# బైబులు భాష్య సంపుటావళి

ఏడవ సంపుటం

# పవిత్రాత్మ



# బైబులుభాష్య సంపుటావళి

## ఏడవ సంపుటం

# పవిత్రాత్మ


**ఫాదర్ పి. జోజయ్య, S.J.**

ఆంధ్ర లొయోలా కాలేజి

విజయవాడ - 520 008

# విషయసూచిక

# మనవి మాట

బైబులు భాష్యం సంచికలను 1972లో ప్రారంభించాం. ఇప్పటికి 157 సంచికలు ముగిసాయి. వీటినే యిప్పుడు పది బైబులుభాష్యం సంపుటాలనుగా ముద్రించాం. ఈ సంచికల్లో ఓ 60 మాత్రం ఇదివరకే "బైబులు గ్రంథమాల" అనే పేరుతో పుస్తక రూపాన్ని సంతరించుకొని పలు ముద్రణలు పొందాయి.

ప్రస్తుతం ఈ 157 సంచికలను, వీటిల్లో వచ్చే అంశాలనుబట్టి, ఓ క్రమపద్ధతిలో అమర్చాం. ఈ సంపుటాల్లో వుంది ప్రధానంగా బైబులు వివరణలు, దైవశాస్త్ర విషయాలు, ప్రార్థనాంశాలు. మన క్రైస్తవ భక్తివిశ్వాసాలను బలపరచేది ముఖ్యంగా ఈ యంశాలే. ఎందరో వేదపండితుల భావాలు ఈ పుస్తకాల్లోకి వచ్చాయి. ఆ మహానుభావులందరికీ వందనాలు.

ఈ పుస్తకాలు మన క్రైస్తవమత సత్యాలను లోతుగా అర్థంచేసికోవడానికీ, ప్రార్థన జేసికోవడానికీ, ఇతరులకు బోధించడానికీ గూడ ఎంతో వుపయోగపడతాయి. కనుక మన గురువులు, మఠకన్యలు, ఉపదేశులు, గృహస్థులు మొదలైనవాళ్లు ఎవరైనాసరే వీటిని వినియోగించుకొని ఆధ్యాత్మిక లాభాన్ని పొందవచ్చు.

చాల సంవత్సరాల పొడుగున కొనసాగించిన రచనలు కనుక ఈ గ్రంథాల్లో పునరుక్తులు అనివార్యమయ్యాయి. పాఠకులు మన్నింతురుగాక. మొదటవ్రాసిన సంచికలకు తర్వాత వ్రాసిన వాటికీ శైలిలోకూడ భేదం వుంది.

మన క్యాతలిక్ సమాజంలో పఠనాభ్యాసం లేదు. ఇది మనం అవశ్యం సవరించు కోవలసిన ప్రధానలోపాల్లో వొకటి. ఇందుకే ఈ గ్రంథాలను చౌకధరకే విక్రయిస్తున్నాం. ఈ పుస్తకాలు మన సాహిత్యరాశిని పెంచి మన ప్రజల్లో పఠనాభిరుచిని ప్రోదిచేస్తాయని ఆశిస్తున్నాం. అసలు తెలుగులో మనకున్న క్యాతలిక్ సాహిత్యమే చాల తక్కువ.

ఫాదర్ టి.మర్రెడ్డిగారి ఆర్థిక సహాయంలేందే ఈ సంపుటాలు ఇప్పుడు, ఈ రూపంలో వెలుగు చూచేవి కావు. ప్రభువు ఆ మహనీయుని దీవించి ఆయన కృషిని సఫలీకృతం జేయునుగాక. విజయవాడ మేత్రాసనం తరపుననే ఈ పుస్తకాలను ప్రచురిస్తున్నాం.

ఈ సంపుటాల్లో రచయిత 31 ఏండ్ల పొడుగున కొనసాగించిన అవిరళకృషి దాగివుంది. కరుణామయుడైన ప్రభువు యెరూషలేం దేవాలయంలోని సాయంకాలపు ధాన్యబలినివలె ఈ సాహిత్యబలిని గూడ నెనరుతో స్వీకరించునుగాక.

ఈ పుస్తకాలకు పరిచయవాక్యాలు వ్రాసియిచ్చిన విజయవాడ పీఠాధిపతులు, పూజ్యులు, మహాఘనత వహించిన డాక్టరు ఎం.ప్రకాష్‌గారికి నమస్సుమాంజలులు. వీటిని సర్వాంగసుందరంగా ముద్రించిన శ్రీ పి.సాంబిరెడ్డిగారికి వారి సిబ్బందికి, ఓపికతో ప్రూఫులు దిద్దిన శ్రీ వి. గోపాలరెడ్డిగారికి మా కృతజ్ఞతలు.

- గ్రంథకర్త

# ముందుమాట

ఫా.జోజయ్య గారు తమ రచనల ద్వారా ఆంధ్ర శ్రీసభకు సుపరిచితులు. వారి అవిరళకృషి, సేవాతత్పరత, తెలుగులో చక్కని సాహిత్యాన్ని రాయాలనే తపన, దానికితగిన అంకితభావం వేనోళ్ల కొనియాడదగింది. వీరు రచించిన చిన్నచిన్న పుస్తకాలను సంకలనం చేయడం అనే ప్రక్రియ వీరి జీవితకాలంలోనే జరగకపోయినట్లైతే, ఈ గొప్ప సాహిత్యాన్ని కోల్పోయే అపాయం వుండేది. అరుదుగా పాఠకులకు తెలుగులో లభ్యమయ్యే బైబులును మరియు కతోలిక వేదాంతమునకు సంబంధించిన అంశాలను క్షుణ్ణంగా పరిశోధన జరిపి చక్కని భాషలో ఆంధ్ర కతోలిక సంఘానికి గత ముప్పది సంవత్సరాలపైగా అందించారు ఫా.జోజయ్య గారు.

తెలుగు కతోలిక శ్రీసభకు, బైబులును క్రైస్తవ సిద్ధాంతాలను అర్థం చేసుకోవాలన్న కోరిక గల క్రైస్తవేతరులకు ఫా.జోజయ్య గారు గొప్ప వరమని నేను భావిస్తున్నాను. వీరి రచనలు సత్యాన్ని అన్వేషించడం యెడల ఆయనకున్న పట్టుదలకు, అందరికి జ్ఞానోదయాన్ని కలిగించాలన్న తపనకు, మరియు ఆంధ్ర శ్రీసభ పురోభివృద్ధి యెడల ఆయనకున్న తృష్ణకు నిదర్శనాలు. సరళమైన స్వచ్ఛమైన, సామాన్య ప్రజలకు అర్థమయ్యే తెలుగుభాషలో రచింపబడిన ఈ పుస్తకాలను చదివి, ఆధ్యాత్మిక జీవిత వికాసానికి క్రైస్తవ సిద్ధాంతాలను లోతుగా అర్థం చేసికోవటానికి వీటిని వినియోగించుకోవాలని కోరుతున్నాను. ఎంతో నేర్పుతో, క్రమపద్ధతిలో విభజింపబడిన రచనలను "బైబులు భాష్య సంపుటావళి" అన్న పేరుతో పదిసంపుటాలుగా అచ్చు వేస్తున్నందుకు అభినందిస్తున్నాను. ఈ గ్రంథాల ప్రచురణ బాధ్యతను తన భుజాలపై వేసికొని, సమయాన్ని వెచ్చించి, వలసిన ఆర్థిక వనరులను చేకూర్చినందుకు, ఆంధ్ర శ్రీసభకు ఉపయోగకరమైన ఈ సాహిత్యాన్ని ప్రజలకు అందించాలనే మంచికార్యాన్ని చేపట్టి విజయంతంగా పూర్తి చేసినందుకు ఫా.మర్రెడ్డి గారిని నా హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

ఆణిముత్యాల్లాంటి ఈ రచనలను ఆధ్యాత్మిక సంపత్తిగా అందరూ గుర్తించాలని, కతోలిక క్రైస్తవ సమాజమంతా ముఖ్యంగా మేత్రాణులు, గురువులు, మఠవాసులు అందరు ఈ కృషిని అభినందించాలని, ఆదరించాలని నా ఆకాంక్ష. మన ప్రజల స్తోమతకు తగినట్లుగా వీటి వెల కూడ చాల తగ్గించడమైనది. కావున ప్రతి ఒక్కరు, గ్రంథాలయాలు, ఆశ్రమాలు, మఠాలు, కతోలిక కేంద్రాలు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని నా మనవి.

ఫా.జోజయ్య గారు చేసిన ఈ కృషిని మరోసారి అభినందిస్తూ, వారు ఇంకా ఆంధ్ర శ్రీసభకు తమ అమూల్యమైన సేవలను రానున్న కాలంలో అందించాలని మనసారా కోరుకుంటూ, ప్రార్థిస్తూ...

ఇట్లు
మీ జ్ఞానతండ్రి
**+ మల్లవరపు ప్రకాష్**
విజయవాడ పీఠాధిపతులు

# 1. దేవుని ఆత్మ

## మనవిమాట

ఈ పుస్తకం పవిత్రాత్మనుగూర్చిన వేదసత్యాలను సంగ్రహంగా తెలియజేస్తుంది. దీన్ని పూర్వమే బైబులు భాష్యం 93-95 సంచికల్లో ప్రచురించాం.

ఇక్కడ ఆత్మనుగూర్చిన అంశాలను చిన్నచిన్న ధ్యానాలుగా పొందుపరచాం. పాఠకులు ఈ ధ్యానాలను నిదానంగా చదువుకొని భక్తితో మననం చేసికోవాలి. వీటిల్లో ఉదాహరించిన బైబులు ఆలోకనాలను నేరుగా బైబులునుండే చదువుకోవాలి. ఇది మూడవ ముద్రణం.

## విషయసూచిక

### 1. దేవుని ఆత్మ



### 2. క్రీస్తుని ఆత్మ

## 3. తిరుసభలో ఆత్మ

# 1. ఆత్మ నామాలూ, సంకేతాలూ

1. బైబుల్లో ఆత్మకు ప్రధానమైన హీబ్రూ పేరు రువా (ఆత్మ, వూపిరి). ఈ పేరు కాక ఇతర నామాలు కూడ కొన్ని వున్నాయి. ఆత్మ "ఆదరణ కర్త" - యోహా 14,16. ఓదార్చేవాడని ఈ పేరుకి అర్థం. అతనికి "సత్యస్వరూపి" అని ఇంకో పేరు - యోహా 16,13. రక్షణ ప్రణాళికను తెలియజేసేవాడని ఈ పేరుకి అర్థం. "దేవుని వాగ్దానం" అని మరో పేరు - గల 3,14. తండ్రి ఈ యాత్మను పంపుతానని వాగ్దానం చేసాడు కదా! "దత్త పుత్రత్వపు ఆత్మ" అని వేరొక పేరు - రోమా 8,15. ఆత్మద్వారా మనం తండ్రికి దత్తపుత్రులమూ పుత్రికలమూ ఔతామని భావం. ఇంకా అతనికి "క్రీస్తు ఆత్మ", "ప్రభువు ఆత్మ", "దేవుని ఆత్మ", "తండ్రి ఆత్మ" అనే నామాలుకూడ వున్నాయి. 1పేత్రు 4,14 అతన్ని "మహిమకల ఆత్మ" అని పిలుస్తుంది. "పవిత్రాత్మ" అనే పేరు చాలాచోట్ల విన్పిస్తుంది.

2. బైబుల్లో ఆత్మకు చాల సంకేతాలున్నాయి. ఇక్కడ ముఖ్యమైనవాటిని పరిశీలిద్దాం.

1. జలం ఒక సంకేతం. నీరు ప్రాణాన్నిచ్చినట్లే ఆత్మకూడా మనకు జీవాన్నిస్తుంది. మనం జ్ఞానస్నాన జలాలద్వారా ఆధ్యాత్మిక జీవాన్ని పొందుతాం - యోహా 3,5. జీవజలమనికూడ ఆత్మకు పేరు - యోహా 7,28. ఆత్మను జలాన్ని లాగ పానంచేస్తాం - 1కొ 12,13.

2. అభిషేకం మరో సంకేతం - 1యోహా 2,20. ఈ పదం ప్రధానంగా భద్రమైన అభ్యంగనాన్ని సూచిస్తుంది. క్రీస్తుకీ మనకీకూడ అభిషేకం చేసేది పవిత్రాత్మే - లూకా 4,18.

3. అగ్ని ఇంకో సంకేతం. ఇక్కడ అగ్ని అంటే పాపమాలిన్యాన్ని తొలగించి మనలను పవిత్రపరచే శక్తి అని భావం. క్రీస్తు మనకు ఆత్మతోను అగ్నితోను జ్ఞానస్నానమిస్తాడు - లూకా 3,16. మనం మన హృదయంలోని ఆత్మాగ్నిని ఆర్పివేసికోగూడదు - 1తెస్స 5,19.

4. మేఘం, వెలుగు ఇంకో ప్రతీక. పూర్వం మేఘం మోషే గుడారంమీదికి దిగివచ్చింది - నిర్గ 33,9-10. ఆత్మ మేఘంలాగ మరియమీదికి దిగివచ్చి ఆమెను గర్భవతిని చేసింది - లూకా 1,35. క్రీస్తు దివ్యరూపధారణ సమయంలో మేఘం కన్పిస్తుంది - లూకా 9,34. అతడు మేఘంగుండ స్వర్గానికి పోయాడు - అచ 1,9.

5. ముద్ర మరో ప్రతీక. తండ్రి క్రీస్తుకి ముద్ర వేసాడు - యోహా 6,67. ఆత్మ మనపై క్రీస్తు ముద్ర వేస్తుంది - ఎఫే 4,30.

6. చేయి, వ్రేలు ఇంకో ప్రతీక. క్రీస్తు దేవుని వ్రేలితో దయ్యాలను వెళ్ళగొట్టాడు - లూకా 11,20. అపోస్తలులు ప్రజలపై హస్తాలను చాచడం ద్వారా వారికి పవిత్రాత్మను దయచేసారు - అచ 8,17. ఇక్కడ చేయి, వ్రేలు దైవశక్తిని సూచిస్తాయి.

7. పావురం మరో సంకేతం. జ్ఞానస్నానానంతరం పవిత్రాత్మ పావురం రూపంలో క్రీస్తుమీదికి దిగివచ్చింది. మన దైవర్చానలో పావురం పవిత్రాత్మకు చిహ్నం. మెస్సియా ఆత్మశక్తిద్వారా నూత్న ప్రజలను తయారుచేస్తాడని పావురం భావం.

మనం ఈ నామాలనూ సంకేతాలనూ నిదానంగా ధ్యానించుకొని ఆత్మపట్ల భక్తిని పెంచుకోవాలి.

### ప్రార్థనా భావాలు

ఇరెనేయస్ భక్తుడు ఈలా వ్రాసాడు. మనం జ్ఞానస్నానం స్వీకరించినపుడు ఆత్మద్వారా నూత్న జన్మను పొందుతాం. ఆత్మ మనలను క్రీస్తు దగ్గరికి చేర్చగా, క్రీస్తు తండ్రి దగ్గరికి చేరుస్తాడు. పిత మనకు అవినాశశక్తిని దయచేస్తాడు. క్రీస్తుద్వారా తప్ప ఎవడూ తండ్రిని చేరడు. తండ్రినిగూర్చిన జ్ఞానాన్ని ప్రసాదించేది సుతుడే. అలాగే ఆత్మద్వారా తప్ప ఏ నరుడూ దేవుని కుమారుని చేరలేడు. క్రీస్తుజ్ఞానాన్ని ప్రసాదించేది ఆత్మ ఒక్కటే.

## 2. ఆత్మ దేవుని క్రియాశక్తి

1. ఆత్మకు హీబ్రూ భాషలో రువా అని పేరు. ఈ శబ్దానికి చాల అర్థాలున్నాయి. 1. రువా అంటే గాలి, ఊపిరి అని అర్థం. 2. నరునిలోని జీవశక్తికీ తెలివికీ సంవేదనలకూ రువా అని పేరు. 3. దేవుని జీవానికీ క్రియాశక్తికీ గూడ రువా అని పేరు. కనుక ఈ పదం చాల విస్తృతభావాలు కలది.

దేవుని క్రియాశక్తియైన ఆత్మ కొందరు యుద్ధవీరుల మీదికి దిగివచ్చినట్లుగా పూర్వవేదంలోని న్యాయాధిపతుల గ్రంథంలో చదువుతూన్నాం. ఆ యాత్మ ఒత్నీ యేలుమీదికి దిగివచ్చింది - 3,10. గిద్యోనుమీదికి దిగివచ్చింది - 6,34. యెఫ్తా మీదికి దిగివచ్చింది - 11,29. అలాగే సంసోనును ఆవేశించింది - 14,19. సౌలుమీదికి దిగివచ్చి అతనికి ఆవేశం పుట్టించింది - 1సమూ 10,5-6. దావీదుమీదికి దిగివచ్చి అతనిలో వుండిపోయింది - 16,13. ఈ వీరులమీదికి దిగివచ్చిన ఆత్మ వీళ్ళను శత్రువులతో యుద్ధం చేయడానికి ప్రేరేపించింది.

ఆత్మ ప్రవక్తలమీదికి గూడ దిగివచ్చింది. ప్రభువు బాధామయ సేవకుని ఆత్మతో నింపాడు - యెష 42,1. పేదలకు శుభవార్తను ప్రకటించే ప్రవక్తను ఆత్మతో నింపాడు - 61,1. ఆత్మ ప్రేరణంతో వీళ్లు దైవసందేశాన్ని ఎరిగించారు.

కడన మెస్సియాకూడా ఆత్మను పొందినవాడే.

"దేవుని ఆత్మ అతనిపై నిలుస్తుంది
అది విజ్ఞాన వివేకాలను దయచేసే ఆత్మ
దూరదృష్టినీ బలాన్నీ ప్రసాదించే ఆత్మ
దైవజ్ఞానాన్నీ దైవభీతినీ దయచేసే ఆత్మ" - యెష 11,2.

2. పూర్వవేదంలో ఆత్మ దేవుని క్రియాశక్తిగా మాత్రమే కన్పిస్తుంది. కాని నూత్నవేదంలో ఈయాత్ముడు ఓ వ్యక్తిగా కన్పిస్తాడు. ఓ వ్యక్తిగానే అతడు క్రీస్తుమీదికి దిగివచ్చాడు - యోహా 1,33. ఈ క్రీస్తు మహిమను పొంది తండ్రి నుండి ఆత్మను స్వీకరించాక మనకందరికీ ఆ యాత్మను ప్రసాదిస్తాడు - యోహా 7,39.

పూర్వవేదంలో ఆత్మవరాలున్నాయేకాని ఆత్మడు ఓ వ్యక్తిగా కన్పించడు. నూత్నవేదంలో అతడు ఓ వ్యక్తిగాగూడ కన్పిస్తాడు. మన హృదయాల్లో వసిస్తూ మనలను దివ్యలను చేస్తాడు.

నేడు మనం జ్ఞానస్నానం పొందినపుడే ఆత్మను స్వీకరిస్తాం. జ్ఞానస్నాన సమయంలో ఆత్మ మన హృదయాలపై క్రీస్తుని ముద్రవేస్తుంది - ఎఫే 1,13-14.

దేవుడు తన ఆత్మద్వారా మనలను తన దగ్గరికి ఆకర్షించుకొంటాడు - యోహా 6,44. ఆత్మ మనలను దేవుని దగ్గరికి చేరుస్తుంది. మనలను దేవుని రాజ్యంలోకి ప్రవేశపెడుతుంది.

## ప్రార్థనా భావాలు

1. వేదపండితులు ముగ్గురు దైవవ్యక్తులకు మూడు ప్రత్యేక కార్యాలు ఆరోపించారు. తండ్రి సృష్టి చేసేవాడు. కుమారుడు మనలను పాపాన్నుండి రక్షించేవాడు. ఆత్మడు మన హృదయాల్లో వసిస్తూ మనలను పవిత్రపరచేవాడు. అతడు ప్రధానంగా హృదయనివాసి. మన హృదయంలోనే వుండే యీ దైవశక్తిని మనం నిత్యం గుర్తిస్తుండాలి.

2. యూదుల రబ్బయుల బోధల ప్రకారం ఆత్ముడు మన హృదయాల్లో మాట్లాడతాడు, విలపిస్తాడు, దుఃఖిస్తాడు, సంతోషిస్తాడు, మనలను మందలిస్తాడు, హెచ్చరిస్తాడు,

ప్రోత్సహిస్తాడు, మనకు ఓదార్పును దయచేస్తాడు. ఈ కార్యాలన్నీ మన రోజువారి జీవితంలో జరుగుతూనే వుంటాయి. మన తరపున మనం ఆత్మ మనలో జరిగించే ఈ కార్యాలను జాగ్రత్తగా అనుభవానికి తెచ్చుకొంటూండాలి.

## 3. ఆత్మ దేవుని శక్తి

1. బైబులు ఆత్మనుగూర్చి మాట్లాడేపుడు ప్రేమ అన్న పదాన్ని అట్టే వాడదు. శక్తి అన్న పదాన్ని వాడుతుంది. కనుక ఆత్మను ప్రధానంగా దైవశక్తిగా గణించాలి.

దేవుని శక్తి యేలాంటిదో క్రీస్తు ఉత్థానంలో కన్పిస్తుంది. "క్రీస్తు బలహీనతవల్ల సిలువమీద చంపబడినా దైవశక్తివల్ల సజీవుడుగా వున్నాడు" - 2కొరి 13,4. ఈ దైవశక్తి దేవుని ఆత్మే. క్రీస్తు ఈ యాత్మద్వారానే ఉత్థానమయ్యాడు. ఆత్మ బలమైంది, శరీరం బలహీనమైంది.

2. పూర్వవేదంలో దైవశక్తియైన ఆత్మ యుద్ధవీరుల మీదికి దిగివచ్చింది. ఆత్మ సౌలుమీదికీ, దావీదు మీదికీ, మెస్సియామీదికీ దిగివచ్చింది. 1సమూ 10,6. 16,13. యోష 11,2. నూత్నవేదంలో లూకా ఈ పూర్వవేద సంప్రదాయాన్ని అనుసరించాడు. దేవదూత మరియమాతతో "పవిత్రాత్మ నీపై వేంచేస్తుంది, సర్వోన్నతునిశక్తి నిన్ను ఆవరిస్తుంది" అని చెప్పాడు - లూకా 1,35. ఈ పాదంలోని సమాంతరభావాన్ని బట్టి ఇక్కడ ఆత్మా, శక్తీ ఒకటేనని అర్థం చేసికోవాలి. కనుక దేవుని శక్తియైన ఆత్మ మరియ మీదికి దిగివచ్చి ఆమెను గర్భవతిని చేస్తుందని భావం. క్రీస్తు బహిరంగబోధ ఆత్మ బలంతోనే ప్రారంభమైంది. "పిదప యేసు ఆత్మబలంతోనే గలిలయ సీమకు తిరిగి వెళ్ళాడు" - 4,14. అతడు దేవుని శక్తితోనే దయ్యాలను వెళ్ళగొట్టాడు - 11,20. క్రీస్తు ఉత్థానానంతరం దైవశక్తిని పొందేంతవరకూ శిష్యులు యెరూషలేములోనే వుండాలి - 24,49. ఆత్మ వారిమీదికి దిగివచ్చినపుడు వారికి శక్తి లభిస్తుంది - అకా 1,8. ఈ వుదాహరణలన్నిటిలోను దైవశక్తి పవిత్రాత్మేనని వేరుగా చెప్పనక్కరలేదు.

3. తొలినాటి క్రైస్తవ సమాజంలో శక్తీ ఆత్మా కలసిపోతూండేవి. పౌలు పవిత్రాత్మతోను శక్తితోను తెస్సలోనీయులకు సువిశేష బోధ చేసాడు - 1తెస్స 4,5. పౌలు బోధ క్రీస్తు ఆత్మనూ శక్తినీ ప్రదర్శిస్తుంది - 1కొరి 2,4. ఇంకా ఆ బోధ ఆత్మశక్తితో నిండివుండి ప్రజలు విశ్వాసానికి విధేయులై యుండేలా చేస్తుంది - రోమా 15,19. స్తెఫను దైవానుగ్రహంతోను శక్తితోను నిండిపోయాడు - అ.కా. 6,8. ఈ వేద వాక్యాలనుబట్టి దేవుని మహాశక్తే ఆత్మ అనుకోవాలి. దేవుడు పనికి పూనుకోవడమే శక్తి

ఔతుంది. అతడు ఆత్మద్వారా తన పనిని నిర్వహిస్తాడు. పరిశుద్ధ త్రీత్వంలో క్రియాపరుడైన వ్యక్తి పవిత్రాత్మ.

సృష్టి చేసినపుడూ, యూదులతో నిబంధనం చేసికొన్నపుడూ, సుతుడైన సర్వేశ్వరుని మనుష్యావతార మెత్తించినపుడూ, అతనికి ఉత్థానాన్ని దయచేసినప్పుడూ దేవుడు శక్తితో పనిచేసాడు. ఈ సందర్భంలో అలెగ్జాండ్రియా సిరిల్ భక్తుడు "ఆత్మ అంటే దేవుని శక్తీ, క్రియా అనుకోవాలి. దేవుని పనులన్నిటినీ నిర్వహించేది ఆత్మదే" అని నుడివాడు. నరుల క్రియాశక్తిలో బోలెడంత క్రూరత్వముంటుంది. అది చావును తెచ్చిపెడుతుంది. కాని దేవుని శక్తి అంటే దయ, వరప్రసాదం, ప్రేమ.

## ప్రార్థనా భావాలు

ప్రాచీన క్రైస్తవ భక్తుదెవడో పవిత్రాత్మమీద "వేనిసాంక్తె స్పిరితుస్" అనే భక్తిమంతమైన గేయం వ్రాసాడు. ఈ గీతంద్వారా నేడు మనం ఆత్మకు చక్కగా ప్రార్థనం చేసికోవచ్చు.

1. "పవిత్రాత్మమా! వేంచేసిరా
   పరలోకం నుండి నీ దివ్యప్రకాశ కిరణాన్ని
   మా మీదికి ప్రసరించు
2. దరిద్రులకు తండ్రీ!
   వరాలొసగే దాతా!
   మా హృదయాలకు జ్యోతీ! వేంచేసిరా
3. శ్రేష్ఠమైన ఓదార్పు నొసగే దేవా!
   మా యాత్మకు మేలైన అతిథీ!
   మధురమైన ఉపశాంతికర్తా! వేంచేసిరా
4. శ్రమలలో విశ్రాంతివి నీవు
   వేడిమిలో చల్లదనానివి నీవు
   బాధలలో దుఃఖనివారకుడివి నీవు
5. భాగ్యామల జ్యోతీ!
   నిన్ను విశ్వసించే భక్తుల అంతరంగాలను
   వెలుగుతో నింపు

6. నీ దివ్య సహాయం లేందే
నరుల్లో పాపం దప్ప
మంచి అనేదే చూపట్టదు
7. అపవిత్రులమైన మమ్ము శుద్ధిచేయి
ఎండిపోయిన మమ్ము నీటితో తడుపు
మా గాయాలను మాన్పు
8. లొంగని మా హృదయాలను లొంగదీయి
మా కఠిన మనస్సులను కరిగించు
దారిదప్పిన మమ్ము త్రోవకు జేర్చు
9. నిన్ను విశ్వసించే భక్తులకు,
నిన్ను పూజించే విశ్వాసులకు,
నీ యేడు వరాలను ప్రసాదించు
10. పుణ్యాచరణకు తగిన ఫలాన్నీ
ధన్యమైన మరణాన్నీ
శాశ్వత మోక్షానందాన్నీ మాకు దయచేయి"

# 4. ఆత్మ దేవుని తేజస్సు

1. పూర్వవేదంలో ఆత్మ దేవుని తేజస్సు. ఈ తేజస్సు యిస్రాయేలీయులకు సీనాయి కొండపై నిప్పులా దర్శనమిచ్చింది. "యావే తేజస్సు సీనాయికొండమీద నిల్చింది. ఆరురోజులపాటు మొయిలు కొండను క్రమ్మింది. యావే తేజస్సు కొండ కొమ్మున ప్రజ్వరిల్లుతున్న అగ్నిలా యిస్రాయేలీయులకు కన్పించింది" - నిర్గ 24,16-17. ఈ తేజస్సు ప్రకాశపూరితమైన ప్రభువు సాన్నిధ్యమే.

ఈ కాంతే దేవుడు చేసే అద్భుతాల్లోకూడ కన్పిస్తుంది. ప్రభువు మన్నాను కురిపించే సందర్భంలో మోషే యిస్రాయేలీయులతో "మీరు ఉదయం ప్రభువు తేజస్సును చూస్తారు" అన్నాడు - నిర్గ 16,7. లాజరు ఉత్థాన సందర్భంలో క్రీస్తుకూడ మార్తతో "నీవు విశ్వసించినట్లయితే దేవుని తేజస్సును చూస్తావు" అని పల్కాడు - యోహా 11,40. ఇక్కడ తేజస్సు దేవుడు చేసే అద్భుత కార్యాలే. నూత్నవేదంలో తేజస్సు ఆత్మ అనే పదాలు ఒకదానితో ఒకటి మిళితమైపోయాయి. "అప్పుడు మనుష్య కుమారుడు మహాశక్తితోను తేజస్సుతోను మేఘారూఢుడై రావడం చూస్తారు" - మార్కు 13,26. ఈ వాక్యంలో శక్తీ తేజస్సూ కూడ ఆత్మే.

2. పూర్వవేదంలో కాంతిమంతమైన మేఘం గుడారం మీదికి దిగివచ్చేది - నిర్గ 33,9. ఈ మబ్బు ఆత్మకు చిహ్నం. నూత్నవేదంలో ఈ మొయిలుకు మారుగా పవిత్రాత్మే కన్యమరియ మీదికి దిగివచ్చింది - లూకా 1,35. క్రీస్తు ఆత్మద్వారాను, తేజస్సు ద్వారాను గూడ ఉత్థానమయ్యాడు - రోమా 8,11. 6,4. మనం ఉత్థానక్రీస్తు తేజస్సులోనికి మారిపోతాం - 2కొ 3,18. ఆత్మా తేజస్సూ ఒకటేనని చెప్పాం. కావుననే 1పేత్రు 4,14 "తేజోమయమైన దేవుని ఆత్మ" అని వాకొంటుంది. "మానవులందరూ పాపంచేసి, దేవుని తేజస్సును కోల్పోయారు" అంటుంది రోమీయుల జాబు 3,23. అనగా పాపంవల్ల మనం దేవుని ఆత్మను పోగొట్టుకొన్నామని భావం. (తెలుగు బైబుళ్ళు "తేజస్సు" అనే మాటను "మహిమ" అని అనువదించాయి. ఇది పొరపాటు.)

## ప్రార్థనా భావాలు

ఓ ప్రాచీన క్రైస్తవభక్తుడు "వేని క్రెయాతోర్ స్పిరుతుస్" అనే గేయం వ్రాసాడు. ఆత్మపట్ల భక్తిని పెంపొందించుకోడానికి ఈ గీతం బాగా ఉపయోగపడుతుంది.

1. "సృష్టికర్తవైన పవిత్రాత్మమా!
   నీ భక్తుల హృదయాలను సందర్శించు
   నీ బిడ్డలమైన మా యెదదలను
   వరప్రసాదాలతో నింపు
2. నీవు ఉపశమనదాతవు
   మహోన్నతుడైన దేవుని వరానివి
   జీవజలానివి, అగ్నిజ్వాలవు, ప్రేమమూర్తివి,
   అభ్యంగన కర్తవు
3. నీవు సప్తవరదాతవు
   దేవుని కుడిచేతి వ్రేలివి
   పరమపిత వాగ్దానానివి
   మాకు వాక్శక్తిని ప్రసాదించు
4. ఘమ్ము నీ వెలుగుతో నడిపించు
   మా హృదయాలను నీ ప్రేమతో నింపు
   నీ మహాశక్తితో
   మా దౌర్బల్యాన్ని తొలగించు

5. శత్రువైన పిశాచాన్ని దూరంగా పారద్రోలు
మాకు శాంతిని దయచేయి
మా నాయకుడవైన నిన్ననుసరిస్తూ
మేము సకలాపదలనుండి తప్పించుకొందుముగాక

6. నీ కృపచే తండ్రిని తెలుసుకొందుముగాక
నీ కరుణచే సుతుని గుర్తింతుముగాక
వారిరువురి ఆత్మవైన నిన్ను
సదా విశ్వసింతుముగాక.

# 5. పవిత్రమైన ఆత్మ

1. ఆత్మశక్తీ, తేజస్సూ మాత్రమేకాదు, పవిత్రత కూడ. శక్తి, తేజస్సు, పవిత్రత ఈ మూడు భావాలకు పరస్పర సంబంధం వుంది.

యెషయా ప్రవక్త దర్శనంలో చూచిన దేవుణ్ణి దేవదూతలు
"సర్వశక్తిమంతుడైన ప్రభువు
పవిత్రుడు, పవిత్రుడు, పవిత్రుడు
లోకమంతా అతని తేజస్సుతో నిండి వుంది"

అని స్తుతిస్తున్నారు - యెష 6,3. ప్రభువు పరాత్పరుడు. నరులకు దూరంగా వుండేవాడు. కనుక పవిత్రుడు. హోషేయ ప్రవచనంలో అతడు "నేను మీ నడుమనున్న పవిత్రమూర్తిని" అంటాడు - 11,9. తండ్రిలాగే ఆత్ముడు కూడ నరులకు దూరంగా వుండేవాడు. కనుక పవిత్రుడు.

2. ఆత్ముడు పరలోకానికి చెందినవాడు. కావున పవిత్రుడు. అతడు పైనుండి దిగివచ్చే శక్తి - అ.చ. 1,8. స్వర్గంనుండి క్రీస్తుమీదికి పావురంలా దిగివచ్చినవాడు - మార్కు 1,10. పరమండలం నుండి శిష్యులమీదికి గాలిలా వేంచేసినవాడు - అ.చ. 2,2.

3. క్రీస్తు దేవుని పవిత్రమూర్తి - మార్కు 1,24. ఇతడు ఆత్మద్వారా నరరూపం దాల్చినవాడు, ఆత్మద్వారా పవిత్రుడైనవాడు - లూకా 1,35. దేవుడు అతన్ని పవిత్రాత్మతోను శక్తితోను అభిషేకించాడు - అ.చ. 10,38. క్రీస్తు పునరుత్థానుడైనందున పవిత్రపరచే ఆత్మశక్తితో దేవుని కుమారుడుగా నియమింపబడ్డాడు - రోమా 1,4. పవిత్రుడైన ఆత్ముడే క్రీస్తుని పవిత్రపరచాడని ఈ వేదవాక్యాల సారాంశం.

4. ఆత్మ పవిత్రుడైన వ్యక్తి. జీవనదాత. అతడు లేందే అంతా శూన్యం. అంతా నిస్సారం. ఆత్మ లేకపోతే శరీరం పాపమూ మృత్యువూ మాత్రమే. ఆత్మ లేకపోతే మోషే ధర్మశాస్త్రం మృత్యుదాయిని మాత్రమే - 2కొరి 3,6.

5. దేవుడూ ఆత్మాకూడ పరాత్పరులు, నరునికి దూరంగా వుండేవాళ్ళు. కాని ఆత్మడు సృష్టి ప్రాణులకు దూరంగావున్నా వారికి చేరువగాగూడ వుంటాడు. అతడు స్వర్గంలో వుండేవాడైనా నరుల దగ్గరికి వచ్చి వారికి దివ్యత్వాన్ని ప్రసాదిస్తాడు. ఆత్మడు మనలను పవిత్రపరుస్తాడు - 2తెస్స 2,13. జ్ఞానస్నానంద్వారా మనలో ఓ దేవాలయంలోలాగ వసిస్తాడు. కనుకనే పౌలు "మీ శరీరం మీయందు వసించే పవిత్రాత్మకు ఆలయమని మీకు తెలియదా" అన్నాడు. - 1కొ 6,19. ఆత్మద్వారా మనం ఆధ్యాత్మిక దేవాలయంలో సజీవ శిలలమౌతాం. పవిత్రులమైన యాజకులం, రాచరికపు గురుకులం, పవిత్రమైన జనం, దేవుని సొంత ప్రజ ఔతాం - 1పేత్రు 2,5.9. కనుక ఆత్మ వలన మనం పరిశుద్ధులమౌతాం. అతనిద్వారా క్రీస్తుకి పవిత్ర వధువుగాగూడ తయారౌతాం - ఎఫే 5,26-27. శ్రీసభ క్రీస్తు వధువు. కాని ప్రతి ఆత్మా, ప్రతి క్రైస్తవుడూ శ్రీసభలాంటివాడే.

భగవంతుడు స్వయంగానే పరిశుద్ధుడు. కాని సృష్టి ప్రాణులమైన మనం స్వయంగాగాక దేవునికి సమర్పితులం గావడంద్వారా పవిత్రులమౌతాం. కనుకనే క్రీస్తుకూడ తన్ను తాను దేవునికి ప్రతిష్ఠించుకొన్నాడు - యోహా 17,19.

## ప్రార్థనా భావాలు

1. అల్బర్ట్ భక్తుడు ఈలా చెప్పాడు "ఆత్మడు శ్రీసభను నిత్యం పవిత్రపరుస్తుంటాడు. వరప్రసాదాల ద్వారా, దేవద్రవ్యానుమానాలద్వారా, పుణ్యాలు వరాలద్వారా, అద్భుతాలద్వారా అతడు ఈ పవిత్రీకరణ కార్యాన్ని కొనసాగించుకొంటూ పోతాడు". మన తరపున మనంగూడ, మనలను పవిత్రపరచమని ఆత్మను నిరంతరం అడుగుకొంటూండాలి.

2. ఆత్మడు పవిత్రత్రీత్వంనుండి బయలుదేరే దివ్యవ్యక్తుల్లో కడపటివాడు. కనుక అతనికి త్రీత్వంలో సఫలత్వం ఏమీలేదు. అతని సఫలత్వం త్రీత్వానికి వెలుపలనే వుంటుంది. క్రీస్తు మనుష్యావతారంలోను, నరులమైన మన పవిత్రీకరణంలోను అతని సఫలత్వం బాగా కన్పిస్తుంది. ఈ యాత్మ వలన మనం అధికాధికంగా పవిత్రులమౌతూండాలి. పైగా మనం ఎంతగా పాపంనుండి వైదొలగుతామో అంతగా పవిత్రాత్మకు బిడ్డలమౌతాం.

# 6. ఆత్మ ప్రేమ నిధి

1. దేవుడు ప్రేమ స్వరూపుడు - 1యోహా 4,8. ఆత్మ దేవుని ప్రేమను మన హృదయాల్లోనికి తీసికొని వస్తుంది. దేవుడు ఆత్మద్వారా మన హృదయాలను ప్రేమతో నింపుతాడు - రోమా 5,5. మనం ఆత్మయందూ ప్రేమయందూగూడ నడవాలి - రోమా 8,4. ఎఫె 5,2. అనగా మనం ఆత్మనుండి ప్రేమనుపొంది ఆ ప్రేమతోనే జీవించాలి.

2. ఆత్మకూ శరీరానికి బద్ధవైరం. ఆత్మ శరీర దుష్టశక్తులను నాశం చేస్తుంది - గల 5,17. ఐతే ఆత్మ ప్రేమను మనకు ఫలంగా ఇస్తుంది - గల 5,22. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, ఆత్మ ప్రేమను మనకు వరంగా ఈయదు. అసలు ఆ యాత్మే ప్రేమ. క్రీస్తు సిలువపై పండిన ఫలం ఆత్ముడు. క్రీస్తు సిలువనుండి ఆత్మను మనకు ఓ ఫలంలా అందించాడు. కనుకనే యోహాను సువిశేషం "యేసు సిలువపై తలవంచి ఆత్మను విడిచాడు" అని చెప్తుంది - 19,30. ఇంకా క్రీస్తు అంతరంగంనుండి జీవజలనదులు ప్రవహిస్తాయనే వేదవాక్యంగూడ వుంది - 7,38. తండ్రి క్రీస్తుద్వారా మనకు ఆత్మను అనుగ్రహిస్తాడని ఈ వేదవాక్యాల భావం. మహోన్నతుడైన దేవుడు మనకు దయచేసే దానం ఆత్మ.

3. ఆత్మ మనకు తోడినరులతో సహవాసాన్ని దయచేస్తుంది. అనగా మనం తోడి నరులతో ఐక్యమై జీవించేలా చేస్తుంది- 1కొ 13,13. ఈ యైక్యతే సోదరప్రేమ. అతని ద్వారా మనం ఒక్క దేహమూ, ఒక్క సమాజమూ ఔతాం - 1కొ 12,13. మన దేహంలోని అవయవాలన్నిటినీ ఒక్కటిగా బంధించి వాటిని ఒక్క వ్యక్తినిగా ఐక్యపరచేది మన ఆత్మ. అలాగే జ్ఞానశరీరంలోని నరులందరినీ ఒక్కటిగా ఐక్యపరచి వారిని ఒక్క సమాజంగా చేసేది పవిత్రాత్మ. మన దేహానికి మామూలు ఆత్మ వున్నట్లే జ్ఞానశరీరానికి పవిత్రాత్మ వుంటుంది. ఇంకా ఈ యాత్మ భార్యాభర్తలను గూడ ఏకదేహంగా - అనగా ఏకవ్యక్తినిగా ఐక్యపరుస్తుంది - ఎఫె 5,31.

4. ఆత్ముడు ప్రేమస్వరూపుడని చెప్పాం. కనుక అతడు దేవుణ్ణి ప్రేరేపించి ప్రాణికోటిని సృష్టిచేయించాడు. దేవునిచే నరవతార మెత్తించాడు. సుతుడైన సర్వేశ్వరుడు నరుడై జన్మించింది ఆత్మశక్తితోనేగదా! - లూకా 1,35. సువిశేషాలు ఆత్మను అగ్నితో పోల్చాయి - మత్త 3,11. ఇక్కడ ఈ యగ్ని పదానికి చాలా అర్థాలున్నాయి. ప్రేమ కూడ ఈ యర్థాల్లో ఒకటి. అనగా ఆత్మ మనలను ప్రేమాగ్నితో నింపుతుందని భావం.

5. పూర్వవేద కాలంలో గుడారంపై తేజోమయమైన మేఘం వాలివుండేది. ఈ మేఘానికి బదులుగా నూత్నవేదంలో ఆత్మ కన్పిస్తుంది. ఈ తేజోమయమైన గుడారంలాగే ఈ యాత్మకూడ తేజోమయమైన సాన్నిధ్యం. దేవుడు ఎప్పుడుకూడ తన తేజస్సు కొరకే

జీవిస్తాడు, పనిచేస్తాడు. నరుడు దేవునికి పోలికగా వుండేవాడు. కనుక, ఇరేనేయస్ వేదశాస్త్రి నుడివినట్లుగా, పరిపూర్ణంగా జీవించే నరుడు కూడ దేవుని తేజస్సేనని చెప్పాలి.

## ప్రార్థనా భావాలు

1. సిప్రియన్ భక్తుడు ఈలా వాకొన్నాడు. త్రీత్వంలో పితసుతులను ఐక్యపరచేది ఆత్మడే. శ్రీసభ సభ్యులను ఐక్యపరచేదికూడ ఈ యాత్మడే. కనుక శ్రీసభ సభ్యులను ముఠాలుగా విభజించే పతితులను ఆ యాత్మడు అణగద్రొక్కుతాడు. అతడు ఆనాడు కొరింతులో విభజనకు గురైన క్రైస్తవులనులాగ నేడు మనలనుగూడ ఐక్యపరుస్తాడు - 1కొరి 1,11. ఆత్మడు ఎక్కడుంటే అక్కడ ఐక్యతా వుంటుంది. కనుక మన రోజువారి జీవితంలో మనం ఆత్మనుండి ఐక్యత సోదరప్రేమ అనే వరాలను అడుగుకోవాలి.

2. అగస్టీను భక్తుడు ఈలా వ్రాసాడు. "ఆత్మకు చాలా పేర్లున్నా అతని ప్రధాననామం మాత్రం ప్రేమే. అతడు తండ్రి కుమారుల పరస్పర ప్రేమ. ఈ మూడవవ్యక్తి ప్రేమద్వారా గాని మిగిలిన యిద్దరు వ్యక్తులు ఐక్యంగారు. ఇంకా దేవుని మన హృదయాల్లోనికి కొనివచ్చేదికూడ ఈ యాత్మడే." కనుక ఆత్మనుండి మనం ప్రేమభిక్ష అర్థించాలి.

# 7. జీవమొసగే ఆత్మ

1. దేవుడు ప్రాణులను సృజించేవాడు. ప్రాణమొసగేవాడు. అతడు చంపడానికంటె బ్రతికించడానికే సిద్ధంగా వుంటాడు. దేవునిలాగే అతని ఆత్మకూడ జీవమొసగే ఆత్మ - రోమా 8,2.

ఉత్థాన క్రీస్తు జీవనదాయకుడైన ఆత్మతో నిండిపోయాడు. అతడు స్వయంగా ప్రాణదాత ఐన ఆత్మ అయ్యాడు - 1కొ 15,45. అనగా జీవాత్మను పొందిన క్రీస్తు మనకు గూడ ఆధ్యాత్మిక జీవాన్ని దయచేస్తాడని భావం. మొదటి ఆదాము మనకు దయచేసింది భౌతికజీవం. కాని రెండవ ఆదాము దయచేసింది దివ్యజీవం, ఆత్మజీవం.

దేవుని ఆత్మకు హీబ్రూ భాషలో రువా అని పేరు. ఈ మాటకు సృష్టిచేసేది, ఊపిరినొసగేది అని అర్థం. ఈ యాత్మ సృష్ట్యాదిలో పక్షి తన గూటిపైలాగ నీటిపై గుండ్రంగా తిరుగుతుండేది - ఆది 1,2. ఆత్మవల్లనే మొట్టమొదటిసారిగా నీటినుండి జీవకోటి పుట్టుకవచ్చింది. అటుపిమ్మట ఆత్మ ఆదాముకి ఊపిరిపోసింది - ఆది 2,7. అనగా సృష్ట్యాదిలోనే పవిత్రాత్మడు ఆదాము మీదికి దిగివచ్చాడు.

ఊపిరి విశ్వమంతటా వ్యాపించివుంది. కావుననే కీర్తనకారుడు

నీవు ఊపిరిపోస్తే ప్రాణిసృష్టి జరుగుతుంది

నీవు భూమికి నూత్నజీవం దయచేస్తావు

అని పాడాడు - 104,30. ఆత్మ వూపిరి. ఆ వూపిరివల్లనే బాబిలోనియాలో శిధిలమైయున్న ఎముకలు మళ్లా జీవాన్ని పొందాయి. "నా ప్రజలారా! నేను మీ సమాధులు తెరిచి మిమ్ము లేపుతాను. మిమ్ము మళ్ళా యిస్రాయేలు దేశానికి తోడ్కొని పోతాను" - యెహెజ్కేలు 37,14.

2. పాలస్తీనా దేశంలో వాన అట్టే కురవదు. కనుక యూదులు నీటిని అమూల్యమైన వరంగా భావించారు. జీవంతో సమానంగా ఎంచారు. దేవుని దీవెనవల్ల ఎడారి కూడ నీటితో నిండిపోతుందని చెప్పాడు యెషయా

నేను ఎడారిని కొలకులుగా మారుస్తాను

ఎండిన నేలను నీటి బుగ్గలుగా జేస్తాను

-41,18. క్రమేణ జీవదాయినియైన నీరు జీవమొసగే ఆత్మకు చిహ్నామైంది. ఆత్మ నీరు కనుక దేవుడు దాన్ని ప్రజలపై కుమ్మరిస్తాడు. "పిమ్మట నేను నా యాత్మను ఎల్లరిపై కుమ్మరిస్తాను' ' - యోవేలు 2,28. "నేను దావీదు వంశజులపైనా, యెరూషలేములోని యితర ప్రజలపైనా దయాగుణాన్నీ ప్రార్థనగుణాన్నీ కుమ్మరిస్తాను" - జెకర్యా 12,10. దేవుడు తన ఆత్మనే ప్రజలపై కుమ్మరిస్తాడు. నేను మీపై శుభ్రమైన జలాలు చల్లి మిమ్ము శుద్ధిచేస్తాను" - యెహె 36,25. ఈ నీరు యెరూషలేములోని దేవాలయం నుండి ప్రవహిస్తుంది. "ఆ దేవళం గుమ్మం క్రిందినుండి నీరు ఊరి తూర్పుదిక్కుగా ప్రవహిస్తుంది" - 37,1. ఇక్కడ ఈ దేవళం దేవునికి చిహ్నం. ఆత్మ యెప్పుడు గూడ దేవునినుండిగాని బయలుదేరదు.

బైబులు ఆత్మను సముద్రజలాలతో పోల్చదు. చెలమ నీటితోను వాననీటితోను పోలుస్తుంది. ఈ నీరు జీవాన్నీ సత్తువనూ దయచేస్తుంది.

3. నీరు మృదువుగా వుండి అన్నిటిలోకి ప్రవేశిస్తుంది. నరుని శరీరంలోకిగూడ ప్రవేశిస్తుంది. కనుకనే ప్రభువు "నా యాత్మను మీలో వుంచుతాను" అన్నాడు - యెహె 36,27. ఆత్మ జలంలాంటిదనే పూర్వవేద భావాన్ని నూత్నవేదంలో యోహాను మళ్లా ఎత్తుకొన్నాడు. విశ్వాసంగల భక్తుడు ఆత్మవలనా నీటివలనా గూడ జన్మిస్తాడు - 3,5. క్రీస్తు అంతరంగంనుండి జీవజల నదులు పుట్టుకవస్తాయి. ఈ జీవజలం పవిత్రాత్మే - 7,38-39.

పౌలుకి కూడ ఈ భావాలు తెలుసు. మనమందరం ఒకే ఆత్మలోనికి జ్ఞానస్నానం పొందాం. అందరమూ ఒకే ఆత్మను పానం చేస్తాం - 1కొ 12,13. ఇక్కడ ఆత్మను పానం చేస్తామంటే, శ్రీసభలోని ఆత్మను మనంకూడ స్వీకరిస్తామని భావం. ఇంకా, మోషే ధర్మశాస్త్రం మృత్యువును తెచ్చిపెడుతుంది. కాని ఆత్మ జీవనదాత - 2కొ 3,6.

## ప్రార్థనా భావాలు

1. బార్ హెబ్రెయస్ అనే సిరియా భక్తుడు ఈలా వాకొన్నాడు. "పవిత్రాత్మ ప్రధానంగా జీవం. లోకంలోని జీవమంతా ఆ ఆదిమ జీవంనుండి వచ్చిందే. ఆ దివ్యజీవం తండ్రినుండి బయలుదేరి కుమారుని ద్వారా లోకంలోకి వచ్చింది. లోకంలోని నరులందరికీ ప్రాణమొసగి వారిని దివ్యులనుగా జేస్తుంది. ఆ నరులద్వారా లోకాన్నంతటినీ దివ్యం చేస్తుంది." మనంకూడ దివ్యజీవాన్ని దయచేయమని ఆత్మను నిరంతరం ప్రార్థిస్తుండాలి.

2. యెరూషలేము సిరిల్ భక్తుడు ఈలా వాకొన్నాడు. "క్రీస్తు ఆత్మను జలంగా ఎందుకు పేర్కొన్నాడు? జలం వల్లనే అన్నీ బ్రతుకుతాయి. నీరు నూత్నజీవానికి మూలం. అది పైనుండి దిగివస్తుంది. నీరు ఒక్కటైనా బహువిధాలుగా మారుతుంది. ఏదెను తోటకంతటికీ ఒకే నీటిబుగ్గ నీరు పెట్టింది. ప్రపంచమంతటినీ ఒక్కవానే తడుపుతుంది. ఆ ఒక్క జలమే లిల్లీలో తెల్లగాను, గులాబీలో ఎఱ్ఱగాను, మరో పూవులో ముదురు కెంపు వన్నెగాను కన్పిస్తుంది. ఒకే జలం ఆయా వస్తువులకు అనుకూలంగా మారిపోతుంది. ఆత్మకూడ ఒక్కడైనా తన చిత్తాన్నిబట్టి తన వరప్రసాదాలను అనేకులకు అనేక విధాలుగా పంచిపెడతాడు. కనుకనే క్రీస్తు అతన్ని నీటితో పోల్చాడు". ఆత్మజలం మనపై సమృద్ధిగా కురవాలనీ, ఆ నీటిలో మన శరీరాలూ హృదయాలూ నానాలనీ అడుగుకొందాం.

# 8. రక్షణ చరిత్రను నడిపించే ఆత్మ

1. దేవుడు మట్టిముద్దలోనికి ఊపిరి ఊది నరుని చేయడంతో నరజాతి చరిత్ర ప్రారంభమైంది - ఆది 2,7. దేవుడు వూదిన ఆ వూపిరి ఆత్మే. తర్వాత ప్రభువు యిస్రాయేలీయులతో నిబంధనం చేసికొన్నాడు. కాని యూదులు ఆ ప్రభువు నిబంధనాన్ని మీరారు.

యిస్రాయేలీయులు దేవునిమీద తిరగబడి
అతని పవిత్రాత్మను దుఃఖపెట్టారు

- యెష 63,10. కనుక పూర్వవేద నిబంధన చరిత్ర ఆత్మద్వారానే నడిచింది. తర్వాత ప్రభువు నూత్నవేద ప్రజలతో గూడ నిబంధనం చేసికొన్నాడు. ఈ నూత్న నిబంధనపు మధ్యవర్తి క్రీస్తే. యావే ఆత్మ అతనిమీదికి గూడ దిగివచ్చింది.

దేవుని ఆత్మ అతనిపై నిలుస్తుంది
అది విజ్ఞాన వివేకాలను ఒసగే ఆత్మ
దూరదృష్టినీ బలాన్నీ ప్రసాదించే ఆత్మ
దైవజ్ఞానాన్నీ దైవభీతినీ దయచేసే ఆత్మ

- యెష 11,2. ఈ విధంగా పూర్వ నూత్న నిబంధనలు కూడ ఆత్మద్వారానే నెలకొన్నాయి.

2. లూకా సువిశేషంలో మెస్సీయా ఆత్మద్వారా రక్షణ చరిత్రను కొనసాగించుకొని పోతాడు. అతడు ఆత్మ ప్రభావంవల్ల జన్మించాడు-1,35. జ్ఞానస్నాన సమయంలో ఆత్మ అతనిమీదికి పావురంలా దిగివచ్చి అతన్ని మెస్సీయాగా అభిషేకించింది. అటుపిమ్మట అతన్ని ఎడారికి తోడ్కొనిపోయింది - 4,4. క్రీస్తు ఆత్మ ప్రభోధంతో పిశాచాలను వెళ్ళగొట్టి దైవరాజ్యాన్ని నెలకొల్పాడు - 11,20.

ఆత్మ నరునికి స్నేహితుడై రక్షణచరిత్రను నడిపించుకొనిపోతుంది. క్రీస్తుద్వారా దైవప్రజలకు పరలోక రాజ్యాన్ని స్థాపించిపెడుతుంది. గ్రీకు రోమను ప్రజలూ, మనదేశంలోని హిందూ ప్రజలూ జననమరణాదులతో కూడిన సంసార చక్రంలో చిక్కుకొనిపోయారు. కాని దైవప్రజల కొరకు ఆత్మ నడిపించే రక్షణచరిత్ర మాత్రం అలా జననమరణాదుల్లో చిక్కుకొనిపోక, క్రీస్తుద్వారా ఓ నిర్ణీత గమ్యాన్ని చేరుతుంది. ఆత్మ మహాశక్తితో పనిచేసి సుతుణ్ణి లోకంలో నరుణ్ణిగా పుట్టించింది. రక్షణోద్యమానికి గమ్యాన్ని సాధించిపెట్టేది ఈ సుతుడే.

3. రక్షణచరిత్రకు ఆదీ అంతమూ ఆత్మే. ఆత్మ ద్వారానే ఆదిలో జలరాశినుండి ప్రాణికోటి పుట్టింది - ఆది 1,2. ఈ దివ్యచరిత్రకు అంతంకూడ ఆత్మే. కనుకనే ఆత్మా వధువు ఇద్దరూ క్రీస్తుని తిరిగిరమ్మని ఆహ్వానిస్తారు - దర్శ 22,17. ఈ క్రీస్తు పుట్టుక ఆత్మద్వారానే అని చెప్పాం. అతని వుత్థానంగూడ ఆత్మద్వారానే - రోమా 8,11.

4. రక్షణచరిత్రకు ఆత్మ ఆదీ అంతమూ అంటే, ఆ యాత్ముడు అతి ముఖ్యమైనవాడు, మన హృదయాల్లో వసించేవాడు అని భావం. కనుకనే ప్రభువు యెహెజ్కేలు ప్రవక్తద్వారా నా యాత్మను నీ హృదయాల్లో వుంచుతాను అన్నాడు - 36,26. ఇంకా, దేవుడు తన కుమారుని ఆత్మను మన హృదయాల్లోకి పంపాడు - గల 4,6. ఆత్మద్వారా దేవుడు ప్రేమను మన మృదయాల్లోకి కుమ్మరించాడు - రోమా 5,5. మన ఉత్థానమూ మోక్ష ప్రవేశమూ ఆత్మద్వారానే - 2కొ 1,22. సంగ్రహంగా చెప్పాలంటే

ఆత్మడు మనలోనే వుంటాడు - యోహా 14,17. మనం నిర్ణయాలు చేసికొనేపుడూ, పనికి పూనుకొనేపుడూ మన అంతరంగంలో వుండి మనకు ప్రేరణ పుట్టిస్తాడు.

## ప్రార్థనా భావాలు

1. ఇరెనేయస్ భక్తుడు ఈలా చెప్పాడు. "క్రీస్తులో వసిస్తూన్నపుడే ఆత్మడు నరజాతితో జీవించడానికి అలవాటు పట్టాడు. అటుపిమ్మట ఆ దివ్యమూర్తి అపోస్తలుల్లో వసించాడు. నేడు మనలోను వసిస్తున్నాడు". పవిత్రాత్మకు మానవజాతి అంటే యిష్టం. మానవులతో వుండడం యిష్టం. మన తరపున మనకుకూడ ఆ యాత్మపట్ల ఎనలేని ప్రీతి పుట్టాలి.

2. అగస్టీను భక్తుడు తన విశ్వాసులకు ఈలా బోధించాడు. "నా మట్టుకు నేను మీకు వేదవాక్యం విన్పించాను. కాని మీరు నా పల్కులను విన్నపుడు ఆత్మే మీ హృదయాల్లో బోధచేస్తుంది. లేకపోతే నేను విన్పించిన వేదవాక్యం మీకు అర్థం కానేకాదు. బోధకుల బోధ మనం కేవలం చెవులతో వినడానికి మాత్రమే. మన హృదయాల్లో నిజంగా బోధచేసే దేవుని ఆత్మ పరలోకంలో వుంది. మీలో వసించే క్రీస్తు ఆత్మ మీ హృదయాల్లో మాట్లాడకపోతే నా బోధ నిరర్థకమే ఔతుంది." బోధకుల బోధలను నిమిత్త మాత్రంగా తీసికొని ఆత్మే నేడు మనకు బోధ చేయాలని వేడుకొందాం.

# 9. కడపటి దినాల్లో దేవుడిచ్చే దానం

1. ప్రభువు మోషే అనుచరులైన 70 మంది పెద్దలకూ ఆత్మను దయచేసాడు. అతడు మోషే ఆత్మను తీసికొని ఆ పెద్దలకిచ్చాడు - సంఖ్యా 11,25. అటుపిమ్మట న్యాయాధిపతులూ రాజులూ ప్రవక్తలూ ఆత్మను పొందారు. అంత్యదినాల్లో ఆత్మ అందరి మీదికీ దిగివస్తుందని యోవేలు ప్రవచించాడు - 2,28. కాని చివరి ప్రవక్తయైన మలాకీతో పూర్వవేదంలో ఆత్మ అదృశ్యమైపోయింది. యేసు ఇంకా మహిమను పొందలేదు కనుక ఆత్మ యింకా అనుగ్రహింపబడలేదు అంటుంది యోహాను సువిశేషం 7,39. అనగా ప్రవక్తల కాలం ముగిశాక అదృశ్యమైన ఆత్మ, మళ్ళా క్రీస్తు మహిమానంతరంగాని మనకు దర్శనమీయదు. అందుకే కాబోలు ఎఫేసులోని స్నాపక యోహాను శిష్యులు "పవిత్రాత్మడు ఉన్నాడన్న విషయం మేము విననైన లేదే" అన్నారు - అ.చ. 19,2.

2. క్రీస్తుతో ఆత్మ మళ్ళా ప్రత్యక్షమైంది. క్రీస్తు జ్ఞానస్నాన సమయంలో పావురంలా దిగివచ్చింది - లూకా 3,22. ఉత్థాన క్రీస్తు తండ్రినిచేరి పిత వాగ్దానమైన ఆత్మను స్వీకరించాడు. ఆ యాత్మను మన మీద కూడ కుమ్మరించాడు - అ.చ. 2,33. నేడు

మనం జ్ఞానస్నాన సమయంలోనే ఈ యాత్మను పొందుతాం. ఈ జీవితయాత్రలో మనలను నడిపించేది ఆత్మే - రోమా 8,14. దేవుడు వాగ్దానం చేసిన ఆత్మను మనం సమృద్ధిగా పొందాలి. ఈ కడపటి దినాల్లో దేవుడు మనకిచ్చే గొప్ప దానం ఆత్మ.

## ప్రార్థనా భావాలు

1. ఆత్మ గొప్పవరం. క్రీస్తు ఈ వరాన్ని అందరికీ దయచేస్తాడు. నరులు ఒక్కొక్కరి ఆశనుబట్టీ యోగ్యతను బట్టీ క్రీస్తునుండి ఆత్మను పొందుతారు. ఆత్మ అనే వరం లోకాంతం వరకు నరులతోవుండి వారికి వూరటా నమ్మకమూ వెలుగూ దయచేస్తుంది. క్రీస్తునుండి మనం ఆత్మను పుష్కలంగా పొందాలి. ఓసారి పొందిన ఆత్మను భక్తి విశ్వాసాలతో నిలబెట్టుకోవాలి.

2. మనకు ఆత్మ అవసరం ఏమిటి? ఆత్మ లేకపోతే నష్టమేమిటి?

ఆత్మ లేకపోతే దేవుడు మనకు దూరమౌతాడు. అతడుంటే దగ్గిరౌతాడు.

ఆత్మ లేకపోతే క్రీస్తు కేవలం భూతకాలానికి చెందిన వాడౌతాడు. అతడుంటే క్రీస్తు వర్తమానానికి చెందినవాడౌతాడు.

ఆత్మ లేకపోతే సువిశేషం మృతాక్షర మౌతుంది. అతడుంటే అది జీవనదాయక సందేశ మౌతుంది.

ఆత్మ లేకపోతే తిరుసభ కేవలం అధికార మందిర మౌతుంది. అతడుంటే అది సేవాసంస్థ ఔతుంది.

ఆత్మ లేకపోతే మనం చేసే వేదబోధ కేవలం రాజకీయ ప్రచారమౌతుంది. అతడుంటే అది నూత్న పెంతెకోస్తు ఔతుంది.

ఆత్మ లేకపోతే అర్చనకాండ కేవలం క్రీస్తు మరణోత్థానాల స్మరణం మాత్రమే ఔతుంది. అతడుంటే అది వరప్రసాద సాధనమౌతుంది.

ఆత్మ లేకపోతే మన శరీరమే మన ఆత్మను జయిస్తుంది. అతడుంటే మన ఆత్మే మన శరీరాన్ని జయిస్తుంది.

ఆత్మ లేకపోతే ఈ లోకంలో కేవలం లౌకిక రాజ్యమే పెత్తనం జేస్తుంది. అతడుంటే ఈ లోకం పరలోకరాజ్యంగా మారిపోతుంది.

ఆత్మ మనకు నిత్యనూతనత్వాన్ని దయచేస్తుంది. ఆత్మతో జీవించేదే ఆధ్యాత్మిక జీవితం.

# 2. క్రీస్తుని ఆత్మ

## 10. క్రీస్తూ - ఆత్మా

1. పౌలు క్రీస్తు నుద్దేశించి "ఆత్మయైన ప్రభువు" అని పేర్కొన్నాడు. "ప్రభువే ఆత్మ" అన్నాడు - 2కొ 3,17-18. ఇక్కడ క్రీస్తు ఆత్మ అయిపోయాడని భావం కాదు. ఆత్మతో సంపూర్ణంగా నిండిపోయాడని మాత్రమే అర్థం. క్రీస్తు దేవుని కుమారుడైనట్లే, ఆత్మ క్రీస్తు ఆత్మ ఔతుంది. క్రీస్తు ఉత్థానంలో ఆత్మ సంపూర్ణంగా గోచరిస్తుంది.

2. పూర్వవేదంలో మెస్సీయా ఆత్మతో నిండిపోయాడు. "దేవుని ఆత్మ అతనిపై నిలుస్తుంది" అన్నాడు యెషయా 11,2. క్రీస్తు ఆత్మద్వారానే జన్మించాడు. జ్ఞానస్నానంలో ఆత్మడు అతనిపై దిగివచ్చాడు - యోహా 1,32. పూర్వం సంసోను సౌలు దావీదు మొదలైన యుద్ధవీరులమీదికి దిగివచ్చినట్లే ఆత్మడు మెస్సీయామీదికి గూడ దిగివచ్చాడు. క్రీస్తు అతనియందు ఆనందించాడు - లూకా 10,21. ఆత్మతోనే పిశాచాలను తరిమివేసాడు - 11,20.

3. క్రీస్తుకీ ఆత్మకీ దగ్గరి సంబంధం వుంది. ఇద్దరూ మన దగ్గరికి వస్తారు. ఆత్మను తండ్రి పంపుతాడు. "నేను తండ్రిని ప్రార్థిస్తాను. మీతో ఎల్లపుడూ వుండడానికి మరొక ఆదరణ కర్తను ఆయన మీకు అనుగ్రహిస్తాడు" - యోహా 14,16. కాని క్రీస్తు తనంతట తానే మన దగ్గరికి వస్తాడు. "నేను మిమ్ము అనాథులుగా వదలిపెట్టను. నేను మీ యొద్దకు వస్తాను" - 14,18. ఆత్మడు వచ్చి క్రీస్తుని తొలగించడు. క్రీస్తుని మనకు ప్రత్యక్షం చేస్తాడు.

క్రీస్తు చనిపోతూ మనకొరకు ఆత్మను విడిచాడు - యోహా 19,30. బల్లెంతో పొడిచిన ప్రభువు ప్రక్కనుండి నెత్తురూ నీరూ కారాయి 19,34. ఈ నీరు ఆత్మనే సూచిస్తుంది.

క్రీస్తు ఆత్మా ఏకవ్యక్తికాదు. వేరు వేరు వ్యక్తులు. ఆత్మ మరొక ఆదరణకర్త - 14,16.

క్రీస్తు మహిమను పొందకముందు లోకంలో ఇంకా ఆత్మలేదు - 7,39.

4. పౌలు పవిత్రాత్మను దేవుని ఆత్మ, క్రీస్తు ఆత్మ అని పేర్కొన్నాడు - రోమా 8,9. క్రీస్తు ఆత్మా కలసే విశ్వాసులను నీతిమంతులనుగా జేస్తారు - 1కొ 6,11. విశ్వాసులు క్రీస్తుకి దేహమౌతారు. ఆత్మకు ఆలయమౌతారు -1కొ 6,15.19. క్రీస్తూ ఆత్మా ఎప్పుడూ కలసిపోతూంటారు. ఏనాడూ ఒకరినుండి ఒకరు వేరుకారు. ఆత్మ సహాయం లేందే ఇప్పుడు మనం క్రీస్తుని విశ్వసించలేం. "పవిత్రాత్మ వలన తప్ప ఎవడుకూడ యేసే ప్రభువు అని అంగీకరించలేడు" - 1కొ 12,3.

1. గ్రెగోరీ నాసియాన్సన్ భక్తుడు ఈలా వ్రాసాడు. "దేవుడు తనలోని ముగ్గురు వ్యక్తులనుగూర్చి మూడుదశల్లో నరులకు తెలియజేసికొన్నాడు. పూర్వవేదం తండ్రినిగూర్చి స్పష్టంగాను క్రీస్తునిగూర్చి అస్పష్టంగాను మాట్లాడుతుంది. నూత్నవేదం క్రీస్తుని స్పష్టంగా బోధిస్తుంది. కాని ఆత్మ దైవత్వాన్ని అస్పష్టంగా మాత్రమే బోధిస్తుంది. పెంతెకోస్తు తర్వాత ఇప్పుడు ఆత్మ మన హృదయాల్లో వసిస్తూ తన్నుతాను మనకు స్పష్టంగా తెలియజేసికొంటూంది. నరులకు తండ్రిని గూర్చి తెలియకముందే కుమారుని తెలియజేయడం, కుమారుని గూర్చి తెలియకముందే ఆత్మను తెలియజేయడం భావ్యం కాదు. అప్పుడు మనం ముగ్గురు దైవవ్యక్తులకూ వుండే వ్యత్యాసాన్ని గుర్తించలేక ఒకరితో ఒకరిని కలపివేసి వుండేవాళ్ళమే. పిల్లలకు అరగించుకోలేనంత భోజనం పెట్టకూడదు. వారి కండ్లు చూడలేని సూర్యుణ్ణి వారికి చూపించకూడదు. కనుక దేవుడు తన్నుగూర్చి తాను ఒక విడతగాక, క్రమేణ మెట్లుమెట్లుగా తెలియజేసికొన్నాడు". ఇవి లోతైన వాక్యాలు. పలుసార్లు భక్తితో మననం చేసికోదగ్గవి.

2. ఇరెనేయస్ భక్తుడు ఈలా చెప్పాడు. "ఉత్థాన క్రీస్తు శిష్యులకు తన యాత్మను దయచేసాడు. శిష్యులు ఆ యాత్మను పొంది ప్రజలకు జ్ఞానస్నానమిచ్చారు. వారికి ఆ యాత్మను పంచిపెట్టారు. ఈ విధంగా వాళ్ళు శ్రీభను స్థాపించారు. కనుక క్రీస్తూ ఆత్మా శిష్యులు స్థాపించిన శ్రీసభలో నెలకొని వుంటారు." ఈనాడు మనం శ్రీసభ ద్వారాగాని ఆత్మను పొందలేం.

# 11. ఆత్మతో నిండిన క్రీస్తు

1. పౌలు చెప్పినట్లుగా క్రీస్తు ప్రాణప్రదాతయైనన ఆత్మ అయ్యాడు - 1కొ 15,45. అనగా ఉత్థాన క్రీస్తు పరిశుద్ధత, శక్తి, అణిమ, మహిమ మొదలైన ఆత్మ లక్షణాలను పొందాడని భావం. క్రీస్తు ఉత్థానం అతని జీవితంలో శిఖరాయమానమైంది. ఆ సంఘటనం తర్వాత అతనికి నూత్నమహిమ ఏదీ లేదు. ఉత్థానంద్వారానే అతడు కుమారుడయ్యాడు. ఈ కుమారుణ్ణి గూర్చి రెండవ కీర్తనం

నీవు నాకు కుమారుడవు

ఈ దినం నీవు నాకు జన్మించావు

అని చెప్తుంది - 2,7. ఉత్థానం ద్వారా సిద్ధించిన ఈ కుమారత్వానికి పరిశుద్ధాత్మడే కారకుడు. క్రీస్తు జననం ద్వారానే కుమారుడు. కాని మరణోత్థానాల ద్వారా అతడు తండ్రికి అధిక ప్రీతిపాత్రుడైన కుమారుడయ్యాడు.

2. ఉత్థానక్రీస్తు ఒక్కడే. కాని ఉత్థానంద్వారా అతడు ఓ దేహాన్ని ఓ సమాజాన్ని పొందాడు. ఈ సమాజమే శ్రీభ. కనుకనే అతడు శిష్యులతో "నేను నా తండ్రి యందూ, మీరు నాయందూ నేను మీయందూ ఉన్నామని ఆ దినం మీరు గ్రహిస్తారు" అన్నాడు - యోహా 14,20. ఈలా ఉత్థానక్రీస్తు సమాజాన్ని నెలకొల్పడం గూడ ఆత్మద్వారానే జరిగింది.

3. నిత్యుడైన ఆత్మద్వారా క్రీస్తు తన్ను తాను అర్పించుకొన్నాడు - హీబ్రూ 9,14. చనిపోయిన క్రీస్తుని మళ్ళా ఉత్థానం చేసింది ఆత్మే. క్రీస్తు మరణోత్థానాలు ఒకే దైవరహస్యం.

మరణోత్థానాల ద్వారా క్రీస్తు మన రక్షణ కార్యాన్ని నిర్వహించాడు. మన పాస్క గొర్రెపిల్లయై మనకు విమోచనాన్ని సంపాదించిపెట్టాడు - 1కొ 5,7. ఆత్మద్వారా అతడు మనకు స్వీయదానమూ, స్వీయవరమూ అయ్యాడు. ఇప్పుడు క్రీస్తుని మరణమూ ధర్మశాస్త్రమూ మొదలైనవేవీ బాధించలేవు. ఆత్మద్వారా అతడు సర్వతంత్ర స్వతంత్రుడు - 2కొ 3,17. ఇక అతనిలో ఆత్మశక్తేగాని శరీర బలహీనత ఏమీ లేదు.

## ప్రార్థనా భావాలు

1. శ్రీసభకు శిరస్సు లేక నాయకుడు క్రీస్తు. ఆ సభకు ఆత్మ ఆత్ముడే. మన ఆత్మ మన దేహాన్ని నడిపిస్తుంది. దేహంలోని అవయవాలన్నింటినీ అదుపులో వుంచుకొని అవి ఐక్యమత్యంతో పనిచేసేలా చేసేది ఆత్మే. ఈలాగే పవిత్రాత్ముడు కూడ శ్రీసభలోని విశ్వాసులందరినీ ఐక్యపరుస్తాడు. వాళ్ళందరినీ ఒక త్రాటమీద నడిపించి క్రీస్తు దగ్గరికి చేరుస్తాడు. మన సమాజాల్లో ఐక్యతా పరస్పర ప్రేమా వృద్ధిచెందేలా చేయమని ఆత్మను అడుగుకొందాం.

2. లియొనిడెస్ ప్రాచీన వేదసాక్షి. అతనికి ఓరిజన్ అనే శిశువు పుట్టాడు. ఓ దినం లియోనిడెస్ ఓరిజన్ రొమ్ముమీది బట్టను తొలగించి ఆ శిశువుని రొమ్ముమీదనే ముద్దు పెట్టుకొన్నాడు. జ్ఞానస్నానం ద్వారా పవిత్రాత్మ ఆ శిశువు హృదయంలో ఓ దేవాలయంలోలాగ వసిస్తూందన్న విశ్వాసంతోనే లెయోనిడెస్ అలా ముద్దుపెట్టుకొన్నాడు. ఈ ఓరిజన్ తర్వాత గొప్ప వేదపండితుడయ్యాడు. క్రీస్తు ఆత్మ పవిత్ర గ్రంథాలపట్ల భక్తిభావమూ బాల్యంనుండే ఓరిజన్ హృదయంలో నెలకొన్నాయి. ఈ లెయోనిడెస్‌లాగే నేడు మనంకూడ ఆత్మపట్ల భక్తిని పెంపొందించుకోవాలి.

# 12. ఆత్మను దయచేసే క్రీస్తు

1. ఉత్థాన క్రీస్తు మనకు ఆత్మను దయచేస్తాడు. క్రీస్తు ప్రాణదాతయైన ఆత్మ అయ్యాడు - అకొ 15,45. అతడు తాను సమృద్ధిగా స్వీకరించిన ఆత్మనే మనకుగూడ దయచేసాడు.

అతని అంతరంగంనుండి జీవజల నదులు ప్రవహిస్తాయి - యోహా 7,38. ఉత్థాన క్రీస్తునుండి పారే నీరు పవిత్రాత్మే. ఈ నీరు నరులను శుద్ధిచేస్తుంది. సఫలులను చేస్తుంది. మనకు జీవమిస్తుంది. పూర్వవేదంలో యెహెజ్కేలు దేవళంనుండి నీరు పారుతూందని చెప్పాడు - 47,1. ఆ దినాన యెరూషలేమునుండి స్వచ్ఛమైన నీరు ప్రవహిస్తుందని జెకర్యా వచించాడు - 14,8. కాని నూత్నవేదంలో క్రీస్తు తననుండే నీరు ప్రవహిస్తుందని వాకొన్నాడు. అతని ఆధిక్యం అలాంటిది.

2. క్రీస్తు తండ్రి దగ్గరికి వెళ్ళి అతని వద్దనుండి మనకు ఆత్మను పంపుతాడు - యోహా 16,7. ఈ వాక్యంలో తండ్రి దగ్గరికి వెళ్ళడమంటే మోక్షారోహణం చేయడమని అర్థం. క్రీస్తు స్వర్గంనుండి ఆత్మను పంపుతాడు. ఆత్ముడు స్వర్గానికి చెందినవాడు. కనుక స్వర్గంనుండిగాని మనమీదికి దిగిరాడు. క్రీస్తు తండ్రి చెంతనుండి మనకు ఆత్మను పంపుతాడు - 15,26. క్రీస్తు తండ్రినుండి ఆత్మను పొంది తాను పొందిన ఆత్మను మనమీద కుమ్మరిస్తాడు - అ.చ. 2,33. ఆత్మను పంపడమనేది క్రీస్తు ఉత్థాన దేవరహస్యంలో ఓ ముఖ్యాంశం.

3. ఆత్మను పంపేది ఉత్థాన క్రీస్తు మాత్రమే. ఉత్థాన దేవరహస్యం ఆత్మకు జన్మస్థానం. క్రీస్తు ప్రక్కను బల్లెంతో తెరవగా నెత్తురూ నీరు స్రవించాయి. పూర్వం మోషే బెత్తంతో రాతి బండను కొట్టగా దానినుండి నీళ్ళు స్రవించాయి - సంఖ్యా 20,11. ఆ రాతిబండ క్రీస్తునే సూచిస్తుంది. ఆ రాయి క్రీస్తే - 1కొ 10,4.

క్రీస్తు ప్రక్కలోనుండి కారిన నెత్తురు అతడు బలిపశువని తెలియజేస్తుంది. కనుక ఈ నెత్తురు మన పాపాలకు పరిహారం చేస్తుంది. ఇంకా ఈ రక్తం దివ్యసత్ప్రసాదానికి గూడా చిహ్నం. మనం ప్రభువు శరీరరక్తాలను భుజించి మన ఆకలిదప్పులు తీర్చుకొంటాం. అతన్ని స్వీకరించే వాళ్ళకు ఆకలి దప్పులు వుండవు - యోహా 6,35.

క్రీస్తు ప్రక్కలోనుండి కారిన నీరు వరప్రసాదానికీ జ్ఞానస్నాన జలాలకీ ఆత్మకీ చిహ్నం. ఉత్థాన దేవరహస్యం ఆత్మకు జన్మస్థానమని ముందే చెప్పాం.

తెరువబడిన క్రీస్తు హృదయంనుండే శ్రీసభ పుట్టుకవచ్చింది. పూర్వం ఆదాము ప్రక్కలోనుండి ఏవ పుట్టింది. అలాగే యిప్పుడు క్రీస్తు ప్రక్కలోనుండి తిరుసభ పుట్టింది.

క్రీస్తు సిలువపై శిరస్సువంచి ఆత్మను విడిచాడు - యోహా 19,30. క్రీస్తు మరణంనుండి ఆత్మ పుట్టింది. ప్రేమతో గూడిన క్రీస్తు మరణంనుండి ప్రేమ నిధియైన ఆత్మ వెలువడింది. క్రీస్తు మరణమే ఆత్మకు మూలం. అతడు మహిమను పొందేంతవరకూ లోకంలో ఆత్మ లేదు - 7,37.

నీరూ నెత్తురూ క్రీస్తు హృదయంనుండి వెలువడ్డాయి. అవి అతని అంతరంగంనుండి స్రవించాయి. మన రక్షణం కొరకు నీరూ నెత్తురూ ఒలికించిన ప్రభువుని మనం లోకాంతం వరకు ధ్యానించుకోవాలి. "వారు తాము కత్తితో పొడిచిన వానివైపు చూస్తారు" అని ప్రవచించాడు జెకర్యా - 12,10.

క్రీస్తు ఆత్మను దయచేసేవాడు. అతడు మనకిచ్చే దానం ఆత్మ. క్రీస్తు ఉత్థాన దేవరహస్యం ఆత్మకు జన్మస్థానం.

## ప్రార్థనా భావాలు

1. యెరూషలేము సిరిల్ భక్తుడు ఈలా వ్రాసాడు. "పవిత్ర గ్రంథాలను వ్రాయించింది ఆత్మడే. అతడు ఆ పుస్తకాల్లో తన్ను గూర్చి తనకిష్టమొచ్చినంత మాత్రమే చెప్పించాడు. అతడు చెప్పించినదానికంటె మనం ఎక్కువ చెప్పకూడదు. ఐనా అతడు చెప్పించని విషయాలను గూర్చి మనం పరిశోధనం చేయవచ్చు." ఆత్మ పవిత్ర గ్రంథాల్లో తన్ను గూర్చి చాల స్వల్పంగా చెప్పించాడు గనుకనే ఆత్మను గూర్చిన దైవశాస్త్రం అంతగా వృద్ధిచెందలేదు. ప్రాచీనకాలం నుండి ఆత్మకు "గుప్తమైయున్న దేవుడు" అని పేరు. నేటికీ ఆత్మను గూర్చిన దేవరహస్యాలు ఎన్నో అస్పష్టంగానే మిగిలివున్నాయి.

2. సిరియా సీమోను అనే భక్తుడు ఈలా వాకొన్నాడు. "ఆత్మద్వారా మనం రోజూ ఉత్థానం పొందుతాం. ఇది లోకాంతంలో ప్రాప్తించే ఉత్థానం కాదు. ఈ లోకంలోనే పాపంనుండి పొందే ఉత్థానం. ఆత్మ రోజూ మనకు పాప పరిహారాన్ని దయచేస్తుంది. పాపంలో పడిపోయిన మనలను రోజూ పైకి లేపుతుంది." పాపపరిహారమనే యీ వుత్థానాన్ని మనం అధికాధికంగా పొందాలని వేడుకొందాం.

# 13. క్రీస్తుకి సాక్ష్యంబలికే ఆత్మ

1. క్రీస్తు అద్భుతాలద్వారా తండ్రి అతనికి సాక్ష్యం బలుకుతాడు - యోహా 8.18. పూర్వవేద గ్రంథాలు అతని తరపున సాక్ష్యం చెప్తాయి. స్నాపక యోహాను అతని పక్షాన సాక్ష్యం బలుకుతాడు - 1,6-7. కడన ఆత్ముడుగూడ అతన్ని గూర్చి సాక్ష్యం బలుకుతాడు - 15,26.

2. క్రీస్తుని దోషినిగా నిర్ణయించినపుడు ఎవరూ అతని తరపున సాక్ష్యం చెప్పలేదు. అందరూ అతన్ని ద్రోహినిగానే ఎంచారు. ఇపుడు ఉత్థానం తర్వాత ఆత్మ క్రీస్తుని గూర్చి సాక్ష్యం పలుకుతుంది - 16,8-11. అనగా దోషిగా నిర్ణయింపబడిన క్రీస్తే నీతిమంతుడుగా చలామణి అయ్యాడు. పిశాచమే దోషిగా తీర్పును పొందింది - 12,31.

**3. కాని ఆత్మ క్రీస్తుకి ఏలా సాక్ష్యం పలుకుతుంది?**

1. ఆత్ముడు అపోస్తులుల ద్వారా క్రీస్తు మరణోత్థానాలను గూర్చి లోకానికి సాక్ష్యం చెప్పిస్తాడు - లూకా 24,48.

2. ఇంకా ఆత్ముడు విశ్వాసుల హృదయాల్లో కూడ క్రీస్తుకి సాక్ష్యం పల్కుతాడు. "మీరు పవిత్రాత్మ వలన అభిషేకం పొందారు" - 1యోహా 2,20.27. ఆత్మ మన హృదయాల్లో విశ్వాసం పుట్టించి మనం క్రీస్తుని నమ్మేలా చేస్తుంది. ఈ విశ్వాసాన్నే యోహాను ఇక్కడ అభిషేకం అని పిల్చాడు. ఇది మన అంతరంగంలో జరిగే పని.

4. ఆత్మ క్రీస్తుకి ఎందుకు సాక్ష్యం పలుకుతుంది ?

తాను సత్యస్వరూపియైన ఆత్మ కనుక - యోహా 16,13. నూత్నవేదం సత్యం అనే మాటను క్రీస్తుకి వాడుతుంది, ఆత్మకూ వాడుతుంది. ఆత్మ శిష్యులకు క్రీస్తుని బోధిస్తుంది. అతని బోధలను వారికి విప్పి చెప్తుంది - 14,26. వారిని సంపూర్ణ సత్యంలోనికి నడిపిస్తుంది - 16,13. ఈ సంపూర్ణ సత్యం క్రీస్తే. కనుక శిష్యులు ఆత్మ సహాయంతో క్రీస్తుని బాగా అర్థం చేసికొంటారు.

ఆత్మే సత్యం కాదు. క్రీస్తు సత్యం. కనుక ఆత్మ శిష్యులను సత్యంలోనికి నడిపిస్తుంది. మనకు వేదసత్యాలను తెలియజేసేది ఆత్మే. అతడు ఎప్పుడుకూడ మన హృదయాల్లో పని జేస్తూంటాడు. మన హృదయాల్లో దివ్యజ్యోతిని వెలిగించి మనం క్రీస్తుని అధికాధికంగా అర్థం చేసికొనేలా చేస్తుంటాడు.

## ప్రార్థనా భావాలు

1. సిరియా సీమోను అనే భక్తుడు ఈలా ప్రార్థించాడు :

వెలుగైన ఆత్మమా
స్వర్గనిధివైన ఆత్మమా
స్వీయశక్తితో సర్వాన్ని మార్చే ఆత్మమా
స్వయంగా కదలకే అన్నిటినీ కదిలించే ఆత్మమా
ఆనంద దాయకుడవైన ఆత్మమా
నా హృదయాశలకు నిలయమైన ఆత్మమా

నా కోర్కెలన్నీ తీర్చే ఆత్మమా
నాకు ఆనందానుభూతి నొసగే ఆత్మమా
వేంచేయి.

2. ఇంకో ప్రాచీన భక్తుడు ఆత్మనుగూర్చి ఈలా జపించాడు :
కష్టపడేవాళ్ళను ఓదార్చే ఆత్మమా
మా హృదయాలను శుద్ధిచేసే ఆత్మమా
దుర్బలులకు బలాన్నొసగే ఆత్మమా
పడిపోయేవాళ్ళను నిలబెట్టే ఆత్మమా
వినయవంతుల వినయాన్ని పెంచి
గర్వితుల గర్వాన్ని అణచివేసే ఆత్మమా
అనాథులకు తండ్రివైన ఆత్మమా
పేదలకు ఆశాజ్యోతివైన ఆత్మమా
ఓడ మునిగిన వారికి రేవువైన ఆత్మమా,
నాకు నీపట్ల భక్తిని ప్రసాదించు.

3. నూత్నవేదం ప్రకారం, క్రీస్తు మరణోత్థానాలకు ముందు అతడే తండ్రినుండి ఆత్మను పొందుతాడు. ఈ దశలో అతడు శిష్యులకు ఆత్మను ఈయడు. మరణోత్థానాల తర్వాత అతడు శిష్యులకు ఆత్మను దయచేస్తాడు. ఈ దశలో అతడు తండ్రినుండి ఆత్మను పొందడు. నేడు ఆత్మా క్రీస్తు ఒకరినొకరు మనకు అందించుకొంటారు. ఆ దివ్యవ్యక్తుల్లో ఒకరున్నచోట మరొకరుకూడ వుంటారు.

## 14. మరియను నడిపించిన ఆత్మ

1. మరియ తాను జన్మించినప్పటినుండి ఆత్మకు ఆలయంగా వుండిపోయింది. గబ్రియేలు ఆమెను "అనుగ్రహ పరిపూర్ణురాలా" అని సంబోధించాడు. అనగా ఆమె ఆత్మతో పూర్ణంగా నిండిపోయిందనే భావం. క్రిసోస్తం భక్తుడు "తండ్రి మరియను ఎన్నుకొన్నాడు. కాని ఆత్ముడు ఆమెను సందర్శించి పవిత్రపరచాడు. ఓ తోటకులాగ ఆమెకు నీరు పెట్టాడు" అని వ్రాసాడు. అనగా ఆత్మద్వారా ఆమె సంపూర్ణంగా శుద్ధినిపొంది పవిత్రురాలయిందని భావం.

ఆత్మ క్రీస్తుని ఎడారికి నడిపించింది - లూకా 4,1. నేడు తన బిడ్డలమైన మనలను నడిపిస్తుంది - రోమా 8,14. అలాగే మరియనుకూడ నిరంతరం దైవమార్గంలో నడిపించింది.

2. గబ్రియేలు మంగళవార్తను విన్పించినపుడు మరియ దేవుని రక్షణ ప్రణాళికతో సహకరించింది. విశ్వాసంతో దేవుని చిత్తానికి లొంగింది. ఈ సందర్భంలో పవిత్రాత్మే ఆమె విశ్వాసాన్ని బలపరిచింది. ఆత్మ ఆమె మీదికి ఓ మేఘంలా దిగివచ్చింది - లూకా 1,35. ఆ దివ్యశక్తివల్లనే ఆమె గర్భవతి ఐంది, ఆమె కుమారుడు పవిత్రుడయ్యాడు.

ఎలిసబేతును సందర్శించినపుడు ఆమె ఆత్మశక్తితో ప్రవచనం చెప్పింది. ఆ ప్రవచనమే మహిమగీతం. ఆ పాటలో ఆమె దేవుడు తన దాసురాలి దీనావస్థను కటాక్షించాడు అని చెప్పుకొంది. ప్రభువు గర్వితులను అణగద్రొక్కి దీనులను పైకి లేపేవాడు.

మరియ జీవితకాలంమంతా ఆత్మ ఆమెను నడిపిస్తూనే వచ్చింది. ఆ దివ్యశక్తి మరియను ప్రేరేపించి ఆమె క్రీస్తు జీవిత సంఘటనల భావాన్ని లోతుగా ఆలోచించి చూచుకొనేలా చేసాడు - లూకా 2,19.51.

క్రీస్తు సిలువపై చనిపోయేపుడు ఆ తల్లి సిలువ క్రింద నిలచివుంది. ఆమె తన మనసులో ఘోరబాధలు అనుభవిస్తూ కుమారుని తండ్రికి సమర్పించింది. కొందరు పునీతుల భావాల ప్రకారం, ఈ సందర్భంలో ఆమె అనుభవించినంత వేదన ఏ నరుడూ అనుభవించలేదు. కాని ఈ బాధను అనుభవించే శక్తి ఆత్మడే ఆమెకు దయచేసాడు.

ఆత్మ దిగిరాకముందు మరియ శిష్యులతో గలసి మీదిగదిలో ఆత్మ రాకడకొరకు ప్రార్థించింది - అ.చ. 1,14. ఈ కార్యం ఆత్మ ప్రేరణం వల్లనే జరిగింది.

మరియ ఉత్థాపనంలోకూడ ఆత్మశక్తి వుంది. ఆత్మ అనుగ్రహం వల్లనే ఆమె దేహం శిథిలం కాకుండా మోక్షానికి కొనిపోబడింది. జీవనదాతయైన ఆత్ముడు ఆమె మృతదేహానికి శాశ్వతజీవాన్ని దయచేసాడు. ఈలా ఆమె దేహంలోని ప్రతి ముఖ్యసంఘటనంలోను ఆత్మ ప్రభావం వుంది.

3. కాని పవిత్రాత్ముడు కన్య గర్భంలో క్రీస్తు శిశువుని ఏలా రూపొందించాడు? పవిత్రాత్ముడు క్రీస్తుకి ముందుగా పోయేవాడు. అతనికి మార్గం సిద్ధంజేసేవాడు. మరియ దేవదూత సందేశాన్ని విని అంగీకరించగానే ఆత్ముడు ఆమె గర్భంలో యేసు శిశువుని రూపొందించాడు. మరియ మొదట పవిత్రాత్మను తన హృదయంలో ధరించింది. ఆ దివ్యవ్యక్తి ఆమెకు పరిపూర్ణ జీవాన్నిచ్చి జీవమయుడైన క్రీస్తు ఆమెనుండి జన్మించేలా చేసాడు. ప్రాచీన క్రైస్తవులు ఆమెను "పవిత్రాత్మకు ప్రియురాలు" అని పేర్కొన్నారు. ఆత్ముడు

యేసు జననానికి ఓ పవిత్ర గర్భాన్ని వెదికాడు. ఆ గర్భం అతనికి కన్య మరియలో దొరికింది. ఆ నిర్మల గర్భమే దేవుణ్ణి మానవలోకంలోకి తీసుకవచ్చింది.

మరియ ఒక్క క్రీస్తుకేకాదు, అతని దేహమైన తిరుసభకు కూడ తల్లి. క్రీస్తు మనకు శిరస్సు. మనమందరమూ అతనిలో ఇమిడే వున్నాం. కనుక మరియ మనందరికీ తల్లి. నేడు క్రీస్తు సాన్నిధ్యంలాగే ఆ తల్లి సాన్నిధ్యంకూడ తిరుసభలో నెలకొనివుంది. మరియను క్రీస్తుకి, శారీరకంగా తల్లిని జేసిన ఆత్మడే ఆమెను తిరుసభకుకూడ ఆధ్యాత్మికంగా తల్లిని చేసాడు. ఆత్మకు వశవర్తినియై జీవించిన మరియ నేడు మనంకూడ ఆ యాత్మ ప్రేరణలకు లొంగి జీవించాలని హెచ్చరిస్తుంది.

### ప్రార్థనా భావాలు

1. ఆత్మ దేవునికీ మనకూ నడుమ మధ్యవర్తిగా వుంటుంది. అన్ని వరాలూ వరప్రసాదాలూ తండ్రినుండి క్రీస్తుద్వారా ఆత్మగుండా మనకు లభిస్తాయి. మన తరపున మనం దేవుణ్ణి తెలిసికోవాలన్నా, చేరాలన్నా ఆత్మే మార్గం. కనుక మనం ఆత్మగుండ క్రీస్తుద్వారా తండ్రిని చేరుతాం. అసలు ఆత్మ అనుగ్రహం లేందే ఆధ్యాత్మికరంగంలో దేన్నిగూడ సాధించలేం. ఆ దివ్యవ్యక్తి దేవునికీ మనకూ మధ్య వంతెన.

2. నూత్న వేదాంతి సిమియోను అనే భక్తుడు ఈలా నుడివాడు. "ఆత్మ దేవుని నోరు. ఆ నోటితో దేవుడు పలికే పలుకే క్రీస్తు. మన నోటితో మన మాటలు తెలియజేస్తాం. నోరు లేకపోతే మన మాటలు ఇతరులకు ఏలా విన్పిస్తాయి? అలాగే ఆత్మ అనే నోరు లేకపోతే క్రీస్తు మనకు విన్పించడు, కన్పించడు".

# 3. తిరుసభలో ఆత్మ

## 15. తిరుసభ ఆరంభంలో ఆత్మ

1. శ్రీసభను ప్రారంభించింది క్రీస్తు ఒక్కడే కాదు, ఆత్మకూడ. ఉత్థానక్రీస్తు శరీరం మహిమను పొందిన శరీరం. ఈ శరీరాన్ని గూర్చే అతడు "మీరు ఈ యాలయాన్ని పడగొట్టండి, నేను మళ్ళా దీన్ని మూడు దినాల్లో కడతాను" అని యూదులతో చెప్పాడు. ఇక్కడ క్రీస్తు ఉద్దేశించిన ఆలయం యెరూషలేము రాతిగుడి కాదు. తన ఉత్థాన శరీరమే – యోహా 2,19,21. కాని క్రీస్తుకి ఈ ఉత్థాన దేహంతోపాటు మరో దేహంకూడవుంది. అదే శ్రీసభ. కనుకనే పౌలు కొరింతులోని క్రైస్తవులను ఉద్దేశించి మాట్లాడుతూ "మీరందరూ

క్రీస్తు శరీరమైయున్నారు. ప్రతివ్యక్తి దానిలో ఒక భాగమే" అని వ్రాసాడు - 1కొ 12,27. ఉత్థాన శరీరంతోపాటు శ్రీసభకూడ క్రీస్తు దేహం. ఈ దేహం మనమే. ఈ దేహనిర్మాత ఆత్మే.

2. ఉత్థాన క్రీస్తు శిష్యులమీదికి శ్వాసను ఊదాడు. ఈ శ్వాస పవిత్రాత్మే. ఈ యాత్మ ద్వారా వారికి పాపాలను పరిహరించే శక్తి లభించింది - యోహా 20,21-23. క్రీస్తు ఈలా శ్వాసనూదడం, సృష్ట్యాదిలో దేవుడు మట్టి ముద్దలోనికి శ్వాసనూదడాన్ని జ్ఞప్తికి తెస్తుంది - ఆది 2,7. ఆ శ్వాసకూడ పవిత్రాత్మే. అక్కడ ఆ శ్వాసద్వారా మనుష్య సృష్టి జరిగింది. ఇక్కడ ఈ శ్వాసద్వారా శ్రీసభ అనే సృష్టి జరిగింది.

3. అపోస్తలుల చర్యల ప్రకారం పెంతెకోస్తు దినాన శ్రీసభ ఆవిర్భవించింది. ఆనాడే ఆత్మ శిష్యులమీదికి గాలిలా, అగ్నిలా, నాలుకల్లా దిగివచ్చింది - 2.1-4. పేత్రు ఈ యంశాన్ని ఈలా వివరించాడు : ఉత్థానక్రీస్తు తండ్రి కుడిప్రక్కను చేరుకొని అతనినుండి ఆత్మను పొందాడు. తాను పొందిన ఆత్మను శిష్యులమీద కుమ్మరించాడు. అదే పెంతెకోస్తు లేక ఆత్మ దిగిరావడం - 2,33. ఈ యంశాన్ని క్రీస్తు ముందుగానే శిష్యులకు ఎరిగించాడు. అతడు మీరు ఆత్మతో జ్ఞానస్నానం పొందుతారు అని చెప్పాడు - 1,5. యెరూషలేములో తొలినాటి భక్తసమాజం 120 మంది - 1,15. వీళ్ళంతా నీటితోగాక ఆత్మతోనే జ్ఞానస్నానం పొందారు. వీళ్ళే తొలి శ్రీసభ. అనగా శ్రీసభను ప్రారంభించింది ఆత్మే. ఈ సందర్భంలో ఇరెనేయస్ వేదశాస్త్రి ఈలా చెప్పాడు. "తండ్రి తన వాక్కుతోను శ్వాసతోను శ్రీసభను సృజించాడు. అవి రెండు అతనికి రెండు చేతుల్లాంటివి. ఈ రెండు చేతులతోనే అతడు పూర్వం ఆదాముని చేసాడు." ఇక్కడ ఈ వేదశాస్త్రి దృష్టిలో తండ్రి వాక్కు క్రీస్తు. తండ్రి శ్వాస పవిత్రాత్మ.

చనిపోయిన క్రీస్తుని మళ్ళా సజీవుని చేసింది ఆత్మే - రోమా 8,11. శ్రీసభకు ఊపిరిపోసింది గూడ ఆత్మే. కనుక క్రీస్తుతోపాటు ఆత్మడుకూడ శ్రీసభను స్థాపించాడు అని చెప్పాలి. తండ్రి క్రీస్తునీ ఆత్మనుకూడ శ్రీసభలోనికి పంపాడు.

4. ఆత్మ ప్రారంభించిన శ్రీసభ ఆత్మశక్తితోనే వ్యాప్తి చెందడం మొదలుపెట్టింది. సమరయలోని భక్తసమాజం ఆత్మను పొందింది - 8,14-17. కైసరియలోని కొర్నేలి బృందం ఆత్మను పొందింది - 10,44-48. ఎఫెసు నగరంలోని భక్తులు ఆత్మను పొందారు - 19,1-7. ఈ విధంగా తిరుసభ పెంపుజెందుతూ వచ్చింది. క్రైస్తవులందరూ ఆత్మలోనికి జ్ఞానస్నానం పొందారని వాకొన్నాడు పౌలు. "మనమందరం ఒకే ఆత్మయందు ఒకే శరీరంగా జ్ఞానస్నానం పొందాం" - 1కొ 12,13.

క్రీస్తు మరణించి పునరుత్థానుడై తన ఆత్మను కుమ్మరింపగా శ్రీసభ పుట్టింది. అది క్రీస్తు దేహం. ఆ దేహం మనమే.

## ప్రార్థనా భావాలు

1. మనం శ్రీసభలో ఆత్మసాన్నిధ్యాన్ని అట్టే గుర్తించం. శ్రీసభకూ ఆత్మకూ చాల దగ్గిర సంబంధం వుంది. ఇరెనేయస్ భక్తుడు ఈలా నుడివాడు. శ్రీసభ వున్నచోట పవిత్రాత్మా వుంటుంది. పవిత్రాత్మ వున్నచోట శ్రీసభ వుంటుంది. సకల వరాలూ వుంటాయి. కనుక శ్రీసభలో చేరనివాళ్ళు ఆత్మ వరాలు పొందలేరు.

2. శ్రీసభ దేశదేశాల్లో విస్తరించివున్న బ్రహ్మాండమైన క్రైస్తవ సమాజం. ఈ క్రైస్తవులంతా కలసి ఐక్యభావంతోను పవిత్రంగాను జీవించడంలోనే పవిత్రాత్మశక్తి కన్పిస్తుంది. ఈ పవిత్రత, ఐక్యత అనేవి నరమాత్రులవల్ల సిద్ధించే లక్షణాలు కావు. దైవశక్తివల్ల లభించే గుణాలు.

# 16. క్రీస్తుతో ఐక్యంజేసే ఆత్మ

1. ఆత్మ మనలను క్రీస్తుతో ఐక్యంజేస్తుంది. ఈ యైక్యత జ్ఞానస్నానం ద్వారా ప్రారంభమౌతుంది. మన మందరం ఒకే ఆత్మయందు ఒకే శరీరంగా జ్ఞానస్నానం పొందాం - 1కొ 12,13. అనగా మనం ఆత్మ అనుగ్రహం వల్ల క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొంది ఒక్క సమాజానిమయ్యాం. మనుష్యావతార సమయంలో ఆత్మ సుతునికి ఓ దేహమిచ్చింది. ఇప్పుడు మళ్ళా శ్రీసభ అనే దేహాన్నిస్తుంది.

2. అప్పరసాలను దివ్యసత్ప్రసాదంగా మార్చేది ఆత్మే. ఈ సత్ప్రసాదంకూడ క్రీస్తు శరీరమే. ఆత్మతో నిండివున్న ఈ దివ్యభోజనాన్ని ఆరగించి మనం క్రీస్తుతో ఐక్యమౌతాం. ఒకే రొట్టెలో పాలుపంచుకొనే మనం ఒక్క శరీరమౌతాం - 1కొ 10,17. ఆత్మ మనలను క్రీస్తుతో కలుపుతుంది. ఈ కలయికద్వారా మనమంతా క్రీస్తనే వరునికి వధువులమౌతాం. క్రీస్తనే శరీరంలో అవయవాలమౌతాం. అతడు తన శరీరమైన శ్రీసభకు శిరస్సు - కొలో 1,18. ఎప్పుడుగూడ ఆత్మ మనలను తనతోగాక క్రీస్తుతో ఐక్యంజేస్తుంది.

శ్రీసభ కేవలం సాంఘిక, ఆర్థిక అవసరాలను తీర్చే సంఘం మాత్రమేకాదు. అది క్రీస్తునుండీ ఆత్మనుండీ ఉద్భవించింది. ఆధ్యాత్మికమైంది. ఆ సభలోనే చేరిన మనంకూడ ప్రభువుతో ఐక్యమౌతాం.

మన దేహంలోని అవయవాలను మన ఆత్మ ఒక్కటిగా బంధిస్తుంది. కనుకనే మన అవయవాలన్నీ కలసి ఐక్యభావంతో పనిచేస్తున్నాయి. ఈలాగే శ్రీసభ అనే జ్ఞానదేహంలో అవయవాలైన క్రైస్తవులందరినీ ఐక్యపరచేది పవిత్రాత్మే. ఈ యాత్మ శక్తివల్లనే క్రైస్తవులు ఏ దేశానికి చెందినా, ఏ జాతికి చెందినా, ఏ కాలానికి చెందినా ఒకరినొకరు అంగీకరింపగల్గుతున్నారు.

పతితులు తమ దబ్బరబోధలతో శ్రీసభలోని కొందరిని అపమార్గం పట్టిస్తారు. తిరుసభను విభజిస్తారు. కాని ఆత్మ ఆ సభను నిరంతరం ఐక్యపరుస్తుంది. ఆత్మ లోకాన్నంతటినీ ఒక్కటిగా కలిపేస్తుంది - జ్ఞాన 1,7.

3. శ్రీసభేమో ఒక్కటే. ఐనా దానిలో చాల అవయవాలూ, చాల భాగాలూ వున్నాయి. క్రీస్తు పెక్కు అవయవాలతో కూడిన ఒక్క శరీరం వంటివాడు. పెక్కు అంగాలతో కూడిన శరీరం ఒక్కటే గదా! 1కొ 12,12. దేవుడు ఒక్కడైగూడ ముగ్గురు వ్యక్తులుగా వున్నాడు. అలాగే ఆ దేవుని సమాజమైన తిరుసభకూడ ఒక్కటైనా భిన్నభిన్న వ్యక్తులతో కూడివుంది. ఐక్యతా విభిన్నతా రెండూ దాని లక్షణాలు. ఈ రెండు లక్షణాలకూ కర్త పవిత్రాత్మే. ఈ యాత్మ శ్రీసభ సభ్యులకు ఒక్కొక్కరికి ఒక్కొక్క వరాన్ని దయచేస్తుంది - 1కొ 12,11. ఈ వరాల వలన మనలో వైవిధ్యం ఏర్పడుతుంది. తిరుసభ సభ్యులు ఎప్పుడూ ఐక్యమైయుండాలి. ఐనా ఎవరి వ్యక్తిత్వాన్ని వాళ్ళు నిలబెట్టుకోవాలి. పవిత్రాత్ముడు కోరేది యిదే. ఆ యాత్ముడు ఐక్యతకూ భిన్నత్వానికి గూడ కర్త అని చెప్పాం.

## ప్రార్థనా భావాలు

1. పేత్రు 4,10 పలురకాల ప్రజలు దేవుని నుండి పలురకాల వరాలను పొందుతారని చెప్తుంది. శ్రీసభ క్రీస్తు శరీరం. ఆ శరీరానికి జీవమిచ్చేది ఆత్మే. ఆ శరీరంలో మనమందరం సభ్యులం. పుణ్యపురుషుడైన హేబెలునుండి ఎన్నుకోబడినవారిలో చిట్టచివరి వ్యక్తివరకు అందరికీ వరాలిచ్చేది, అందరి విశ్వాసాన్ని పెంచేది ఆత్మే. ఆ యాత్ముడు తానొక్కడైకూడ భిన్న వ్యక్తులకు భిన్న వరాలిస్తాడు- 1కొ 12,11.

1. "సొలోమోను గీతాలు" అనే గ్రంథాన్ని వ్రాసిన ఓ సిరియా భక్తుడు ఈలా నుడివాడు. "సంగీతకారుడు వాద్యాన్ని చేతబట్టి తంత్రులను మీటగానే అది మధుర సంగీతం పలుకుతుంది. అలాగే దేవుని ఆత్మ నా హృదయ తంత్రులను మీటగానే నేనతని ప్రేమద్వారా స్తుతిగీతాలు పలుకుతాను". ఈ భక్తునిలాగే మనంకూడ ఆత్మ ప్రభావంతో దేవుణ్ణి స్తుతించాలి.

# 17. నరుల్లో దేవుని పోలికను కలిగించే ఆత్మ

1. దేవుడు మట్టిముద్దలోనికి తన శ్వాసను ఊదగా ఆ ముద్ద జీవంగల ప్రాణి ఐంది - ఆది 2,7. అతడే ఆదిమ మానవుడు, ఆదాము. ఆ శ్వాస పవిత్రాత్మే. అది దేవుని వూపిరి. ఆ యాత్మ మనలోనికి ప్రవేశించింది కనుక మనం "ఆధ్యాత్మిక" మానవులమయ్యాం. ప్రాచీన భక్తులు వాకొన్నట్లుగా ఆత్మ మన ఆత్మకే ఆత్మ. ఆ యాత్మ మనలో వుండబట్టే మనం నిత్యం దేవుణ్ణి కోరుకొంటున్నాం. అతనితో ఐక్యంకాగోరుతున్నాం. అతనివైపు పయనిస్తున్నాం. బాసిల్ భక్తుడు చెప్పినట్లు, ఆరోగ్యంగావున్న కన్ను వస్తువులను చూస్తుంది. ఆత్మతో నిండివున్న నరుడు దేవుణ్ణి దర్శిస్తాడు.

దేవుడు నరుణ్ణి తనకు పోలికగా చేసాడు - ఆది 1,26-27. ఈ పోలిక, లేక రూపం, నరునికి తనలోని దైవశ్వాస వల్లనే, అనగా దేవుని ఆత్మవల్లనే వచ్చింది. ఈ పోలిక నరునికి లభించిన ఏదో వొక గుణంకాదు. అసలు నరుడే దేవుని పోలిక.

కాని దేవునికి ప్రధానమైన పోలిక క్రీస్తే - కోలో 1,15. ఆ క్రీస్తుద్వారానే మనం దేవుని పోలికను పొందాం. అతని ద్వారానే దేవునితో ఐక్యంగావాలని అభిలషిస్తాం. ఇప్పుడు మనం మొదట జ్ఞానస్నానంలో క్రీస్తు పోలికను పొంది ఆ పోలికద్వారా దేవుని పోలికను పొందుతాం. కనుక మనం దేవుని పోలికకు పోలికగా వుంటాం అని చెప్పాలి.

2. నరుడు పాపంచేసి దేవుని పోలికను కోల్పోయాడు. కాని క్రీస్తు తన మరణోత్థానాలద్వారా మనలో ఈ పోలికను పునరుద్ధరించాడు. కాని యిప్పుడు మన హృదయంలో క్రీస్తు పోలికనూ దేవుని పోలికనూ నెలకొల్పేది పవిత్రాత్మే. అతడు గొప్ప చిత్రకారుడు. మన హృదయంలో దైవరూపాన్ని చిత్రించేది అతడే. దేవునికీ మనకూ ఐక్యతను సాధించిపెట్టేది దైవాత్ముడే. 2పేత్రు 1,4. మనం దైవ స్వభావంలో పాలుపొందామని చెప్తుంది. దేవుని పోలిక వల్లనే మనకు దైవస్వభావం సిద్ధించింది.

దేవుడు నరుణ్ణి రెండు దశల్లో సృజించాడు. మొదటిది ప్రాతసృష్టి. అనగా ఆదాము సృష్టి. కాని మానవజాతి పాపంవల్ల పతనమై దేవుని పోలికను కోల్పోయింది. దేవుడు క్రీస్తు మరణోత్థానాలద్వారా నరులను మళ్ళా నూత్నంగా సృష్టించాడు. మనం మళ్ళా దేవుని రూపాన్ని పొందాం. ఈ రెండు దశల్లోను నరుళ్ళో దేవుని రూపాన్ని నెలకొల్పింది ఆత్మే.

భగవంతుడు లోకాన్ని నరునికొరకు సృజించాడు. కాని నరుణ్ణి తనకొరకు సృజించాడు. కనుక ఆత్మ తాను నరుళ్ళో వుంచిన దైవరూపంద్వారా అతన్ని నిరంతరం

దేవునివైపు ఆకర్షిస్తుంటుంది. ఆయాత్మ అనుగ్రహంవల్ల నరుడు దేవునిపట్ల భక్తి పెంచుకొంటాడు. అతన్ని చేరి అతనితో కలసిపోగోరుతాడు. మనలోవున్న దేవుని రూపం మనం దేవునికి చెందినవాళ్ళమని నిరూపించే దివ్యముద్ర.

మనలో వసించి మన హృదయంలో దైవరూపాన్ని చిత్రించే ఆత్మ మూడు పనులు చేస్తుంది. మనం దేవునితో, క్రీస్తుతో ఐక్యమై జీవించేలా చేస్తుంది. తోడినరులతో ప్రేమభావంతో కలసిమెలసి వుండేలా చేస్తుంది. మన దైవస్వభావాన్ని మనం గుర్తించి దివ్యత్వం గలవారిలా బాధ్యతాయుతంగా జీవించేలా చేస్తుంది. ఆత్మద్వారా దేవుని పోలికను పొంది వుండడం నరుని మహాభాగ్యాల్లో వొకటి అని చెప్పాలి.

## ప్రార్థనా భావాలు

1. బైబులు గ్రంథాలను వ్రాయించింది ఆత్మ. పవిత్ర గ్రంథంలో ఆత్మ నెలకొని వుంటుంది. ఐతే ఆత్మ జీవం. ఆ దివ్యవ్యక్తి సాన్నిధ్యం వలన బైబులు వాక్కు సజీవవాక్కు ఔతుంది. జ్ఞానస్నాన సమయంలో క్రీస్తు మీదికి దిగివచ్చినట్లుగా ఆత్మడు దైవవాక్కులోనికికూడ దిగివచ్చి దాన్ని సజీవం చేస్తాడు - హెబ్రే 4,12. ఈలా ఆత్మతో నిండివున్న జీవవాక్కుని మనం భక్తితో పఠించాలి. ఇంకా, మనం ఆత్మశక్తితోనే వేదవాక్కుని అర్థంచేసికొంటాం గూడ. ఆ దివ్యవ్యక్తి అనుగ్రహించందే బైబులు ఎవ్వరికీ బోధపడదు.

2. గ్రెగొరీ నాసియాన్సన్ భక్తుడు ఈలా వ్రాసాడు. క్రీస్తు జన్మించాడు. ఆత్మడు అతనికి ముందుగా మార్గం సిద్ధంజేసాడు. క్రీస్తు జ్ఞానస్నానం పొందాడు. దివ్యాత్ముడు అతనికి సాక్ష్యం పలికాడు. క్రీస్తు శోధనలకు గురయ్యాడు. ఆత్మడు అతన్ని యెడారికి కొనిపోయాడు. ప్రభువు అద్భుతాలు చేసాడు. ఆత్మడు అతనికి శక్తినిచ్చాడు. క్రీస్తు మోక్షారోహణం చేసాడు. ఆత్మడు ఇప్పుడు అతని వుద్యమాన్ని కొనసాగిస్తున్నాడు. ఈలా ఆ యిద్దరికీ ఎడతెగని సంబంధం వుంది.

# 18. దైవ పుత్రత్వమొసగే ఆత్మ

1. జ్ఞానస్నాన సమయంలోనే పవిత్రాత్మ మనలను దేవుని పుత్రులనుగాను పుత్రికలనుగాను చేస్తుంది. మనం దత్తపుత్రత్వాన్నొసగే ఆత్మను స్వీకరించాం. ఆ యాత్మద్వారా దేవుని అబ్బా, అనగా నాన్నా అని పిలుస్తాం - రోమా 8,15. పూర్వవేదంలోని

యూదులు తాము దేవుని బానిసలమనుకొన్నారు. ఆ దేవుణ్ణిచూచి భయపడ్డారు. కాని నూత్నవేదంలో మనం దేవునికి బానిసలమనుకోము. బిడ్డల మనుకొంటాం. దేవునిపట్ల యూదులకు లేని చనువు మనకుంది.

దేవుడు ఆదాముని తన్ను పోలిన వాణ్ణిగా చేసాడు. అతనికి దేవుని కుమారుడని పేరు - ఆది 5,1. నూత్నవేదంలో మనం క్రీస్తుద్వారా దేవుని కుమారులమూ కుమార్తెలమౌతాం. కాని క్రీస్తుద్వారా మనలను దేవుని బిడ్డలను చేసేది మాత్రం పవిత్రాత్మే. క్రీస్తు దేవునికి సహజపుత్రుడు. మనం దత్తపుత్రులము మాత్రమే. ఇక ఈ దత్తపుత్రత్వాన్ని మనకు దయచేసేది పవిత్రాత్మే. ఆత్మద్వారానే క్రీస్తు దేవునికి కుమారుడయ్యాడు. ఆ యాత్మద్వారానే మనంకూడ కుమారునియందు కుమారులమౌతాం - గల 4,5-7.

2. సత్యస్వరూపియైన ఆత్మ మీలో వుంటాడు అని చెప్పాడు ప్రభువు - యోహా 14,17. పవిత్రాత్ముడు మనలో వసిస్తుంటాడని ఈ వాక్యం భావం. పూర్వవేదంలోని ఏ భక్తుడుకూడ, ఏ ప్రవక్తకూడ, పవిత్రాత్ముడు తనలో వసిస్తున్నాడని చెప్పుకోలేదు. వాళ్ళు ప్రభువు సాన్నిధ్యం తమతో వుంటుందని నమ్మారు. అది తమలో వుందనుకోలేదు. ప్రవక్తల్లో ఆత్మ క్రియాశక్తీ, ప్రేరణమూ వున్నమాట నిజమే. కాని ఆత్మే తమలో వుందని ప్రవక్తలు భావించలేదు. నూత్న వేదంలో పవిత్రాత్ముడు మనలో ఓ వ్యక్తిగా వసిస్తాడు. త్రీత్వంలోను క్రీస్తులోను ఉన్నట్లే అతడు మనలో కూడ వుంటాడు. ఈలావుండి మనలను దేవుని పుత్రులనుగా జేస్తాడు. ఈ దివ్యనివాసం పూర్వవేదంలోని భక్తుల్లో లేదు. ఇది దేవుడు మనకు అనుగ్రహించిన ప్రత్యేక భాగ్యం.

3. బిడ్డలు తండ్రి ఆస్తికి హక్కుదారులౌతారు. మన తండ్రి దేవుడు. అతని ఆస్తి మోక్షం. కనుక మనం దేవుని బిడ్డలమై అతని మోక్షానికి వారసులమౌతాం. కాని మనం మోక్షానికి వారసులమయ్యేలా చేసేది మాత్రం పవిత్రాత్మే. కనుకనే పౌలు " దేవుడు తన ప్రజలకు చేసిన వాగ్దానాన్ని మనం పొందుతాం అనడానికి ఆత్మే హామీ" అని వాకొన్నాడు - ఎఫే 1, 14. దేవుడు తన ప్రజలకు చేసిన వాగ్దానం మోక్ష బహుమానమే. దీన్ని మనం సంపాదించుకొంటాం అనడానికి ఆత్మే మనకు హామీగా వుంటుంది. ఇక్కడ "హామీ" అంటే బయానా లేక సంచకరువు. క్రయవిక్రయాల్లో బయానా ఇచ్చినవాడు తర్వాత పూర్తిసొమ్ముగూడ చెల్లిస్తాడు. అలాగే ఆత్మ ఈ లోకంలోనే మనకు మోక్షాన్ని కొంతవరకు ఇప్పిస్తుంది. మన మరణానంతరం ఆ మోక్షం మనకు పూర్తిగా దక్కేలా చేస్తుంది. కనుకనే

పౌలు మరో తావులో, మనం దేవుని పుత్రులం గనుక దేవునికి వారసులం అని నుడివాడు. మన వారసత్వమైన మోక్షాన్ని మన కిప్పించేది పవిత్రాత్మే – రోమా 8, 16–17. ఇందుకు మనం ఆత్మకు ఎంతో కృతజ్ఞులమై యుండాలి.

## ప్రార్థనా భావాలు

1. ఆత్మడు పూర్వవేదంలో కన్పించే తీరుకీ నూత్న వేదంలో కన్పించే తీరుకీ చాలా తేడాలున్నాయి.

   అతడు పూర్వవేదంలోని పుణ్యాత్ముల మీదికి ఓ గొప్ప శక్తిలా దిగివచ్చాడు. కాని నూత్నవేదంలోని స్నాపక యోహాను మీదికి, క్రీస్తుమీదికీ, శిష్యుల మీదికీ ఓ వ్యక్తిగా దిగివచ్చాడు.

   పూర్వవేదంలో భక్తులు ఆత్మవరాలు పొందారేగాని అతన్ని ఓ వ్యక్తినిగా పొందలేదు. నూత్నవేదంలో ఆత్మ భక్తులమీదికి ఓ వ్యక్తిగా వేంచేసివచ్చి వాళ్ళకు తన వరప్రసాదాలను దయచేసింది.

   పూర్వవేదంలో పవిత్రాత్ముడు ప్రవక్తలకు తన వెలుగును ప్రసాదించాడు. కాని నూత్నవేద భక్తుల్లో అతడు ఓ దేవాలయంలోలాగ వసిస్తాడు.

   పూర్వవేదంలో ఆత్మ సాన్నిధ్యం తాత్కాలికమైంది. కాని నూత్నవేదంలో అది శాశ్వతమైంది.

2. బాసిల్ భక్తుడు ఈలా వాకొన్నాడు. "పరిశుద్ధ గ్రంథం ఆత్మనుగూర్చి చాల తక్కువగా చెప్తుంది. కనుక భక్తులుకూడ ఆత్మనుగూర్చి ఎక్కువగా మట్లాడరు. మనం ఆత్మను పూర్ణంగా అర్థంచేసికొనేదీ, అనుభవానికి తెచ్చుకొనేదీ మోక్షంలోనే." కనుక ఈ లోకంలో వున్నంతవరకు ఆత్మ మనకు చాలవరకు అర్థంకాని దైవరహస్యంగానే వుండిపోతుంది.

# 19. ప్రేషితసేవ చేయించే ఆత్మ

1. ప్రేషితసేవ ద్వారా ఆత్మ శ్రీసభను వ్యాప్తిజేస్తుంది. అన్ని దేశాల్లోను అన్ని కాలాల్లోను శ్రీసభ నెలకొనేలా చేస్తుంది. పెంతెకోస్తునాడు ఆత్మ శిష్యులమీదికి నాలుక రూపంలో దిగివచ్చిందని వింటున్నాం – అచ 2,3. నాలుకద్వారా మాట్లాడతాం, సమాచారం తెలియజేస్తాం. కనుక నాలుకలా వచ్చిన ఆత్మ, మనం లోకానికి క్రీస్తుని గూర్చి సమాచారాన్ని అందించేలా చేస్తుంది.

ఆత్మదు ఎప్పుడూ భక్తులను ప్రేషిత సేవకు పంపుతూనే వుంటాడు. అతడు ఫిలిప్పుని రథమెక్కిపోతూన్న యితియోపీయుని దగ్గరికి పంపాడు - అ.చ. 8,29. పేత్రుని అన్యజాతివాడైన కొర్నేలివద్దకు పంపాడు - 10,19-20. పౌలు బర్నబాలను అన్యజాతి ప్రజలకు బోధచేయడానికి పంపాడు - 13,2-4. అసలు తొలినాటి ప్రేషితుల వేదబోధ అంతా దేవుని ఆత్మయొక్క శక్తితోనే జరిగింది. ఆత్మ పౌలుచే ఆసియా, బితూనియా రాష్ట్రాల్లో వేదబోధ చేయించనీయలేదు. మాసెడోనియాలో చేయించింది - అ.చ. 16,6.7.9.

పౌలు ప్రేషితుడుగా వ్యవహరించడానికి పిలువబడినవాడు. సువార్త నిమిత్తం ప్రత్యేకింపబడినవాడు - రోమా 1,1. ఆత్మ ఎల్లవేళలా పిలువబడినవారిని వేదబోధకు పంపుతూంటుంది.

క్రీస్తు శిష్యులమీదికి ఊదిన ఊపిరి వారిని వేదబోధకు పంపింది - యోహా 20,22. ఈ ఊపిరి పవిత్రాత్మే. మొదట దేవుడు మట్టిముద్దలోనికి గాలిని వూదగా సృష్టి జరిగింది. ఆదాము ఆవిర్భవించాడు - ఆది 2,7. క్రీస్తు శిష్యులమీదికి వూదిన గాలి నూత్న సృష్టిని జరిగిస్తుంది. ఈ నూత్న సృష్టి క్రైస్తవ ప్రపంచమే. క్రీస్తు తనతో వుండడానికీ, సువార్తా ప్రకటనకు పంపడానికి పండ్రెండు మందిని ఎన్నుకొన్నాడు - మార్కు 3,14. ప్రేషితులు ప్రధానంగా సువార్తాబోధకు వెళ్ళేవాళ్ళు. కాని ఈ కార్యం జరిగేది మాత్రం ఆత్మద్వారానే.

2. ప్రేషితులు ఉత్థాన క్రీస్తునిగూర్చి బోధించారు. కాని ఈ బోధనాకార్యం ఆత్మశక్తివల్లనే జరిగింది. ఆత్మ శక్తివల్లనే వాళ్ళు అన్యజనులను దేవునికి విధేయులను జేయగలిగారు - రోమా 15,19. ఆత్మ క్రీస్తుని లోకానికి తెలియజేస్తుంది. ఆత్మ ప్రోద్బలంవల్లనే ప్రేషితులు క్రీస్తుని గూర్చి బోధించారు - అచ 4,31. నిజమైన వేదబోధ ఎప్పుడూ ఆత్మ ప్రేరణం వల్లనే జరుగుతుంది.

పౌలు విలువలేని ఓ మట్టిపాత్రలాంటివాడు. కాని ఆ పాత్రలో గొప్ప సంపద వుంది. ఆ సంపద క్రీస్తు సందేశమే. అతడు ఆ సంపదను లోకానికి పంచిపెడతాడు - 2కొ 4,7. అతడు స్వయంగా బలహీనుడు. కాని అతని బలహీనతను ఆధారంగా జేసికొని ఆత్మ తన శక్తిని చూపిస్తుంది. అతని ద్వారా క్రీస్తు సందేశాన్ని విన్పిస్తుంది - 1కొ 3,13.

3. పౌలు మొదలైన తొలినాటి భక్తులు బోధించిన క్రీస్తు సందేశాన్ని తిమోతి జాగ్రత్తగా కాపాడుతూ వచ్చాడు. అది పారంపర్య బోధ. కాని ఆత్మశక్తివల్లనే అతడు ఆ బోధను కల్తీలేకుండా పదిలపరచగలిగాడు. కల్తీ లేకుండా ఇతరులకు అందించగలిగాడు

– 2తిమో 1,14. ఈలాగే నేడు మనంకూడ వేదబోధను కల్తీచేయకూడదు. తొలినాటి వేదబోధకులు ఏ సందేశాన్ని విన్పించారో, దాన్ని మాత్రమే మనం ప్రజలకు తెలియజేయాలి. ఆత్మ మనతోవుండి మనం కల్తీలేని వేదబోధ చేసేలా సాయపడుతుంది.

## ప్రార్థనా భావాలు

1. సిరియా సీమోను భక్తుడు ఓ గీతంలో ఆత్మను గూర్చి ఈలా వ్రాసాడు.
ఆత్మమా! నీవేలా అనలంగాను
శీతలంగాను గూడ వుంటావు?
నీవు చీకటిని వెలుగునుగాను
మృత్యువుని జీవంగాను
నరుణ్ణి దేవుణ్ణిగాను ఏలా మార్చుతావు?
నీవు మా హృదయాల్లోకి ప్రవేశించి
మా అంతరంగాన్ని ఏలా మార్చుతావు?
మా దుఃఖాన్ని ఏలా ఆనందంగా చేస్తావు?
నీవు మాతో ఎలా వసిస్తావు?
మా పాపాలకు ఏలా కోపించకుండా వుంటావు?
మమ్మేలా భరిస్తావు?
మహోన్నతంలో వసించే నీవు
భూమిమీది మా చర్యలను ఏలా గమనిస్తావు?

2. ఆత్మ మనమీదికి దిగివచ్చినపుడు గొప్ప నెమ్మదీ శాంతీ ఆనందమూ కలుగుతాయి. దీన్ని పురస్కరించుకొనే క్రీస్తు లోకం ఈయలేని శాంతిని నేను మీకు ఇస్తానని వాకొన్నాడు – యోహా 14,27.

# 20. ప్రవచనం చెప్పించే ఆత్మ

1. ప్రవక్తలు విశేషంగా పవిత్రాత్మచే ప్రబోధితులైనవాళ్ళు. ఆత్మ వారిద్వారా మాట్లాడింది. "ప్రవక్తలు పవిత్రాత్మచే ప్రేరితులై దేవుని సందేశాన్ని చెప్పారు" – 2పేత్రు 1,21. పూర్వం మోషే ప్రజలందరూ ఆత్మనుపొంది ప్రవచనం చెప్పాలని కోరాడు – సంఖ్యా 11,29. యోవేలు ప్రవక్తకూడా నరులందరూ ఆత్మనుపొంది ప్రవచనం చెప్తారని పల్కాడు – అచ 2,17. ప్రభువు తన ప్రజలను ప్రవక్తలనుగాజేసి వారికి ఉపదేశం

చేస్తాడు అన్నాడు యెషయా - 54,12. నూత్నవేదంలో పవిత్రాత్మే మనకు అభిషేకం చేస్తుంది - 1యోహా 2,20. అనగా ఆత్మ మన హృదయాల్లో విశ్వాసం పుట్టించి మనం వేదసత్యాలను గ్రహించేలాను వాటిని ఇతరులకుగూడ తెలియజేసేలాను చేస్తుంది.

బైబులు గ్రంథ రచనతో దివ్యశ్రుతి ముగిసింది. కనుక ఇప్పుడు మనం క్రొత్త వేదసత్యాలేమీ నేర్చుకోము. కాని ఆత్మప్రేరణంతో ప్రాత వేదసత్యాలనే మరింత లోతుగా గ్రహిస్తాం. ఆ వేదసత్యాలనుండి పురాతన విషయాలనూ నూత్న విషయాలనూ నేర్చుకుంటాం - మత్త 13,52.

2. ప్రవచన వరాన్ని దయచేసేది ఆత్మే. ఆ వరంలో ముఖ్యమైన అంశం వేదగ్రంథ రచన. ప్రవక్తలు పవిత్రాత్మచే ప్రేరితులై దేవుని సందేశాన్ని విన్పించారు - 2పేత్రు 1,21. ఆత్మ క్రీస్తుని మహిమపరుస్తుంది. ఏలా? వేదగ్రంథాలను వ్రాయించడంద్వారా, వాటిని ప్రకటింపజేయడంద్వారా. నూత్నవేదగ్రంథాలు తెరువబడిన క్రీస్తు హృదయంనుండి ఆత్మ ప్రేరణంవల్ల పుట్టాయి.

మనం మామూలుగా తిరుసభ, దివ్యసత్ప్రసాదం క్రీస్తు శరీరమని చెప్తాం. కాని దివ్యగ్రంథాలుకూడ క్రీస్తు శరీరమని చెప్పాలి. వాటిల్లోగూడ ఆత్మశక్తివల్ల క్రీస్తు సాన్నిధ్యం నెలకొని వుంటుంది. కనుక మనం వేదగ్రంథాన్ని పఠించేపుడు క్రీస్తే మనతో మాటలాడుతుంటాడు. అగస్టీను భక్తుడు చెప్పినట్లుగా, సువిశేషం క్రీస్తు నోరు. పవిత్రగ్రంథంద్వారా ఆత్మ దేవుని సందేశాన్ని విన్పిస్తుంది.

3. ప్రవచనవరం పూర్వం వేదగ్రంథ రచయితల్లో కన్పించింది. ఈనాడది వేదగ్రంథ పఠితల్లో కన్పిస్తుంది. ఈ వరంద్వారా మనం పవిత్రగ్రంథాన్ని అర్థం జేసికొంటాం. దాన్ని ఇతరులకుగూడ బోధిస్తాం. ఈ బోధయెప్పుడూ ఆత్మశక్తివల్లనే జరుగుతుంది - 1కొ 12,3. పూర్వవేదంలో ప్రవచనవరం చివరి ప్రవక్తయైన మలాకీతో ఆగిపోలేదు. ఆ వరం తర్వాత రబ్బయిలలో కొనసాగింది. దీని బలంతోనే రబ్బయిలు పూర్వవేదంమీద వ్యాఖ్యలు చెప్పారు. నూత్నవేదంలోగూడ వేదబోధ చేసే వాళ్ళందరికీ ఈ వరం కొద్దోగొప్పో వుంటుంది. దేవుణ్ణి నిరాకరించే ఆధునిక ప్రపంచంలో మనం ఈ వరాన్ని వినియోగించుకొని మరీ అధికంగా వేదబోధ చేయాలి.

వేద గ్రంథాలను చదివి అర్థంజేసికోడానికి ఆత్మ సహాయం అత్యవసరం. పవిత్ర గ్రంథంలోని ప్రవచనానికి ఎవరి యిష్టం వచ్చినట్లుగా వాళ్ళు అర్థం చెప్పకూడదు - 2పేత్రు 1,20. ఆత్మ మనకు ఆ గ్రంథ భావాన్ని తెలియజేయాలి. ఆ యాత్మ సహాయంతోనే దాన్ని మనం ఇతరులకు బోధించాలి.

ఆత్మ వేదగ్రంథ వాక్యం మనకు అర్థమయ్యేలా చేస్తుంది. ఆ వాక్కు మన హృదయంలో సజీవంగా నెలకొనేలా చేస్తుంది - హెబ్రే 4,12. కనుక ఎప్పుడుగూడ మనం ఆత్మ సహాయంతోగాని వేదగ్రంథాన్ని పఠించగూడదు. ఆత్మ తోడ్పాటుతో వేదగ్రంథాన్ని చదివితే దానిలో తప్పక క్రీస్తుని కలసికొంటాం. దివ్యగ్రంథ పఠన ప్రయోజనం ఇదే.

మనం బైబులు చదువుకొనేపుడు ఆత్మ మన ముఖం మీది ముసుగును తొలగిస్తుంది. అప్పుడు క్రీస్తు జ్యోతి మనమీద ప్రసరిస్తుంది - 2కొ 3,17-18. మనం వేద గ్రంథంలోని వాక్యంలో క్రీస్తు స్వరాన్ని స్పష్టంగా గుర్తిస్తాం.

### ప్రార్థనా భావాలు

1. సిరియా సీమోను భక్తుడు ఈలా నుడివాడు. "తండ్రి విశ్వాసగృహంలాంటివాడు. క్రీస్తు ఆ గృహానికి తలుపులాంటివాడు. ఆత్మడు ఆ తలుపుకి తాళపు చెవిలాంటివాడు." ఆత్మ గొప్ప వెలుగు. ఆ వెలుగునుపొంది మనం వేదసత్యాలను గ్రహిస్తాం. దేవుణ్ణి విశ్వసిస్తాం.

2. ఇరెనేయస్ భక్తుడు ఈలా చెప్పాడు. తండ్రికి వాక్కూ శ్వాసా రెండూ ఉన్నాయి. ఆ వాక్కే క్రీస్తు. ఆ శ్వాసే పవిత్రాత్మ. ఇవి రెండూ దేవునికి రెండు చేతుల్లాంటివి. ఈ రెండిటిద్వారా అతడు ఆదిమానవుడైన ఆదాముని చేసాడు. అతన్ని తనకు పోలికగాగూడ చేసాడు. ఈ రెండిటిద్వారానే అతడు మళ్ళా శ్రీసభనుగూడ చేసాడు.

## 21. సంస్కారాల్లో పనిచేసే ఆత్మ

1. ఆత్మ క్రియాశక్తివల్లనే శ్రీసభ ఏర్పడింది. ఈ శ్రీసభలోని ఏడు సంస్కారాలూ ఆత్మవరప్రసాద బలం వల్లనే ఫలసిద్ధిని పొందుతాయి. ఇక్కడ ఈ యేడింటినీ క్రమంగా పరిశీలిద్దాం.

పూర్వవేదం ఆత్మకు నీటిని సంకేతంగా వాడింది. ఈ సంకేతానికి తగినట్లుగానే నూత్నవేదంలో ఆత్మ క్రీస్తు ప్రక్కలోనుండి నీరులాగా ప్రవహించింది - యోహా 19,34. ఈ నీరు ఆత్మ, జ్ఞానస్నానం, వరప్రసాదం మొదలైన వాటికన్నిటికి చిహ్నంగా వుంటుంది. మనం నీటివలన ఆత్మ వలనా ఆధ్యాత్మికంగా జన్మిస్తాం - 3,5. క్రీస్తు మరణోత్థానాల్లోకి జ్ఞానస్నానం పొందుతాం - రోమా 6,3-5. క్రీస్తు మరణంలోకి జ్ఞానస్నానం పొంది అతనితోపాటు పాపానికి చనిపోతాం. క్రీస్తు ఉత్థానంలోకి జ్ఞానస్నానం పొంది అతనితోపాటు

పవిత్ర జీవితానికి లేస్తాం. ఈ జ్ఞానస్నానం ద్వారా ఆత్మ మనలను క్రీస్తు శరీరమైన శ్రీసభలోనికి చేరుస్తుంది. మనమందరం ఒకే ఆత్మయందు ఒకే శరీరంగా జ్ఞానస్నానం పొందాం - 1కొ 12,13.

2. జ్ఞానస్నానంలాగే భద్రమైన అభ్యంగనం గూడ ఆత్మనూ వరప్రసాదాన్నీ దయచేస్తుంది. కాని రెండింటికి తేడా వుంది. జ్ఞానస్నానం చిన్నపిల్లలకు. అది మనలను క్రీస్తుతో ఐక్యం చేస్తుంది. భద్రమైన అభ్యంగనం పెద్దవాళ్ళకు. అది మనలను శ్రీసభతో ఐక్యం జేస్తుంది. ఈ సంస్కారంద్వారా మనం శ్రీసభకు, అనగా తోడివారికి సేవలు చేస్తాం. క్రీస్తుకి సాక్ష్యంగా వుంటాం. అతన్ని ఇతరులకు బోధిస్తాం. ఇతరుల హృదయాల్లోకూడ విశ్వాసరూపంలో క్రీస్తు జన్మించేలా చేస్తాం - గల 4,19. లోకంలో మన విశ్వాసాన్ని ధైర్యంగా ప్రకటిస్తాం. ఈ కార్యాలన్నీ ఆత్మద్వారా జరుగుతాయి. సమరయ ప్రజలు స్వీకరించింది ఈ భద్రమైన అభ్యంగనాన్నే - అచ 8,14-17.

3. నడిపూజలో పీఠంమీది అప్పరసాలను క్రీస్తు శరీరరక్తాలుగా మార్చేది పవిత్రాత్మే. కనుకనే పూజలో "మీ పవిత్రాత్మ ద్వారా ఈ కానుకలను పవిత్రపరచ బతిమాలు కొనుచున్నాము" అని దేవునికి ప్రార్థన చేస్తాం. ఆత్మ క్రీస్తు మరణోత్థానాలను అప్పరసాల్లోనికి ప్రవేశపెట్టి వాటిని దివ్య వస్తువులనుగా మారుస్తుంది. పూర్వవేదంలో దేవుని వాక్కూ శ్వాసా రెండూ వున్నాయి. ఈ వాక్కు క్రీస్తు, ఈ శ్వాస ఆత్మ. ప్రతి సంస్కారంలోను క్రీస్తు, ఆత్మ ఇద్దరు కలసే పనిచేస్తారు. క్రీస్తు రొట్టె నుద్దేశించే "ఇది నా శరీరం" అని చెప్పాడు. కాని ఆ రొట్టెను ప్రస్తుతః క్రీస్తు శరీరంగా మార్చేది మాత్రం ఆత్మే. క్రీస్తు శరీరంనుండి నీరూ నెత్తురూ స్రవించినప్పుడు దివ్యసత్ప్రసాదం పుట్టింది - యోహా 19,34. అది ఆత్మవల్లనే తయారైంది. కనుక ఆత్మ సాన్నిధ్యంతో నిండివుంటుంది. ఈనాడు జీవంకొరకు మనం ఈ రొట్టెనూ ఈ పానీయాన్నీ స్వీకరిస్తాం - యోహా 6,53-54. శ్రీసభలో దీనికంటె శక్తిమంతమైన సంస్కారం మరొకటి లేదు.

4. కేవలం కొన్ని ఆజ్ఞలనూ పుణ్యాలనూ పాటించినంత మాత్రాన్నే నరుడు పవిత్రుడు కాడు. క్రీస్తుని విశ్వసించి పవిత్రాత్మను పొందడం ద్వారా అతడు పవిత్రుడౌతాడు. పవిత్రాత్మ లేనివాడెల్ల పాపాత్ముడే. నరులందరు పాపంచేసి దేవుని మహిమను (ఆత్మను) కోల్పోయారు - రోమా 3,23. నరుడు తన పాపాలకు పశ్చాత్తాపపడితే దేవుడు అతనికి తన ఆత్మను అనుగ్రహించి అతని పాపాలు మన్నిస్తాడు. అసలు ఆత్మే మనకు పాపపరిహార మౌతుంది. ఉత్థాన క్రీస్తు శిష్యులమీదికి శ్వాసను (ఆత్మను) వూది వారికి పాపాలను

మన్నించే శక్తిని దయచేసాడు - యోహా 20,22-23. కనుక ఆత్మద్వారానే పాపపరిహారం జరుగుతుంది. నేడు తిరుసభ ఈ పాపపరిహారాన్ని ప్రకటిస్తుంది - లూకా 24,47. నరులు క్రీస్తుని అంగీకరించి దేవునితో సఖ్యపడాలి అని నలుమూలలా బోధిస్తుంది - 2కొ 5,19. ఈ పనంతా ఆత్మద్వారానే జరుగుతుంది.

5. గురుపట్టం పొందినవారిని ప్రాచీన శ్రీసభ "పెద్దలు" అని పిల్చింది. పవిత్రాత్మద్వారా తిరుసభలోని మంద ఈ పెద్దలకు అప్పగింపబడింది - అచ. 20,28. తిమోతి పౌలు హస్తనిక్షేపణం వల్లనే దేవుని వరమైన ఆత్మను పొందాడు - 2తిమో 1,6. అనగా అతనికి ఆత్మద్వారానే గురుపట్టం సిద్ధించింది. క్రీస్తులాగే అతని శిష్యులుకూడ దేవునికి నివేదితులు - యోహా 17,19. ఈలా నివేదితులైన తర్వాత వాళ్ళు ప్రజలను పవిత్రులను చేస్తారు. గురువు కూడ పవిత్రాత్మద్వారా ప్రజలను దేవునికి నివేదిస్తాడు - రోమా 15-16. కనుక ఆత్మద్వారానే గురుపట్ట సంస్కారం ఫలప్రదమౌతుంది.

6. అన్ని సంస్కారాల్లా కాకుండ, జ్ఞానవివాహ సంస్కారాన్ని వధూవరులే ఒకరికొకరు ఇచ్చుకొంటారు. మన వివాహం క్రీస్తు శ్రీసభతో ఐక్యంకావడానికి గుర్తుగా వుంటుంది - ఎఫె 5,32. వివాహం వధూవరుల మధ్య ఓ నిబంధనం లాంటిది. వివాహసంస్కారం ద్వారా భార్యాభర్తలను ఐక్యంజేసేది పవిత్రాత్మే. వధూవరులు పరస్పర ప్రేమతో ఒకరితో నొకరు ఐక్యంగావడం ఈ సంస్కారం యొక్క ప్రయోజనం - ఎఫె 5,31. ఈ యైక్యతవల్లనే వాళ్ళు నూత్నకుటుంబాన్ని నెలకొల్పుతారు. ఈ యైక్యతను ప్రసాదించేది పవిత్రాత్మే.

7. కడపటిది అవస్థాభ్యంగం. ఆత్మ స్వయంగా అభ్యంగనమే. క్రీస్తు ఆత్మచే అభిషిక్తుడయ్యాడు - అచ 10,38. అతనిలోనికి ఐక్యమయ్యేవాళ్ళనుగూడ ఆత్మ అభిషేకిస్తుంది. అవస్థాభ్యంగన అభిషేకంద్వారా వ్యాధిగ్రస్తులకూ ఆరోగ్యమూ, ఊరటా, పాపపరిహారమూ లభిస్తాయి. ఆత్మ అభ్యంగనాన్ని పొందిన రోగి హృదయంలో వసించి అతనికి ఉపశాంతిని దయచేస్తుంది. ఆ రోగి పాపాలను మన్నించి అతన్ని పవిత్రుని చేస్తుంది. మందు మన దేహం మీద పనిచేస్తుంది. కాని అవస్థాభ్యంగనం ప్రత్యక్షంగా మన ఆత్మమీద పనిచేస్తుంది. పరోక్షంగా మాత్రమే అది మన దేహంమీద పనిచేస్తుంది. వ్యాధిగ్రస్తునికి పెద్దలచే తైలాన్ని పూయించాలి అనే యాకోబు వాక్యం ఈ సంస్కారాన్నే పేర్కొంటుంది - యాకో 5,14-15. ఈరీతిగా ఏడు సంస్కారాల్లోను ఆత్మ పనిచేస్తుంది.

1. గురుపట్ట సంస్కారాన్నిచ్చేది పవిత్రాత్మే. పీఠాధిపతి అభ్యర్థిపై చేతులుచాచి ఈలా ప్రార్థిస్తారు. "సర్వశక్తి గల పితా! ఈ సేవకునికి గురుత్వపు ఘనతను ప్రసాదించండి. ఇతని హృదయంలో పవిత్రాత్మ శక్తిని నూత్నీకరించండి. దీనివలన ఇతడు మీనుండి ఆచార్యత్వంలో రెండవ అంతస్తును పొందునుగాక. నిగ్రహజీవితాన్ని అలవర్చుకొని తన సత్ప్రవర్తనం వలన అందరికీ ఆదర్శంగా వుండునుగాక." ఈ హస్తనిక్షేపణం ద్వారాను, ఈ ప్రార్థనం ద్వారాను సామాన్య మానవుడు ఆత్మనుపొంది గురువుగా మారిపోతాడు.

2. పరలోక జపం "మీ రాజ్యం వచ్చునుగాక" అనే వాక్యం వస్తుంది. కాని ఈ వాక్యానికి బదులుగా ప్రాచీన పితృపాదులు చాలమంది "నీ పవిత్రాత్మ మాపై దిగివచ్చి మమ్ము శుద్ధిచేయునుగాక" అనే వాక్యాన్ని గ్రహించారు. అనగా ఆత్మ మనలను పవిత్రపరచి మనకు మోక్షభాగ్యాన్ని దయచేస్తుందని భావం.

# 22. నైతిక జీవితం గడిపేలా చేసే ఆత్మ

1. భక్తులు నైతిక జీవితం గడిపేలా చేసేది ఆత్మే. పూర్వవేదకాలానికి ధర్మశాస్త్రమున్నట్లే నూత్న వేదకాలానికి క్రీస్తు కట్టడలున్నాయి. కాని ఈ కట్టడలన్నిటికీ కర్త ఆత్మడే. అందుచే అతడే నూత్న వేదకాలానికి ప్రధాన నియమం అని చెప్పాలి. మనం ఆత్మవలన జీవించేవాళ్ళం గనుక ఆత్మకు వశవర్తులమై నడచుకోవాలి - గల 5,25.

పూర్వవేదకాలంలో ధర్మశాస్త్రం రాతిపలకలపై రాయబడింది. అది నరుల అంతరంగంలోగాక వారి హృదయాలకు వెలుపల వుంది. దాన్ని పాటించే శక్తిగూడ పూర్వవేద నరులకు లేదు. కనుకనే యూదులు తరచుగా ధర్మశాస్త్రాన్ని మీరుతూ వచ్చారు. కాని నూత్నవేదపు ధర్మశాస్త్రం మన హృదయాల్లోనే లిఖింపబడింది. దాన్ని పాటించే శక్తిగూడ మనకుంది. కనుకనే యిర్మీయా ప్రవచనం ఈలా చెప్తుంది. "ఆ దినం వచ్చినపుడు నేను యిస్రాయేలు ప్రజలతో చేసికొనే నిబంధనం ఇది. నేను నా ధర్మశాస్త్రాన్ని వారి అంతరంగంలో వుంచుతాను. వారి హృదయాలపై లిఖిస్తాను" - 31,33. పై ప్రవక్త చెప్పినట్లుగా ధర్మశాస్త్రాన్ని ఈలా మన అంతరంగంలో వుంచేది పవిత్రాత్మే. "ఆయన వలన మీరు పొందిన అభిషేకం మీలో నిలచివుంది" -1యోహా 2,27. ఈ వాక్యం ప్రకారం మనలను అంతరంగికంగా అభిషేకించేవాడు పవిత్రాత్ముడే. దైవవాక్కు ద్వారా

పవిత్రాత్ముడు మన హృదయాల్లో క్రీస్తుపట్ల విశ్వాసాన్ని పుట్టిస్తాడు. ఈ విశ్వాసమే ఇక్కడ అభిషేకం అని చెప్పబడింది. పవిత్రాత్మ మన హృదయాల్లో క్రీస్తుపట్ల విశ్వాసం పుట్టిస్తూ మనం ఆ క్రీస్తు కట్టడల ప్రకారం జీవించేలా చేస్తుంది.

ఆత్మ తన శక్తితో మన చిత్తశక్తికి బలాన్ని దయచేస్తుంది. ఈ బలంతోనే మన చిత్తశక్తి ఆయా నైతికక్రియలను నిర్వహిస్తుంది. చెట్టు పండ్లుకాస్తుంది, తల్లి బిడ్డను కంటుంది. అలాగే మన చిత్తశక్తికూడ ఆయా నైతిక క్రియలను నిర్వహిస్తుంది. ఆ క్రియలను పండ్లలా కాస్తుంది. ఈ శక్తి దానికి ఆత్మనుండే లభిస్తుంది. ఆత్మ మన హృదయంలో ప్రేమ, ఆనందం, శాంతి మొదలైన తొమ్మిది పండ్లు ఫలించేలా చేస్తుందని పౌలు నుడివాడు - గల 5,22. ఫలితాంశమేమిటంటే, నూత్నవేదకాలంలో నైతికజీవితం గడపాలనే అభిలాష మన హృదయంలోనుండే వస్తుంది. ఆత్మే ఆ యభిలాషను మన అంతరంగంలో మొలకెత్తిస్తుంది. కనుకనే నైతికంగా జీవించడం మనకు అంత కష్టమనిపించదు. ఈ భావాలన్నిటినీ సంగ్రహంగా తెలియజేస్తూ పౌలు "దేవుని ఆత్మ నడిపించేవాళ్ళు దేవుని పుత్రులు" అని వాకొన్నాడు - రోమా 8,14.

2. 1 యోహాను 3,9 దైవప్రకృతి (దైవబీజం) మనలోనే వుంది కనుక మనం పాపకార్యాలు చేస్తూ పోమని చెప్తుంది. 1 యోహాను 2,20 మరియ 27 వచనాల్లో అభిషేకాన్ని గూర్చి చెప్పాడు. ఈ దైవప్రకృతీ ఈ యభిషేకమూ రెండూ మన హృదయంలోని దైవవాక్కునే సూచిస్తాయి. ఆత్మ మన హృదయంలోని ఈ వాక్కుపై పనిచేసి మన మనస్సులో క్రీస్తుపట్ల విశ్వాసం పుట్టిస్తుంది. మనం అతని కట్టడల ప్రకారం జీవించేలా చేస్తుంది. క్రీస్తు భక్తులమయ్యేలా చేస్తుంది. క్రీస్తు మనకు తండ్రిని తెలియజేస్తాడు. కాని ఆత్మ మనకు క్రీస్తుని తెలియజేస్తుంది. క్రీస్తు తండ్రికి ప్రియకుమారుడు. ఆత్మ మనంకూడ క్రీస్తుద్వారా తండ్రికి ప్రీతిపాత్రులమైన బిడ్డలమయ్యేలా చేస్తుంది. ఆత్మ మనలను క్రీస్తు చెంతకు తీసికొనిపోగా, క్రీస్తు మనలను తండ్రి చెంతకు చేరుస్తాడు. కనుక మన క్రైస్తవ విశాస్వమూ భక్తి సత్క్రియలూ నైతిక జీవితమూ పాపం నుండి వైదొలగడమూ అన్నీ ఆత్మద్వారానే జరుగుతాయి. మన నైతిక జీవితానికి కర్త ఆత్మే.

## ప్రార్థనా భావాలు

1. ఆత్మ అభ్యంగన తైలంలాగ మెల్లగా మనలోనికి ప్రవేశిస్తుంది. మన పాపాలనూ స్వార్థబుద్ధినీ మనం గ్రహించేలా చేస్తుంది. మనం వాటి కొరకు పశ్చాత్తాపపడేలా చేస్తుంది. అటుపిమ్మట మన పాపాలను మన్నిస్తుంది. కనుక క్రీస్తుతోపాటు ఆత్మకూడ మనకు పాపపరిహారాన్ని దయచేస్తుంది.

2. డీట్రిక్ బోన్‌హోపర్ అనే భక్తుడు ఈలా నుడివాడు. నీవు స్వేచ్ఛను పొందాలంటే మొదట నీ యింద్రియాలనూ నీ కోరికలనూ అదుపులో పెట్టుకో. నీ దేహమూ మనస్సూ గూడ నిర్మలంగా వుండాలి. అవి నీకు లొంగివుండాలి. ఆత్మ నిగ్రహం లేనివాళ్ళకు ఆత్మవరమైన స్వేచ్ఛ లభించదు.

## 23. శారీరక వాంఛలను జయించేలా చేసే ఆత్మ

1. మన శరీరం నిత్యం పాపక్రియలవైపు మొగ్గుతూంటుంది. కాని ఆత్మ తన వరప్రసాదబలంతో మనం ఈ శరీర వాంఛలను జయించేలా చేస్తుంది. పౌలు ఈలా చెప్పాడు. "మీరు ఆత్మయందు జీవించండి. శరీర వాంఛలను తృప్తిపరచకండి. శరీరం కోరేది ఆత్మ కోరేదానికి విరుద్ధంగా వుంటుంది. అలాగే ఆత్మ కోరేది శరీరం కోరేదానికి విరుద్ధంగా వుంటుంది. ఈ రెండిటికీ బద్ధవైరం" - గల 5,16-17. మన ఆత్మ మంచిని కోరితే మన శరీరం చెడ్డను కోరుతుంది. ఇంకా, ఎవడు చల్లిన విత్తనాలకు తగిన పంటను వాడు కోసికొంటాడు. శరీర వాంఛలకు అనుకూలమైన విత్తనాలు చల్లేవాడికి మరణమనే పంట పండుతుంది. ఆత్మకు అనుకూలమైన విత్తనాలు చల్లేవాడు నిత్యజీవమనే పంట కోసికొంటాడు - గల 6,7-8. పవిత్రాత్మ మన శరీరవాంఛలను మట్టుపెడుతుంది. ఈ యంశాన్ని పురస్కరించుకొని పౌలు ఈలా చెప్పాడు. శరీరవాంఛల ప్రకారం జీవించే వాళ్ళు శరీరం కోరుకొనే పాపకార్యాలకే తమ మనస్సును అర్పిస్తారు. ఆత్మాభిలాషల ప్రకారం జీవించేవాళ్ళు ఆత్మ కోరుకొనే పవిత్రకార్యాలకే తమ మనస్సును అర్పిస్తారు. శారీరక వాంఛలు మరణానికీ, ఆత్మవాంఛలు జీవానికీ దారితీస్తాయి - రోమా 8,6-7.

పౌలు పేర్కొన్న ఈ సూత్రాలను రోజువారి జీవితంలో మనంకూడ అనుభవానికి తెచ్చుకొంటూనే వుంటాం. ఓవైపు మనం పాపంద్వారా పిశాచ పుత్రులం. మరోవైపు జ్ఞానస్నాన విశ్వాసాలద్వారా, వాక్కుద్వారా దేవుని పుత్రులం. కనుక పాపస్వభావమూ దైవస్వభావమూ రెండూ మనలో వుంటాయి. మనలోని ఈ రెండు స్వభావాలూ నిరంతరం ఒకదానితో ఒకటి ఘర్షణ పడుతూనే వుంటాయి. ఈ రెండు ప్రకృతులను బైబులు వెలుగు, చీకటి అనికూడ పిలుస్తుంది. ఈ రెండిటి మధ్య జరిగే పోరాటాన్ని ఆధ్యాత్మిక మానవులు గుర్తిస్తూనే వుంటారు. ఈ పోరాటంలో ఆత్మ మన పక్షాన్ని అవలంభించి మనకు విజయాన్ని ప్రసాదిస్తుంది. ఉత్థాన క్రీస్తూ ఆత్మా యిద్దరూ శోధనల్లో మనకు విజయాన్ని చేకూర్చి పెడతారు.

2. కొందరు ఆత్మ ప్రబోధాన్ని పెడచెవిని బెడతారు. శరీర వాంఛలకు లొంగిపోయి పాపంలో బడతారు. అప్పుడు కూడ ఆత్మ వాళ్ళను వదిలిపెట్టదు. వాళ్ళ హృదయాల్లో పశ్చాత్తాప భావాలు పుట్టిస్తుంది. వాళ్ళకు పరివర్తనం కలిగిస్తుంది. పూర్వం జక్కయ అన్యాయంగా సొమ్ముజేసి కొంటూండగా ప్రభువు అతన్ని మందలించి అతనికి పరివర్తనం కలిగించాడు - లూకా 19,1-10. ఈ రీతిగానే ఆత్మ మనలనుగూడ మందలిస్తుంది. అతడు ఓ దేవళంలోకిలాగ మన యెడదల్లోకి వేంచేస్తాడు. మన హృదయ దేవాలయాన్ని శుద్ధిచేస్తాడు. ఆత్మ శిష్యుల మీదికి వేంచేసింది పాపపరిహారాన్ని దయచేయడానికే. కనుకనే ఉత్థాన క్రీస్తు శిష్యులమీదికి ఆత్మనువూది మీరు ప్రజల పాపాలు మన్నించండి అని చెప్పాడు - యోహా 20,22-23.

3. ఆత్మ మనకు స్వేచ్ఛను ప్రసాదిస్తుంది. ఆత్మ వున్నచోట స్వాతంత్ర్యముంటుంది - 2కొ 3,17. ఈ స్వేచ్ఛ ప్రధానంగా పాపంనుండే - రోమా 8,2. పాపం చేసేవాళ్ళు పిశాచానికి బానిసలౌతారు. ఆత్మ మనలను దేవునికి దత్తపుత్రులనుగా జేసి ఈ స్వేచ్ఛను ప్రసాదిస్తుంది. మనకు స్వేచ్ఛనిచ్చేవాడు తండ్రే. అది మనకు క్రీస్తుద్వారా ఆత్మ సహాయం వలన లభిస్తుంది. కుమారుడు మిమ్ము స్వతంత్రులను జేస్తే మీరు నిజంగా స్వతంత్రులౌతారు అన్నాడు ప్రభువు - యోహా 8,36.

ఐతే స్వేచ్ఛ అంటే నియమాలు మీరి విచ్చలవిడిగా సంచరించడం గాదు. అది అరాజకం అనిపించుకొంటుంది. నిజమైన స్వేచ్ఛ ఇతరులకు సేవలు చేయడానికి పూనుకొంటుంది. "ఈ స్వేచ్ఛవలన మీరు లౌకిక వ్యామోహాలకు లొంగిపోగూడదు. దీనిద్వారా ఒకరికొకరు సేవలు చేయండి" - గల 5,13. క్రీస్తు సర్వతంత్ర స్వతంత్రుడు. కాని అతడు శిష్యుల కాళ్ళు కడిగి వారికి సేవలు చేసాడు. పౌలు కూడా స్వతంత్రుడే. కాని అతడు అందరికీ దాసుడై సేవలు చేసాడు. ఈ మహానుభావులు మనకు ఆదర్శం కావాలి. అగస్టీను చెప్పినట్లు, భక్తి భయంతో ప్రారంభమౌతుంది. ఇది పూర్వవేద పద్ధతి. కాని భక్తి ప్రేమతో గూడిన సేవాకార్యాలతో ముగుస్తుంది. ఇది నూత్నవేద పద్ధతి.

4. ఇంకా, దైవభక్తుల్లో ఓ రకమైన ధైర్యం కన్పిస్తుంది. ఈ ధైర్యం ఆత్మవరమైన స్వేచ్ఛనుండే జనిస్తుంది. మాకు ఇంత నమ్మకం వుంది కనుకనే మేము ఇంత ధైర్యంతో వున్నాం అన్నాడు పౌలు-2కొ 3,12. శిష్యులు పవిత్రాత్మతో నిండినవారై ధైర్యంతో క్రీస్తు సందేశాన్ని విన్పించారు - అచ 4,31. ప్రాచీన వేదసాక్షులు తమ్ము హింసించేవారిని ధైర్యంతో ఎదుర్కొన్నారు. నేడుకూడ కొంతమది భక్తుల్లో ఈ ధైర్యం కొట్టవచ్చినట్లుగా కన్పిస్తుంది. ఇది ఆత్మయిచ్చే వరమే.

1. నోవేష్యస్ అనే భక్తుడు ఈలా వ్రాసాడు. ఆత్మ కోరేది శరీరం కోరేదానికి విరుద్ధంగా వుంటుంది. మనలోని దుష్టవాంఛలనూ కామాన్నీ ఉద్రేకాన్నీ మోహాగ్నిని అణచివేసేది ఆత్మమే. త్రాగుబోతుతనాన్నీ దురాశనీ అల్లరితో గూడిన ఆటపాటలనూ అణగద్రొక్కేదికూడ ఆత్మమే. ఇంకా, సోదరప్రేమను దయచేసేదీ, ప్రేమ భావాలను రేకెత్తించేదీ, మఠా తత్వాలను రూపుమాపేదీ, సత్యాన్ని బోధించేదీ, పతితులను ఖండించేదీ, భక్తిరహితులను బహిష్కరించేదీ, సువిశేషాలను సంరక్షించేదీ ఆత్మమే. అపోస్తలులను క్రీస్తుకి సాక్షులనుగా చేసిందీ, వేదసాక్షులకు మొక్కవోని ధైర్యాన్నిచ్చిందీ, కన్యల కన్యాత్వాన్ని కాపాడిందీ, క్రీస్తు బోధలను పదిలపరచేదీ, శ్రీసభ విశ్వాసాన్ని కాపాడేదీ, తప్పు చేసినవారిని సవరించేదీ ఆత్మమే.

2. ఓ ప్రాచీన భక్తుడు ఈలా వ్రాసాడు. ఆత్ముడు కేవలం ఆత్మస్వరూపుడైకూడ మన దేహాన్ని బలపరుస్తాడు. అతడు వేదసాక్షుల్లోనికి ప్రవేశించి వారి శరీరాలను బలపరచాడు. కనుకనే వాళ్ళు నానాహింసలు భరించగలిగారు. ఆత్మ సాన్నిధ్యం వల్లనే వారి దేహాలు దౌర్బల్యాన్ని విడనాడి బలాన్ని పొందాయి. వాళ్ళు నరమాత్రులై కూడ ఆత్మసాన్నిధ్యం వల్ల దేవుళ్ళా ప్రవర్తించగలిగారు. ఇంకా, ఆత్ముడు కన్యల్లోకి ప్రవేశించి వారికి బ్రహ్మచర్యవరాన్ని ప్రసాదించాడు. ఆ యాత్మ సాన్నిధ్యంవల్లనే వాళ్ళు కామ ప్రలోభాలను జయించి దృఢగాత్రులయ్యారు.

3. క్రైస్తవునిలో స్వేచ్ఛ, సేవ అనే రెండు గుణాలు వుంటాయని చెప్తూ లూతరు ఈలా వ్రాసాడు. "క్రైస్తవుడు స్వేచ్ఛాపరుడు. అతడు ఎవ్వరికీ దాసుడు కాడు. కాని క్రైస్తవుడు సేవకుడు, విధేయాత్ముడు. అతడు అందరికీ లొంగి వుంటాడు".

# 24. పాపపరిహారాన్ని దయచేసే ఆత్మ

1. క్రీస్తు భక్తులమైన మనం పాపం చేయకూడదు. ఐనా బలహీనతవల్ల చాలసార్లు పాపంలో పడిపోతూంటాం. అప్పుడు ఆత్మ మనలను వదిలివేయదు. పడిపోయిన మనలను మెల్లగా లేపుతుంది. హృదయంలో పశ్చాత్తాపం పుట్టించి మనం మన పాపాలకు దుఃఖపడేలా చేస్తుంది. పరివర్తనం పుట్టించి మనం మళ్ళా ప్రయాణాన్ని కొనసాగించేలా చేస్తుంది.

నరుడు దేవునికి పోలికగా కలిగింపబడినవాడు. దేవుణ్ణి చేరవలసినవాడు. నిరంతరం దేవునిపై ఆధారపడి జీవించవలసినవాడు. కాని అతడు తన స్వేచ్ఛను

దుర్వినియోగం జేసికొని దేవుణ్ణి నిరాకరిస్తాడు. తనకు తానే దేవుడై పోతాడు. పాపంజేసి దేవునికి దూరమైపోతాడు. అపుడు ఆత్మ వరప్రసాదం అతనిపై సోకి అతడు మళ్ళా పశ్చాత్తాపపడేలా చేస్తుంది. తప్పిపోయిన కుమారుళ్ళా మళ్లా తండ్రి యింటికి తిరిగివచ్చేలా చేస్తుంది. అతడు ఈలా తిరిగివచ్చేలా చేసేది ఆత్మడే.

పెంతెకోస్తు దినాన ప్రజలు పేత్రు ఉపన్యాసం విని తీవ్రంగా మనసు నొచ్చుకొని సోదరులారా! మేము ఏంచేయాలి అని అడిగారు. పేత్రు మీరు పరివర్తనం చెంది యేసుక్రీస్తు నామాన జ్ఞానస్నానం పొందండి. అప్పుడు మీ పాపాలు పరిహారమౌతాయి. మీరు ఆత్మను పొందుతారు అని చెప్పాడు - అచ 2,37-38. ఇక్కడ ఆత్మే ఆ ప్రజల మనసులో బాధను పుట్టించి వాళ్ళకు పరివర్తనం కలిగించింది. వాళ్ళ ఆత్మలకు "మేలైన అతిథి"గా వాళ్ళ హృదయాల్లోకి దిగివచ్చింది. నేడు మనకు పరివర్తనం కలిగించి మన పాపాలను మన్నించేదికూడ ఆ యాత్మడే. అసలు ఆ పవిత్రమూర్తే మన పాపపరిహారం.

2. ఉత్థాన క్రీస్తు శిష్యులమీదికి శ్వాసనువూది "మీరు పవిత్రాత్మను పొందండి. మీరు ఎవరి పాపాలనైనా క్షమిస్తే అవి క్షమింపబడతాయి" అన్నాడు - యోహాను 20,23-23. ఈ శిష్యులు పవిత్రాత్మశక్తితోనే పాపాలు మన్నించారు. ఈలా మన్నించే అధికారాన్ని తమ అనుయాయులకుకూడ యిచ్చిపోయారు. ఆదిమ తిరుసభ దైవప్రేరణచే పాపాల మన్నింపుకొరకు ఓ దేవద్రవ్యానుమానాన్నికూడ నెలకొల్పింది. అదే నేటి మన పాపసంకీర్తనం. ఆత్మకీ పాపపరిహారానికీ దగ్గరి సంబంధం వుంది. పవిత్రాత్మ మనకు పశ్చాత్తాపం పుట్టించి మన పాపాలను కడిగివేస్తుంది. తాను పవిత్రమూర్తిగాన మన అపవిత్రతను పూర్తిగా తొలగిస్తుంది. వెలుతురు చీకటిని పారద్రోలినట్లుగా మన కల్మషాన్ని నిర్మూలిస్తుంది.

పాపసంకీర్తనాన్ని కేవలం మన్నింపును పొందేతంతునుగా మాత్రమే భావించకూడదు. అది ప్రధానంగా నరునికి పరివర్తనం కలిగించే సంస్కారం. పరివర్తనమంటే మన హృదయాన్ని మార్చుకోవడం. ఈ మార్పుని ఆత్మమాత్రమే దయచేయగలదు. ఆత్మ పాపసంకీర్తనంలో గురువునీ పాపినీగూడ సోకి ఈ మార్పుని దయచేస్తుంది. ప్రవక్త యెహెజ్కేలు నుడివినట్లుగా, నరులకు నూత్న హృదయాలను దయచేసేవాడు ఆత్మడు - 36,26. పాపపరిహారం పొందిన నరుడు మళ్ళా దేవుణ్ణి ప్రేమించి అతని చిత్తప్రకారం జీవించడం మొదలుపెడతాడు.

అంబ్రోసు భక్తుడు ఈలా వ్రాసాడు. "మీరు ఎవరి పాపాలనైనా క్షమిస్తే అవి క్షమింపబడతాయని వేదశాస్త్రం చెప్తుంది. కాని నరులు తమ సొంత శక్తితోనే తోడి నరుల పాపాలను మన్నించలేరు. పితపుత్ర పవిత్రాత్మల నామాల మీదిగా వాళ్ళు పాపపరిహారాన్ని

దయచేస్తారు." ఈలాంటి వాక్యాలనుబట్టి ప్రాచీనకాలంనుండి తిరుసభలో పాపపరిహార ప్రక్రియా వుంది, ఆత్మద్వారా ఆ ప్రక్రియ జరుగుతుందనే నమ్మకమూ విశ్వాసుల్లో వుంది అనుకోవాలి.

3. యెరూషలేం సిరిల్ భక్తుని భావాల ప్రకారం, ఆత్మ మన పాపాలను మన్నించడం మాత్రమేకాదు. మన జీవితకాలమంతా సహాయంచేస్తు మనలను కాపాడుతూంటుంది. "నీవు దేవుని నమ్మితే ఆత్మ నీ పాపాలను మన్నిస్తుంది. అంతమాత్రమేకాదు, నీ శక్తికి మించిన కార్యాలను నీచే చేయిస్తుంది. నీ హృదయంలోని భక్తిని బట్టి నీవు ఆత్మ వరప్రసాదాన్ని పొందుతావు. నీ జీవితకాలమంతా ఆయాదరణ కర్త నీతో వుండిపోతాడు. ఆ దివ్యవ్యక్తి నిన్ను తన సైనికుణ్ణిలాగ ఆదుకొంటాడు. నీ కార్యాలన్నిటిలోను, విశేషంగా నీవు శత్రువులతో పోరాడేపుడు అతడు నిన్ను కాచి కాపాడతాడు. నీవు పాపంద్వారా ఆ యాత్మను దుఃఖపెట్టకుండా వుంటే చాలు, అతడు నీకు అన్ని వరప్రసాదాలు దయచేస్తాడు. ఆత్మను దుఃఖపెట్టవద్దు అనే వేదవాక్యం వుంది కదా! - ఎఫె 4,30."

కనుక మనం బలహీనతవల్ల పాపంలో పడిపోయినపుడెల్ల ఆత్మ సహాయాన్ని అడుగుకొని పశ్చాత్తాపపడాలి. అవసరమైనపుడు పాపసంకీర్తనంగూడ చేసికొని పాప పరిహారం పొందాలి. ఎప్పటికప్పుడు ఆత్మద్వారా శుద్ధిని పొందే వాడే నిజమైన క్రైస్తవుడు.

## ప్రార్థనా భావాలు

1. కీర్తన 33,6 ఈలా చెప్తుంది :

   ప్రభువు తన వాక్కుతో ఆకాశాన్ని సృజించాడు
   తన నోటి వూపిరితో సూర్యచంద్రులను చేసాడు.

   ఇక్కడ దేవుని వాక్కంటే కుమారుడు. అతని నోటి వూపిరి అంటే పవిత్రాత్ముడు. ఈ యిద్దరిద్వారా దేవుడు లోకాన్ని సృజించాడని భావం. ఇరెనేయస్ వేదశాస్త్రి ఈ యిద్దరూ తండ్రికి రెండు చేతుల్లాంటివాళ్ళనీ ఈ యిద్దరి ద్వారానే అతడు సృష్టి చేసాడనీ వాకొన్నాడు.

2. నూత్న వేదాంతి అనబడే సిమియోను భక్తుడు ఈలా చెప్పాడు. "దేవుణ్ణి తెలిసికొనే ముఖ్యసాధనం పవిత్రాత్మ వరప్రసాదమే. ఈ వరప్రసాదం మన హృదయాలను శుద్ధిచేసి వాటికి వెలుగుని ప్రసాదిస్తుంది. ఈ వెలుగువల్ల మనం దేవుణ్ణి గ్రహించి విశ్వసిస్తాం. దీనివల్ల నూత్నజన్మను పొంది దేవునికి బిడ్డలమౌతాం. ఆత్ముడు మనకు దైవజ్ఞానాన్ని దయచేసేవాడు కనుక అతనికి "తాళపుచెవి" అని పేరు వచ్చింది."

# 25. ప్రార్థన చేయించే ఆత్మ

1. తొలినాటి క్రైస్తవులు బృందంగాగూడి భక్తితో ప్రార్థన చేసేవాళ్ళు - 1కొరి 11,18. ఆత్మే మనచే ప్రార్థన చేయిస్తుందని పౌలు స్పష్టంగా చెప్పాడు. మనం ఆధ్యాత్మికంగా బలహీనులం. ఎప్పుడు, దేనికొరకు, ఏలా ప్రార్థించాలో మనకు తెలియదు. మన దౌర్భాగ్యాన్ని తలంచుకొని ఆత్మ బాధపడుతుంది, విలపిస్తుంది. ఆత్మే మన తరపున ప్రార్థన చేయడం మొదలుపెడతుంది. కాని మనచేగూడ జపం చేయించి మన జపాన్ని తన జపంతో జోడిస్తుంది. తల్లి పసిబిడ్డను వేలిచ్చి నడిపించినట్లే మనలను ప్రార్థనలో నడిపిస్తుంది. ఈలా ఆత్మ మనకొరకు, మనతోగలసి, మనలోనే ప్రార్థన చేస్తుంటే అందరి హృదయాలు తెలిసిన తండ్రి ఆ ప్రార్థనను వెంటనే అర్థంజేసికొంటాడు. ఆత్మ మన రక్షణాన్ని పురస్కరించుకొనే ప్రార్థన చేస్తుంది. కనుక తండ్రి ఆ ప్రార్థనను తప్పక అంగీకరిస్తాడు - రోమా 8,26-27. జపాన్ని గూర్చి పౌలు చెప్పిన ఈ వాక్యాలు చాల విలువైనవి.

ఇంకా ఆత్మ మనం ఎడతెగక ప్రార్థన చేసేలా చేస్తుంది - 1తెస్స 5,17. దేవునినుండి మనం పొందిన ఉపకారాలకు ఆ తండ్రికి వందనాలు చెప్తూ ప్రార్థన చేసేలా చేస్తుంది - కొలో 3,16. ప్రార్థనద్వారా మనం చాలా వరాలు పొందవచ్చు. కాని అన్నిటికంటె శ్రేష్ఠమైన వరంగా ఆ యాత్మనే పొందుతాం - లూకా 11,13.

ప్రార్థనద్వారా ఆత్మ మనలను దేవుని బిడ్డలనుగా జేస్తుంది. పవిత్రాత్ముడు మన హృదయాల్లోవుండి మనచే దేవుణ్ణి అబ్బా! అనగా నాన్నా అని పిలిపిస్తాడు. పూర్వవేదంలో ఏ యూద భక్తుడు కూడ ఇంత చనువుతో దేవుణ్ణి నాన్నా అని సంబోధించలేదు. క్రీస్తే మొదటిసారిగా ఈలా జపించాడు - మార్కు 14-36. ఈనాడు మనం ఆత్మశక్తితో క్రీస్తు ప్రార్థనను మన ప్రార్థనగా జేసికొంటాం. ఇది చాల శ్రేష్ఠమైన జపం.

మనం ఆత్మయందు, అనగా ఆత్మ ప్రేరణంతో జపిస్తాం - ఎఫె 6,18. ఆత్మ ప్రేరేపించందే మనంతట మనం ప్రార్థన చేయలేం. ఇంకా, మన ప్రార్థన చాలసారులు స్పష్టంగా వుండదు. మనుష్యులముందేగాదు, దేవునిముందు కూడ మన భావాలూ కోరికలూ స్పష్టంగా తెలియజేయలేం. అందుచే మన వేడికోలు అవ్యక్తంగా వుండిపోతుంది. ఈలాంటి సందర్భాల్లో ఆత్మ మన జపానికి ఓ రూపమంటూ ఇస్తుంది. దాన్ని స్పష్టంజేసి దేవునిముందు పెడుతుంది.

ఉత్థాన క్రీస్తు మోక్షంలోవుండి తండ్రి సమక్షంలో మనకొరకు జపిస్తాడు - హెబ్రే 7,25. కాని పవిత్రాత్మ మన హృదయంలోనే వుండి మనకొరకు జపిస్తుంది. ఈ

యిరువురు దైవవ్యక్తుల ప్రార్థనాబలంవల్లనే మనం కొద్దోగొప్పో భక్తిని అలవరచ్చుకోగల్గుతున్నాం - రోమా 8,15.

2. తరతరాల పొడుగునా పునీతులకు జపం నేర్పింది ఆత్మ. భక్తులచే మహా ప్రార్థనలు చేయించింది ఆత్మ. పుణ్యాత్ములకు భక్తిపారవశ్యాన్ని కలిగించింది ఆత్మ. బైబుల్లోని ప్రశస్తజపాలైన కీర్తనలను వ్రాయించింది ఆత్మ.

వేదవాక్యాన్ని చదువుకొని ప్రార్థన చేసికోడానికి పవిత్రాత్మ విశేషంగా తోడ్పడుతుంది. బైబులు వాక్యాన్ని జపించే విధానంలో మూడు మెట్లున్నాయి. మొదటిది, భక్తిభావంతో పవిత్రగ్రంథంలోని ఓ వాక్యాన్ని చదువుకొంటాం. రెండవది, ఆ వాక్యం భావమేమిటా అని కొంచెం సేపు ఆలోచించి చూస్తాం. ఆత్మే మన హృదయంలో వెలుగును పుట్టించి మనం ఆ వాక్యం అర్థాన్ని గ్రహించేలా చేస్తుంది. మూడవమెట్టు, ఆ వాక్యాన్ని పురస్కరించుకొని ప్రార్థన చేసికొంటాం. ఈ ప్రార్థన మనవి, కృతజ్ఞత, పశ్చాత్తాపం, ఆరాధన అనే నానారూపాల్లో వుండవచ్చు. ఈ జపాన్ని నడిపించేది ఆత్మే. ఈలా మొదటి వాక్యాన్ని పురస్కరించుకొని ప్రార్థించాక దాని తర్వాతి వాక్యానికి వెళ్తాం. ఈవిధంగా మనకు అందుబాటులోవున్న కాలాన్నిబట్టి బైబుల్లోని ఓ వాక్యాన్నిగాని పేరానుగాని అధ్యాయాన్నిగాని ముగించుకొంటాం. ఇది సులువైన ప్రార్థనాపద్ధతి.

## ప్రార్థనా భావాలు

1. కీర్కెగార్డ్ అనే భక్తుడు ఈలా జపించాడు. “ఆత్మమా! పవిత్రాత్ముడవైన నీవు అపవిత్రుడైన నరుళ్ళో, మురికి మానిసిలో వసిస్తావు. జ్ఞానివైన నీవు మూర్ఖుడైన నరుల్లో వసిస్తావు. సత్యానివైన నీవు మోసగాడైన నరుల్లో జీవిస్తావు. ఆత్మమా! నీవు నా హృదయాన్ని కూడ నీకు నివాసయోగ్యంగా తయారుచేయి. నా యెదదలోని మాలిన్యాన్నీ మూర్ఖత్వాన్నీ మోసాన్నీ తొలగించి దానిలో వసించు.” ఈ జపం మనంకూడ జపించదగ్గది.

2. ఓ ప్రాచీన భక్తుడు ఈ వుపమానాలు చెప్పాడు. ఆత్మ మనలను దేవునిలోకి మార్చివేస్తుంది. ద్రాక్షరసంలో పడిన నీటిబొట్టు రసమైపోతుంది. నిప్పులో పెట్టిన ఇనుపముక్క నిప్పయిపోతుంది. సూర్యరశ్మి సోకిన గాలి తానూ వెల్తురైపోతుంది. అలాగే ఆత్మతో ఐక్యమైపోయిన మనం కూడ ఆత్మలోనికి మారిపోతాం.

3. పాపిలో ఆత్మ వసించదు. పవిత్రునిలో వసిస్తుంది. కనుకనే ప్రాచీన క్రైస్తవులు భక్తులను “ఆత్మధరులు” అని పిల్చేవాళ్ళు.

# 26. దైవపుణ్యాలకు కర్తయైన ఆత్మ

ప్రేమ, విశ్వాసం, నిరీక్షణం అనే మూడు దైవపుణ్యాలూ ఆత్మ దయచేసే వరాలే. ఈ విషయాన్ని విపులంగా పరిశీలిద్దాం.

1. ప్రేమ ఆత్మ దయచేసే వరం. తండ్రి ఆత్మ ద్వారా ప్రేమశక్తిని మన హృదయాల్లో కుమ్మరిస్తాడు - రోమా 5,5. ఈ ప్రేమ దైవప్రేమా సోదరప్రేమా కూడ. ఇక్కడ విశేషంగా సోదరప్రేమను పరిశీలిద్దాం. ధర్మశాస్త్రమంతా సోదరప్రేమలో ఇమిడే వుంది. కనుక ఈ ప్రేమను పాటిస్తే ధర్మశాస్త్రాన్నంతటినీ పాటించనట్లే - గల 5,14. సోదరప్రేమ విశ్వాస నిరీక్షణలకంటె గొప్పది - 1కొ 13,13. మొదట మనం తోడి నరులను ప్రేమిస్తే తర్వాత వారికి ఏమి చేసినా చెల్లుతుంది.

యూదులు ధర్మశాస్త్రాన్ని పాటించలేకపోయారు. అది వారికి పెనుభారంగాను, పెద్దకాడిగాను తోచింది. ధర్మశాస్త్రసారం సోదరప్రేమేనని చెప్పాం. నూత్నవేదంలో క్రీస్తు ప్రధానంగా బోధించింది సోదరప్రేమా దైవప్రేమలనే. ధర్మశాస్త్రమనేకాడి కష్టమైంది. కాని క్రీస్తు ప్రేమాజ్ఞ అనే కాడి సులువైంది. ధర్మశాస్త్రమనే భారం బరువైంది. కాని క్రీస్తు ప్రేమాజ్ఞ అనే బరువు తేలికైంది - మత్త 11,29.

సోదరప్రేమద్వారా మనం తోడి నరులకు సేవలు చేస్తాం. ప్రేమతో ఒకరినొకరు సేవించండి అన్నాడు పౌలు - గల 5,13. మదర్ తెరీసా ఈ సేవకు చక్కని ఉదాహరణం.

యూదులకు పెంతెకోస్తు పండుగ అంటే ధర్మశాస్త్రాన్ని పొందిన సంఘటనను జ్ఞప్తికి తెచ్చుకోవడం. కాని క్రైస్తవులమైవు మనకు పెంతెకోస్తు పండుగ అంటే ఆత్మ దిగివచ్చిన సంఘటనను జ్ఞప్తికి తెచ్చుకోవడం. ఆత్మ మనమీదికి దిగివచ్చి మనకు దయచేసేది ప్రధానంగా ప్రేమవరాన్నే. కనుక సోదరప్రేమలో తప్పిపోయే వాళ్ళు ఆ వరాన్ని సమృద్ధిగా దయచేయమని వినయంతో ఆత్మను అడుగుకోవాలి.

2. విశ్వాసంగూడ ఆత్మ దయచేసే వరమే. స్తెఫను మొదలైన ఏడ్గురు పరిచారకులు ఆత్మతోను విశ్వాసంతోను నిండినవాళ్ళు - అచ 6,5. అనగా ఆత్మే ఆ భక్తులకు విశ్వాసాన్ని ప్రసాదించింది. ఈ యాత్మద్వారా మనం యేసే ప్రభువని అంగీకరిస్తాం - 1కొ 12,3. అనగా యేసే దేవుడని నమ్ముతాం. కనుక ఆత్మవరం లేనివాళ్ళు క్రీస్తు దైవత్వాన్ని విశ్వసింపలేరు.

క్రొత్తగా జ్ఞానస్నానం పొందేవాళ్ళను ఆత్మ విశ్వాసానికి విధేయులనుగా చేస్తుంది - రోమా 1,5. అనగా ఆత్మ, భక్తులు క్రీస్తుని విశ్వసించి అతనికి విధేయులయ్యేలా చేస్తుందని

భావం. ఈ విశ్వాసం పూర్వం అబ్రాహామునిలాగే ఈనాడు మనలనుగూడ నీతిమంతులను జేస్తుంది. అతనికిలాగే మనకుగూడ రక్షణాన్ని దయచేస్తుంది - రోమా 4,19.

ఆత్మ దయచేసే విశ్వాసంద్వారా క్రీస్తుని నమ్ముతాం. అతని మరణోత్థానాల శక్తిని విశ్వసిస్తాం. క్రీస్తుకూడ తన ఆత్మద్వారా మన విశ్వాసాన్ని బలపరుస్తాడు. ఒకోసారి క్రీస్తుపట్ల మనకు విశ్వాసం సన్నగిల్లుతుంది. అలాంటప్పుడు ఆ విశ్వాస వరాన్ని బలపరచమని ఆత్మనే అడుగుకోవాలి.

3. మోక్షాన్ని చేరుకొని క్రీస్తుని దర్శిస్తామని నమ్మడమే నిరీక్షణం. ఈ వరాన్ని మనకు దయచేసేదికూడ ఆత్మమే. ఆత్మవల్లనే మనం దేవుని పుత్రులమౌతాం. ఈ వారసం మనకు లభిస్తుందనడానికి ఆత్మే హామీ - ఎఫె 1,14. కనుక మనం మోక్షాన్ని ఆశించేలా చేసేదీ, ఆ భాగ్యం మనకు దక్కుతుందని నమ్మేలా చేసేదీ ఆత్మే. ఇంకా ఈ యాత్మ మనం ఈ మోక్షభాగ్యం కొరకు ఆశతో ఎదురుచూచేలా చేస్తుంది. బాధతో మూలిగేలాకూడ చేస్తుంది - రోమా 8,13.

ఒకోసారి మనం ఈ లోక భాగ్యాలతోనే సంతృప్తి చెందుతాం. పరలోక భాగ్యాలను ఆశించం. ఈ దౌర్భాగ్యం నుండి మనలను కాపాడమని ఆత్మనే అడుగుకోవాలి. మనకు స్వర్గ సంపదలమీద కోరిక పుట్టించమని ఆ ప్రభువుని వేడుకోవాలి.

## ప్రార్థనా భావాలు

1. పిత, సుతుడు, పవిత్రాత్మ అనే ముగ్గురు దైవవ్యక్తులకుగల సంబంధాన్ని వేదశాస్త్రులు కొన్ని వుపమానాలతో వివరించారు. టెర్టూలియన్ ఈలా చెప్పాడు. "మొదట తండ్రి వున్నాడు. అతనినుండి కుమారుడు బయలుదేరుతాడు. వారిరువురినుండి కడన ఆత్ముడు బయలుదేరుతాడు. ఏలాగంటే, వేరునుండి చెట్టూ ఆ చెట్టునుండి ఫలమూ ఉద్భవిస్తాయి. జలధారనుండి నదీ ఆ నదినుండి కాల్వా బయలుదేరుతాయి. సూర్యునినుండి కిరణాలూ వాటినుండి ప్రకాశమూ పుడతాయి."

2. అతనేష్యస్ భక్తుడు ఈలా వివరించాడు. "తండ్రి దీపం. కుమారుడు దీపకాంతి. ఆత్ముడు ఆ కాంతితో మనలను వెలిగించేవాడు. ఇంకా తండ్రి జలధార. కుమారుడు ఆ ధారనుండి పుట్టిన నది. ఆ నదినుండి మనం త్రాగేనీరు ఆత్మ."

3. దీపం తన కాంతితో అన్ని వస్తువులను ప్రకాశించేలా చేస్తుంది. అలాగే ఆత్మ తాను సోకినవారందరినీ తేజోమయులను చేస్తుంది.

# 27. ఆత్మా దైవవాక్కు

1. ప్రాచీనకాలంనుండి భక్తులు బైబులు చదువుకొనేపుడు ఆత్మకు ప్రార్థన చేస్తూ వచ్చారు. పూర్వం యిర్మీయా యెషయా మత్తయి మార్కు మొదలైన పరిశుద్ధ రచయితలకు ప్రేరణం పుట్టించి వారిచే బైబులు వ్రాయించింది పవిత్రాత్మే. కనుక ఆ యాత్మ అనుగ్రహం లేందే ఎవరికీ పవిత్రగ్రంథం వశపడదు. బైబులు ఆధ్యాత్మిక విషయాలు చెప్పే పుస్తకం. ఆత్మ సహాయంలేందే ఆధ్యాత్మిక విషయాలు ఎవరు అర్థం చేసికోగలరు?

ఆత్మ రెండు ప్రేరణలు దయచేస్తుంది. ఒకటి రచయితకీ, మరొకటి పాఠకుడికీ. రచయితకు కలిగే ప్రేరణం దివ్యగ్రంథాలు వ్రాయడానికి. మత్తయి మార్కు మొదలైనవాళ్ళు ఈ ప్రేరణంతోనే సువిశేషాలు వ్రాసారు. పాఠకులకు కలిగే ప్రేరణం బైబులు చదవడానికి. ఈ ప్రేరణం వల్ల మనం మళ్ళా బైబులు వ్రాయం. ఇదివరకే వ్రాసిన బైబులు చాలు. ఈ ప్రేరణంవల్ల మనం బైబులు అర్థం చేసికొంటాం. దానిపట్ల భక్తి కలిగించుకొని దాని బోధల ప్రకారం జీవిస్తాం. కనుక బైబులు చదువుకొనేపుడు మనం ఈ ప్రేరణను బాగా వాడుకోవాలి.

2. పౌలు బోధిస్తుంటే లూదియా అనే భక్తురాలు వింది. ప్రభువు ఆమె హృదయాన్ని తలుపు తెరచినట్లుగా తెరచాడు - అచ 16,14. ఈనాడు మనం బైబులు చదువుకొనేపుడు ఆత్మ మన హృదయాన్ని కూడ ఈలాగే తెరుస్తుంది. లేకపోతే మనకు భక్తి పుట్టదు.

యోహాను మొదటి జాబు మీరు పవిత్రుని వలన అభిషేకింపబడ్డారు అని చెప్తుంది - 2,20. అతనినుండి మీరు పొందిన అభిషేకం మీయందు నిల్చివుంది అంటుంది - 2,27. ఈ రెండు అలోకనాలు పేర్కొనే "అభిషేకం" పవిత్రాత్మ ప్రభావమే. మనం మొదట వేదవాక్యం వింటాం. అది విత్తనంలా మన హృదయంలో పడుతుంది. ఆత్మ మన హృదయంలో పడిన ఈ వేదవాక్యాన్ని మనకు వివరిస్తుంది. దీనివలన మన హృదయంలో భక్తి పుడుతుంది. మనం క్రీస్తుని విశ్వసిస్తాం. ఈ ప్రక్రియనే ఇక్కడ అభిషేకం అన్నారు. ఆత్మ వివరించకపోతే వేదవాక్యం మన హృదయంలో ఏలాంటి ప్రభావమూ చూపలేదు.

నేడు ఆత్మ మనకు క్రీస్తు బోధలను విప్పి చెప్తుంది. అతని వుపదేశాలను తలపునకు తెస్తుంది - యోహా 14,26. ఆత్మ వివరించి చెప్పకపోతే క్రీస్తు బోధలు మనకు అర్థం కావు. అతని జీవిత సంఘటనలు మనకు బోధపడవు. విశేషంగా అతని మరణోత్థానాల భావాన్ని మనం గ్రహించలేం. ఆత్మడు మనలను సర్వసత్యంలోనికి నడిపించేవాడు -

16,13. క్రీస్తు తెలియజేసే దివ్యశ్రుతే ఈ సత్యం. అనగా అతడు తండ్రినిగూర్చి తెలియజేసే అంశాలే సత్యం. అసలు క్రీస్తే సత్యం. ఈ సత్యం మనకు అర్థమయ్యేలా చేసేది ఆత్మడే.

3. మనం వేదబోధ చేస్తాం, శ్రోతలు మన బోధ వింటారు. అలా వినగానే ఆత్మ వాళ్ళ హృదయాలను కదిలిస్తుంది. దీని ఫలితంగా శ్రోతల హృదయాల్లో భక్తి విశ్వాసాలు పుడతాయి. లేకపోతే వాళ్ళు క్రీస్తుని గ్రహించలేరు. పౌలుకి ఈ సత్యం బాగా తెలుసు. కనుకనే అతడు తన వేదబోధను ప్రజలు బాగా ఆలించేలా ప్రార్థించమని తన క్రైస్తవులను అర్థించాడు - కొలో 4,3.

ఆత్మ లేందే దేవద్రవ్యానుమానాలు పని చేయవు. దైవవాక్కుకూడ ఓ దేవద్రవ్యానుమానంలాంటిది. కనుక ఆత్మలేందే బైబులు పనిచేయదు. పూర్వనూత్నవేదాలు క్రీస్తునే బోధిస్తాయి. ఈలాంటి వేదవాక్యాలను ఆత్మ సహాయం లేందే ఎవరు అర్థంచేసికోగలరు? ఆత్మడు అనుగ్రహించందే ఎవడు క్రీస్తుని గ్రహించగలడు? కనుక మనం ఎప్పుడుకూడ ఆత్మను వేడుకొనిగాని వేదవాక్యాన్ని ధ్యానించుకోగూడదు.

### ప్రార్థనా భావాలు

1. ముగ్గురు దైవవ్యక్తులనుగూర్చి నీసా గ్రెగొరీ భక్తుడు ఈ వుపమానం చెప్పాడు. "మొదటి ఒక దీపం వుంది. దానినుండి రెండవ దీపాన్ని వెలిగించారు. ఆ రెండవ దానినుండి మూడవ దీపాన్ని వెలిగించారు. ఈ మూడవ దీపం మొదటి రెండిటినుండీ వచ్చిందే. అదే ఆత్మ."

2. న్యూడో దయొనీష్యస్ అనే భక్తుడు ఈ వుపమానం చెప్పాడు. "అన్నిటికి మూలకారణమైన తండ్రి చెట్టు లాంటివాడు. క్రీస్తూ పవిత్రాత్మా ఆ చెట్టునుండి పుట్టే మొగ్గలూ పూలూ అనుకోవాలి."

## 28. వరాలు దయచేసే ఆత్మ

ఆత్మ భక్తులకు నానావరాలు దయచేస్తుంది. వీటి ద్వారా భక్తులు భగవంతునికి చేరువౌతారు. ఇక్కడ ఈ వరాలనుగూర్చి విపులంగా తెలిసికొందాం.

1. ఆత్మ మెస్సీయా శిశువుకు ఆరు వరాలు దయచేస్తుందని చెప్పాడు యెషయా ప్రవక్త. ఈ వరాలు విజ్ఞానం, వివేకం, బలం, సదుపదేశం, దైవజ్ఞానం, దైవభీతి - 11,2-3. ఇక్కడ హీబ్రూ బైబులు ఆరువరాలనే పేర్కొన్నా దీని అనువాదమైన గ్రీకు సెప్తువాజింత్ బైబులు దైవభక్తి అనే ఏడవ వరాన్ని గూడ పేర్కొంది. దీనివల్ల ఆత్మ సప్తవరాలు దయచేస్తుందనే సంప్రదాయం వాడుకలోకి వచ్చింది. బైబులు ఆత్మ మెస్సీయాకు

సప్తవరాలనిస్తుందని చెప్తుంది. కాగా ఆ మెస్సీయాను విశ్వసించే భక్తులకు కూడ ఈ వరాలు లభిస్తాయని మనం నమ్మవచ్చు. ప్రాచీన కాలంనుండి క్రైస్తవభక్తులు ఈలాగే విశ్వసిస్తూ వచ్చారు.

ఈ యేడు వరాలూ వ్యక్తిగత పావిత్ర్యం కొరకు ఉద్దేశింపబడినవి. కనుక వీటిద్వారా ఆత్మ మనలను పవిత్రులను చేస్తుంది. అసలు వరాలు ఎన్ని? బైబులూ క్రైస్తవ సంప్రదాయమూ ఏడని చెప్తుంది. కాని బైబుల్లో ఏడు పూర్ణసంఖ్య. అనగా ఈ యేడు ఆత్మయిచ్చే వరాలన్నిటినీ సూచిస్తాయి. ఆత్మ వరాలన్నీ ఈ యేడింటిలో ఇమిడివున్నాయని భావం. ఆత్మవరాలు ఎన్నయినా వుండవచ్చు. కాని అవన్నీ ఈ యేడింటిలో ఇమిడే వుంటాయి.

2. పౌలు తన జాబుల్లో చాలచోట్ల ఆత్మ ఎన్నో వరాలు దయచేస్తుందని చెప్పాడు. కాని యీ వరాలు పై యెషయా పేర్కొన్న వాటిలాగ వ్యక్తిగత పావిత్రానికి ఉపయోగపడవు. మనం ఇతరులకు సేవ చేయడానికి ఉపయోగపడతాయి. కనుక వీటిని సేవావరాలు లేక ప్రేషిత వరాలు అన్నారు (Charisms). 1కొ 12,7-10.28. రోమా 12,6-8. ఎఫే 4,11 వచనాల్లో వీటి ప్రస్తావనం వస్తుంది. ఈ యాలోకనాల్లో పౌలు ఇంచుమించు ఇరవై వరాలదాకా పేర్కొన్నాడు. అవి బుద్ధి, జ్ఞానం, విశ్వాసం, స్వస్థత చేకూర్చడం, అద్భుతాలు చేయడం, ప్రవచనం చెప్పడం, భాషల్లో మాటలాడ్డం, వివేచనం, పరిచర్య, ప్రోత్సహించడం, దానం చేయడం, పర్యవేక్షణం, కరుణకార్యాలు, సువార్త చెప్పడం, కాపరులుగా, అపోస్తలులుగా, సహాయకులుగా, పరిపాలకులుగా మెలగడం మొదలైనవి.

మనం ఈ సేవావరాలను విరివిగా వాడుకొని తోడిప్రజలకు, విశేషంగా పేదసాదలకు పరిచర్య చేయాలి. వారిని వృద్ధిలోనికి తీసికొని రావాలి. ఈ పరిచర్యద్వారా మనం నేరుగా కాదుగాని పరోక్షంగా పవిత్రులమౌతాం.

3. ఆత్మ పైరెండు రకాల వరాలనేకాక ఫలాలను కూడ దయచేస్తుంది. ఇవి తొమ్మిది వున్నాయి. ప్రేమ, సంతోషం, సమాధానం, ఓర్పు, దయ, మంచితనం. విశ్వసనీయత, సాధుశీలత, ఇంద్రియ నిగ్రహం - గల 5,22. ఈ ఫలాలవల్ల హృదయంలో సంతోషమూ మాధుర్యభావమూ నెలకొంటాయి. ఇవి సప్తవరాలకంటెగూడ శ్రేష్ఠమైనవి.

## ప్రార్థనా భావాలు

1. శ్రీసభలో అధికారమనేది వుంది. శ్రీసభ అనే సమాజం మేలుకొరకు పవిత్రాత్మే దీన్ని ప్రసాదించింది. ఐనా శ్రీసభలోని అధికారులు తరచుగా ఈ శక్తిని దుర్వినియోగం చేస్తుంటారు. అలా చేసినప్పుడు తిరుసభలోని సామాన్య క్రైస్తవుల

కుత్తుక నొక్కేసినట్లవుతుంది. ఆత్మ వాళ్ళకిచ్చిన వరాలను వినియోగించుకోక వ్యర్థం చేసినట్లవుతుంది - 1తెస్స 5,19. భారతదేశం తిరుసభలో ఈ యనర్థం తరచుగా కలుగుతుంటుంది.

2. క్రీసభలో అధికారమూ వుంది, ఆత్మ వరాలూ వున్నాయి. అధికారమున్నవాళ్ళు ఇతరులమీద పెత్తనం చెలాయింపబోతారు. వరాలున్నవాళ్ళు అధికారులకు లొంగకుండా విచ్చలవిడిగా ప్రవర్తించబోతారు. కాని మనం అధికారాన్నీ వరాలనూగూడ సద్వినియోగం జేసికొని తిరుసభను ఓ భవనంలా నిర్మించాలి. పూర్వం అధికారానికి ఎక్కువ ప్రాముఖ్యమిచ్చారు. ఇప్పుడు వరాలకు ఎక్కువ ప్రాముఖ్యమిస్తున్నారు. ఐనా ఈ రెండూ సమపాళ్ళలో వుండాలి. అప్పుడే తిరుసభ వృద్ధిలోకి వచ్చేది. ఈ శక్తులను మనం ఏనాడూ దుర్వినియోగం చేయగూడదు.

## 29. శాంతి సంతోషాలను ప్రసాదించే ఆత్మ

1. పిశాచం విచారానుభూతిని కలిగిస్తుంది. కాని పవిత్రాత్మ ఆనందానుభూతిని కలిగిస్తుంది. హృదయంలో శాంతిని నెలకొల్పుతుంది. ఆత్మఫలాల్లో సంతోషమూ శాంతికూడ వున్నాయి - గల 5,22. పౌలు బర్నబాలు అంతియోకయలో వేదప్రచారం చేస్తూంటే అచటి భక్తులు ఆత్మ ప్రభావంవల్ల శాంతి సంతోషాలతో నిండిపోయారు - అచ 13,52. డెబ్బదియిద్దరు శిష్యులు వేదబోధచేసి తిరిగి వచ్చాక పవిత్రాత్మ ప్రభావం వలన క్రీస్తు స్వయంగా ఆనందానుభూతి చెందాడు - లూకా 10,21.

నేడు ఉత్థానక్రీస్తు తన ఆత్మద్వారా మనకు శాంతినీ సంతోషాన్నీ దయచేస్తాడు. అతడు ఉత్థానమైన పిమ్మట యెరూషలేములోని శిష్యులకు ఈ భాగ్యాలను దయచేసాడని వింటున్నాం - యోహా 20,19-20.

పౌలు ఫిలిప్పిలోని క్రైస్తవులకు మీ రెల్లప్పుడూ ఆనందించండని చెప్పాడు - ఫిలి 4,4. క్రైస్తవులమైన మనం మన నాయకుడైన క్రీస్తుని తలంచుకొని ఆనందించాలి. ఈ లోకం కేవలం కన్నీటి కనుమ మాత్రమేకాదు. దేవుడు తన బిడ్డలమైన మనకు ఇక్కడ ఆనందాలు కూడ దయచేస్తాడు. ఈ యానందాలూ సంతోషాలూ భవిష్యత్తులో మనం అనుభవించబోయే మోక్షానందానికి గుర్తుగావుంటాయి. ఈ లోకంలో కొన్ని ఆనందాలు లేకపోతే బ్రతుకు దుర్భరమౌతుంది. కనుక దేవుడు వీటిని మనకు దయచేస్తాడు. ఐతే నిర్మలమైన ఆనందాలన్నిటికీ కర్త పవిత్రాత్మే. ఉత్థానక్రీస్తు ఆత్మ మనం క్రీస్తునందు ఆనందించేలా చేస్తుంది. పుణ్యజీవితం గడపడంద్వారా, తోడిప్రజలను సేవలు చేయడం

ద్వారా, వేదవాక్యం ధ్యానం చేసికోవడంద్వారా - ఇంకా నానాపవిత్రకార్యాలద్వారా మనం ఆనందించేలా చేస్తుంది.

## ప్రార్థనా భావాలు

1. నేడు చాల తావుల్లో పవిత్రాత్మకూటాలు జరుగుతున్నాయి. ఈ సమావేశాలు ఆత్మపట్ల భక్తిని పెంపొందించుకోవడానికి బాగా వుపయోగడపడతాయి. ఈ కూటాల్లో వేదసత్యాలనుగూర్చిన నిర్వచనాలుండవు. వాటనిగూర్చిన వివరణలుంటాయి. వేదసత్యాలను కథలరూపంలో వివరిస్తారు. సాక్ష్యాలరూపంలో బలపరుస్తారు. పాటలరూపంలో గానం చేస్తారు. కనుక ఈ సమావేశాలు ప్రజలను బాగా ఆకర్షిస్తాయి. భక్తులు వీటిల్లో పాల్గొని ఆత్మను లోతుగా అనుభవానికి తెచ్చుకోవాలి.
2. పౌలు బోధకీ యోహాను బోధకీ వ్యత్యాసముంది. పౌలు దైవపుత్రత్వమూ మోక్షభాగ్యమూ మనకు ఈ లోకంలో ఇంకా పూర్తిగా లభింపలేదని చెప్పాడు. ఆ భాగ్యాలు మోక్షంలోగాని సంపూర్తిగా లభించవన్నాడు. కాని యోహాను మనకు ఈ భాగ్యాలు ఈ లోకంలోనే లభించాయని చెప్పాడు. మనం క్రీస్తుని నమ్మి అతని ఆత్మను పొందాం గనుక ఈ భాగ్యాలు ఇక్కడే సమృద్ధిగా లభించాయి అనుకోవాలి.

# 30. మన బాధల్లో మరణంలో ఆత్మ

1. మన బాధల్లోను మరణంలోను ఆత్మ సాన్నిధ్యం వుంటుంది. పూర్వం బాధామయ సేవకుడు ఆత్మ సాన్నిధ్యంతోనే బాధలు అనుభవించాడు - యెష 42,1. సిలువపై మరణించిన క్రీస్తు ప్రక్కనుండి నీళ్ళూ నెత్తురూ స్రవించాయి కదా! - యోహా 19,34. ఈ నీళ్ళు ఆత్మను సూచిస్తాయి. కనుక క్రీస్తు శ్రమల్లోను మరణంలోను గూడ ఆత్మ ప్రత్యక్షమై వుంటుంది.

వేదహింసలు మనకు శ్రమలను దెచ్చిపెడతాయి. ఈ శ్రమల్లో మనం శత్రువులముందు ఏమి మాట్లాడాలా అని కంగారు పడనక్కరలేదు. మనలో వుండే ఆత్మే ఆ సమయంలో మనం పలకవలసిన పలుకులు పలికిస్తుంది - మత్త 10,20. అనగా మన శ్రమల్లో ఆత్మ మనకు సహాయం చేస్తుంటుంది. మనం క్రీస్తు కొరకు శ్రమలు అనుభవించడం ధన్యమని యెంచాలి. ఆ శ్రమల్లో దేవుని ఆత్మ మనమీదికి దిగివస్తుంది - 1పేత్రు 4,14. క్రీస్తుతోపాటు మనం కూడ శ్రమలు అనుభవిస్తే అతని వారసమైన

మోక్షభాగ్యం మనకు కూడ లభిస్తుంది - రోమా 8,17. కాని ఈ మోక్షభాగ్యం మనకు లభించేలా చేసేది పవిత్రాత్మే.

2. మన శ్రమల్లో ఆత్మసాన్నిధ్యం వుంటుందని చెప్పాం. అలాగే మన మరణంలోకూడ ఆత్మ ప్రత్యక్షమై వుంటుంది. మనం క్రీస్తు మరణోత్థానాల్లోకి జ్ఞానస్నానం పొందుతాం - రోమా 6,3. అతడు శారీరకంగా మరణించినట్లే మనం పాపజీవితానికి మరణిస్తాం. అతడు శారీరకంగా ఉత్థానమైనట్లే మనం పుణ్యజీవితానికి ఉత్థానమౌతాం. జ్ఞానస్నానంలో క్రీస్తు మరణం మనమీద సోకి మనకు జీవాన్నిస్తుంది. కాని జీవశక్తి ఎప్పుడూ ఆత్మనుండే. కనుక ఉత్థాన క్రీస్తు ఆత్మ మన జీవితంలోను మరణంలోను మనమీద సోకి మనకు జీవశక్తిని దయచేస్తుంది.

క్రైస్తవ భక్తుడు తన శ్రమల్లోను మరణంలోను గూడ తన్నుతాను ఆత్మకు అర్పించుకోవాలి. ఆ యాత్మ నుండి ఓదార్పునూ శక్తినీ పొందాలి.

## ప్రార్థనా భావాలు

1. రిచర్డ్ ఆఫ్ సెంట్ విక్టర్ అనే భక్తుడు ఈలా నుడివాడు.

తండ్రిలో ఏకత్వముంది
బహుత్వం క్రీస్తుద్వారా లభిస్తుంది
కాని త్రీత్వాన్ని సమాప్తం చేసేది మాత్రం పవిత్రాత్మే.

2. భద్రమైన అభ్యంగనంద్వారా గృహస్థులు ఆత్మను పొంది బాలధ్యులౌతారు. క్రీస్తుకి సాక్షులౌతారు. క్రీస్తు కొరకు శ్రమలు అనుభవిస్తారు. తమ మాటలద్వారా చేతలద్వారాగూడ శ్రీసభ వ్యాప్తికి తోడ్పడతారు.

# 31. ఆత్మ వినయం

1. ఎప్పుడుగూడ స్వచ్ఛమైన ప్రేమ వినయంతో నిండివుంటుంది. కాని ఆత్మ ప్రేమకు నిలయం. అందుచే ఆత్మకుండే వినయం అంతా యింతా కాదు.

త్రీత్వంలో ఆత్మ వినయంతో తన్ను తాను తగ్గించుకొంటుంది. ఆ యాత్మ తండ్రినీ క్రీస్తునీ మనకు తెలియజేస్తుంది. కాని మూడవవ్యక్తిని మనకు తెలియజేసేవాళ్ళెవరూ లేరు. తండ్రి కుమారుని పంపుతాడు. కుమారుడు ఆత్మను పంపుతాడు. కాని ఆత్ముడు ఎవరినీ పంపడు. ఆత్మ తండ్రినీ కుమారునీ మహిమపరుస్తుంది. కాని ఆత్మను మహిమ

పరచేవాళ్ళెవరూ లేరు. ఆత్మద్వారా తండ్రీ కుమారుడూ ప్రవక్తలూ మాట్లాడతారు. కాని బైబుల్లో ఆత్మ తన్ను గూర్చి తాను ఒక్కమాటకూడ చెప్పుకోదు. ఆ యాత్మకు రూపురేఖలుండవు. అసలు ఆత్మ ఎవరోకూడ బైబులు స్పష్టంగా జెప్పదు. దైవవ్యక్తికి ఇంత వినయమూ అని మనం విస్తుపోతాం. మనలనుగూర్చి మనం లోకానికి తెలియజేసికోవాలని ఎంత ఆరాటపడతాం! మనలనుగూర్చి మనం ఎంతగా ప్రచారం జేసికొంటాం! ఆత్మకు ఈ కక్కూర్తి ఎంతమాత్రం లేదు.

2. ఆత్ముడు నిరంతరం పనిచేస్తూనే వుంటాడు. కాని అతని పని తన కొరకు కాదు, మనకొరకు. మనలను పవిత్రులను చేయడంకొరకు. మనం క్రీస్తుని ప్రకటిస్తాంగాని ఆత్మను ప్రకటించం. ఆత్మద్వారా దేవుని తండ్రీ అని పిలుస్తాం. క్రీస్తుని ప్రభువు, దేవుడు అని పిలుస్తాం. కాని మనం ఆత్మను పేరెత్తి పిలచేలా చేసే దివ్యశక్తి ఏదీ లేదు. ఆత్ముడు మనలను తండ్రి దగ్గరికీ కుమారుని దగ్గరికీ రాబడుతూంటాడుగాని తన దగ్గరికి రాబట్టుకోడు. ఇది వినయంగాకపోతే మరేమిటి?

3. నరుని శక్తి అతన్ని గర్వాత్ముణ్ణి చేస్తుంది. కాని ఆత్మశక్తి ఆ యాత్మను వినయాత్ముణ్ణి చేస్తుంది. ఆత్ముడు వినయవంతుడు ఐనట్లుగానే అతడు వసించే భక్తులుకూడ వినయంగానే వుంటారు. ఎప్పుడుకూడ నరుల్లో వినయం గొప్పతనానికీ దైవసాన్నిధ్యానికీ గురుతు.

తండ్రి తాను చేసిన సృష్టితో ఐక్యమౌతుంటాడు. ఇది తండ్రి వినయం. కుమారుడు దైవస్వభావం కలవాడు. ఐనా తన్ను తాను రిక్తునిచేసికొని దాసుడై మానువునికి పోలికగా జన్మించాడు – ఫిలి 2,8. ఇది కుమారుని వినయం. పరిశుద్ధ రచయితలచే బైబులునంతటినీ వ్రాయించింది పవిత్రాత్మ. కాని ఆ యాత్మ ఈ గ్రంథంలో తన్ను గూర్చి తాను ఎక్కడా, ఏమీ స్పష్టంగా చెప్పించుకోలేదు. ఇది ఆత్మ వినయం. ఈ దైవవ్యక్తులనుజూచి గర్వాత్ముడైన నరుడు వినయాన్ని అలవర్చుకోవాలి. దేవునికి వినయం తగినట్లే నరునికి గర్వం తగుతుంది కాబోలు!

## ప్రార్థనా భావాలు

1. ఇరెనేయస్ భక్తుడు ఈలా వాకొన్నాడు. పిండిని నీటితో తడపందే ముద్దకాదు. అలాగే ఆత్మ అనుగ్రహం లేందే మనం ఒకరితో ఒకరం ఐక్యంగాలేం. ఇంకా, ఎండిన నేలగాని నీరులేని చెట్టుగాని ఫలించవు. వీటికి నీరు పెడితే ఫలిస్తాయి. అలాగే ఆత్మ అనుగ్రహం వుంటేనేగాని మనం కూడ ఫలించం.

2. ఎఫ్రేము భక్తుడు ఆత్మను అగ్నితో వుపమిస్తూ ఈలా వ్రాసాడు.

మరియమాత గర్భంలో అగ్నీ ఆత్మా వున్నారు
మనం పొందే జ్ఞానస్నానంలో అగ్నీ ఆత్మా వున్నారు
మనం స్వీకరించే సత్రప్రసాదంలో అగ్నీ ఆత్మా వున్నారు
రొట్టెలో వున్న ఆత్మను మనం భుజించలేం
ద్రాక్షరసంలో వున్న అగ్నిని మనం త్రాగలేం
మన పెదవులు స్వీకరించే ఈ యప్పరసాలు
అద్భుత వస్తువులు అనుకోవాలి.

# 32. తల్లిగా ఆత్మ

1. దేవునికి తండ్రి అని పేరు. క్రీస్తుకి కుమారుడని పేరు. కాని ఆత్మకు ఏ పేరూ లేదు. తండ్రి కుమారులకు లాగ అతనికి ఏ సంబంధమూ లేదు. దేవుడు నరుణ్ణి తనకు పోలికగా చేసాడు. ఈ నరుడు స్త్రీ పురుషులనుగా వుంటాడు. నరుళ్ళో స్త్రీత్వముంది కనుక అతనికి ఆదిరూపమైన భగవంతుళ్లో గూడ స్త్రీత్వముండి వుండాలి. ఈ స్త్రీత్వం, మాతృత్వం, పవిత్రాత్మలో గోచరిస్తుంది.

2. పవిత్రాత్మ మనలను దేవునికి బిడ్డలనుగా చేస్తుంది. కనుక ఈ యాత్మ తల్లిలాంటిది. ఓవిధంగా చెప్పాలంటే, ఆత్మ దేవునికి గర్భంలాంటిది. ఈ గర్భం నుండే మనం ఆధ్యాత్మికంగా జన్మిస్తాం.

శ్రీసభలో వాడుకలోవున్న రెండు సంకేతాలు ఆత్మ తల్లిలాంటిదని నిరూపిస్తాయి. మొదటిది, శ్రీసభను తల్లి అని వాకొంటాం. ఈ శ్రీసభలో ఆత్మ వసిస్తూంటుంది. మనం శ్రీసభ గర్భంనుండీ, ఆ సభలో వసించే ఆత్మ గర్భంనుండీ, బిడ్డల్లాగ జన్మిస్తాం. కనుక ఆత్మ మనకు తల్లి. రెండవది, మనం జ్ఞానస్నాన జలంనుండి ఆధ్యాత్మికంగా జన్మిస్తాం. జలం అన్ని ప్రాణులకు పుట్టుకనిచ్చే తల్లి. స్త్రీగర్భంకూడ జలమయంగానే వుంటుంది. దానిలోనే మనుష్య పిండం పెరుగుతుంది. ఇక, జ్ఞానస్నాన జలం ఆత్మకు చిహ్నం. కనుక మనం ఆత్మ అనే తల్లినుండి ఆధ్యాత్మికంగా జన్మిస్తాం.

3. బైబులు దేవుణ్ణి తల్లితో పోలుస్తుంది. యెషయా ఈలా వాకొన్నాడు.

"స్త్రీ తన పసికందును మరచిపోతుందా?
తన ప్రేవున పుట్టిన బిడ్డమీద
జాలిజూపకుండా వుంటుందా?
ఆమె తన శిశువును మరచిపోయినా

నేను మాత్రం మిమ్ము మరచిపోను" - 49,14-15.

"తల్లి కుమారునివలె నేను మిమ్ము ఓదారుస్తాను

యెరూషలేమున మిమ్ము ఓదారుస్తాను" - 66,13.

ఈ వాక్యాలు పేర్కొనే దైవమాతృత్వం పవిత్రాత్మకు బాగా వర్తిస్తుంది. జూల్యానా అనే భక్తురాలు 15వ శతాబ్దంలో ఇంగ్లండులోని నోర్విచ్‌లో జీవించింది. ఈమె తండ్రినీ క్రీస్తునీ తల్లి అనే పిల్చింది. కనుక దేవుడు తల్లి అనే భావం మన క్రైస్తవ సంప్రదాయంలో వుంది. పవిత్రాత్ముడే ఈ తల్లి.

ఆత్మనుగూర్చి మాట్లాడేపుడు ఈయబడ్డం, వరం, ప్రేమ అనే మూడు పదాలు వాడతాం. ఆత్మ మనకు దేవునిచే ఈయబడింది. మూడవవ్యక్తి వరమూ ప్రేమా కూడ. ఇక, ఈ మూడు పదాలు తల్లికిగూడ వర్తిస్తాయి. తల్లి శిశువుకి ఈయబడుతుంది. తల్లి శిశువుకి వరంగాను ప్రేమగాను వుంటుంది. కనుక ఆత్మకూడ తల్లి లాంటిది అనుకోవాలి. ప్రాచీన క్రైస్తవులు ఆత్మను తల్లిగానే భావించారు.

4. ఆత్మ మనపట్ల నిత్యమూ తల్లిలాగే మెలుగుతుంది. తల్లి బిడ్డను పాలతో పెంచుతుంది. ఆత్మకూడ మనలను వాక్యమనే పాలతో పెంచుతుంది - 1పేత్రు 2,2. ఆత్మ మనచే మన తండ్రియైన దేవుణ్ణి నాన్నా అని పిలుస్తుంది - గల 4,6. మనం క్రీస్తుని దేవుణ్ణిగా విశ్వసించేలా చేస్తుంది - 1కొ 12,3. తోడి నరులపట్ల ప్రేమభావం జూపి వారిని సోదరీ సోదరులనుగా అంగీకరించేలా చేస్తుంది - గల 5,22. ఓ తల్లిలా చిన్నబిడ్డలమైన మనకు ప్రార్థనం నేర్పుతుంది - రోమా 8,26. భౌతికరంగంలో తల్లి బిడ్డకు ఎన్ని సేవలు చేస్తుందో ఆధ్యాత్మిక రంగంలో ఆత్మ మనకు అన్ని సేవలు చేస్తుంది.

5. క్రీస్తు శిష్యులను విడనాడి వెళ్ళిపోకముందు వారికి ఆత్మ, మరియమాత అనే రెండు వరాలు దయచేసాడు. ఈ యాత్మా మరియమాతా కలసే పనిచేస్తుంటారు. మరియ ఆత్మశక్తితోనే గర్భవతి ఐంది. మరియమాత గర్భాన్ని ఫలభరితం చేసింది ఆత్మే. దేవుడు ఆత్మ అనే గర్భంనుండి తన కుమారుడు జన్మించేలా చేసాడు. పవిత్రాత్మ క్రీస్తు జన్మించినపుడు తల్లిగా వ్యవహరించింది. అలాగే మనం ఆధ్యాత్మికంగా జన్మించేపుడుగూడ తల్లిగా వ్యవహరిస్తుంది.

6. ఆత్మ తల్లి లాంటిదని చెప్పాం. కనుక తల్లిలాగే శ్రీసభలో నెలకొని వుంటుంది. తల్లిలాగే ఆ సభను నడిపిస్తూంటుంది. ఆత్మ శ్రీసభలో ఓ అధికారిలాగ పెత్తనం చెలాయించదు. ఓ తల్లిలాగ వినయంతో, ప్రేమతో సేవలు చేస్తుంది - మత్త 20,25-28.

శ్రీసభ సభ్యుల్లో పురుషులూ వున్నారు, స్త్రీలూ వున్నారు. పురుషులు శిరస్సయిన క్రీస్తుకి, అనగా నాయకుడైన క్రీస్తుకి పోలికగా వుంటారు. స్త్రీలు తల్లియైన ఆత్మకు పోలికగా వుంటారు. ఆ యాత్మలోలాగే స్త్రీలలోగూడ ప్రేమ, సేవ ప్రచురంగా కన్పిస్తాయి. ఇంకా, స్త్రీలు మరియమాతకూ శ్రీసభకూగూడ పోలికగా వుంటారు. ఈలా ఆత్మను తలపింపజేసే స్త్రీలకు శ్రీసభలో ఎక్కువ ప్రాముఖ్యముండాలి. పురుషులు వాళ్ళ వరాలను అణచివేయకూడదు. వాళ్ళ సేవలను అధికంగా వినియోగించుకోవాలి. మామూలుగా మన క్యాతలిక్ సమాజంలో స్త్రీలకు మతవిషయాల్లో స్థానం వుండదు. వేదవ్యాపక కృషిలో వాళ్ళు తోడ్పడరు. మనం వాళ్ళకు అధికంగా తర్ఫీదునిచ్చి ఎన్నో బాధ్యతలు ఒప్పజెప్పాలి.

7. ఆత్మ తల్లికి పోలికగా వుంటుంది. కనుక తల్లి బిడ్డలను ఎంత ప్రేమతో సాకుతుందో ఆత్మ మనలను అంత ప్రేమతో సాకుతుంది. బిడ్డలు తల్లి దగ్గరికి ఇష్టంతో వెళ్తారు. కష్టసుఖాల్లో తల్లిని ఆశ్రయిస్తారు. అలాగే మనంకూడ ప్రీతితో ఆత్మ దగ్గరికి వెళ్ళాలి. ఆ యాత్మపట్ల భక్తిని అలవర్చుకోవాలి. మన కష్టాల్లో ఆ దివ్యవ్యక్తి సహాయం అడుగుకోవాలి. సుఖాల్లో అతనికి వందనాలు అర్పించుకోవాలి. ఆత్మపట్ల మనకు గాఢమైన చనువూ పరిచయమూ వుండాలి.

కాని చాలమంది క్రైస్తవుల జీవితం దీనికి భిన్నంగా వుంటుంది. ఆత్మను నిజంగా అనుభవానికి తెచ్చుకొన్నవాళ్లు అరుదు. రోజువారి జీవితంలో ఆత్మచే నడిపింపబడేవాళ్ళు ఇంకా అరుదు. కాని పౌలు దేవుని బిడ్డలు దేవుని ఆత్మచే నడిపింపబడతారు అని చెప్పాడు - రోమా 2,14. అసలు మన క్రైస్తవులకు చాలమందికి పునీతులపట్ల వుండే భక్తికూడ ఆత్మపట్ల వుండదు. ఇది శోచనీయం. ఆత్మ త్రీత్వంలో మూడవ దైవవ్యక్తి. అతడు అనుగ్రహించకపోతే ఎవరూ క్రీస్తు దగ్గరికి రాలేరు. అతనికిగాకపోతే మరెవరికి భక్తి జూపుతాం?

తల్లి దగ్గరికిపోని బిడ్డకి తల్లి యేలా అనుభవానికి వస్తుంది? ఆత్మ దగ్గరికిపోని క్రైస్తవునికి ఆత్మ యేలా అనుభవానికి వస్తుంది? లౌకికరంగంలో తల్లిలేని బిడ్డడికి ఎంత కొరతో ఆధ్యాత్మికరంగంలో ఆత్మలేని బిడ్డడకి అంత కొరత. కనుక ఆత్మపట్ల అధికాధికంగా భక్తిని పెంపొందించుకొందాం.

## ప్రార్థనా భావాలు

1. అఫ్రాటిస్ అనే సిరియా భక్తుడు ఆత్మను తల్లితో పోలుస్తూ ఈలా చెప్పాడు. "అవివాహితుడైన క్రైస్తవ సన్యాసికి దేవుడే తండ్రి, ఆత్మమే తల్లి. అతనికి వేరే ప్రేమలు ఏవీలేవు."

2. ఇరెనేయస్ భక్తుడు "బ్రతికివున్న నరుణ్ణి దేవుని తేజస్సు అనాలి. నరుని జీవితానికి సాఫల్యం దేవుణ్ణి దర్శించడమే" అని వ్రాసాడు. ఇక్కడ ఈ భక్తుడు పేర్కొన్న దేవుని తేజస్సు ఆత్మ ప్రభావమే. ఆత్మశక్తితోనే మనం దేవుణ్ణి దర్శిస్తాం.

# 33. ఆత్మకు బదులుగా ముగ్గురు

1. క్యాతలిక్ సమాజానికి చెందిన మనం ఆత్మను తరచుగా మరచిపోతూంటాం. మన ప్రార్థనల్లో భక్తికృత్యాల్లో, మతాచరణంలో ఆత్మను అట్టే పట్టించుకోం. ఇది పొరపాటు. క్యాతలిక్కులమైన మనం ఆత్మను విస్మరించి ఆత్మకు బదులుగా మూడంశాల్లో శ్రద్ధాభక్తులు చూపిస్తూంటాం. అవి సత్ప్రసాదం, పోపుగారు, మరియమాత. ఈ మూడంశాలను క్రమంగా పరిశీలిద్దాం.

మామూలుగా మనకు దివ్యసత్ప్రసాదంపట్ల అపారభక్తి వుంటుంది. ఉండవలసిందే. అది ప్రభువు ప్రేమ చిహ్నం. కాని పొరపాటేమిటంటే, దివ్యసత్ప్రసాదంలో క్రీస్తుని మాత్రమే గుర్తిస్తాం. దానిలో క్రీస్తుబలీ శరీరమూ సాన్నిధ్యమూ మాత్రమే గమనిస్తాం. కాని అప్పరసాలు క్రీస్తు శరీరరక్తాలుగా ఏలా మారాయి? పవిత్రాత్మ వేంచేయడంవల్లనే కదా! అన్ని సంస్కారాలతోపాటు దీనిలో గూడ ఆత్మే పనిచేస్తుంది. ఆత్మ ఆవాహనంవల్లనే రొట్టెరసాలు క్రీస్తు శరీరరక్తాలవుతాయి. కనుక దివ్యసత్ప్రసాదంలో క్రీస్తుతోపాటు ఆత్మసాన్నిధ్యాన్ని గూడ గుర్తించాలి. క్రీస్తుని ఆరాధించినట్లే ఆత్మనుకూడ ఆరాధించాలి. దివ్యసత్ప్రసాద భక్తి ఆత్మను విస్మరించేలా చేయకూడదు.

2. పోపుగారిపట్ల మనకు విశేష గౌరవాదరాలు వుంటాయి. ఉండవలసిందే. ప్రోటస్టెంట్లు పోపుగారి అధికారాన్ని గుర్తించరు. ఈ లోటును భర్తీచేయడానికో అన్నట్లు మనం పరిశుద్ధ తండ్రిగారిని అధికంగా గౌరవిస్తూంటాం. మంచిదే. పోపుగారు శ్రీసభలో ఐక్యతకు చిహ్నంగా వుంటారు. క్రైస్తవులంతా ఒకే విశ్వాసాన్ని ప్రదర్శిస్తూ ఒకే నాయకుణ్ణి అనుసరిస్తున్నారు అనడానికి గురుతుగా వుంటారు. కాని క్రైస్తవుల ఐక్యతకు పోపుగారికంటెగూడ ముఖ్యమైన కారణం పవిత్రాత్మ. ఆత్మ అనుగ్రహంవల్లనే క్రైస్తవులు ఎన్నిదేశాల వాళ్ళయినా, ఎన్ని జాతులవాళ్ళయినా ఒక్క సమాజంగా కలసిమెలసి జీవించగల్గుతున్నారు. మన దేహంలోని అవయవాలన్నిటిని ఒక్కటిగా ఐక్యపరచేది మన ఆత్మ. అలాగే క్రైస్తవులందరినీ ఒక్కటిగా ఐక్యపరచేది పవిత్రాత్మ. కనుక మనం పోపుగారిపట్ల చూపే గౌరవాదారాలు ఆత్మను మరచిపోయేలా చేయకూడదు. పోపుగారిని పట్టించుకొంటే చాలు, ఆత్మను విస్మరించినా పరవాలేదులే అనిపించేలా చేయకూడదు.

3. మనం దేవమాతపట్ల అధిక భక్తిని చూపిస్తాం. చూపించవలసిందే. ప్రోటస్టెంట్ల దృష్టిలో క్రీస్తువేరు దేవమాత వేరు. క్రీస్తు దేవుడు, మరియమాత కేవలం సామాన్య వ్యక్తి. క్రీస్తుని ఆరాధించాలి, మరియను పట్టించుకోకపోయినా పరవాలేదు. కాని మన దృష్టిలో క్రీస్తూ మరియా ఎప్పుడూ కలసే వుంటారు. వాళ్ళిద్దరిపట్లా తప్పకుండా భక్తి చూపించవలసిందే. కాని ఈ భక్తి మరియ చాలు, పవిత్రాత్మను స్మరించకపోయినా పరవాలేదులే అనిపించేలా చేయకూడదు. ఇది పెద్దపొరపాటు.

చారిత్రకంగాజూస్తే, ఇప్పుడు మనం మరియమాతకు చేసే ప్రార్థనలు మొదట ఆత్మకు చెందినవి. ఆమెను మంచి ఆలోచనయొక్కమాత, వివేకంగల కన్యక, జ్ఞానంయొక్క ఆలయం, దేవరహస్యంగల రోజాపుష్పం అని సంబోధిస్తాం. కాని ఈ సంబోధనలు ప్రాచీనకాలంలో పవిత్రాత్మకు వర్తించేవి. మరియమాత శ్రీసభకు ఆత్మలాంటిదీ, క్రీస్తుతోపాటు ఆమె సాన్నిధ్యంగూడ మనతో వుంటుందనీ భావిస్తాం. కాని ఈ రెండుభావాలు ప్రాచీనకాలంలో పవిత్రాత్మకు వర్తించేవి. ప్రోటస్టెంటులు పవిత్రాత్మకు ఆరోపించే విషయాలు మనం మరియకు ఆరోపిస్తుంటాం.

మరియను పవిత్రపరచింది పరిశుద్ధాత్మ. ఆమె గర్భంలో క్రీస్తు శిశువు నెలకొనేలా చేసింది ఆత్మ. ఆత్మ అనుగ్రహంవల్లనే ఆమె దేవమాత, వరప్రసాదాలమాత ఐంది. మరియపట్ల తప్పకుండా భక్తి చూపవలసిందే. కాని ఈ భక్తి మనం ఆత్మను మరచిపోయేలా చేయకూడదు. ఆత్మకు బదులుగా మరియమాతవుంది చాలులే అనిపించేలా చేయకూడదు.

## ప్రార్థనా భావాలు

1. ఇల్డెఫోన్సుస్ అనే భక్తుడు మరియమాత నుద్దేశించి ఈలా ప్రార్థించాడు. "అమ్మా! నీవు పవిత్రాత్మ ద్వారా క్రీస్తుని నీ గర్భంలో ధరించావు. ఆ యాత్మ ద్వారా నేనుకూడ క్రీస్తుని నా హృదయంలో ధరించేలా చేయి. ఆత్మద్వారా నీవు క్రీస్తుని ప్రేమించావు. ఆరాధించావు. ఆ యాత్మద్వారానే నేనుకూడ క్రీస్తుని ఆరాధించి ప్రేమించేలా చేయి. ఆత్మ ఆనాడు నీయందు నిర్వహించిన పవిత్రకార్యాలను నేడు మాయందును కొనసాగించుగాక."

# 34. మన బాధ్యతలు

1. ఆత్మపట్ల మన బాధ్యతలు ఏలా వుండాలి? పౌలు పవిత్రాత్మను విచారంలో ముంచకండి అన్నాడు - ఎఫె 4,30. మనం పాపం చేసినపుడెల్లా ఆ యాత్మను దుఃఖపెడతాం. కనుక భక్తుడు పాపానికి దూరంగా వుండాలి. ఒకవేళ పాపంలోపడితే వెంటనే పశ్చాత్తాపపడి హృదయశుద్ధిని పొందాలి. ఇంకా, పౌలు ఆత్మను ఆర్పివేయకండి

అన్నాడు - 1తెస్స 5,19. మనం చాలసార్లు ఆత్మప్రబోధం వినం. ఆత్మకు ద్రోహంగా పాపంచేస్తాం. అలాంటప్పుడు మన హృదయంలో వెలిగే ఆత్మను దీపాన్నిలాగ ఆర్పివేస్తాం. ఇంకా, స్తెఫను యూదులతో వాదిస్తూ పవిత్రాత్మను ఎదిరించవద్దని చెప్పాడు - అచ 7,51. ఆత్మ కలిగించే మంచి ఆలోచనలను బుద్ధిపూర్వకంగా తిరస్కరించి పాడుపనులు చేసినపుడెల్లా ఆత్మను ఎదిరిస్తుంటాం.

2. ఆత్మచేసే ప్రధానకార్యం, క్రీస్తుని మన చెంతకు తీసికొనిరావడం, మనలను క్రీస్తు చెంతకు తీసికొనిపోవడం, ఆ ప్రభువుపట్ల మనకు విశ్వాసం పుట్టించడం. ఆత్మ అనుగ్రహించందే యెవడుకూడ యేసే ప్రభువని చెప్పలేడు -1కొ 12,3. అనగా ఆత్మ అనుగ్రహించందే ఎవడుకూడ యేసే దేవుడని విశ్వసించలేడు. కనుక ప్రభువుని పరిపూర్ణంగా విశ్వసించి నిండుహృదయంతో ప్రేమించే భాగ్యాన్ని దయచేయమని ఆత్మను అడుగుకొందాం.

## ప్రార్థనా భావాలు

1. యెరూషలేం సిరిల్ భక్తుడు ఈలా వ్రాసాడు. "పవిత్రాత్మ దయ్యాలుకూడ ఆత్మలే. కాని ఈ రెండురకాల ఆత్మలూ మనమీద పనిచేసే తీరుమాత్రం భిన్నంగా వుంటుంది. తోడేలు గొర్రెమీదికిలాగ పిశాచం నరుని మీదికి దూకుతుంది. నరుని పీడించి బాధించి నాశంజేస్తుంది. దయ్యం నరునికి సహజశత్రువు కనుక అది అతనిపట్ల బహుక్రూరంగా ప్రవర్తిస్తుంది. దీనికి భిన్నంగా పవిత్రాత్ముడు చాల మృదువుగా నరునిమీదికి దిగివస్తాడు. ఆ యాత్మ రాకముందే మన హృదయంలో ఓ విధమైన వెలుగూ జ్ఞానమూ జనిస్తాయి. పవిత్రాత్ముడు దయాపూర్వకంగా మన మీదికి దిగివస్తాడు. అతడు వచ్చేది మనలను కాపాడ్డానికి, బలపరచడానికి, హెచ్చరించడానికి, మనకు బోధ చేయడానికి, వెలుగును దయచేయడానికి. చీకటిలో వున్నవాడు సూర్యకాంతిని చూడగానే ఉత్తేజం పొందుతాడు. చీకటిలో వున్నపుడు కన్పించని వస్తువులను చూస్తాడు. అలాగే ఆత్మను పొందినవాడుకూడ మనసులో ఉత్తేజాన్ని పొంది సామాన్య జనులు చూడలేని వస్తువులను చూస్తాడు. నరులకు తెలియని రహస్యాలను గ్రహిస్తాడు. అతనిదేహం భూమిమీదనే వున్నా ఆత్మమాత్రం మోక్షంలో వుంటుంది."

2. నాసియాన్సన్ గ్రెగోరి భక్తుడు ఈలా చెప్పాడు. మొదట పవిత్రాత్మ దేవదూతల్లో పనిచేసి వారికి తేజస్సునీ పాపం చేయకుండా వుండేశక్తినీ ప్రసాదించింది. తరువాత పితరుల్లో పనిచేసి వారికి దేవుణ్ణి తెలిసికొనే శక్తిని దయచేసింది. ఆ పిమ్మట ప్రవక్తల్లో పనిచేసి వారికి మెస్సీయాను గూర్చిన భవిష్యత్ జ్ఞానాన్ని ఇచ్చింది.

అటుపిమ్మట అపోస్తలుల్లోకి ప్రవేశించి వారికి మూడువిధాలుగా ఉపయోగపడింది. మొదటిది, క్రీస్తు ఉత్థానానికి ముందు వాళ్ళకు అద్భుతాలు చేసే శక్తి నిచ్చింది. ఈ దశలో వాళ్ళు ఆత్మను సరిగా గుర్తించలేదు. రెండవది, క్రీస్తు ఉత్థానానంతరం వారిపై శ్వాసగా వేంచేసివచ్చింది. ఈ దశలో వాళ్లు ఆత్మను ఒక పాటిగా గుర్తించారు. మూడవది, క్రీస్తు మోక్షారోహణానంతరం పెంతెకోస్తు దినాన వారిమీదికి దిగివచ్చింది. ఈ దశలో ఆత్మ ఒక వ్యక్తిగా వారిలో వుండిపోయింది. ఈ దశలో అపోస్తలులు ఆత్మను స్పష్టంగా గుర్తించారు."

3. పై గ్రిగోరీ భక్తుడే ఇంకా యిలా చెప్పాడు. ఆత్మ మనకు నూత్న జన్మనిస్తుంది. మనలోని చీకట్లను తొలగించి మనకు వెలుగును ప్రసాదిస్తుంది. ఆత్మడు మహాజ్ఞాని, మహా ప్రేమమూర్తి. అతడు పూర్వం ఒక కాపరిలో ప్రవేశించి అతన్ని రాజునీ, కీర్తనకారుణ్ణీ చేసాడు. అత్తిచెట్లను పెంచే మరో కాపరిలో ప్రవేశించి అతన్ని ప్రవక్తను చేసాడు. ఒక బాలునిలో ప్రవేశించి అతన్ని న్యాయమూర్తిని చేసాడు. బెస్తల్లో ప్రవేశించి వారిచే క్రీస్తనే వలలో నరులను చేపల్లా పట్టించాడు. దైవరాజ్యాసక్తిగల వేదహింసకునిలో ప్రవేశించి అతన్ని పౌలునిగా మార్చివేసాడు. నేడు ఆ యాత్మణ్ణి మనంకూడ అనుభవానికి తెచ్చుకొందుముగాక."

# 35. కొన్ని ప్రార్థనలు

1. పరమపితా! నీ యాత్మను మా హృదయాల్లోకి పంపు. అతడు ప్రేరేపించి వ్రాయించిన బైబులు గ్రంథాన్ని మేము అర్థంచేసికొనేలా చేయి. ఆ గ్రంథానికి మేము వివరణం చెప్పేపుడు నీయాత్మ వుద్దేశించిన భావాలను మాత్రమే తెలియజేప్పేలా అనుగ్రహించు. మా బోధలు వినే ప్రజలందరు సత్ఫలితాన్ని పొందేలా దయచేయి – సెరాపియన్ భక్తుడు.

2. బాధితులకు ఓదార్పునొసగే ఆత్మమా! వేంచేయి. మా దుష్టచేష్టలను సవరించి మా గాయాలను మాన్పే దైవవ్యక్తీ! దిగిరా. గర్వితులను అణచివేసి వినయాత్ములను ప్రోత్సహించే దివ్యశక్తీ! దిగిరా. బలహీనులకు బలమును, పడిపోయినవారిని లేవనెత్తేవాడివైన ఆత్మమా! విచ్చేయి. అనాథులకు తండ్రివి, పేదలకు ఆశామూర్తివి, నావికులకు నక్షత్రానివి, ఓడ మునిగినవారికి రేవువైన మూడవవ్యక్తీ! వేంచేయి. ఆత్మలలో అతి పవిత్రుడవైన తండ్రీ! నామీదికి వేంచేసి నన్ను కరుణించు. నన్నుగూడ నీలాంటివాణ్ణిగా తయారుచేయి – షేకాంప్.

3. దివ్యజ్యోతీ వేంచేయి. నిత్యజీవమూ దిగిరా. దాగియున్న దైవరహస్యమా విచ్చేయి. పేరులేని నిధీ రా. అనిర్వచనీయమైన భాగ్యమా దయచేయి. నరులు ఊహింపలేని దివ్యవ్యక్తీ దిగిరా. అనంతానందమా వేంచేయి. ఆరిపోని వెలుగా వేంచేయి. రక్షణం పొందేవారి ఆశా విచ్చేయి. నిద్రించేవారిని లేపే దివ్యశక్తీ దిగిరా. చనిపోయినవారికి ఉత్థానమా రా. నీవు సోకినవారినెల్ల మార్చివేసే మహాశక్తీ దిగిరా. సృష్టికర్తా దిగిరా. మేము చూడలేని, తాకలేని, గ్రహింపలేని శక్తీ దయచేయి. నీవు కదలకుండానే మమ్ము కదిలించే శక్తీ రా. స్వర్గంనుండి దిగివచ్చి చీకటిలోవున్న మమ్ము దర్శించే ప్రభువా విచ్చేయి. అందరు ప్రీతితో ఉచ్చరించే దివ్యనామమా దిగిరా. శాశ్వతానందమా, నాశంగాని కిరీటమా దయచేయి. మారాజైన దేవుడు ధరించే నీలలోహిత వస్త్రమా విచ్చేయి. రత్నాలు పొదిగిన స్ఫటికపు వడ్డాణమా దిగిరా. గంధపు పరిమళమా విచ్చేయి. దేవుని కుడిపార్శ్వాన ఆసీనుడవైయున్న ప్రభువా దిగిరా. నా నికృష్టపు ఆత్మ సదా ఆశించే దేవా రా. వంటరిగా వుండేవాళ్ళకు ఉపశమనమా విచ్చేయి. హృదయంలోని కోరికవై నేను నిరంతరం కోరుకొనే భాగ్యమూర్తీ దయచేయి. నా వూపిరీ జీవమూ ఐన ప్రభూ వేంచేయి. నా ఆత్మకు శాంతీ ఆనందమూ కిరీటమూ మహిమా ఐన ప్రభూ విచ్చేయి - నూత్న వేదాంతి సిమియోను.

# ప్రశ్నలు

## 1. దేవుని ఆత్మ

1. ఆత్మ నామాలనూ, సంకేతాలనూ తెలియజేయండి.
2. పూర్వవేదంలో ఆత్మ దేవుని క్రియాశక్తిగా మాత్రమే కన్పిస్తుంది. నూత్నవేదంలో అతడు ఓ వ్యక్తిగా కన్పిస్తాడు - వివరించండి.
3. ఆత్మ యేలా దేవుని క్రియాశక్తి ఔతుందో వివరించండి.
4. ఆత్ముడు పవిత్రాత్ముడు ఎలా అయ్యాడు?
5. ఆత్మ మనకు ప్రేమశక్తిని ఏలా దయచేస్తుంది?
6. ఆత్మ మనకు జీవాన్ని ఏలా అందిస్తుంది? నీరు ఆత్మకు ఎందుకు చిహ్నామైంది?
7. పూర్వనూత్నవేదాల్లోని రక్షణచరిత్రను నడిపించేది ఆత్మేనని నిరూపించండి.
8. ఆత్మ కడపటి దినాల్లో దేవుడు మనకిచ్చే దానమని నిరూపించండి.

## 2. క్రీస్తుని ఆత్మ

9. క్రీస్తుకీ ఆత్మకూ గల సంబంధాన్ని తెలియజేయండి
10. దేవుడు మూడు దశల్లో తన్ను గూర్చి తాను మనకు తెలియజేసికొన్నాడు - వివరించండి.

11. క్రీస్తు ఆత్మతో నిండినవాడని నిరూపించండి.
12. ఉత్థానక్రీస్తు మనకు ఆత్మను ఏలా యిస్తాడు?
13. ఆత్మ క్రీస్తుకి ఏలా సాక్ష్యం పలుకుతుంది?
14. ఆత్మ మరియను ఏలా నడిపించింది?

## 3. తిరుసభలో ఆత్మ

15. క్రీస్తుతోపాటు ఆత్మడుకూడ తిరుసభను స్థాపించాడు - వివరించండి.
16. ఆత్మ మనలను క్రీస్తుతో ఏలా ఐక్యం చేస్తుంది?
17. దివ్యవ్యక్తి మనలో దేవుని పోలికను ఏలా కలిగిస్తాడు?
18. ఆత్మ మనకు దైవపుత్రత్వాన్ని ఒసగే తీరును తెలియజేయండి.
19. ఆత్మ మనలను ప్రేషిత సేవకు ఏలా పురికొల్పుతుంది?
20. ఆత్మ మనచే ఏలా ప్రవచనం చెప్పిస్తుంది?
21. ఏ మూడు దేవద్రవ్యానుమానాలైనా తీసికొని ఆత్మ వాటిల్లో పనిచేసే తీరును వివరించండి.
22. మన నైతిక జీవితానికి కర్త ఆత్మే - వివరించండి.
23. ఆత్మద్వారా మనం శారీరక వాంఛలను ఏలా జయిస్తాం?
24. దైవవ్యక్తి మనకు పాపపరిహారాన్ని ఏలా దయచేస్తాడు?
25. ఆత్మ మనచే ఏలా ప్రార్థన చేయిస్తుంది?
26. ఆత్మ మనకు ప్రేమ, విశ్వాసం, నిరీక్షణం అనే దైవపుణ్యాలను ఏలా దయచేస్తుంది?
27. వేదవాక్యాన్ని అర్థంచేసికొనే శక్తిని ఆత్మ మనకు ఏలా దయచేస్తుంది?
28. ఆత్మ మనకు దయచేసే సప్త వరాలనూ సేవా వరాలనూ వివరించండి.
29. ఆత్మ ఫలాల్లో ఏ రెండిటినైనా తెలియజేయండి.
30. మన శ్రమల్లో మరణంలో ఆత్మ ఏలా ప్రత్యక్షమై వుంటుందో తెలపండి.
31. ఆత్మకుండే వినయం అంతా యింతా కాదు - వివరించండి.
32. ఆత్మ మనపట్ల ఏలా తల్లిగా మెలుగుతుందో తెలుపండి.
33. సత్ప్రసాదం, పోపుగారు, మరియమాత - ఈ ముగ్గురు మనం పవిత్రాత్మను విస్మరించేలా చేయకూడదు - వివరించండి.
34. ఆత్మపట్ల మన బాధ్యతలు ఏమిటివి?

# 2. సప్తవరాలు

బైబులుభాష్యం 71-78

విషయసూచిక



## 1. సదుపదేశం

### 1. సదుపదేశం అంటే యేమిటి?

ఆత్మ మనకు దయచేసే వరాల్లో సదుపదేశం కూడ వొకటి. ఈ వరం ద్వారా కష్టమైన పరిస్థితులూ గడ్డుసమస్యలూ ఎదురైనపుడు మంచి నిర్ణయాలు చేసికొనే శక్తిని పొందుతాం. జీవితంలో బోలెడన్ని సమస్యలు ఎదురౌతూంటాయి. వాటి నేలా పరిష్కరించుకోవాలో, ఎలాంటి నిర్ణయాలు చేసికోవాలో మన కట్టే తెలియదు. ఆలాంటి పరిస్థితుల్లో ఈ వరం మనకు వెలుగుని ప్రసాదిస్తుంది. ఆత్మే మన హృదయంలో మాటలాడి సలహా చెప్తుంది. దానివల్ల మనం సమస్యను అర్థంచేసికొంటాం. తగిన నిర్ణయాలు చేసికొంటాం. కార్యాచరణకు పూనుకొంటాం.

ప్రభువు "మీరు న్యాయస్థానాలకు అప్పగింపపడినపుడు ఏవిధంగా మాట్లాడాలా, ఏమి చెప్పాలా అని కలత చెందకండి. ఆ సమయానికి తగినరీతిగా చెప్పవలసిందల్లా మీకు అనుగ్రహింపబడుతుంది. మీరు మాట్లాడే మాటలు మీవి కావు. మీ తండ్రి ఆత్మే మీ నోట మాట్లాడుతుంది" అన్నాడు - మత్త 10, 19. ఇక్కడ సందర్భం వేదహింసలు. ఐనా ఒక్క వేద హింసలు కాలంలోనే కాకుండ ఇతరావసరాల్లో కూడ ఆత్మ మనకు సలహా యిస్తూంటుంది.

పేత్రుకి ఆపత్కాలంలో ఈలాంటి సలహా లభించింది. క్రీస్తు ఉత్థానానంతరం శిష్యులు యెరూషలేములో బోధిస్తున్నారు. ఆబోధ వినేటప్పటికి యూదనాయకులకు కన్ను కుట్టింది. వాళ్ళు శిష్యులను చెరలో త్రోయించారు. క్రీస్తునిగూర్చి బోధింపవద్దని ఆజ్ఞాపించారు. అప్పుడు పేత్రు ఆత్మవల్ల ప్రబోధితుడై "మేము మీలాంటి మనుష్యులకు కాక దేవునికి విధేయులమై యుండాలి. మీరు క్రీస్తుని చంపారు. కాని తండ్రి అతన్ని రక్షకునిగా నియమించాడు. ఆ క్రీస్తుకి విధేయులైనవారికి పవిత్రాత్మ లభిస్తుంది" అని ప్రసంగించాడు - అచ 5,29-32

చాలమంది అర్చ్యశిష్టుల జీవితాల్లో ఈ సదుపదేశం అనే వరం ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. ఆంటోనైనస్ అనే భక్తునికి ఈ వరప్రసాదం మిక్కుటంగా వుండేది. ఆనాటి సామాన్య ప్రజలూ రాజకీయ నాయకులూ గూడ అతన్ని సలహా అడిగేవాళ్ళు. సియన్నాపురి కత్తరీనమ్మగారిలో ఈ వరం మెండుగా వుండేది. ఆమె యువతిగా వున్నపుడే, చదువు సంధ్యలు లేక పోయినప్పటికి, రాజకీయ నాయకులకీ కార్డినల్సుకీ ఆలోచన చెప్తుండేది. ఆనాటి పాపుగారికికూడ సలహాదారిణి అయింది. వీరవనితయైన ఆర్కుపురి జోన్‌గారికి ఈ వరం పుష్కలంగా వుండేది. ఆమె ఫ్రెంచి సైన్యాలకి నాయకత్వం వహించి యుద్ధ వ్యూహాలు పన్నేది. ఈ వ్యూహాలు శత్రుసైన్యాధిపతులకు దిగ్భ్రాంతి కలిగించేవి. "మీరు నరమాత్రులనుండి సలహాను పొందారు. నేను దేవుని ఆత్మనుండి సలహా పొందాను" అని తన విరోధులకు చెప్పింది జోన్.

## 2. ఈ వరంతో ఏమి యవసరం?

జీవితంలో బోలెడన్ని సమస్యలూ చిక్కులూ ఎదురౌతూంటాయి. ఆలాంటప్పుడు మామూలుగా తోడినరులను సలహా అడుగుతాం. మనం నమ్మినవాళ్ళనూ మన మిత్రులనూ సంప్రతిస్తాం. నరుల సలహా వలన లాభం కలుగుతుంది. కాని దేవుని సలహా వలన యింకా యెక్కువలాభం కలుగుతుంది. కనుక మనం పవిత్రాత్మను అడుగుకోవాలి.

కొన్ని పరిస్థితులు తీసికొందాం. మన యువతీయువకులు యుక్తవయస్సుకి వచ్చారు. వాళ్ళు గురుకన్యా జీవితాలే యెన్నుకోవాలో, లేక సంసార జీవితమే యెన్నుకోవాలో ఎలా తెలుస్తుంది? జీవితంలో మన అభిరుచులు ఒకవిధంగా ఉన్నాయి. ఉద్యోగావకాశాలు మరొక విధంగా ఉన్నాయి. అప్పుడేమి చేయాలి? ఒకోసారి కొన్ని సమస్యలకు రెండుమూడు పరిష్కార మార్గాలు గోచరిస్తాయి. వాటిల్లో దేన్ని యెన్నుకోవాలి? ఈలాంటి చిక్కులు జీవితాంతమూ వస్తూనే వుంటాయి. వాటిల్లో మనకు సలహా అవసరం. ఈ వరం ఇందుకొరకే వుద్దేశింపబడింది.

ఇంకా, ఒకోసారి యితరులు తమ సమస్యలతో వచ్చి మనలను సలహా అడుగుతారు. వాళ్ళకు మనం దురాలోచనగాదు, మంచి ఆలోచన చెప్పాలి. ఈ సామర్థ్యం మన కెక్కడనుండి వస్తుంది? ఈ వరంద్వారానే

జీవితంలో సిద్ధాంతంవేరు. ఆచరణంవేరు. ఉపాధ్యాయుడు బోధనా పద్ధతులను క్షుణ్ణంగా నేర్చుకొని వుండవచ్చు. కాని పిల్లలకు సరిగా పాఠాలు చెప్పలేకపోవచ్చు. వైద్యుడు వైద్యశాస్త్రాన్ని బాగా చదువుకొని ప్రథమ శ్రేణిలోనే ఉత్తీర్ణుడై యుండవచ్చు. కాని రోగులు వచ్చినపుడు వ్యాధినిర్ణయం చేయలేకపోవచ్చు, జబ్బును కుదర్చలేకపోవచ్చు. అందుకే యెప్పుడుకూడ సిద్ధాంతంవేరు ఆచరణంవేరు అని చెప్పాం. ఆత్మ సలహా అనే వరం ప్రధానంగా ఈ యాచరణం కొరకే ఉద్దేశింపబడింది.

ఈ వరంద్వారా మనం ఈ ప్రత్యేక పరిస్థితుల్లో, ఈ ప్రత్యేక సమస్యలో, ఏమిచేయాలో తెలిసికొంటాం. ఆత్మ నీవు ఇప్పుడు ఈలా చేయి అని మన అంతరాత్మలో చెప్తుంది. లోకంలో నరుడు నరునికి హితోపదేశం చేసినట్లుగానే ఆత్మకూడ మనకు హితోపదేశం చేస్తుంది. మన తరపున మనం ఆత్మ చెప్పినట్లుగా చేస్తే చాలు, సమస్యనుండి బయట పడతాం.

ఈ వరంద్వారా మనం దైవచిత్తం తెలిసికొంటాం. దేవుడు ఈ విషయంలో మనలను ఎటుపొమ్మంటున్నాడో, ఏమి చేయమంటున్నాడో గ్రహిస్తాం. ఒకమారు దైవచిత్తాన్ని గుర్తించాక ఇక మనం చేయవలసిన పనిని చేసికోవచ్చు. కాని మనకు తరచుగా దైవచిత్తమేమిటో అంతుబట్టదు. అప్పుడు ఈ వరం మనకు తోడ్పడి, మనపట్ల దేవుని యభిమతమేమిటో స్పష్టం చేస్తుంది. అందుచేత ఇది చాల ఉపయోగకరమైన వరమని చెప్పాలి.

ఈ వరమే లేకపోతే ఏమౌతుంది? మన ఆలోచనలు స్పష్టంగా వుండవు. తొందరపడి, గ్రుడ్డిగా నిర్ణయాలు చేసికొంటాం. అవి మనలను అపమార్గం పట్టిస్తాయి. కనుక మనం పొరపాట్లు చేస్తాం. ఓడ ఒకరేవుకు చేరబోయి మరొక రేవుకి చేరి కూర్చుంటుంది. ఈలాంటి అనర్థాలను వారించడానికే ఈ వరం ఉద్దేశింపబడింది.

## 3. ఆత్మ సలహాను ఏలా పొందాలి?

ఆత్మనుండి సలహాను పొందాలంటే ఆ యాత్మనే అడుగుకోవాలి. వినయంతోను నమ్మకంతోను వేడుకొనేవాళ్ళ మొర దేవుడు ఆలిస్తాడు. కనుకనే కీర్తనకారుడు "ప్రభూ! నీ మార్గాలను నాకు తెలియజేయి, నీ త్రోవలను నాకు ఎరుకపరచు" అని ప్రార్థించాడు – కీర్త 25, 4. మామూలుగా మనం ఉదయకాల ప్రార్థనలోనే ఏరోజు కారోజు ఆత్మ

సలహానీ సహాయాన్నీ అడుగుకోవడం మంచిది. మనం చేయబోయే ప్రతి ముఖ్యమైన కార్యంలోను, మన కెదురయ్యే ప్రతి చిక్కు సమస్యలోను వెలుగును ప్రసాదించమని కూడ ఆత్మను అడుగుకోవాలి.

ఈ సందర్భంలో భక్తులు దేవుణ్ణి సలహా అడగడాన్ని గూర్చి కొన్ని ఉదాహరణలు చూడ్డం మంచిది. రిబ్కా గర్భంలో ఇరువురు శిశువులున్నారు. వాళ్ళిద్దరూ ఒకరినొకరు గట్టిగా నెట్టుకొన్నారు. ఆమె కీడుని శంకించింది. ప్రభువు దగ్గరికివెళ్ళి సలహా అడిగింది. ప్రభువు "నీ గర్భంలో పరస్పర వైరంగల రెండు జాతులు యిమిడి వున్నాయి. పెద్దబిడ్డడు చిన్న బిడ్డడికి దాసుడౌతాడు" అని చెప్పాడు. ఆ బిడ్డలు ఏసావు యాకోబులు – ఆది 25, 22–23.

మోషే మహాభక్తుడు. అతడు చిక్కులెదురైనపుడల్లా ప్రభువుని సంప్రతించేవాడు. మస్సామెరిబాలవద్ద నీళ్ళు దొరకనందున ప్రజలు అతనిమీద తిరుగబడ్డారు. అతడు ప్రభువు ఉపదేశమడిగాడు. దేవుడు నీవు నదిని కొట్టిన కఱ్ఱతోనే కొండబండను చరవమని సలహా యిచ్చాడు. మోషే ఆలాగే చేయగా బండనుండి నీళ్ళు వెలువడ్డాయి. ఆ నీళ్ళు త్రాగి ప్రజలు సంతృప్తి చెందారు – నిర్గ 17, 4–6. ఇంకా, యీ మోషే ప్రభువు గుడారంలోకి వెళ్ళి అతనితో తన కష్టసుఖాలన్నీ చెప్పుకొనేవాడు. ఆ ప్రభువుని సలహా అడిగేవాడు. మిత్రుడు మిత్రునితో మాట్లాడినట్లే దేవుడతనితో ముఖాముఖి మాట్లాడేవాడు. తన చిత్తాన్ని అతనికి తెలియజేసేవాడు – నిర్గ 33,11.

దావీదు తాను శత్రువులతో యుద్ధాలు చేసేపుడల్లా ప్రభువుని సంప్రతించేవాడు. ఓమారు బాలు పెరాసీమువద్ద అతనికి ఫిలిస్త్రీయులతో పోరు తటస్థించింది. అతడు ప్రభువుతో మంత్రాలోచన చేయగా ప్రభువు శత్రువు మీదికి పొమ్మని సలహాయిచ్చాడు. ఆ సలహా ప్రకారమే దావీదు శత్రువుల మీదికి వెళ్లి వాళ్ళ నోడించాడు – 2 సమూ 5, 19.

"ప్రభుని ఒక్క వరం కోరుకొన్నాను
నాకు కావలసింది ఇదొక్కటే –
నా జీవితమంతా ప్రభు మందిరంలో వసించాలనీ
ఆయనను ప్రసన్నుణ్ణి చేసికోవాలనీ
దేవాలయంలో అతన్ని సంప్రతించి చూడాలనీ నా కోరిక"

అన్నాడు కీర్తనకారుడు. ఇతడు సమస్యల్లో ప్రభువు నుండి సలహా పొందాలని అభిలషించాడు – 27,4. ఈ భక్తుల్లాగే మనంకూడ కష్టసుఖాల్లో, ఆపదల్లో, అక్కరల్లో ఆత్మ సలహా అడుగుకోవాలి. అలా అడిగేవాళ్ళను ఆయాత్మ సరళమార్గాల్లో నడిపిస్తుంది. దేవుని బిడ్డలను దేవుని ఆత్మే నడిపిస్తుంది. – రోమా 8,14.

# 2. దైవభక్తి

## 1. దైవభక్తి అంటే యేమిటి?

దైవభక్తి అనే వరంవల్ల దేవుణ్ణి తండ్రిలా భావించి పూజిస్తాం. దేవునికి అంకితమైన వ్యక్తులనూ వస్తువులనూ గౌరవభావంతో చూస్తాం. ఈ వరంవల్ల ప్రార్థనం మొదలైన భక్తికృత్యాలను సంతోషంతో నిర్వహిస్తాం.

దేవుడు సృష్టికర్త కావడంవల్ల మనకు యజమానుడౌతాడు. కనుక అతన్ని సహజంగానే గౌరవిస్తాం. ఐతే ఈ వరంద్వారా ఆ ప్రభువుని తండ్రిలా భావించి పూజిస్తాం. అతన్ని నమ్ముతాం, ప్రేమిస్తాం. "మీరు దేవుని నుండి మిమ్ము భయకంపితులను చేసే బానిసపు ఆత్మను స్వీకరించలేదు. దత్తపుత్రత్వాన్నొసగే ఆత్మనే స్వీకరించారు. ఆ యాత్మద్వారా మనం దేవుణ్ణి అబ్బా - అనగా, నాన్నా అని పిలుస్తాం. ఆ యాత్మ మన ఆత్మతో ఏకమై మనం దేవునికి పుత్రులమని సాక్ష్యమిస్తుంది" - రోమా 8, 14-15. పవిత్రాత్మ మన హృదయాల్లో వుండి మనచేత దేవుణ్ణి నాన్నా అని పిలిపిస్తుంది. తాను మన హృదయాల్లో వుండి మనం దేవునికి బిడ్డలమని హెచ్చరిస్తూంటుంది. దేవునికీ మనకీ తండ్రీ బిడ్డల సంబంధం వుందని గుర్తించడమే ఈ వరంలోని ముఖ్యాంశం.

ఈ వరంద్వారా దేవునికి అంకితులైన పునీతులనూ పవిత్ర వస్తువులనూ గౌరవమర్యాదలతో చూస్తాం. 1. దేవమాత దేవునితల్లి, మనతల్లికూడ. దేవునికి సన్నిహితంగా వుండే వ్యక్తి కనుక ఆమెను గౌరవించి ప్రేమిస్తాం. 2. దేవుని మహిమను తమలో యిముడ్చుకొన్నవాళ్ళు కనుక అర్చ్యశిష్టులనూ సన్మనస్కులనూ గౌరవిస్తాం. 3. దివ్యగ్రంథం దేవుని వాక్కు. అతని ప్రేమభావాలను తెలియజేసేది. కనుక ఆ గ్రంథాన్ని పూజ్యభావంతో చూస్తాం. 4. తిరుసభ క్రీస్తు స్థాపించినది. క్రీస్తు పత్ని. మనకు జ్ఞానజీవాన్ని ప్రసాదించే తల్లి. దివ్యసత్ప్రసాదంలాంటి సంస్కారాలద్వారా మనలను పోషించే తల్లి. కనుక ఆ తల్లిని గౌరవిస్తాం. ఆమెపట్ల బిడ్డల్లా మెలుగుతూ విధేయత చూపుతాం. 5. తిరుసభ అధికారియైన పరిశుద్ధ పోపుగారు క్రీస్తు స్థానంలో వుండేవ్యక్తి. కనుక క్రీస్తుకిలాగే అతనికికూడ విధేయులమౌతాం. 6. తల్లిదండ్రులు ఉపాధ్యాయులు పెద్దలు మొదలైన వాళ్ళంతా దేవుని స్థానంలో వుండే వ్యక్తులు. కనుక వాళ్ళను గౌరవాదారాలతో చూస్తాం. దేవుడు ఎవరినైనా మన ఆధీనంలో వుంచితే వాళ్ళను తండ్రిలాగ ఆదరిస్తాం. దైవభక్తి ఇంత విస్తృతమైన వరం.

## 2. దైవభక్తితో ఏమి యవసరం?

దేవుణ్ణి ప్రేమభావంతో పూజించాలన్నా, పెద్దలకు విధేయత చూపాలన్నా, మన క్రిందివాళ్ళను అప్యాయంగా ఆదరించాలన్నా దైవభక్తి అవసరం. ఇదే లేకపోతే దేవుడు యజమానుడు, మనం బానిసలం అనుకొంటాం. అతడు తండ్రి మనం బిడ్డలం అనుకోం. పూర్వవేదపు దాస్యత్వంలోనే వుండిపోతాంగాని నూత్న వేదపు పుత్రత్వాన్ని పొందలేం - యోహా 15,15. ఇంకా, యీ వరమే లేకపోతే ప్రార్థనం విసుగు పుట్టిస్తుందేకాని ఊరట నీయదు. దేవుడు పంపే కష్టాలను శిక్షనుగా భావించి మొరపెడతామేగాని అవి మన మేలు కొరకే ఉద్దేశింపబడిన పరీక్షలని గ్రహించం. పైగా ఈ వరంవల్ల మనం సల్పే భక్తి కృత్యాలన్నీ మనకు సంతోషం కలిగిస్తాయి. మనం ఉత్సాహంతో ఆనందంతో దేవుణ్ణి కొలుస్తాం. గాలి అనుకూలంగా వీచినపుడు పడవ సులువుగా పయనిస్తుంది. అలాగే ఈ వరంవల్ల మన ఆధ్యాత్మిక జీవితం సుకరమౌతుంది.

గురువులకూ మఠకన్యలకూ ఎన్నో ఆధ్యాత్మిక అనుష్ఠానాలుంటాయి. ఆలాగే భక్తికల గృహస్థులకు కూడ. రోజురోజూ ఈ యధ్యాత్మిక కార్యాలన్నిటినీ చేసికొంటూ పోవాలంటే సహజంగానే విసుగుపుడుతుంది. ఆలాంటప్పుడు ఈ వరం మనకు తోడ్పడుతుంది. అది మన హృదయాల్లో ప్రేమజల్లుని కురిపిస్తుంది. ఈ ప్రేమవల్ల మనం దేవుణ్ణి అనురాగపు తండ్రిలా భావిస్తాం. అతని కోసం ఎంతసేవైనా చేయదానికి సంసిద్ధులమౌతాం. ఆగస్టీను భక్తుడు వాకొన్నట్లు "ప్రేమవున్నకాడ పని భారమనిపించదు. ఒకవేళ నని భారమనిపిస్తే, ఆ భారమైన పనినిగూడ ప్రేమిస్తాం".

ఇంకా వొకోసారి, మన అధీనంలోవున్న వాళ్ళల్లో కొందరంటే మనకు ఇష్టంగా వుండకపోవచ్చు. కనుక మనం వాళ్ళను అప్యాయంగా చూడకపోవచ్చు. అలాంటప్పుడు ఈ వరం మనమీద పనిచేసి మన అధీనంలో వున్నవాళ్ళనందరినీ మనం ప్రేమతో చూచేలా చేస్తుంది. మనం వాళ్ళల్లో క్రీస్తుని చూచేలా చేస్తుంది. పౌలు తన క్రైస్తవుల నుద్దేశించి "బిడ్డలారా! క్రీస్తు రూపం మీ యందు నెలకొనడానికిగాను, స్త్రీ ప్రసవవేదన ననుభవించినట్లే, నేనూ మిమ్ముగూర్చి బాధపడుతున్నాను" అన్నాడు- గల 4,19. ఈ వరంద్వారా మన క్రిందవుండే వాళ్లపట్ల మనకుకూడ ఈలాంటి ఆదరభావమే కలుగుతుంది.

## 3. ఈ వరాన్ని సాధించడం ఎలా?

ఈ వరంలోని ప్రధానాంశం దేవుణ్ణి తండ్రిగా భావించడం, అతన్ని ప్రేమతోను సంతోషంతోను పూజించడం అని చెప్పాం. దేవుణ్ణి తండ్రిగా అనుభవానికి తెచ్చుకోవాలంటే,

అతన్ని తండ్రిగా చిత్రించే వేదవాక్యాలను శ్రద్ధతో ధ్యానం చేసికోవాలి. కనుక ఆలాంటి వాక్యాలను కొన్నిటిని అవలోకిద్దాం.

అబ్రాహాము మమ్ము ఎరుగకపోయినా, యాకోబు మమ్ము అంగీకరింపకపోయినా, ప్రభూ! నీవే మాకు తండ్రివి. అనాది కాలంనుండే మా విమోచకుడవని నీకే పేరు - యెష 63, 16. ప్రభూ! నీవే మా తండ్రివి. మేము మట్టిమైతే నీవు కుమ్మరివి. నీవే మమ్ము చేసావు. 64,6. తల్లి తన ప్రేవున బుట్టిన బిడ్డను మరచిపోతుందా? తన శిశువుని ప్రేమించకుండా వుంటుందా? ఒకవేళ తల్లి తాను కనిన బిడ్డను మరచిపోతే పోతుందేమోకాని, నేను మాత్రం మిమ్ము మరచిపోను - 49, 15. తండ్రి తన కుమారులమీద కరుణ జూపినట్లే ప్రభువు తనకు భయపడేవాళ్ళమీద జాలి జూపుతాడు - కీర్త 103, 13. మా అమ్మా నాన్నా నన్ను విడనాడినా యావే నన్ను చేరదీస్తాడు - కీర్త 28,10. తండ్రి తన ప్రియ కుమారుని చక్కదిద్దినట్లే యావే తన కిష్టుడైన నరుణ్ణి శిక్షిస్తాడు - సామె 3,11-12.

పరలోకంలో వుండే మీ తండ్రికి మీ యక్కరలన్నీ తెలుసు - మత్త 6, 32. మీరెంత చెడ్డవారైనా మీ బిడ్డలకు మేలివస్తువుల నీయాలని మీకు తెలుసుకదా! పరలోకంలో వుండే మీ తండ్రి తన్నడిగినవారికి ఇంకా యెట్టి మేలి వస్తువుల నిస్తాడో ఊహించండి.

దేవుడు లోకాన్ని యెంతో ప్రేమించి తన ఏకైక కుమారుణ్ణి ప్రసాదించాడు. తన్ను విశ్వసించేవాళ్లు నాశమైపోకుండ నిత్యజీవాన్ని పొందడానికే అతడు అలా చేసాడు. - యోహా 3,16. నన్ను ప్రేమించేవాడు నామాట పాటిస్తాడు. అప్పుడు నా తండ్రి వాణ్ణి ప్రేమిస్తాడు. మేము వానియొద్దకు వచ్చి వానితో నివసిస్తాం - 14, 23. మనం దేవుని బిడ్డలమని పిలువబడుతున్నాం అంటే దేవుడు మనలను ఎంతగా ప్రేమించాడో ఊహించండి. ఔను, మనం నిజంగా దేవుని బిడ్డలమే - 1 యోహా 3,1. తండ్రిని ప్రేమించేవాడు ఆ తండ్రి బిడ్డలను గూడ ప్రేమించాలి-5,1.

ఈలాంటి వాక్యాలను ధ్యానించుకోవడంవల్ల భగవంతుడు తండ్రి అనే భావం బలపడుతుంది. దేవునికి ఎన్ని పేర్లున్నా, మనం అతన్ని ప్రధానంగా తండ్రిగా గుర్తించాలనే అతని కోరిక.మన తరపున మనం అతనిపట్ల బిడ్డల్లా మెలుగుతూండాలి. చనువుతో, చొరవతో అతని చెంతకు వెళ్ళి మన కష్టసుఖాల్లో అతన్ని శరణు వేడుతూండాలి. ఇక, దేవుణ్ణి తండ్రినిగా గుర్తించే భాగ్యాన్నీ, అతనిపట్ల బిడ్డల్లాగ మెలిగే మనస్తత్వాన్నీ, ఆత్మే మనకు దయచేస్తుంది. మనచేత భగవంతుణ్ణి నాన్నా అని పిలిపించడం ఆయాత్మకు ఎంతో యిష్టం.

# 3. దృఢత్వం

## 1. దృఢత్వం అంటే యేమిటి?

ఈవరం ద్వారా ఆటంకాలెదురైనా గూడ వెనుకాడకుండా నిర్భయంగాను సంతోషంగాను దేవుని కొరకు గొప్పకార్యాలు చేయడానికి పూనుకొంటాం. ఈవరం అనుమానాలు శంకలు భయాలు మొదలైనవాటిని పూర్తిగా తొలగించదు. కాని అది మనకు పట్టుదలనీ ఉత్సాహాన్నీ విజయాన్నీ సాధిస్తామనే నమ్మకాన్ని దయచేస్తుంది. ఈ గుణాలతో కృషిచేసి విజయాన్ని చేపడతాం. స్టెఫనుకు ఈ వరముండేది. అతడు దైవానుగ్రహంతోను శక్తితోను నిండినవాడై ప్రభువుకి సాక్ష్యం బలికాడు - అ.కా. 6,8. పేత్రుకి ఈ వరముండేది. అతడు తన్ను హింసించే సానేడ్రిన్ సభసభ్యులను లెక్కచేయకుండా, యేసు నామంమీదుగా దప్పితే మరొక నామంమీదుగా రక్షణంలేదని బోధించాడు - అ.చ. 4,12.

ఈ వరంవల్ల మనకు రెండు ఫలితాలు కలుగుతాయి. మొదటిది, కష్టమైన కార్యాలు సాధించడానికి పూనుకొంటాం. పౌలు, ఫ్రాన్సిస్ శౌరివారు మొదలైన భక్తులు ఈ వరంవల్లనే శ్రమలకు జంకకుండ వేలకొలది మైళ్ళు ప్రయాణం జేసి నానా తావుల్లో వేదబోధ చేసారు. ఇటీవల 23వ జాన్ పోపుగారు ఈ వరం సహాయంతోనే ప్రాతపడిపోయిన తిరుసభను నూత్నీకరించడానికి ధైర్యంతో పూనుకొన్నారు. ఇంకా నేడు చాలమంది భక్తులు వ్యవప్రయాసలకోర్చి ప్రభువు సేవలో గొప్పకార్యాలు సాధిస్తున్నారంటే అది యీ దృఢత్వం ఫలితమే.

రెండవది, ఓర్పునిగూడ పొందుతాం. దీర్ఘకాలం కష్టాలనెదుర్కొంటూ కృషిచేయాలంటే సహనమూ ఓర్పూ అవసరం. వేదసాక్షుల్లో ఈ వోర్పు అద్భుతంగా కన్పిస్తుంది. అంటియోకయ ఇన్యాసివారు, పెర్పెత్తువ, మరియగొరెట్టి మొదలైన వాళ్ళంతా ఈ సహనానికి ఉదాహరణలే. కాని వేదసాక్షులు స్వల్పకాలంలో ప్రాణాలు విడచారు. ఈనాడు మనం దేవుని సేవలో దీర్ఘకాలం శ్రమించి కృషిచేయాలి. వాళ్ళు ఒక్కక్షణంలో నెత్తురుధారవోస్తే మనం జీవితమంతా నెత్తురు బొట్టులు బొట్టులుగా కార్చాలి. దీనికిగూడ గొప్ప సహనమే కావాలి. ఈ పట్టున దృఢత్వమనే వరం మనకు తోడ్పడుతుంది.

## 2. నిత్యజీవితంలో ఈ వరంతో అవసరం

పాపపు లోకం ఎన్నో ప్రలోభాలను కలిగిస్తుంది. లైంగిక భావాలతో నిండిన నేటి పాపపు లోకంలో పవిత్రతను నిలబెట్టుకోవాలంటే మాటలుకాదు. కొన్ని సార్లు

ధనవాంఛకు లొంగి గడ్డితినాలనిపిస్తుంది. రోజువారిపనిని సంవత్సరం పొడవునా సంతృప్తికరంగా చేసికుంటూ పోవాలంటే యెంత ఓపిక వుండాలి? వ్యాధిబాధలకూ కష్టాలకూ తట్టుకొని నిలవాలంటే యెంత స్థైర్యముండాలి? దేవుని పిలుపు విన్పించిన యువతీయువకులు ఆ పిలుపునిబట్టి పోవాలంటే యెంత తెగువ వుండాలి? సాంఘిక అన్యాయాలను ఎదరించాలంటే ఎంత ధైర్యముండాలి? జీవితంలో ఒకోసారి ఎదురయ్యే నిరాశాభావాలను జయించాలంటే యెంత గుండె దిటవు కావాలి?

ఈలాంటి సందర్భాలన్నిటిలోను ఈ వరం మనకు ఉపయోగపడుతుంది. యోబు గ్రంథం వర్ణించినట్లుగా, ఈ లోకంలో మనుష్యజీవితం యుద్ధరంగం లాంటిది - 7,1. ఈ యుద్ధంలో ధైర్యంతో పోరాడాలంటే, విజయాన్ని చేపట్టాలంటే, దృఢత్వం కావాలి. మన శక్తి ఎంత? మన బందారమెంత? దైవశక్తి అండగా నిలువకపోతే మనం నెగ్గగలమా?

## 3. ఈ వరాన్ని సాధించడం ఎలా?

దృఢత్వమనేది ప్రధానంగా దైవబలాన్ని దయచేసే వరం. ఈ వరాన్ని పొందాలంటే మొదట మన బలహీనత మనకు బాగా తెలిసివుండాలి. పౌలు తన బలహీనతను తాను బాగా అర్థం చేసికొన్నాడు. అతడు దైవదర్శనాలు పొందాడు. వాటివల్ల అతనికి తల తిరగకుండా వుండటానికీ, అతన్ని అణచి వుంచడానికీ, ప్రభువు అతనికి ఏదో ఘోరమైన బాధను కలిగించాడు. దాన్నే పౌలు "మల్లు" అని పేర్కొన్నాడు. ఆ ముల్లుని తొలగించమని అతడు ముమ్మారు ప్రభువుని మనవి చేసాడు. కాని ప్రభువు ఆ ముల్లుని తొలగించలేదు. "నా కృప నీకు చాలు. నీవు బలహీనుడివిగా వున్నపుడు నా శక్తి నీమీద పరిపూర్ణంగా పనిచేస్తుంది" అని చెప్పాడు. పౌలు తన బలహీనతను అంగీకరించాడు. దాని ద్వారానే అతడు గొప్ప దైవశక్తిని పొందాడు. కనుకనే నేనెప్పుడు బలహీనుణ్ణో అప్పుడే బలవంతుణ్ణి అని చెప్పుకొన్నాడు - 2 కొ 12, 7-10. మనంకూడ ఆ పౌలులాగే మన శక్తిహీనతనూ చేతగాని తనాన్నీ అంగీకరించాలి. ఆ ప్రభువుమీద ఆధారపడాలి. దివ్యబలాన్ని దయచేయమని అతన్ని అడుగుకోవాలి. అప్పుడు అతని శక్తి మనమీద పనిచేస్తుంది. ఉత్థానక్రీస్తు శిష్యులతో "ఆత్మ వచ్చిందాకా మీరు యెరూషలేములోనే వుండండి. ఆత్మ దిగి వచ్చినపుడు మీరు శక్తిని పొందుతారు" అని చెప్పాడు - అ.చ. 1,8. శిష్యులు యథార్థంగా ఆత్మనుండి శక్తిని పొందారు. పొంది భూదిగంతాలవరకూ క్రీస్తుకి సాక్ష్యం పలికారు. నేడు మన జీవితంలో కూడ ఈలాగే జరుగుతుంది. ప్రభువు ఆత్మ మనకు అమోఘమైన శక్తినీ బలాన్నీ దయచేస్తుంది. వీటితో మనం గొప్ప విజయాలు సాధిస్తాం.

తేపతేపకు మనం స్వీకరించే దివ్యసత్ప్రసాదం ద్వారా కూడ దైవబలాన్ని పొందుతాం. పూర్వం యూదులు మన్నా భోజనాన్ని తిని భౌతికమైన పుష్టిని పొందారు. నేడు మనం ఈ భోజనాన్ని అరగించి ఆధ్యాత్మికమైన పుష్టిని పొందుతాం - యోహా 6, 49-51. పవిత్రాత్మ దేవద్రవ్యానుమానాలద్వారా గూడ మన హృదయంమీద పని చేస్తుది. కనుక మనం ఈ భోజనాన్ని యోగ్యంగా భుజించి ఆ యాత్మనుండి దృఢత్వమనే వరాన్ని అధికాధికంగా పొందుతూండాలి.

# 4. దైవభీతి

## 1. దైవభీతి అంటే యేమిటి?

ఈవరంవల్ల దేవునిపట్ల బిడ్డల్లా మెలుగుతూ భయభక్తులతో ప్రవర్తిస్తాం. పాపంనుండి వైదొలగుతాం.

సేవకుడు యజమానుణ్ణి జూచి భయపడతాడు. విశేషంగా తాను తప్పు చేసినప్పుడు యజమానుడు తన్ను శిక్షిస్తాడేమోనని భీతిజెందుతాడు. అలాగే కొందరు పాపంచేసి దేవుడు తమ్ము దండించి నరకానికి పంపుతాడేమోనని భీతిజెందుతారు. ఇది కేవలం శిక్షాభయం. దైవభీతి అనే వరానికీ ఈ భయానికీ ఏమీ సంబంధం లేదు.

బిడ్డలు తండ్రిపట్ల ప్రేమతో మెలుగుతారు. అతనిపట్ల వినయవిధేయతలూ భయభక్తులూ ప్రదర్శిస్తారు. కానిపనులు చేసి అతనికి అప్రియం కలిగించడానికి జంకుతారు. అలాగే దేవుడు కూడ మనకు గారాబు తండ్రి. మనమంటే అతనికెంతో ప్రీతి. కనుక మనం అతని ఆజ్ఞలుమీరి అతని మనసు నొప్పించడానికి భయపడతాం. అతని యెడల భయభక్తులతో మెలుగుతాం. ఇదే దైవభయమనే వరం.

పూర్వం దైవభక్తి అనే వరాన్ని చూచాం. ఆ వరం ద్వారా దేవుణ్ణి తండ్రిగా భావించి ప్రేమతో పూజిస్తాం. ఈ దైవభయమనే వరంవల్ల పాపంద్వారా దేవుని మనసునొప్పించడానికి వెనుకాడతాం. వళ్ళు దగ్గర పెట్టుకొని జీవిస్తాం.

కొందరు పునీతులు పాపం చేయడంకంటె చనిపోవడం మేలని యెంచారు. ఇగ్నేష్యస్ లొయోలా, డాన్‌బోస్కో, మరియగొరెట్టి మొదలైనవాళ్ళంతా ఈలా భావించినవాళ్ళే. ఇది యీ వరం ఫలితమే. ఈవరంవల్ల పాపం చేయడానికి వెనుకాడతాం. పామునుండిలాగ పాపంనుండి పారిపోతాం - సీరా 21,2.

పూర్వవేదంలో యూదులు ప్రభువుని జూచి భయపడేవాళ్ళు. మోషే మండుతూవున్న పొదలో దేవుణ్ణి చూచి ఉత్తరీయంతో ముఖం కప్పుకొన్నాడు – నిర్గ 3,6. దేవుడు అతనితో ఏ నరుడైనాసరే నా ముఖం చూస్తే ఇక బ్రతకడు అని చెప్పాడు – నిర్గ 32, 20. ఏలియా హోరెబు కొండమీద దేవుణ్ణి చూచి ఉత్తరీయంతో ముఖం కప్పుకొన్నాడు – 1రాజు 19,13. యెషయా చూచిన దర్శనంలో దేవదూతలు ఆ పవిత్రుడైన ప్రభువువైపు తేరిపాడజూడలేక రెక్కలతో ముఖాలు కప్పేసుకున్నారు – యెష 6,2. మనకు కూడ ఈలాంటి భయం అవసరం.

ఇక్కడ ఓ అనుమానం కలుగవచ్చు. మనం యూదుల్లాగ దాస్యపు ఆత్మను పొందలేదు. దత్తపుత్రుల ఆత్మను పొందాం. ఆయాత్మ సహాయంతో నూత్నవేదంలో దేవుణ్ణి చనువుతో నాన్నా అని పిలుస్తాం – రోమా 8,15. మరి ఆ దేవుణ్ణి చూచి భయపడ్డం దేనికి? అతనిపట్ల మనకు కావలసింది చొరవా చనువూకాని భయం కాదుగదా? నిజమే. మనం దేవునికి బానిసలంగాదు, బిడ్డలం. కాని బిడ్డలమైనా కూడ మన మెప్పుడైనా పాపం కట్టుకోవచ్చు. ఫలితంగా మన దత్తపుత్రత్వాన్ని కోల్పోవచ్చు. అందుచేత మనకు ఈ దైవభయం అవసరం. మనం దత్తపుత్రులమని చెప్పిన పౌలే "భయంతో వణకుతూ మీ రక్షణకార్యాన్ని నిర్వహించుకొనండి" అని చెప్పాడు – ఫిలి 2,12. నిత్యజీవితంలో మనం ప్రవర్తించేతీరు యూదుల ప్రవర్తనకంటె మెరుగేమీ కాదు. అందుచేత ఆ యూదులకుమల్లె మనకు కూడ దైవభయం అవసరమే. ఒక వైపున దేవునిపట్ల భయమూ వుండాలి, మరోవైపున అతనిపట్ల చొరవా నమ్మకమూ కూడా వుండాలి.

## 2. ఈ వరంతో ఏమి యవసరం?

కొంతమంది దేవునిపట్ల చులకనగా మెలుగుతుంటారు. అమర్యాదగా ప్రవర్తిస్తారు. భక్తులకు ఈలాంటి ప్రవర్తనం ఎంత మాత్రం తగదు. తల్లిదండ్రులు తమపట్ల వినయవిధేయతలూ మేరమర్యాదలూ లేకుండా ప్రవర్తించే బిడ్డలను మెచ్చుకోరుగదా! దేవుడూ అంతే. కనుక దైవభీతి అనేది అనవసరం కాదు.

పాపాంకురం మనలో నిత్యమూ వుంటూనే వుంటుంది. అది యెప్పుడైనా చెట్టుగా ఎదగవచ్చు. కనుక మన పతన స్వభావాన్ని తలంచుకొని మనమే భయపడాలి. అబ్షాలోము తన్ననురాగంతో జూచే తండ్రి దావీదుమీద తిరగబడ్డాడు. అలాగే మనంకూడా యెప్పుడైనా పాపంద్వారా దేవునిమీద తిరగబడవచ్చు. ఫిలిప్ నేరి అనే భక్తుడు "ప్రభూ! నీవీ ఫిలిప్పుని నమ్మ వద్దు. ఇతడు నీకెప్పుడైనా ద్రోహం చేయగలడు సుమా!" అని ప్రార్థించేవాడట. మనకు కూడ ఈ మనస్తత్వం, ఈ భయం అవసరం.

దైవభయం ఇంకోలాభాన్ని కూడ చేకూర్చి పెడుతుంది. ఒకోసారి మన క్రిందివారిపట్ల నిరంకుశంగా, నిర్దయగా ప్రవర్తిస్తాం. వాళ్ళకు హానిచేయబోతాం. అలాంటప్పుడు ఈ వరం మనలను హెచ్చరించి మనకు బుద్ధిచెప్తుంది.

## 3. ఈ వరాన్ని సాధించే మార్గం

భగవంతుడు మహావైభవం కలవాడు. మహాపవిత్రుడు. అలాంటి ప్రభుని అల్పప్రాణులమైన మనం పాపంద్వారా అవమానించగలం. అందుచేత మనం ఎప్పుడుకూడ ఆ ప్రభుని చూచి భయపడతూండాలి. వళ్ళు దగ్గరబెట్టుకొని బ్రతుకుతూండాలి. కావుననే కీర్తన కారుడుకూడ "నీ భయంతో నావళ్ళు వణకిపోతూంది, నీ యాజ్ఞలకు నేను గడగళ్ళాడుతూన్నాను" అని వాకొన్నాడు - 119, 20, ఈ భయం మన హృదయంలో భక్తి మర్యాదలను పుట్టిస్తుంది. ఈ వినయభావాన్ని జూచి ప్రభువు మనలను ప్రీతితో ఆదరిస్తాడు. బిడ్డలు తండ్రిపట్లలాగే మనంకూడ తనపట్ల, ఒకవైపున అనురాగంతోను మరొకవైపున మేరమర్యాదలతోను మెలిగేభాగ్యాన్ని దయచేస్తాడు. మనతరపున మనం మన పాపాలకు ఎప్పుడూ చిత్తశుద్ధితో పశ్చాత్తాప పడుతూండాలి. పశ్చాత్తాప తప్తమైన హృదయాన్ని నీ వనాదరం చేయవు అన్నాడు కీర్తనకారుడు - 51, 17. ఈ పశ్చాత్తాప భావం మనలో దైవభయాన్ని పెంచుతుంది.

# 5. తెలివి

## 1. తెలివి అంటే ఏమిటి?

ఈ వరం ద్వారా సృష్టివస్తువులు దేవునిమీద ఆధారపడి వుంటాయనీ, అతడు అన్నిటికీ ఆదికారణమనీ గ్రహిస్తాం. సృష్టి వస్తువుల్లో దేవుణ్ణి గుర్తించి అతన్ని కొలుస్తాం. కనుక ఇది లోకవస్తువులన్నింటిలోను, అన్ని కార్యాల్లోనుగూడ దేవుణ్ణి గుర్తించడానికి వుపయోగపడే వరం.

ప్రభువు తాను చేసిన వస్తువులన్నింటిలోను ప్రతిబింబిస్తూనే వుంటాడు. పాపంచేయకముందు ఆదాము అన్నిటిలోను దేవుణ్ణి గుర్తించేవాడు. కాని పాపం చేసాక అతడు ఆ శక్తిని కోల్పోయాడు. అతని సంతతిమై అతని పాపంవల్ల పతనమై పోయిన మనకు కూడ ఈ శక్తిలోపించింది. క్రీస్తు సిలువమీద మరణించి పాపానికి పరిహారంచేసి ఈ శక్తిని మనకు మళ్లా సంపాదించి పెట్టాడు. ఇప్పుడు క్రీస్తు ఆత్మ తెలివి అనే వరం

ద్వారా, క్రీస్తు సంపాదించిపెట్టిన ఈ శక్తిని మనకు సమృద్ధిగా దయచేస్తుంది. దీనిద్వారా మనం, పెద్దగా ఆలోచించవలసిన అవసరం లేకుండానే, శ్రమపడవలసిన అగత్యం లేకుండానే, ఆయావస్తువులవైపు పారజూచిన వెంటనే వాటికి దేవునితో సంబంధం వుందని గ్రహించగల్గుతాం.

అన్ని వస్తువులు దేవునినుండే పుడతాయి. వాటిల్లో దేవుడు ప్రతిబింబిస్తుంటాడు. అవి మన మనసుని దేవునివైపు త్రిప్పుతాయి. కనుక అన్ని వస్తువులుకూడ నిచ్చెన మెట్లలాగ మనలను దేవునిచెంత కెక్కించుకొనిపోతాయి. ఇదే తెలివి అనేవరం.

అసిస్సీఫ్రాన్సిస్ భక్తుడు అన్నిటిల్లోను దేవుణ్ణి చూచేవాడు. అతడు సూర్య చంద్ర నక్షత్రాదులూ నీరు గాలి అగ్ని భూమి పశుపక్ష్యాదులూ మొదలైనవాటి నన్నిటినీ దేవునికి బిడ్డలనుగాను తనకు సోదరీ సోదరులనుగాను భావించేవాడు. వాటిపట్ల పవిత్రమైన భావాలతో మెలిగేవాడు. ఈ భావాలను అతడు "సూర్యగీతం" అనే గేయంలో వ్యక్తం చేసాడు. ఇది తెలివి అనే వరం ఫలితమే.

కీర్తనకారుడు "ఆకాశం దేవుని మహిమను చూపెడుతూంది, అంతరిక్షం అతని సృష్టిని ప్రకటిస్తూంది" అన్నాడు - 19,1. మహాభక్తులు అన్ని సంఘటనల్లోను దేవుని హస్తాన్ని గుర్తించారు. దేవుడు తన్ను ప్రేమించేవాళ్ళకి అన్నీ మంచికే సమకూరేలా చేస్తాడు అని చెప్పాడు పౌలు - రోమా 8,28. ఈ భావాలన్నీ తెలివి అనే వరానికి నిదర్శనాలే.

## 2. ఈ వరంవల్ల లాభాలు

సృష్టివస్తువులు మనలను దేవుని చెంతకు చేర్చడానికి ఉద్దేశింపబడ్డాయి. ఐనా పాపఫలితంగా వాటిద్వారానే మనం దేవునికి దూరమైపోతుంటాం. ఆ వస్తువుల్లోనే తగుల్కొనిపోయి భగవంతునినుండి వైదొలగిపోతూంటాం. వస్తుప్రీతికి లొంగి పోతూంటాం. అలాంటప్పుడు ఈ వరం మనమీద పనిచేసి మనలోని వస్తువ్యామోహాన్ని చక్కదిద్దుతుంది. దేవుడు చేసిన వస్తువులను నమ్మి దేవుణ్ణి విస్మరించవద్దని హెచ్చరిస్తుంది. ఫలితంగా మనం అశాశ్వతములైన ఈ లోకవస్తువులనుండి వైదొలగి శాశ్వతుడైన ప్రభువుని ఆశ్రయిస్తాం.

దేహధారులమైన మనకు లోకవస్తువులేమో అవసరమే. తోడినరులు కూడుగుడ్డ యిల్లువాకిలి డబ్బు - ఇవన్నీ అవసరమే. కనుక మనం ఈ భౌతిక వస్తువులను పూర్తిగా పరిత్యజించలేం. కాని ఈ వరం ద్వారా లోకవస్తువులను ఎంతవరకు వాడుకోవాలో అంతవరకే వాడుకొంటాం. వాటిల్లో చిక్కుకోం. వాటిని మనకు దాసులనుగా

చేసికొంటాంగాని, మనం వాటికి దాస్యం చేయం. వాటిని నిచ్చెన మెట్లలాగ వాడుకొని దేవుని దగ్గర కెక్కిపోతాం.

## 3. ఈ వరాన్ని సాధించడం ఏలా?

దేహధారులమైన మనం నిరంతరమూ ఈ లోకవస్తువుల మధ్య మెలుగుతూంటాం. నిరంతరమూ వీటిని వాడుకొంటూంటాం. కాని మనం అన్ని వస్తువులనూ విశ్వాస నేత్రాలతో దర్శించాలి. ఏ వస్తువునైనాసరే అది కేవలం మన చర్మచక్షువులకు కన్పించినట్లుగా మాత్రమే చూడకూడదు. దాని నిజస్వభావాన్ని దర్శించాలి. అనగా ఆ వస్తువుకి కారణభూతుడైన భగవంతుణ్ణి గుర్తించాలి. వస్తువులు మనలను భగవంతుని చెంతకు చేర్చాలిగాని అతనినుండి వేరుపరుపగూడదు. ఈలాంటి దృక్పథాన్ని అలవర్చుకొంటే మనం వ్యామోహానికి గురికాము. క్రీస్తుతో పోల్చిచూస్తే సమస్త వస్తువులూ వట్టి చెత్తాచెదారమని భావిస్తున్నాను అన్నాడు పౌలు - ఫిలి 3,8. మనం కూడ ఈలాంటి మనస్తత్వాన్ని అలవర్చుకోవాలి.

ఇంకా మనం ప్రతి సంఘటనంలోను దేవుని హస్తాన్ని దర్శించడం నేర్చుకోవాలి. మామూలుగా అందరమూ ప్రియమైన సంఘటనల్లో దేవుని తోడ్పాటుని గుర్తిస్తాం. అతనికి వందనాలర్పిస్తాం. కాని అప్రియమైన సంఘటనలు కలిగినపుడు ఆలా చేయం. ఇది పెద్ద పొరపాటు. కష్టాల్లోకూడ దేవుని చేతిని చూడాలి. యోసేపు సోదరులు అతన్ని ఐగుప్తుకి బానిసగా అమ్మివేసారు. కాని అతడు అక్కడ మంత్రి అయ్యాడు. తరువాత కరవువల్ల ఆ సోదరులు ఐగుప్తుకి వెళ్లి ధాన్యం కొనుక్కోవలసి వచ్చింది. అక్కడ వాళ్ళు తమ్ముణ్ణి గుర్తుపట్టారు. అప్పుడు యోసేపు "మీరు నాకు కీడు తలపెట్టి నన్ను బానిసగా అమ్మివేసారు. కాని ప్రభువు ఆ కీడుని మేలుగా మార్చాడు. మీ కంటే ముందుగా నన్ను ఇక్కడికి పంపి ఈ కరువు కాలంలో నేను చాలమంది ప్రాణాలు నిలబెట్టేలా చేసాడు" అన్నాడు - ఆది 50, 20. మన జీవితంలో గూడ ఈలాంటి సంఘటనలు జరుగుతూంటాయి. ఆ యోసేపులాగే మనంకూడ ఆపదల్లో దేవుని హస్తాన్ని గుర్తించగలిగి వుండాలి.

ప్రభువు నాకు దీపం వెలిగిస్తాడు, నా త్రోవలోని చీకటిని తొలగిస్తాడు అన్నాడు కీర్తన కారుడు - 18,28. అతడు నిన్ను గూర్చి జాగ్రత్తపడతాడు అన్నాడు మరో కీర్తనకారుడు - 55,22. ఈలాంటి భావాలను భక్తితో మననం జేసికొంటే మనకు ఈ తెలివి అనే వరం తప్పక సిద్ధిస్తుంది.

# 6. వివేకం

## 1. వివేకం అంటే ఏమిటి?

ఈ వరంద్వారా వేదసత్యాలను లోతుగా అర్థంచేసికొంటాం. మన బుద్ధి వేదసత్యాలను ఎప్పటికీ పూర్తిగా గ్రహించలేదు. ఐనా మనం వాటిని కొంతవరకు అర్థంచేసికోవచ్చు. అందుకు ఈ వరం తోడ్పడుతుంది.

## 2. ఈ వరం ఫలితాలు

ఈ వరంద్వారా వేదసత్యాలను క్షుణ్ణంగా గ్రహిస్తాం. తోమాసు అక్వినాసు భక్తుని భావాల ప్రకారం ఈ గ్రహించడమనేది ఆరు విధాలుగా వుంటుంది.

1. వెలుపలి గుణాల మాటున దాగివున్న దేవుణ్ణి గుర్తిస్తాం. దివ్యసత్ప్రసాదంలో అప్పం, రసం గుణాల మాటున క్రీస్తుదాగి వున్నాడు. కంటికి కన్పించకపోయినా అతడు సత్ప్రసాదంలో వున్నాడని అర్థంచేసికొంటాం, నమ్ముతాం, ఆరాధిస్తాం.

2. మాటల్లో దాగివున్న గూఢార్థాన్ని గ్రహిస్తాం. ఆత్మ వేదగ్రంథ వాక్యాల్లో దాగివున్న గూఢభావాన్ని మనకు విదితం చేస్తుంది. క్రీస్తు ఎమ్మావు త్రోవలో శిష్యులకు దివ్యగ్రంథ వాక్యాల భావాన్ని వివరించి చెప్పాడు - లూకా 24, 25-27. బైబులు చదువుకొనేపుడు ఆత్మ మనకు కూడ దివ్యగ్రంథ మర్మాలను విశదీకరిస్తుంది. దీనివల్ల మనకు గొప్పభక్తి పుడుతుంది.

3. దేవద్రవ్యానుమానాల్లోని సాంకేతికార్థాలను అర్థంచేసికొంటాం. మనం జ్ఞానస్నానం పొందినపుడు క్రీస్తు మరణోత్థానాలు మనమీద సోకుతాయి. అతడు భౌతికంగా మరణించినట్లే మనంకూడ పాపానికి మరణిస్తాం. అతడు భౌతికంగా ఉత్థానమైనట్లే మనంకూడ నూత్నజీవితానికి ఉత్థానమౌతాం - రోమా 6,4. పై వరంద్వారా మనం ఈ మరణోత్థానాల సంకేతాలను నమ్మి క్రీస్తు వరప్రసాదాన్ని పొందుతాం.

4. వెలుపలి భౌతిక రూపంలో దాగివున్న ఆధ్యాత్మిక సత్యాన్ని గుర్తిస్తాం. నజరేత్తూరి వడ్రంగిలో సృష్టికర్త దాగి వున్నాడు. ఈ వరం ద్వారా నరరూపధారియైన క్రీస్తు నిజంగా దేవుడని గ్రహిస్తాం.

5. కారణంలో దాగివున్న కార్యాన్ని గుర్తిస్తాం. సిల్వమీద తెరువబడిన క్రీస్తుహృదయంలో తిరుసభా ఏడు దేవద్రవ్యానుమానాలూ దాగివున్నాయి. క్రీస్తు కల్వరిమీద చిందించిన నెత్తుటిలో మన పాపాలకు పరిహారమూ, దేవునితో మనకు సిద్ధించే

పునస్సమాధానమూ ఇమిడి వున్నాయి. ఈ వరం మనకు ఈలాంటి రహస్యాలను ఎన్నిటినైనా నేర్పుతుంది.

6. కార్యంనుండి కారణాన్ని గ్రహిస్తాం. సకాలంలో వాన కురిసింది. పంటలు బాగా పండాయి. కనుక ఆ వాన ప్రభువు ప్రాణిపోషణానురక్తిని సూచిస్తూంది. ఈ వరంద్వారా వానలో ప్రభువు కృపను గుర్తిస్తాం. ఇక్కడ వాన కార్యం, ప్రభువు కృప కారణం.

పై యుదాహరణలనుబట్టి ఈ వరం ప్రధానంగా వేద సత్యాలకు సంబంధించినదని తెలిసికోవాలి. దీనిద్వారా మన విశ్వాసం బలపడుతుంది. మనకు దేవునిమీదా దైవసంబంధమైన కార్యాలమీదా గాఢమైన భక్తి కలుగుతుంది. ఈ వరం ప్రధానంగా వేదాంతులకూ, వేదబోధకులకూ, ఆధ్యాత్మిక గ్రంథ రచయితలకూ అవసరం.

## 3. దీన్ని సాధించడం ఏలా

ఈ వరాన్ని సాధించాలంటే మనకు నిశ్చలమైన విశ్వాసం వుండాలి. పండ్రెండవ శతాబ్దంలో జీవించిన ఆన్సెల్మ్ భక్తుడు గొప్ప వేదాంతి. అతడు వేదాంత విషయాలను చర్చించడానికి పూనుకొనేప్పుడెల్లా ముందుగా విశ్వాస ప్రార్థనం చేసేవాడు. విశ్వాసం సహాయంతో బుద్ధిశక్తిని వినియోగించి వేదసత్యాలను వివరించడానికి పూనుకొనేవాడు. విశ్వాసం సహాయంతో మనలోని బుద్ధిశక్తి వేదసత్యాలను గ్రహిస్తుంది అనేది అతని సూత్రం.

కొందరు చాల తెలివైనవాళ్ళు వుంటారు. ఐనా వాళ్లు దేవుణ్ణి అట్టే పట్టించుకోరు. వేదసత్యాలను అంతగా నమ్మరు. వాళ్ళ హృదయంలో భక్తివిశ్వాసాలు వుండవు. మరికొందరికి తెలివితేటలు అట్టే వుండవు. ఐనా వాళ్లు దేవుణ్ణీ మతసత్యాలనూ గాఢంగా నమ్ముతారు. చాల భక్తి కలిగి వుంటారు. ఈ వ్యత్యాసం ఏలా వచ్చింది? తెలివైనవాళ్ళమీదకంటె తెలివి తక్కువవాళ్ళమీద ఈ వరం అధికంగా పనిచేయడంవల్లనే. ప్రభువేమన్నాడు? "తండ్రీ! విజ్ఞులకూ వివేకవంతులకూ పరలోక రహస్యాలను మరుగుపరచావు. పసిబిడ్డలకు వాటిని తెలియపరచావు. కనుక నిన్ను స్తుతిస్తున్నాను" అన్నాడు – మత్త 11,15. ఈ సత్యం నేడు మన జీవితంలో కూడ నెరవేరుతుంది.

మనం తరచుగా జ్ఞానోపదేశాన్నీ, వేదసత్యాలనూ, బైబులు బోధలనూ కేవలం సిద్ధాంతాలుగా మాత్రమే నేర్చుకొంటాం. లెక్కలు, చరిత్ర, భూగోళం మొదలైన వాటివలె ఈ వేదవిషయాలుకూడ మనకు కేవలం కొన్ని విజ్ఞానాంశాలు మాత్రమే ఔతాయి. కాని వేదవిషయాలను ఈలా నేర్చుకొంటే లాభంలేదు. ఈ పద్ధతివల్ల భగవంతుడు అనుభవానికిరాడు. మన హృదయం మంచికి మారదు.

మరి మనం ఏమిచేయాలి? వేదసత్యాలనూ దివ్యగ్రంథబోధలనూ నేర్చుకోవడం వల్ల మన హృదయం భక్తిభావంతో నిండిపోవాలి. ఆత్మ మన హృదయంమీద పనిచేసి దానికి గొప్ప వెలుగుని ప్రసాదించాలి. ఆ వెలుగులో మన ఆత్మ ఆ భగవంతుణ్ణి ధ్యానించి అతన్ని అనుభవానికి తెచ్చుకోవాలి. ఆ యనుభవంవల్ల మన హృదయం పాపంనుండి వైదొలగాలి. మనం మార్పుచెంది పుణ్యకార్యాలను చేయడానికి పూనుకోవాలి. ప్రేమభావంతో జీవించాలి. పలానా వేదసత్యంగాని, దివ్యగ్రంథంలోని పలానా అంశంగాని ఈనాడు మన జీవితానికి కూడ అక్షరాల వర్తిస్తుంది అన్నట్లుగా వుండాలి. అలా వర్తించడంవల్ల మన జీవితం మంచికి మారింది అనిపించాలి. వివేకం అనే దైవవరమే ఈ భాగ్యాలన్నిటినీ మనకు సంపాదించి పెడుతుంది.

# 7. విజ్ఞానం

## 1. విజ్ఞానం అంటే యేమిటి?

ఈ వరంలో రెండంశాలున్నాయి. మొదటిది, దేవుని విలువనూ సృష్టివస్తువుల విలువనూ అర్థంజేసికొంటాం. భగవంతునిపట్ల, ప్రపంచంలోని అన్ని వస్తువులపట్ల నిర్దిష్టమైన భావాలు అలవర్చుకొంటాం. ఇంతవరకు ఈ వరం మన బుద్ధి శక్తికి సంబంధించింది అవుతుంది. విజ్ఞానాత్మకంగా వుంటుంది. మన బుద్ధిశక్తికి గొప్ప వెలుగుని ప్రసాదిస్తుంది.

రెండవది, భగవంతుణ్ణీ ఆధ్యాత్మిక విషయాలనూ ఆస్వాదిస్తాం. ఆ యాస్వాదనం వలన ఆనందమూ తన్మయత్వమూ కలుగుతుంది. ఈ రెండవ అంశంలో ఈ వరం మన చిత్తశక్తికి చెందిందవుతుంది. ప్రేమాత్మకంగా వుంటుంది.

వివేక వరం వలన దైవసత్యాలను వట్టినే అర్థం చేసికొంటాం. ఈ విజ్ఞానవరంవల్ల దైవసత్యాలను చవిజూస్తాం. అనుభవానికి తెచ్చుకొంటాం. ఆనందిస్తాం. మామూలుగా వేదశాస్త్రుల్లో దైవసత్యాలను గూర్చిన తెలివివుంటుంది. ఇది వివేకవరం. కానీ పునీతుల్లో ఆ దైవసత్యాలను అస్వాదించి ఆనందించడమనేదికూడ వుంటుంది. భగవంతుణ్ణి వ్యక్తిగతంగా అనుభవానికి తెచ్చుకొని గాఢంగా ప్రేమించడమనేది వుంటుంది. ఇదే విజ్ఞాన వరం.

ఆత్మయిచ్చే ఏడు వరాల్లోను ఈ విజ్ఞానవరం శ్రేష్ఠమైంది. ఈ వరంద్వారా మన దైవానుభూతీ, ఆనందానుభూతీ, ప్రేమభావమూ పరాకాష్ఠ నందుకొంటాయి. అనగా ఆధ్యాత్మిక జీవిత శిఖరం మీదికి ఎక్కిపోతాం.

ఈ వరం పౌలుమీద పనిచేసింది. అతడు క్రీస్తుద్వారా తండ్రి మనకు దయచేసిన రక్షణాన్ని తలంచుకొని ప్రేమభావంతో పులకించిపోయాడు. "మన ప్రభువైన యేసుక్రీస్తు తండ్రియగు దేవునికి స్తుతికలుగును గాక" అన్నాడు - ఎఫే 3,1.

ఈ వరం యోహానుని ప్రభావితం చేసింది. అతడు క్రీస్తుద్వారా తండ్రి మనపట్ల చూపిన ప్రేమకు ముగ్ధుడైపోయాడు. భక్తి భావంతో "దేవుడంటే ప్రేమే" అని వాకొన్నాడు - 1యో 4,8.

ఈ వరం ఎమ్మావు త్రోవలో శిష్యులమీద సోకింది. వాళ్లు తన్మయులైపోయారు. "అతడు మార్గంలో మనతో మాట్లాడుతూ లేఖనాలను వివరిస్తూంటే మన హృదయం ప్రజ్వరిల్లింది కదా" అనుకొన్నారు - లూకా 24, 32.

## 2. ఈ వరం ఫలితాలు

ఈవరంవల్ల మన హృదయంలో దేవునిపట్ల గాఢమైన భక్తీ, అనుభూతీ, ప్రేమా పుడతాయి. "మోక్షంలో మాత్రం నీవు తప్ప ఇంకెవరున్నారు? ఈ లోకంలో నీవు తప్ప మరొకటి నాకు రుచించడం లేదు" అన్నాడు కీర్తనకారుడు - 73, 25. "ప్రభూ! నిత్యజీవం ఇచ్చే పలుకులు నీ నోటి నుండి వెలువడుతున్నాయి. నిన్ను కాదని మరెవరి దగ్గరికి వెళ్తాం? లోకంలోకి వెళ్లి అక్కడ యేమి పాముకొంటాం గనుక?" అన్నాడు పేత్రు - యోహా 6,68. "ఇప్పుడు నేను కాదు, నాయందు క్రీస్తే జీవిస్తున్నాడు" అన్నాడు పౌలు - గల 2,20. ఈ భక్తులకు గలిగిన అనుభూతే మనకూ కలుగుతుంది.

తెలివితేటలుకల పండితులమీద మాత్రమేకాదు, చదువు సంధ్యలూ పుస్తకజ్ఞానమూలేని పామరజనంమీద కూడ ఈ వరం పనిచేస్తుంది. విద్యవిజ్ఞానంలేని ఒక పేద ముసలమ్మ వుంది. ఆమె భక్తురాలు. పరలోక జపాన్ని ప్రారంభించేది కాని ముగించలేకపోయేది. దానికి కారణం ఆమే యీలా చెప్పింది. "పరలోకంలోని మా యొక్క తండ్రి అన్న వాక్యాన్ని ప్రారంభించగానే దేవుడంతటివాడు నాకు తండ్రికదా అనే భావం స్ఫురిస్తుంది. దానితో నా కన్నులవెంట గిర్రున నీళ్ళు తిరుగుతాయి. ఇక నేను ఆ జపాన్ని ముగించలేను. దినమంతా ఆ భావాన్నే నెమరు వేసికొంటూ భక్తితో అలాగే వుండిపోతాను. ఇప్పటికి ఐదేళ్ళబట్టి ఈలా జరుగుతూంది". ఈ దైవానుభూతి విజ్ఞాన వరంవల్లగాకపోతే మరి దేనివల్ల కలిగింది?

ఈ వరం మన మీద సోకనంత కాలం, భగవంతుడు మనకు వట్టి భావంగానే వుండిపోతాడు. మన సత్యాలు బైబులు బోధలు వట్టి సిద్ధాంతాలుగానే వుండిపోతాయి. మన హృదయం ఎండిపోయిన నేలలా, మోడువారిన కొర్రులా వుంటుంది. ఆ దేవునికీ మనకీ ఏమి సంబంధముందో కూడ గ్రహించలేం. కాని ఓమారు ఈ వరం మనమీద సోకగానే మన హృదయం ద్రవిస్తుంది. భగవంతుడు వట్టి భావంగాగాక, ఓ వ్యక్తిగా అనుభవానికి వస్తాడు. అతన్ని తండ్రిగాను, రక్షకుణ్ణిగాను, మన సర్వస్వంగాను భావిస్తాం. హృదయంలో ప్రేమ పుడుతుంది. ప్రార్థనం పెల్లుబికివస్తుంది. మనలను మనం

సంస్కరించుకోవడం మొదలుపెడదాం. ఆనందానుభూతి కలుగుతుంది. కనుక ఈ వరం మనకు అత్యవసరం.

### 3. ఈ వరాన్ని సాధించే మార్గం

ఈ వరంకోసం ఆత్మనే అడుగుకోవాలి. వినయంతోను భక్తిభావంతోను అడుగుకొనే వాళ్ళకి ఆత్మ ఈ భాగ్యాన్ని దయచేస్తుంది.

పవిత్రాత్మను గూర్చిన ఓ ప్రార్థనం ఇది. "ఓ ప్రభూ! నీవు పవిత్రాత్మ వెలుగుద్వారా విశ్వాసుల హృదయాలకు బోధచేసావు. ఆయాత్మద్వారా మేము ఉచితమైన వాటిని ఆస్వాదించేలా అనుగ్రహించు. ఆ యాత్మ దయచేసే ఊరటవలన ఎల్లప్పుడు ఆనందం చెందే భాగ్యాన్ని దయచేయండి".

ఈ ప్రార్థనం పేర్కొన్నట్లు, ఆత్మద్వారా మనం ఉచితమైనవాటిని ఆస్వాదిస్తాం. అనగా భగవంతుణ్ణీ ఆధ్యాత్మిక విషయాలనూ చవిజూస్తాం. ఆత్మ మనకు ఊరటనూ ఉపశాంతినీ దయచేస్తుంది. దానివల్ల ఆనందానుభూతి కలుగుతుంది. భగవంతుణ్ణి ఆస్వాదించి ఆనందానుభూతి చెందడమే విజ్ఞానవరం ప్రయోజనం. తన్నడుగుకొనే భక్తులకు ఆత్మ ఈ వరాన్ని తప్పక ప్రసాదిస్తుంది.

## 8. వరాల వివరణం

### 1. పుణ్యాలూ వరాలూ

పవిత్రాత్మ మనకు పవిత్రీకరణ వరప్రసాదాన్ని దయచేస్తుంది. పుణ్యాలనూ వరాలనూ గూడ ప్రసాదిస్తుంది. ఈ పుణ్యాలు రెండురకాలు. విశ్వాసం, నమ్మకం, ప్రేమ అనే మూడు దివ్యపుణ్యాలు. వివేకం, న్యాయం, మితత్వం, దృఢత్వం అనే నాల్గు నైతికపుణ్యాలు. ఈ నాల్గింటికి సంబంధించిన ఇతర నైతిక పుణ్యాలుకూడ వున్నాయి. సదుపదేశం, దైవభక్తి, దృఢత్వం, దైవభీతి, తెలివి, వివేకం, విజ్ఞానం అనే యేడువరాలు.

మనలో పుణ్యాలూ వరాలూ కలసే పనిచేస్తాయి. ఐనా ఆ రెండిటికి చాలా వ్యత్యాసముంది. పుణ్యాలను ఆచరించేపుడు మన ఆత్మే కర్త ఔతుంది. అనగా వరప్రసాద సహాయంతో మనమే ఆయా మంచిపనులు చేస్తాం. కాని వరాల విషయం వచ్చినపుడు పవిత్రాత్మ కర్త ఔతుంది. ఆయాత్మ మనయాత్మ మీద పనిచేసి మనచే ఆయా మంచిపనులు చేయిస్తుంది.

పుణ్యాలను ఆచరించడమంటే తెడ్లతో పడవను నడిపించడం లాంటిది. అనగా మన కృషి ముఖ్యం. వరాలతో జీవించడమంటే తెరచాప యెత్తి పడవలో

సాగిపోవడంలాంటిది. అనగా గాలి పడవనులాగ పరిశుద్ధాత్మే మనలను నడిపించుకొని పోతుంది. కృషి చేసేది ప్రధానంగా ఆయాత్మ. బిడ్డ తల్లి చేతిని పట్టుకొని నడవడం పుణ్యాలను ఆచరించడంలాంటిది. ఆ తల్లే బిడ్డని ఎత్తి రొమ్ముమీద పెట్టుకొని నడచిపోవడం వరాలతో జీవించడం లాంటిది.

## 2. వరాల వర్గీకరణం

యెషయా ప్రవక్త మెస్సియాను గూర్చి చెప్తూ "ప్రభువు ఆత్మ అతనిమీద నిలుస్తుంది. ఆయాత్మ జ్ఞానం వివేకం బలం సదుపదేశం తెలివి దైవభీతి పుట్టించే ఆత్మ" అని నుడివాడు- 11, 2-3. ఇక్కడ హీబ్రూ బైబులు పేర్కొనే వరాలు ఆరే. కాని సెప్తువాజింత్ గ్రీకు అనువాదం ఈ వేద వాక్యాల్లో "దైవభక్తి" అనే ఏడోవరం కూడ చేర్చింది. దీన్ని ఆధారంగా తీసికొని మూడవ శతాబ్దంనుండి క్రైస్తవ పారంపర్యం ఈ వరాలు ఏడు అని బోధిస్తూ వచ్చింది. ఈ సప్తవరాలద్వారా ఆత్మ మనలను వశం చేసికొంటుంది. మనం ఆ యాత్ముని చెప్పుచేతల్లో వుండి అతడు నడిపించినట్లుగా నడుస్తాం.

జ్ఞానంస్నానం ద్వారా మనం క్రీస్తులోనికీ క్రీస్తుశరీరమైన శ్రీసభలోనికి ఐక్యమౌతాం. కనుక ఆత్మ క్రీస్తుకొసగిన ఏడు వరాలు క్రీస్తునుండి మనకుకూడ సంక్రమిస్తాయి.

ఈ వరాల్లో తెలివి, విజ్ఞానం, వివేకం సదుపదేశం అనే నాల్గు బుద్ధిశక్తికి సంబంధించినవి. దైవభక్తి, దృఢత్వం, దైవభీతి అనేవి చిత్తశక్తికి సంబంధించినవి. తెలివి, వివేకం, విజ్ఞానం అనేవి మనకు ప్రార్థనాశక్తిని దయచేస్తాయి. దైవభీతి, దైవభక్తి, సదుపదేశం, దృఢత్వం అనేవి ఆయా సత్కార్యాలు చేయడానికి మనకు క్రియాశక్తిని దయచేస్తాయి. ఏడు వరాల్లోను శ్రేష్ఠమైంది విజ్ఞానం. అన్నిటికంటె తక్కువది దైవభీతి.

ఇక, ఈ యేడు వరాలకు ఆయా పుణ్యాలతోగూడ సంబంధం వుంది. ఇవి ఆయా పుణ్యాలమీద సోకి వాటిని పరిపూర్ణంచేస్తాయి. వరాలు నైతిక పుణ్యాలకంటె గొప్పవి. కాని దివ్యపుణ్యాలకంటె తక్కువవి. ఏయే వరాలకు ఏయే పుణ్యాలతో సంబంధం వుందో ఈ క్రింది పట్టిక సూచిస్తుంది.

| వరం | పుణ్యం |
|---|---|
| సదుపదేశం | వివేకం |
| దైవభక్తి | దైవారాధనం |
| ధృఢత్వం | దృఢత్వం |
| దైవభీతి | మితత్వం, నమ్మకం |
| తెలివి, వివేకం | విశ్వాసం |
| విజ్ఞానం | ప్రేమ |

అసలు వరాలు ఎన్ని? క్రైస్తవ సంప్రదాయం ఏడని చెప్తుంది. బైబుల్లో గాని క్రైస్తవ సంప్రదాయంలో గాని ఏడు పూర్ణసంఖ్య. అనగా ఈ యేడు ఆత్మయిచ్చే వరాలన్నిటిని సూచిస్తాయి, ఆత్మ వరాలన్నీ ఈ యేడు వరాల్లో యిమిడి వున్నాయని భావం. యథార్థంగా ఆత్మవరాలు ఎన్నయినా వుండవచ్చు. ఆత్మ ఆయా వ్యక్తుల అవసరాలనుబట్టి ఎవరికీయవలసిన వరాలను వారికిస్తుంది. కనుక ఈ వరాలు చాల వుండవచ్చు. కాని అవన్నీ కూడ ఏదోవొక రూపంలో ఈ యేడింటిలో ఇమిడే వుంటాయి. ఈ యేడు ఆత్మ దయచేసే సర్వవరాలకూ సూచనగా వుంటాయి.

ఆత్మవరాల్లో కొన్ని మనకు వ్యక్తిగత పావిత్ర్యాన్ని సంపాదించి పెడతాయి - Gifts. వీటిద్వారా ఆత్మ మన మీద పనిచేసి మనలను పరిశుద్ధులను చేస్తుంది. పై సప్తవరాలు ఈ కోవకు చెందినవే. ఇవికాక, సేవావరాలు లేక ప్రేషిత వరాలు అనేవికూడ వున్నాయి - Charisms. ఇవి మన వ్యక్తిగత పావిత్ర్యానికి ఉపయోగపడవు. తోడి ప్రజలకు సేవ చేయడానికి ఉపయోగపడతాయి. అద్భుతాలు చేయడం, భాషల్లో మాటలాడ్డం, ప్రవచనం చెప్పడం, వ్యాధులు కుదర్చడం మొదలైనవి ఈలాంటివి - 1కొ 12, 8-10. పెంతెకోస్తు ఉద్యమంలో ఈ సేవావరాలకు ఎక్కువ ప్రాముఖ్య మిస్తారు.

పుణ్యాల ప్రకారమూ, వరాల ప్రకారమూ జీవించే భక్తునిలో ఆత్మఫలాలు నెలకొంటాయి. ఇవి మొత్తం తొమ్మిది. ప్రేమ, సంతోషం, సమాధానం, ఓర్పు; దయ, మంచితనం, విశ్వసనీయత, సాధుశీలత, ఇంద్రియ నిగ్రహం అనేవే ఈ ఫలాలు. పౌలు గలతీయుల జాబు 5,22లో వీటిని పేర్కొన్నాడు. వీటివల్ల హృదయంలో గొప్ప సంతోషభావమూ మాధుర్యభావమూ నెలకొంటాయి. ఈ ఫలాలు సప్తవరాలకంటెగూడ శ్రేష్ఠమైనవి.

ఆత్మఫలాలు పరిపక్వానికివచ్చిన హృదయంలో అష్టభాగ్యాలు ఉద్భవిస్తాయి. ఆత్మ మనకు దయచేసే అత్యున్నత వరప్రసాదాలు ఈ యష్టభాగ్యాలు. పర్వత ప్రసంగంలో ప్రభువు వీటిని ఎన్మిదింటినిగా పేర్కొన్నాడు. అవి దీనాత్మత, శోకార్తత, వినమ్రత, నీతి నిమిత్తం ఆకలిదప్పులు అనుభవించడం, దయ, నిర్మలత్వం, ధర్మార్థం హింసలు అనుభవించడం, శాంతిస్థాపనం - మత్త 5,3-10. వీటివల్ల మనకు పరమానందం కలుగుతుంది. మనం మోక్షభాగ్యాన్ని అనుభవిస్తాం. ఆ భాగ్యం ఈ లోకంలో ప్రారంభమై పరలోకంలో పరిపూర్ణమౌతుంది. ఈ లోకంలో ఆత్మ మనకు దయచేసే వరప్రసాదాలన్నిటి లోను ఈ యష్టభాగ్యాలు అనేవి మహోత్కృష్టమైనవి.

ఈ విధంగా ఆత్మ మనకు తన పుణ్యాలనూ, వరాలనూ, ఫలాలనూ, అష్టభాగ్యాలనూ క్రమంగా దయచేస్తుంటుంది. ఇవి ఒకదానికంటె ఒకటి గొప్పవి.

## 3. సప్తవరాలను సాధించడం ఏలా?

మనం చిన్న పిల్లలంగావుండి జ్ఞానస్నానం పొందినపుడే ఆత్మనుండి వరప్రసాదాన్నీ పుణ్యాలనూ సప్తవరాలనూగూడ స్వీకరిస్తాం. ఈ దివ్యశక్తులు మన హృదయంలో బీజాల్లాగ వుండిపోతాయి. మనం పెరిగి పెద్దవాళ్లమై బుద్ధివివరం వచ్చాక ఈ యాధ్యాత్మిక శక్తులు మనలో పనిచేయడం మొదలిడతాయి.

వరాలను సాధించాలంటే మొదట వివేకం న్యాయం మొదలైన నైతిక పుణ్యాలను జాగ్రత్తగా పాటించాలి. నైతికంగా విశుద్ధ జీవితం జీవించనివాళ్ల హృదయాల్లో ఆత్మ వసించదు. అలాగే మనం పాపంనుండి వైదొలగుతుండాలి. లౌకిక వ్యామోహాలకు దూరంగా వుండాలి. మనం స్వీకరించింది లౌకికమైన ఆత్మకాదు, దేవుని ఆత్మ - 1కొరి 2, 12-14.

ఆత్మ మన హృదయంలో ఓ దేవాలయంలోలాగ వసిస్తుంటుంది -1కొరి 6,19. మనం ఈ ఆత్మ సాన్నిధ్యాన్ని గుర్తించాలి. ఆయాత్మ మన హృదయంలో పుట్టించే ప్రేరణలనూ ప్రబోధాలనూ అర్థంచేసుకోవాలి. ఆ దివ్యవ్యక్తిపట్ల భక్తి పెంపొందించుకోవాలి. అతడు కష్టాల్లో సుఖాన్నీ, గ్రీష్మంలో చల్లదనాన్నీ, దుఃఖంలో ఉపశాంతినీ దయచేసేవాడు. అలాంటి ప్రభువుని తన సప్తవరాలను దయచేయమని అడుగుకోవాలి. తన్ను మనవిచేసే భక్తుల వేడికోలును ఆ యాత్ముడు తప్పక వింటాడు.

# ప్రశ్నలు

1. సదుపదేశాన్ని వివరించండి.
2. దైవభక్తిని గూర్చి తెలియజేయండి.
3. దృఢత్వాన్ని విశదీకరించండి.
4. దైవభీతిని వివరించండి.
5. తెలివిని గూర్చి తెలియజేయండి.
6. వివేకవరాన్ని విశదీకరించండి.
7. విజ్ఞానవరం ప్రాశస్త్యాన్ని తెలియజేయండి.

# 3. పవిత్రాత్మ ఉద్యమం

## మనవిమాట

బైబులుభాష్యం 29,30 సంచికల్లో పవిత్రాత్మ ఉద్యమాన్ని గూర్చి చెప్పాం. ఇప్పుడు ఆ రెండు సంచికలనూ కలిపి ప్రస్తుత గ్రంథం రూపొందించాం.

మన క్యాతలిక్ సమాజంలో రెండవ వాటికన్ మహాసభ ఫలితంగా ఆవిర్భవించిన ఉద్యమాల్లో పవిత్రాత్మ ఉద్యమం ప్రధానమైంది. ఆత్మద్వారా క్రీస్తుని చేరుకోవడం దీనిలోని ప్రధానాంశం. బైబులు బోధించేదికూడ ఈ సత్యాన్నే. కనుక పరిశుద్ధాత్మను గూర్చి లోతుగా తెలిసికొనివుండడం మన ప్రజలందరి విధి. ఇది రెండవ ముద్రణం.

## విషయసూచిక

# 1. పవిత్రాత్మ ఉద్యమం చరిత్ర

1. ప్రభువు తన అనుచరులకు ఆత్మను వాగ్దానం చేసాడు. దప్పిక కలవాళ్ళు తనవద్దకు వచ్చి దాహం తీర్చుకోవాలి అన్నాడు. తన్ను విశ్వసించినవాళ్ళ హృదయంలో నుండి జీవజలప్రవాహం పొంగి పారుతుంది అని చెప్పాడు. విశ్వాసులు తననుండి పొందే ఆత్మే ఈ జీవజలప్రవాహం - యోహా 7, 37-39. క్రీస్తు మోక్షారోహణ మౌతూ శిష్యులు ఈ యాత్మ కోసం కాచుకొని వుండాలని చెప్పాడు. వాళ్ళు తండ్రి వాగ్దానం కొరకు వేచివుండాలనీ ఆ యాత్మలోనికి జ్ఞానస్నానం పొందాలనీ ఆదేశించాడు - అచ 1, 4-5.

2. ఈలా క్రీస్తు వాగ్దానం చేసిన ఆత్మ శిష్యులమీదికి దిగివచ్చింది. పెంతెకోస్తు దినాన శిష్యులంతా కూడి ప్రార్థన చేస్తుండగా ఆత్మ గాలిలాగా నిప్పులాగా వాళ్ళమీదికి దిగి వచ్చింది. అచ 2, 1-4. పూర్వవేదంలోనే ప్రభువు యోవేలు ప్రవక్తద్వారా "అంత్యదినాల్లో మానవులందరిమీదా నా యాత్మను కుమ్మరిస్తాను" అని ప్రమాణం చేసాడు. ఆత్మ రాకడతో ఈ ప్రమాణం నెరవేరింది - 2, 17. అపోస్తులుల మీదికి లాగే యేసుని విశ్వసించిన యేరూషలేము పౌరులు మూడువేల మంది మీదికి గూడ ఆత్మ వేంచేసి వచ్చింది - 2. 38. ఆలాగే క్రీస్తుని నమ్మిన సమరయుల మీదికీ (8,17) కొర్నేలి కుటుంబము మీదికీ (11,15) యెఫెసులోని స్నాపక యోహాను శిష్యుల మీదికి (19.6) ఆత్మ విజయంచేసింది. ఈలా ఆత్మ క్రీస్తుని నమ్మిన వాళ్లందరి మీదికీ వస్తూనేవుంటుంది. ఈలా రెండువేల యేండ్లు సాగిపోయాయి.

3. ఈ శతాబ్ద ప్రారంభంలో కొన్ని పెంతెకోస్తు సమాజాలు వ్యాప్తిలోకి వచ్చాయి. వీళ్లు విశేషంగా ప్రోటస్టెంటు క్రైస్తవులు. ప్రస్తుతం వీళ్ళు రెండుకోట్లదాకా వున్నారు. మన క్యాతలిక్ సమాజంలో జాన్ పోపుగారికి పరిశుద్ధాత్మపట్ల చాలా భక్తి వుండేది. ఆ యాత్మ ప్రేరణంతోనే ఆయన రెండవ వాటికన్ మహాసభ ప్రారంభించాడు. ఈ సభ పరిశుద్ధాత్మ

క్రైస్తవ ప్రజలను ప్రబోధించే తీరునుగూర్చి చాల విషయాలు బోధించింది. క్యాతలిక్ సమాజంలో పవిత్రాత్మ ఉద్యమం 1967లో అమెరికాలో ప్రారంభమైంది. 1970లో ఇండియాకు వచ్చింది. నేడు బొంబాయి, బెంగుళూరు, పోట్టా, హైద్రాబాదులాంటి పట్టణాల్లో ఈ వుద్యమం బాగా ప్రచారంలోవుంది. వాటికన్ సభ ముగిసాక మన క్యాతలిక్ సమాజంలో కన్పించే చైతన్యవంతమైన ఉద్యమాల్లో మొదట చెప్పుకోతగ్గది ఇదే! ప్రస్తుతం దీనిలో చాలమంది క్యాతలిక్ క్రైస్తవులు సభ్యులుగా వుంటున్నారు.

4. ఈ వుద్యమం త్వరితగతిని ప్రచారంలోకి వచ్చింది. ఇందుకు కారణాలు చాలా వున్నాయి. 1 ఇది దేవుని కార్యం. విశేషంగా పరిశుద్ధాత్మ పని. 2. దీనిలో భగవదనుభవం ప్రధానం. ప్రార్థనద్వారా భక్తులు భగవంతుణ్ణి అనుభవానికి తెచ్చుకొంటారు. 3 ఈ వుద్యమం మన ప్రాచీన క్రైస్తవ సంప్రదాయాలకు వ్యతిరేకంగా పోదు. అందువల్ల ఎవరూ దీన్ని నిరోధించడంలేదు. 4. దీనిలో బైబులు పఠనమూ బైబులు ప్రార్థనా ఎక్కువగా వుంటాయి. పైగా ఈ భక్తివిధానంలో ఓ విధమైన ఆనందమూ మాధుర్యమూ కూడ గోచరిస్తాయి. మంచి పాటలు పాడతారు. 5 పోపుగారూ మేత్రాణులూ ఈ వుద్యమాన్ని ప్రశంసించి ప్రోత్సహిస్తూ వచ్చారు.

5. పవిత్రాత్మ ఉద్యమంలోని ప్రధానాంశం ఏమిటి? ఆత్మ ద్వారా క్రీస్తుని అనుభవానికి తెచ్చుకోవడం. ఈ వుద్యమం క్రీస్తు ఈనాడు మన నడుమ వసిస్తున్నాడని చెప్తుంది. ప్రభు సందేశమైన బైబులు గ్రంథాన్ని భక్తితో చదవాలని బోధిస్తుంది. ఆత్మవరాలు విశ్వాసులందరికీ లభిస్తాయని వెల్లడిచేస్తుంది. కనుక ఈ వుద్యమం అన్ని విధాలా యోగ్యమైంది.

ఒక్క విషయం. పవిత్రాత్మ ఉద్యమం అంటే కేవలం పరిశుద్ధాత్మ పట్ల భక్తిని చూపేది మాత్రమేకాదు. అలాంటి భక్తి మార్గాలు పూర్వంనుండే చాలా వున్నాయి. మరి, ఆత్మద్వారా క్రీస్తుని చేరడం దీనిలోని ముఖ్యాంశం. ఆత్మ వచ్చిందిగూడ మనలను తనవైపు ఆకర్షించుకోవడం కోసంగాదు, క్రీస్తు చెంతకు చేర్చడంకోసం. బైబులుసంప్రదాయం ప్రకారం మొదటి నాయకుడు వెళ్ళిపోతూ రెండవ నాయకుణ్ణి నియమిస్తాడు. ఈ రెండవ నాయకుడు మొదటి నాయకుని పనిని కొనసాగిస్తాడు. మోషేదాటిపోతూ యోషువాను యిస్రాయేలు ప్రజకు నాయకునిగా నియమించాడు. ఇతడు ఆ ప్రజను వాగ్దత్త భూమికి చేర్చాడు. ఏలీయా దాటిపోతే ఎలీషాను ప్రవక్తగా నియమించాడు. ఇతడు గురువుగారి ప్రవచనోద్యమాన్ని కొనసాగించాడు. ఈలాగే క్రీస్తు వెళ్ళిపోతూ పరిశుద్ధాత్మను రెండవ ఆదరణకర్తగా నియమించాడు. క్రీస్తు తర్వాత వచ్చిన ఈ యాత్మ క్రీస్తు రక్షణకార్యాన్ని

కొనసాగిస్తుంది. మనలను క్రీస్తు చెంతకు చేరదీస్తుంది. ఈలా ఆత్మద్వారా క్రీస్తుని చేరడం ఈ వుద్యమంలోని ముఖ్యాంశం.

## 2. ఆత్మ నడిపించిన క్రీస్తు

1. పూర్వవేదంలో ప్రవక్తలు రాబోయే మెస్సీయా ఆత్మతో నిండివుంటాడని చెప్పారు. దేవుని ఆత్మ అతనికి జ్ఞానమూ వివేకమూ ప్రసాదిస్తుంది - యెష 11,2. ప్రభువు అతన్ని తన ఆత్మతో నింపుతాడు. ఆయాత్మను పొంది అతడు ప్రతిజాతికీ న్యాయం తీరుస్తాడు - 42,1. ప్రభువు మెస్సీయాను తనఆత్మతో నింపుతాడు. పేదలకు సువార్తను బోధించడానికీ, శ్రమపడే వాళ్ల బాధలను తొలగించడానికీ, బందీలకూ చెరలోవున్న వాళ్ళకూ విడుదలను ప్రకటించటానికీ ప్రభువు అతన్ని పంపుతాడు - 61,1. ఈలా పూర్వవేదం మెస్సీయా ఆత్మతో నిండివుంటాడని చెప్తుంది.

2. రక్షణకాలం ఆసన్నంకాగా పరిశుద్ధాత్మశక్తి వలన మెస్సీయా మానవరూపం చేకొన్నాడు. పరిశుద్ధాత్మ మరియ అనే కన్యపై దిగివచ్చింది. సర్వోన్నతునిశక్తి ఆమెను క్రమ్ముకొంది. ఆమె గర్భం ధరించి బిడ్డను కంది. ఆత్మశక్తివలన పుట్టిన ఆ బిడ్డడే క్రీస్తు - లూకా 1,35.

3. క్రీస్తు జ్ఞానస్నానం పొందుతూండగా ఆత్మ పావురంలాగ అతని మీదికి దిగివచ్చింది - లూకా 3,22. తండ్రి అతన్ని పవిత్రాత్మతోను శక్తితోను అభిషేకించాడు అచ 10,38. ఆశక్తితోనే క్రీస్తు బహిరంగ జీవితాన్ని ప్రారంభించాడు.

4. జ్ఞానస్నానానంతరం ఆత్మ క్రీస్తుని ఎడారికి కొనిపోయింది. అక్కడ అతడు నలువదినాళ్లు ప్రార్థనల్లో గడిపాడు. ఆత్మ బలంతో ప్రభువు ఎడారిలో పిశాచాన్ని ఎదిరించాడు, గెలిచాడు - మత్త 4,1.ఆత్మశక్తితోనే దయ్యాలను వెళ్ళగొట్టాడు - 12,28 (లూకా 11,20) బలవంతుడైన పిశాచాన్ని బంధించి వాని యిల్లు కొల్లగొట్టిన మహాబలవంతుడు ప్రభువు - మార్కు 3,27.

5. ఈ యాత్మ బలంతోనే క్రీస్తు సువార్తను ప్రకటించాడు - లూకా 4, 14-15. వ్యాధిగ్రస్థులకు ఆరోగ్యం ప్రసాదించాడు. -5. 17, ప్రభువు బహిరంగజీవితమంతా ఆత్మప్రేరణంతోనే కొనసాగిపోయింది. ఈకాలంలో ఆత్మ అతన్ని ఆనందంతో నింపింది. ఆ యానందంతో అతడు తండ్రిని కొనియాడాడు - 10,21.

6. ఆత్మ సహాయంతోనే క్రీస్తు చివరి శత్రువైన పిశాచాన్ని జయించి ఉత్థానుడయ్యాడు - 1 కొరి. 15, 45. అనగా ఉత్థాన క్రీస్తు తాను పొందిన ఆత్మను

మనకూ ప్రసాదిస్తాడు. ఆయాత్మద్వారా మనకు జీవం కలుగుతుంది. క్రీస్తు యిచ్చే ఆత్మద్వారానే మరణానంతరం మనంకూడ ఉత్థానమౌతాం - రోమా 8,11.

7. ఉత్థానక్రీస్తు ఆత్మ ఒకరితో ఒకరు కలిసివుంటారు - 2కొ 3,17. క్రీస్తు ఉన్నకాడ అతని ఆత్మకూడ వుంటుంది. అసలు ఇపుడు క్రైస్తవ సమాజంలో క్రీస్తుని ప్రత్యక్షంచేసేది ఆత్మే. ఆత్మ ద్వారానే క్రీస్తు ఈనాడు మన నడుమ నెలకొని వున్నాడు - మత్త 28, 20.

8. మొదటి పెంతెకోస్తునాడు క్రీస్తు శిష్యులమీదికి ఆత్మను పంపాడు. అప్పటినుండి ప్రభువు తన్ను నమ్మినవాళ్ళకు ఆత్మ నిస్తూనే వున్నాడు - అచ 2,38. ఈనాడు మనకు కూడ తన ఆత్మను ప్రసాదిస్తాడు. ఇవి విశేషంగా ఆత్మ క్రైస్తవ ప్రజలకు ప్రబోధం కలిగించే రోజులు. ఇక, క్రీస్తుమనకు ఆత్మ నిచ్చినట్లే ఆత్మ మళ్లా మనకు క్రీస్తు నిస్తుంది. ఆ యాత్మ అనుగ్రహంవల్లనే మనం క్రీస్తుని విశ్వసింపగల్గుతూన్నాం. - 1కొ 12,3.

# 3. ప్రభువు మనలను ప్రేమించేవాడు

1. ప్రభువు నన్నెందుకు ప్రేమించాలి? నావల్ల అతని కేమిలాభం? నన్ను ప్రేమించకపోతే అతనికేమి నష్టం? భగవంతుడు నరులను ఎందుకు ప్రేమిస్తున్నాడో తెలిసికోవాలి అంటే, ఆ నరుల వైపుగాదు భగవంతునివైపే చూడాలి. ప్రేమించడం భగవంతుని స్వభావం. దేవుడు ప్రేమస్వరూపుడు -1 యోహా 4,8. కనుక అతడు నరులను ప్రేమించకుండా వుండలేడు. ఆ ప్రభువు ప్రేమ ప్రతిఫలాన్ని ఆశించదుగూడ. మన నుండి అతడు ఏమి ఆశిస్తాడు గనుక? ఇక, అతని ప్రేమవలన మనకు లాభం కలుగుతుంది. అతని ప్రేమను పొందడంవల్ల మనం ప్రేమింపదగినవాళ్ల మౌతాం. కనుకనే అగస్టీను భక్తుడు "ఓ ప్రభూ! నీవునన్ను ప్రేమించావు కనుకనే నేను ప్రేమింప దగినవాణ్ణి అయ్యాను" అని పల్కాడు.

2. తండ్రి ఈ లోకాన్ని ఎంతో ప్రేమించి దాన్ని రక్షించడానికి తన ఏకైక కుమారుణ్ణి ప్రసాదించాడు - యోహా 3, 16. కనుక ప్రభువు మనలను ఉన్నవాళ్లను ఉన్నట్టుగా అంగీకరిస్తాడు, ప్రేమిస్తాడుగూడ. మనమంటే అతనికిఎంతో ఆదరం. అతడు మననుండి కోరుకొనేదల్లా మనం అతని ప్రేమకు అడ్డుచెప్పకుండా వుండాలనే. చాలామంది భగవంతుడు తమ్ము ప్రేమిస్తున్నాడని నమ్మనేనమ్మరు. వాళ్లు మానవుల ప్రేమకు నోచుకోలేక భగవంతుని ప్రేమను మాత్రం ఏలా పొందగలమని శంకిస్తూంటారు. కాని ఇది పొరపాటు. "నీ బాధలన్నీ ప్రభువుకి వదలివేయి, అతడు నిన్ను కాపాడతాడు" అంటుంది కీర్తన 55,

22. అన్ని రోగాలనూ కుదిర్చే ప్రధాన ఔషధం ప్రేమ. కనుక అన్నింటికంటె పైగా ప్రభువు ఈ ప్రేమౌషధాన్ని మనకు ప్రసాదిస్తాడు.

3. ప్రభువు ప్రేమ మనప్రేమలా చపలమైంది కాదు, నిలకడకలది. అతనిది శాశ్వతమైన ప్రేమ. కనుకనే ప్రభువు "నేను మిమ్ము శాశ్వత ప్రేమతో ప్రేమించాను" అన్నాడు - యిర్మీ 31,3. ప్రవక్త యెషయా ప్రభువు ప్రేమనుతల్లి ప్రేమతో పోల్చాడు. "తల్లి ప్రేగున బుట్టిన బిడ్డను మరచిపోతుందా? తన శిశువును ప్రేమించకుండా వుంటుందా? ఒకవేళ తల్లితాను కనిన బిడ్డను మరచిపోతే పోతుందేమోకాని నేను మాత్రం మిమ్ము మరచిపోను" - 49,15. ఇదే ప్రవక్త ప్రభువు ప్రేమను భర్త భార్యపట్ల చూపే ప్రేమతో గూడ పోల్చాడు. "నిన్ను సృజించిన ప్రభువే నీభర్త. సర్వశక్తిమంతుడని ఆయనకు పేరు. భర్తవలన పరిత్యక్తయై దుఃఖాక్రాంతురాలైన పడుచు భార్యను ఆ భర్తవలె ప్రభువునిన్ను మరల చేపడతాడు" - 54. 5-6. ఆ ప్రభువు మనకు దాపులోనే వుండి మనలను ఆదరిస్తుంటాడు. మనలను పేరెత్తి పిలిచి అభయ మిస్తుంటాడు. "మీరు లోతైన నీళ్లను దాటిపోయేపుడు నేను మీతోవుంటాను. మీ బాధలు మిమ్ము క్రుంగదీయలేవు. మీరు నిప్పు మంటలగుండా నడచిపోయేపుడు ఆ మంటలు మిమ్ము కాల్చివేయలేవు. మీకు అడ్డువచ్చే యాతనలు మిమ్ము బాధించలేవు. నేను మిమ్ము తప్పక రక్షిస్తాను" - 43,2. ఆ ప్రభువుకి మనం బాగాతెలుసు. అతడు మన పేరును తన చేతిమీద పచ్చ పోడిపించుకొంటాడు - 49, 16- ఎందుకు? మనలను గుర్తుంచుకొనేందుకు. అప్రభువు ప్రేమ మన రోగాలను తొలగించేదిగూడ. "నేను చెదరిపోయిన గొర్రెలను వెదుకుతాను. మంద నుండి తొలగిపోయినవాటిని మళ్లా తోలుకొనివస్తాను. గాయపడినవాటికి కట్టు కడతాను. జబ్బుగా నున్నవాటికి రోగం నయం జేస్తాను." - యెహెజ్కేలు34, 16. భగవంతుడు మన పట్ల చూపే ప్రేమలో ఇన్ని సద్గుణాలున్నాయి.

4. అనాదినుండీ అన్ని మతాలవాళ్లూ భగవంతుని ఆశిస్తూనేవచ్చారు. కాని ఈ మతాల్లో భక్తుడే భగవంతుని వెదకాడు. ఐనా మానవ ప్రయత్నంవల్ల భగవంతుడు లభ్యంకాడు. అందుకే బైబులు మతంలో దేవుడే నరుణ్ణి వెదక్కుంటూ వచ్చాడు. దేవుడు లోకాన్ని ఎంతో ప్రేమించి తన ఏకైక కుమారుని ప్రసాదించాడు. అతనిద్వారా నరులు నిత్యజీవం పొందుతారు. - యోహా 3,16

5. పవిత్రాత్మ ఉద్యమం నరులు దేవుని ప్రేమను గుర్తించేలా చేస్తుంది. క్రీస్తుద్వారా మనం పరిశుద్ధాత్మను అధికాధికంగా పొందేలా చేస్తుంది. ఆ ప్రభువు మనకు పరిశుద్ధాత్మతోను అగ్నితోను జ్ఞానస్నానమిస్తాడు - మత్త 3, -11. ఈలా క్రీస్తుద్వారా

పరిశుద్ధాత్మలోనికి జ్ఞానస్నానం పొందిన భక్తులకు భగవంతుని ప్రేమ ఎంతో గొప్పగా అనుభవానికి వస్తుంది. వాళ్ల హృదయం దైవప్రేమతో పులకించిపోతుంది.

6. ఈ దైవప్రేమద్వారా భక్తులు (1) ఓవైపు సోదరప్రేమను అలవర్చుకొంటారు. "నా సోదరులలో అత్యల్పునికి చేసిన ఉపకారం నాకు చేసినట్లే భావిస్తాను" అన్న ప్రభువాక్యాన్ని అర్థంచేసికొంటారు - మత్త 25,40. (2) మరోవైపు ప్రభువు మంచితనాన్ని లోకంముందు చాటిచెప్పడం ప్రారంభిస్తారు. ప్రభువు కారుణ్యానికి తాము సాక్షులుగా మెలుగుతారు - అచ 1,8.

7. ఈవుద్యమంద్వారా భక్తుల్లో "దేవుడు అన్నికార్యాలూ తన్ను ప్రేమించేవాళ్ల మంచికే తోడ్పడేలా చేస్తాడు" అనే నమ్మిక ఏర్పడుతుంది - రోమా 8,28. ఈ నమ్మికద్వారా భక్తులు ఎల్లవేళలా ప్రభుని స్తుతించి కొనియాడతారు. సమస్త కార్యాల్లోను యేసుక్రీస్తుద్వారా తండ్రికి కృతజ్ఞతలు చెల్లిస్తారు - ఎఫే 5,20. కనుకనే పవిత్రాత్మ ఉద్యమంలో పాటలూ స్తుతులూ విరివిగా వాడుతూంటారు.

# 4. ప్రభువు మనలను రక్షించేవాడు

1. మనం ఓ చీమలపుట్టను కాపాడాలి అనుకుంటే చీమలంకాము. కాని భగవంతుడు నరుణ్ణి కాపాడాలి అనుకొని నరుడై జన్మించాడు. అతడు లోకాన్ని ఎంతోప్రేమించి తన ఏకైక కుమారుణ్ణి ప్రసాదించాడు. - యోహా 3,16. ఆ ప్రభువు రక్షించాలి అనుకొన్న లోకం ఏలాంటిది? రోజూ వార్తాపత్రికలు చూస్తే మనకు తెలుస్తుంది. యుద్ధాలూ, హత్యలూ మోసాలూ, వైరమూ, కామమూ పరపీడనమూ - ఇటువంటి వాటితో నిండివుండేది. ఒక్క మన దేశంలోనే ప్రతినిమిషమూ ఓ హత్య జరుగుతూంటుంది. ఈలాంటి పాపపులోకాన్ని రక్షించాలి అనుకున్నాడు భగవంతుడు.

2. ఈలాంటి లోకాన్నీ, ఈలాంటి నరుణ్ణీ రక్షించడానికి విజయం చేసాడు ప్రభువు. ఆయనకు యేసు అని పేరు. రక్షకుడు అని ఆ పేరుకి అర్థం - మత్త 1,21. ఈ ప్రభువు నరులను రక్షిస్తున్నాడు. పెంతెకోస్తు ఉద్యమంలో ఈనాడు వందలకొలది ప్రజలు ప్రభురక్షణాన్ని చవిజూస్తున్నారు. నానారంగాల్లో ఈ ప్రభువు నరులను రక్షిస్తున్నాడు. 1. కొందరు షాపంవలనా దురభ్యాసాల వలనా బాధపడుతున్నారు. ఈలాంటి వాళ్లను ప్రభువు పాపంనుండి విముక్తి చేస్తాడు. 2. మరి కొందరు విచారము దుఃఖము అందోళనము ఒంటరిపాటు అనే మనోభావాలవలన బాధపడుతున్నారు. ప్రభువు ఈలాంటివాళ్ళ మనోభావాలను చక్కదిద్దుతాడు. వాళ్ల హృదయాల్లో తన ఆత్మను నిల్పి సంతోషమూ

సమాధానమూ కుమ్మరిస్తాడు. 3. ఇంకా కొందరు శాశ్వతమైన వ్యాధిబాధలతో శ్రమలనుభవిస్తున్నారు. ఈలాంటి వాళ్ళకు ప్రభువు ఆరోగ్యం ప్రసాదిస్తాడు. దేహదార్ఢ్యం దయచేస్తాడు. 4. వేరు కొందరు నిరాదరణం, అనంగీకారం, అస్పృశ్యత మొదలైన సాంఘిక అన్యాయాల వల్ల బాధపడుతున్నారు. ఈలాంటి వాళ్ళకు ప్రభువు తన ఆత్మ ద్వారా ప్రేమభావమూ, ఐక్యతా, పరస్పరాంగీకారమూ అనే వరాలను ప్రసాదిస్తాడు. 5. ఇంకా కొందరిని పిశాచం బంధించి నానా యాతనలూ పెడుతూంటుంది. ఈలాంటి వాళ్ళను ప్రభువు పిశాచదాస్యం నుండి విముక్తి చేస్తాడు. ఈ విధంగా క్రీస్తు రోజురోజు నరులను రక్షిస్తూనే వుంటాడు. ఆ ప్రభువిచ్చే రక్షణాన్నిమనం ఆదరంతో అందుకోవాలి.

3. ఆ ప్రభువుని మనం ఆత్మ రక్షకునిగా అంగీకరించినపుడు మనకు రక్షణం లభిస్తుంది. అతడు "భారంతో అలసిసొలసి వున్నవాళ్లంతా నావద్దకు రండి. నేను మీకు విశ్రాంతినిస్తాను" అంటాడు - మత్త 11, 28. ప్రభువుని మనం ఆహ్వానించాలి. అతన్ని మన హృదయాంతరాళంలో ఏకైక రక్షకునిగా నెలకొల్పు కోవాలి. అతడు మన హృదయ కవాటాన్ని మెల్లగా తడతాడు. ఆ ప్రభుస్వరాన్ని విని మనం హృదయమనే తలుపు తెరచినట్లయితే అతడు మన లోనికి వేంచేస్తాడు. మనకు ఆప్తుడూ స్నేహితుడూ ఔతాడు- దర్శ 3, 20. ప్రభువు దివ్యసాన్నిధ్యం వలన మన హృదయం కరిగి నిర్మల జీవితానికి పూనుకొంటాం. ప్రభువు కోరుకొనేది కూడ ఈ హృదయ పరివర్తనమే - మార్కు 1,15. పాపం చేసినపుడు సృష్టికర్తను కాదని సృష్టివస్తువుల వద్దకు వెళ్ళిపోతాం. దుడుకు చిన్నవాడు ఆలా చేసాడు. తండ్రిని కాదని దూర దేశానికి వెళ్ళిపోయాడు. ఇక, పరివర్తనం చెందినపుడు ఆ సృష్టివస్తువులను విడనాడి మళ్లా సృష్టికర్త వద్దకు తిరిగి వస్తాం. దుడుకు చిన్నవాడు మళ్లా తండ్రి యింటికి మరలివచ్చాడు. - లూకా 15,20.

4. ఈ పరివర్తనం ద్వారా ప్రభువు మన హృదయంలోకి అడుగిడతాడు. మనం నూత్నమానవుల మౌతాం. మన హృదయంలోని బుద్ధులు క్రొత్తవి ఔతాయి. మనకు నూత్న స్వభావం లభిస్తుంది - ఎఫే 4,23. ఎవడు క్రీస్తుని అంగీకరించి అతనియందు నెలకొంటాడో వాడు నూత్న సృష్టి ఔతాడు. వానిలో ప్రాత జీవితం నశించి క్రొత్తజీవితం ప్రారంభమౌతుంది - 2 కొ 5,17

5. హృదయ పరివర్తన మనేది ఆత్మ యిచ్చే వరం. ఆ యాత్మే మన హృదయం స్వీయపాపాన్ని గుర్తించేలా చేస్తుంది - యోహా 16,8. మన అసత్యజీవితాన్ని ఖండించి మనం సత్యాన్ని చేపట్టేలా చేస్తుంది. క్రీస్తే ఈ సత్యం - 16,13. పరిశుద్ధాత్మలోనికి జ్ఞానస్నానం పొంది ఆ దివ్యాత్మచే నడిపింపబడే నరులకు సున్నితమైన మనస్సాక్షి

అలవడుతుంది. వాళ్లు ఎప్పటికప్పుడు తమ పాపాలను అర్థంచేసికొని పశ్చాత్తాపపడి ప్రభువు మన్నింపు పొందుతుంటారు. ఈ పరివర్తనం ద్వారా వాళ్ళకు చిత్తశాంతీ ఆంతరంగికమైన స్వాతంత్ర్యమూ లభిస్తుంది. ప్రభువు ఆత్మ వుండేకాడ స్వాతంత్ర్యం వుండితీరుతుంది-2 కొ 3,17. ఆంతరంగికమైన సంతోషమూ శక్తీ కూడ లభిస్తాయి - గల 5,22.

## 5. ప్రభువు మన రోగాలను కుదిర్చేవాడు

1. ప్రభువు మన వ్యాధులను నయం జేసేవాడు. ఆనాడు అతడు జనబాహుళ్యాన్ని చూచి జాలిపడి వాళ్ళ వ్యాధులను స్వస్థపరచాడు - మత్త 1, 14. యెషయా ప్రవక్త మెస్సీయాను గూర్చి "ఆయన మన బాధలన్నీ పోగొట్టాడు. మన వ్యాధులన్నీ తానే మోసికొనిపోయాడు" అని చెప్పాడు. మత్తయి ఈ వాక్యాన్ని క్రీస్తుకి అన్వయింప జేసాడు - 8,17.

2. వ్యాధిగ్రస్తులను నయంజేసేనే శక్తి ప్రభువు నుండి శిష్యులకు సంక్రమించింది. పేత్రు క్రీస్తు నుండి పరలోక రాజ్యపు తాళపుచెవులను పొందాడు. అనగా క్రీస్తు నుండి సర్వాధికారమూ పొందాడు. - మత్త 16,19. క్రీస్తును విశ్వసించే శిష్యులు అతడు చేసిన అద్భుత క్రియలన్నీ చేయగలరు - యోహా 14,12. తొలినాటి శిష్యులు క్రీస్తు పేరుమీదిగా వ్యాధిగ్రస్తులను స్వస్థపరచారు - అచ 4,30.

3. పెంతెకోస్తు ఉద్యమంలో భక్తుల వ్యాధిబాధలు నయం కావడం కద్దు. మన వ్యాధిబాధలన్నీ నాల్గురకాలుగా వుంటాయి. ప్రభుని విశ్వసించినవాళ్లకి ఈ నాల్గురకాల రోగాలూ నయమౌతూనేవుంటాయి.

1) ఆధ్యాత్మికమైన వ్యాధి : ఈ వ్యాధి మనదేహానికి కాక ఆత్మకు సంబంధించింది. దానికి కారణం మన పాపం. ఈ వ్యాధిని తొలగించడానికి తిరుసభ నిర్ణయించిన మార్గం పాపసంకీర్తనం. ఈ వుద్యమం అనుసరించే మార్గం పశ్చాత్తాపం. పాపవ్యాధిని నయం జేయడానికి సహజమైన మార్గమేమీలేదు.

2) మనోభావాలకు సంబంధించిన వ్యాధి : దీనివలన మనం తోడిజనంతో ఒద్దికగా మెలగం. కోపతాపాలకు గురౌతాం. ఇతరులతో సంబంధబాంధవ్యాలు త్రెంచుకొంటాం. ఈ వ్యాధికి కారణం జన్మపాపం. ఈ వ్యాధిని తొలిగించడానికి తిరుసభ నిర్ణయించిన మార్గం పాపసంకీర్తనమూ దివ్యసత్ప్రసాదమూ అనే సంస్కారాలు. ఈ ఉద్యమం అనుసరించే మార్గం, వ్యాధిగ్రస్తులకు అంతరంగికమైన హృదయారోగ్యం చేకూరడానికై ప్రార్థన చేయడం.

ఈ వ్యాధిని నయంజేయడానికి సహజమార్గం కూడ వుంది. అది మనస్తత్వశాస్త్రజ్ఞుల నుండి సలహా పొందడం.

3) శారీరకమైన వ్యాధి : దీనివల్ల మన శరీరానికి జబ్బుచేస్తుంది. ఈ వ్యాధికి కారణం రోగక్రిములూ అపాయాలూ అలసటా మొదలైనవి. ఈ వ్యాధిని తొలగించడానికి తిరుసభ నిర్ణయించిన మార్గం అవస్థాభ్యంగనం. ఈ వుద్యమం అనుసరించే మార్గం శారీరక ఆరోగ్యంకోసం విశ్వాసంతో ప్రార్థన చేయడం. ఈ వ్యాధిని నయంజేయడానికి సహజమార్గం ఔషధ సేవ.

4) పిశాచం పూని పై వ్యాధుల్లో కొన్నిగాని అన్నీగాని కలిగించవచ్చు. ఈ వ్యాధిని తొలగించడానికి తిరుసభ నిర్ణయించిన మార్గం దయ్యాన్ని పారద్రోలే తిరుసభ ప్రార్థనలు జపించడం. ఈ వుద్యమం అనుసరించే మార్గం పిశాచ విముక్తికై ప్రార్థన చేయడం. ఈ వ్యాధిని నయంజేయడానికి సహజమార్గమేమిలేదు.

5) క్రైస్తవ సమాజంలో కొందరికి వ్యాధులను నయంజేసే శక్తి వుంటుంది. ఇది ఆత్మ యిచ్చే వరం - 1కొ 12,9. కాని అందరూ ప్రభువు వాగ్దానాన్ని నమ్ముకొని వ్యాధి నివారణం గావాలని ప్రార్థన చేసికోవచ్చు. "ప్రార్థనలో మీరు దేనిని అడిగినా తప్పకుండా పొందుతామని విశ్వసించండి" అన్న ప్రభువాక్యం ఉండనేవుంది - మార్కు 11,24. వ్యాధి నివారణకు ఈ విశ్వాసం అనేది అత్యవసరం.

వ్యాధి నివారణంకోసం ప్రార్థన చేసికొనేపుడు మన ప్రవర్తనం ఏలా ఉండాలి? మనకు వ్యాధి నయంజేసేవాడూ, చేయాలని కోరుకొనేవాడూ ప్రభువు. కనుక మొదట మన మనస్సు అతని మీద లగ్నం కావాలి. అటుపిమ్మట మనం ఏ అవయవంలో లేక రంగంలో ఆరోగ్యంకోరుకొంటున్నామో ప్రభువుకి తెలియజెప్పి ఆరోగ్యదానం కోసం ప్రార్థనం చేసికోవాలి. ఆరోగ్యంతోనూ శక్తితోనూ ప్రేమతోనూ మన శరీరాన్ని నింపమని ఆ ప్రభువుని అడుగుకోవాలి. కడన ఆ ప్రభువు మనకు ఆరోగ్యం ప్రసాదించాడనీ లేక ప్రసాదిస్తాడనీ నమ్మాలి. అతనికి కృతజ్ఞత తెలియజేయాలి. దీనివల్ల హృదయంలో శాంతీ సంతోషమూ నెలకొంటాయి.

4. దేవుని ఆత్మ మనకు భయాన్ని కలిగించదు - రోమా 8, 13. సంతోషాన్ని ఆనందాన్ని ప్రేమనీ అనుగ్రహిస్తుంది - గల 5,22. కనుక ఈ యాత్మచే నడిపింపబడే భక్తులకు అనారోగ్యమూ విషాదమూ గాక, ఆరోగ్యమూ, ఆహ్లాదమూ లభిస్తుంది. ఈ వరాల కోసం మనం ఆత్మను ప్రార్థించాలి.

5. కొందరు క్రైస్తవులు వ్యాధి సోకినపుడు మందులు వాడ్డానికి అంగీకరించరు. దేవుని యందు విశ్వాసముంచితే చాలాదా అని వాదిస్తారు. ప్రోటస్టెంటు క్రైస్తవుల్లో ఈలాంటివాళ్ళు కన్పిస్తారు. ఈలాగే కొందరు క్యాతలిక్ క్రైస్తవులు వ్యాధిని నయంజేసే ప్రార్థనలను వాడుకోవడానికి అంతగా అంగీకరించరు. ఇవి రెండూ విపరీత ధోరణులు. ప్రార్థనద్వారా దేవుని ఆశీర్వాదమూ అడుగుకోవాలి, మందుల ద్వారా మన ప్రయత్నమూ మనం చేయాలి. తరచుగా ప్రభువు మందుల ద్వారా మనకు ఆరోగ్యం ప్రసాదిస్తాడు.

ఇక, వ్యాధి సోకినపుడు క్రీస్తు సిలువ మనమీద భారంగా వ్రాలుతుంది. జ్ఞానస్నానం పొందినపుడే మనం అతని సిలువలో పాలుపంచుకొంటాం - రోమా 6,3. ప్రభువు మనలను రక్షించేది ఈ సిలువ ద్వారానే. కనుక వ్యాధిబాధలు కేవలం చెడ్డవిగావు. వాటిద్వారా గూడ ప్రభువు మనలను దీవిస్తాడు. ఒకోమారు అవి లేకపోతే మనం ప్రభువుచెంతకు పోనేపోము.

## 6. ప్రభువు అంతరంగికమైన ఆరోగ్యం ప్రసాదించేవాడు

1. జీవితంలో బాధలు ఎదురౌతుంటాయి. ఈ బాధలవల్ల మనం హైన్యభావాల వంటి మనస్తత్వాలూ, కోపంవంటి మనోభావాలూ, త్రాగుడువంటి దురభ్యాసాలూ అలవర్చుకొంటాం. ఇవి మన బాధలు. కాని ఈ బాధలు మనపూర్వ జీవితంలో జరిగిన కొన్ని విషమసంఘటనలను ఆధారంగా జేసికొని ఉద్భవించాయి. ఈ పూర్వ సంఘటనలు చాలవరకు మన బాల్యప్రాయానికి సంబంధించినవి. మనం నాలుగైదేండ్లప్రాయంలో వున్నపుడు కొన్ని బాధాకరమైన సంఘటనలు జరిగాయి. వాటి స్మృతులు మన అజ్ఞాత మనస్సులో గూడుగట్టుకొని వుంటాయి. వాటి నిప్పుడు అంత సులభంగా జ్ఞప్తికి తెచ్చుకోలేం. కాని ఆ పూర్వ స్మృతులు ఊరుకోవు. పిలకలు వేస్తుంటాయి. వీటివలన ఇప్పుడు మన జీవితంలో హైన్యభావాలవంటి బాధలు ఏర్పడతాయి. అనగా ఆనాటి బాల్యస్మృతులవల్ల ఇప్పుడు మనం కానిపనులు చేస్తాం. కనుక ఇవి వ్యాధుల్లాంటివి. ఈ స్మృతులనుండి గూడ ప్రభువు మనకు ఆరోగ్యం దయచేస్తాడు.

2. ప్రభువుకి మన భూతకాలంగూడ బాగా తెలుసు. అతడు నిన్నా, ఈనాడూ, ఎప్పుడూ ఒకేరీతిగా వుండేవాడు - హెబ్రే 13,8. మనం చిన్నపిల్లలంగా వున్నపుడు జరిగిన విషాదసంఘటనలూ వాటివల్ల మనం కలిగించుకొన్న పూర్వస్మృతులూ ఆ ప్రభువుకి తెలుసు. ఆ స్మృతులు ఇప్పుడు మనజీవితంలో చిక్కులు తెచ్చిపెడుతున్నాయనిగూడ అతనికి

తెలుసు. ఈ విషపాశాలనుండి మనలను విడిపించి మనకు పూర్ణ ఆరోగ్యాన్ని ప్రసాదించడానికి ప్రభువు సిద్ధంగావున్నాడు.

3. ప్రభువు మనకు పూర్వస్మృతులనుండి ఆరోగ్యంప్రసాదించవలసిన రంగాలు చాలావున్నాయి. కొన్నిటిని ఈ క్రింద ఉదహరిస్తున్నాం.

1) మన మనోభావాలు విషమించి మనలను బాధిస్తాయి. దీని వల్ల మనకు విపరీతమైన సిగ్గూ, బిడియమూ, విచారమూ, ఒంటరిపాటూ, హైన్యభావాలూ కలుగుతాయి.

2) మన మానసిక గుణాలుకూడ విషమించి మనలను పాపంవైపు నడిపిస్తాయి. ఈ కారణంవల్ల కోపమూ, ద్వేషమూ, వైరమూ, పగా, అసూయా మొదలైన దుర్గుణాలు మనహృదయంలో తావు చేసికొంటాయి.

3) కొన్ని దురభ్యాసాలు మనలను నిర్బంధపరుస్తాయి. ఇందువల్ల మనం మద్యపానప్రీతి, ముష్టిమైథునం మొదలైన దురభ్యాసాలకు అలవాటు పడిపోతాం. ఇక ఆ చెడు అలవాటులను తప్పించుకోవాలన్నా తప్పించుకోలేం. అవి మనలను నిర్బంధపెడతాయి. ఈ రంగాలన్నిటిలోను ప్రభువు మనకు ఆరోగ్యం ప్రసాదించవలసిందే.

4. ఈ పూర్వస్మృతులనుండి ఆరోగ్యం పొందాలంటే ప్రభువుకి ప్రార్థనలు అర్పించుకోవాలి. ఈ ప్రార్థనలు చేసేపుడు పాటించవలసిన నియమాలు ఇవి.

1) ప్రభువు మన రక్షకుడు, ఆరోగ్యదాత. అతన్ని మన జీవితంలోకి ఆహ్వానించి మన ప్రస్తుత బాధని అతని ముందు పెట్టాలి. మనం ఈ బాధతో సతమత మౌతూన్నామని అతనికి తెలుసు. మనమేలు కోసమే ప్రభువు దాన్ని అనుమతించాడు.

2) ఈ ప్రస్తుత బాధకు ఆధారమైన పూర్వస్మృతి ఏదో వుంది. కనుక ప్రభువుతో మనపూర్వ జీవితంలోకి వెళ్ళాలి. అనగా మన బాల్యజీవితాన్ని గుర్తుకు తెచ్చుకోవాలి. ఆనాడు ప్రభువు మనపై గల ప్రేమచేతనే ఆ సంఘటనను జరుగనిచ్చాడు.

3) ఆ పూర్వస్మృతిని ఇప్పుడు జ్ఞప్తికి తీసికొనిరమ్మని పరిశుద్ధాత్మను అడుగుకోవాలి.

4) ఆనాడు ఆ సంఘటనంద్వారా మనకు హాని చేసి ఆలాంటి స్మృతికి కలిగించిన వ్యక్తులను క్షమించమని ప్రభుని ప్రార్థించాలి. మన తరుపున మనం పూర్తిగా వాళ్ళను క్షమించాలి. ప్రభువు వాళ్ళను దీవించాలనికూడ ప్రార్థించాలి. ఒకవేళ మనమే ఇతరులకు హాని చేసివుంటే ప్రభుని క్షమాపణం అడుగుకోవాలి.

5) ఆ స్మృతిని ప్రభువు ముందుపెట్టి దాన్ని నయంజేయమని అడుగుకోవాలి. దానివల్ల మనం ఇప్పుడు బాధ పడకుండా వుండేలా గూడ చేయమని ప్రార్థించాలి.

6) కడన ప్రభువు మన బాధాకరమైన స్మృతిని నయంజేస్తాడు అని విశ్వసించాలి - మార్కు 11,24. అతనికి వందనాలు చెప్పాలి.

5. ఈలా మనం పూర్వస్మృతులు నయంగావడం కోసం ప్రార్థనం చేసికొన్నపుడు ఏం జరుగుతుంది? ప్రభువు మన పూర్వస్మృతిని పూర్తిగా తుడిచివేయడు. కాని ఆ స్మృతివల్ల మనం ఇప్పుడు అనుభవించే కష్టమూ విచారమూ భయమూ ద్వేషమూ మొదలైన అనిష్టగుణాలను తొలగిస్తాడు. ఆ స్మృతి అనే పుండులోని విషాన్ని పిండివేస్తాడు. పైగా ఆనాడు మనకు నిరాకరింపబడిన ప్రేమ అంగీకారము మెప్పుకోలు అనే మంచి గుణాలు ఈనాడు మన హృదయంలో నిండుకొనేలా చేస్తాడు. దీనివల్ల మనకు నూత్న బలమూ ఆనందమూ సిద్ధిస్తుంది. మన మీద మనకే నమ్మకం గలిగి మన ప్రస్తుత సమస్యలను ధైర్యంతో ఎదుర్కోగలుగుతాం.

6. పూర్వస్మృతులు నయంగావడంకోసం చేసిన ప్రార్థన మామూలుగా ఫలిస్తుంది. కాని ఈలా ఫలించాలంటే పైన నాల్గవ అంశంలో చెప్పిన షరతులన్నీ నెరవేరాలి. విశేషంగా మనకు అపకారం చేసినవాళ్ళని క్షమించాలి. ఈలా క్షమించక పోతే మన పూర్వస్మృతులు నయంకావు. ఈ నయం కావడమనేది ఒకోమారు ప్రార్థన చేసిన వెంటనే జరుగుతుంది. ఒకోమారు కొంతకాలమైనంక నిదానంగా జరుగుతుంది. వెంటనే నయమైనా కాలక్రమేణ నయమైనా మనంమాత్రం ప్రభుని స్తుతించాలి. ఈ స్తుతిద్వారా ప్రభువు మరీ ఎక్కువగా ఆరోగ్యం దయ చేస్తాడు.

7. పూర్వస్మృతులను నయంజేసికోవడానికి ఇతరుల సహాయం కూడా పొందవచ్చు. కొందరికి వ్యాధులను నయం జేసే వరం వుంటుంది. ఆలాంటి వాళ్ళచేత ప్రార్థన చేయుంచుకొని మానసికమైన ఆరోగ్యాన్ని పొందవచ్చు. కాని ఈలాంటి వాళ్ళు మనం కోరుకొన్నపుడెల్లా దొరకరు. అలాంటప్పుడు మనకు మనమే ఈ బాధలనుండి విముక్తులం కావడానికై ప్రార్థన చేసికోవాలి. ఇప్పుడు మనలను వేధించే సమస్యను తీసికొని ప్రభువు ముందు పెట్టి ఆ బాధను తొలగించమని ప్రార్థించాలి. ఆ ప్రార్థనా పద్ధతిని పైన వివరించాం.

## 7. పిశాచంనుండి విముక్తి కలిగించేవాడు

1. లోకం, శరీరం పిశాచం అని నరునికి జ్ఞాన శత్రువులు మూడున్నాయి. మొదటిది, లోకంలోని తోడిజనం మనలను పాపానికి పురికొల్పుతారు. రెండవది, మన పతనస్వభావంకూడ మనలను పాపానికి పురికొల్పుతుంది. ఆదాము ద్వారా మనకు

సంక్రమించిన జన్మపాపం ద్వారా మన మానవ స్వభావం బలహీనమైపోయి పాపం వైపు మొగ్గుతుంది. మూడవది, పిశాచం కూడ మనలను బాధిస్తుంది. ఈ పిశాచం నుండికూడ ప్రభువు మనకు విముక్తి దయచేయాలి.

2. కొంతమంది పిశాచం లేదు అని చెప్తూంటారు. దయ్యాన్ని నమ్మరు. ఈలా తలంచడం చాలా ప్రమాదకరం. తెలిసిన శత్రువు కంటె తెలియని శత్రువువలన ఆపద యెక్కువ. దయ్యం లేదులే అని ధీమాగా వుండిపోతే అది మనలను సులభంగా మోసగిస్తుంది. మరి కొంతమంది జీవితంలో ఏ కీడు వాటిల్లినా అది దయ్యమే చేసిందనుకుంటారు. దయ్యం మనకు కీడుచేసే మాట నిజమేగాని, మనకు కలిగే కీడులన్నీ దయ్యాన్నుండి కాదు. ఈ రెండు విపరీత మార్గాలకు మధ్యలో వుంది సత్యమార్గం. దయ్యం అనే శక్తి వొకటుంది. ఆ శక్తి మనకు హాని చేయాలని కోరుకొంటుంది. మన శత్రువైన పిశాచం గర్జించే సింహంలా తిరుగుతూంటుంది. ఎవరిని మ్రింగివేద్దామా అని చూస్తూంటుంది. కనుక మనం జాగ్రత్తగా వుండాలి – 1 పేత్రు 5,8. మన శత్రువులందరిలో పెద్ద శత్రువు పిశాచం. అది మానవజాతికే శత్రువు. ఈ విరోధినుండి మనం తప్పకుండా జాగ్రత్తపడాలి.

3. పిశాచం మనలను బాధిస్తుంది. తన అదుపులోకి తెచ్చుకొంటుంది. ఈ క్రింది సందర్భాల్లో మనం పిశాచం అదుపులో వున్నామనే అనుకోవాలి.

1) కొందరు పిశాచాన్ని పూజిస్తూంటారు. దయ్యాన్ని ఆహ్వానించి దానిచేత ఈపనీ ఆపనీ చేయిస్తూంటారు. ఈలాంటివాళ్లు దయ్యానికి అమ్ముడు పోయినట్లే.

2) కొందరు తోడి జనంపట్ల విపరీతమైన ద్వేషాన్ని చూపెడుతూంటారు. భగవంతుడు ప్రేమమయుడు. పిశాచం ద్వేషనిధి. కనుక ఎవరిలోనైనా విపరీత ద్వేషం వుంటే వాళ్ళల్లో పిశాచం వున్నట్లే. బద్ధవైరమూ, అధికరోషమూ పిశాచ ప్రవేశానికి మార్గాలు.

3) ఒకోమారు ఏదోశక్తి మనలను పాపం చేయమని నిర్బంధించినట్లుగా వుంటుంది. ఈ నిర్బంధంవల్ల జనం మద్యపాన ప్రీతి, ముష్టిమైథునం మొదలైన పాపాలు కట్టుకొంటారు. ఈ దురభ్యాసాలను మానుకొందామనుకొన్నా మానుకోలేరు. ఇక్కడ కూడ పిశాచశక్తి పనిచేస్తూన్నట్లే భావించాలి.

4) కొంతమంది మరోరకమైన నిర్బంధానికి గురౌతారు. జనంతో కలియకుండా ఒంటరిగా వుండిపోతూంటారు. ఆత్మహత్య చేసికోగోరుతారు. ఈలాంటప్పుడుగూడ పిశాచం పూనినట్లే.

5) ఇంకా కొందరిని విపరీతమైన భయాలు కృంగదీస్తూంటాయి. కొందరికి చావంటే మహా భయం. ఇంకా కొందరికి చీకటంటే విపరీతమైన భయం. ఈలాంటి విపరీత భయాలు కూడ పిశాచావేశానికి చిహ్నాలే. ఈలాంటి బాధలన్నిటినుండీ ప్రభువు మనకు విముక్తి కలిగించాలి.

4. ప్రభువు దయ్యాన్ని ఓడించాడు. ప్రభువు వచ్చిందాకా పిశాచం ఈ లోకపు నాయకుడు. తాను బలవంతుడై ఈ లోకాన్ని ఏలేవాడు. కాని క్రీస్తు వచ్చి ఈ లోకాధికారిని వెలుపలకు గెంటివేసాడు - యోహా 12, 31. ప్రభువు మహాబలవంతుడు. అతడు వచ్చి బలవంతుడైన పిశాచాన్ని బంధించి వాని యిల్లు కొల్లగొట్టాడు - మత్త 12, 29. పిశాచం ఆకాశంనుండి మెరపుతీగలా పడిపోతూండగా ప్రభువు చూచాడు - లూకా 10, 18. ఈ వాక్యాలన్నీ ప్రభువు పిశాచాన్ని జయించాడు అనడానికి నిదర్శనాలు. కాని ప్రభువు పిశాచాన్ని ఎందుకు జయించాడు? తనకోసం గాదు. మన కోసం. అతని విజయం మన విజయం. కనుక మనం పిశాచంతో పోరాడేపుడు అతని విజయం మనమీద సోకి మనం దయ్యాన్ని జయించేలా చేస్తుంది. బలహీనమైన సన్నని తీగ మహావృక్షం మీదికి ఎగప్రాకి ఆ వృక్షం బలంలో తానూ పాలుపొందుతుది. అలాగే బలహీనులమైన మనం ప్రభువుతో ఐక్యమై అతని బలంలో పాలుపొందుతాం. ఆ బలంతోనే భూతాన్ని జయిస్తాం.

5. మన తరపున మనం ప్రభుసహాయం అడుగుకోవాలి. అతని దివ్యనామాన్ని భక్తితో ఉచ్చరించి పిశాచాన్ని తరిమివేయాలి. ఆ ప్రభువు దివ్యరక్తం పేరుమీదుగా దయ్యం వెళ్ళి పోవాలని అడుగుకోవాలి. ఆ ప్రభువు పరిశుద్ధాత్మద్వారా దుష్టాత్మ పారిపోవాలని ప్రార్థించాలి. ఆ ప్రభువు ఉచ్చరించిన వాక్యాలను బైబుల్లో పదిలపరచి వుంచారు. ఆ బైబులు వాక్యాలను చదివి పిశాచాన్ని తరిమివేయాలి. ఆ ప్రభువు పరిశుద్ధ జననియైన మరియమాత పేరుమీదిగా సైతాను పలాయనం కావాలని ప్రార్థించాలి. పిశాచాన్ని జయించే మార్గాలు ఇవి.

6. పరిశుద్ధాత్మా అపరిశుద్ధాత్మయైన పిశాచమూ ఒకరినొకరు సహింపరు. కనుక పరిశుద్ధాత్మ ఉన్నకాడ పిశాచం వుండలేదు. పిశాచం వున్నకాడ పవిత్రాత్మ వుండదు. వాళ్ళిద్దరూ వెలుగూ చీకటిలాంటివాళ్లు. పవిత్రాత్మ మనలను క్రీస్తు చెంతకు చేర్చాలని కోరుకొంటుంది. పిశాచం మనలను క్రీస్తు చెంతనుండి కొనిపోయి నరకకూపంలో పడద్రోయాలని కోరుకొంటుంది. కనుక మనం పవిత్రాత్మను మన హృదయంలో ప్రవేశపెట్టమనీ, పిశాచం మన హృదయంలో ప్రవేశించకుండా వుండేలా చేయమనీ ప్రభుని మనవిచేసికోవాలి.

# 8. ప్రభువు పరిశుద్ధాత్మతో జ్ఞానస్నానం ఇచ్చేవాడు

1. ప్రభువు ప్రజలకు పరిశుద్ధాత్మతో జ్ఞానస్నానమిస్తాడు. "అతడు పవిత్రాత్మతోను అగ్నితోను జ్ఞానస్నానమిస్తాడు - లూకా 3, 16; యోహా 1, 33. కనుక ఉత్థాన క్రీస్తు పెంతెకోస్తు నాటినుండి భక్తులకు పరిశుద్ధాత్మతో జ్ఞానస్నానం ఈయడం మొదలెట్టాడు. తండ్రి

వాగ్దానం ప్రకారం తాను పరిశుద్ధాత్మను పొంది ఆ యాత్మను శిష్యులమీదికి కుమ్మరించాడు. అచ 2, 33. యేసు ఉత్థానమైనంకనేగాని తండ్రినుండి తాను పూర్ణంగా ఆత్మను పొందదమూ, ఆలా పొందిన ఆత్మను మనకు అందీయడమూ జరగదు - యోహా 7, 39.

2. ఈలా ప్రభువు తన ఆత్మను విశ్వాసులకు ఇచ్చుకొంటూపోతూనే వుంటాడు. ఈనాడు చాలమంది భక్తులు ఆత్మలోనికి జ్ఞానస్నానం పొందుతున్నారు. వారిలోనికి ఆత్మ నూత్నంగా ప్రవేశిస్తుంది. ఈయాత్మ ప్రవేశంవల్ల భక్తులు జీవితాలు చాలవరకు మారిపోతున్నాయి.

3. కాని ఆత్మలోనికి జ్ఞానస్నానం పొందడమంటే యేమిటి? ఇది రెండవ జ్ఞానస్నానంకాదు. జ్ఞానస్నానం ఒక్కసారే - ఎఫే 4,5. రెండవ భద్రమైన అభ్యంగనమూకాదు. మరి క్రొత్తగా ఆత్మను పొందడం. జ్ఞానస్నానంలో ఆత్మను పొందుతాం. కాని ఆ యాత్ముడు దైవవ్యక్తి కనుక అతన్ని పూర్తిగా పొందలేం. ఇప్పుడు పరిశుద్ధాత్మ జ్ఞానస్నానం ద్వారా ఆ దైవవ్యక్తిని మళ్ళా పొందుతాం. ఈలా ఎన్నిసార్లయినా పొందవచ్చు. మన తరపున మనం ఎన్నిసార్లు ఆత్మను పొందినా ఆ దివ్యవ్యక్తిని పూర్తిగా పొందలేం. అతడు పరిమితి లేనివాడు. మనం పరిమితి కలవాళ్ళం. కుండతో ఎన్నిసార్లు ముంచుకొన్నా సముద్రంలోని నీళ్లు తరిగిపోవుగదా!

4. పరిశుద్ధాత్మ జ్ఞానస్నానం ద్వారా జ్ఞానస్నానం, భద్రమైన అభ్యంగనం, దివ్యసత్ప్రసాదం అనే మూడు క్రైస్తవ సంస్కారాలూ మనకు ఎక్కువ ఫలితమిస్తాయి. ఈ సంస్కారాలిచ్చే ఫలితాలను ఇక్కడ ఓమారు జ్ఞప్తికి తెచ్చుకోవాలి.

1) జ్ఞానస్నానం ద్వారా :

1. క్రీస్తుతో ఐక్యమౌతాం - 1కొ 12, 17.
2. ఆత్మను పొంది మన హృదయంలో నిలుపుకొంటాం -1కొ 3,16.
3. మనకు క్రొత్తపుట్టువు కలుగుతుంది - తీతు 3,5.
4. పాప పరిహారం లభిస్తుంది - ఎఫే 5,26.
5. దేవునికి దత్తపుత్రుల మౌతాం - రోమా 8,15.
6. స్వార్థానికి చనిపోయి క్రీస్తు ఉత్థానంలో పాలుపొందుతాం - రోమా 6,3-4.

2) భద్రమైన అభ్యంగనం ద్వారా :

1. క్రీస్తుకి సాక్ష్యమిస్తాం - అచ 1,8.
2. క్రీస్తు శరీరమైన తిరుసభను నిర్మిస్తాం - 1కొ 12, 27.

3) దివ్యసత్ర్పసాదం ద్వారా :

1. క్రీస్తు నెత్తుటితో క్రొత్తనిబంధనం ఏర్పడుతుంది 1కొ 11,25.

2. యాజకులైన క్రైస్తవ ప్రజలు బలి సమర్పిస్తారు - 1 పేత్రు 2,9.

3. క్రీస్తుతోను తోడి క్రైస్తవ ప్రజలతోను ఐక్యమౌతారు - 1కొ 10, 16-17.

4. ఆధ్యాత్మికమైన భోజనము బలమూను - యోహా 6, 53-55.

సంస్కారాలు వాటంతట అవి పై ఫలితాల్నిస్తాయి. కాని మన తరపున మనం ఈ ఫలితాల్ని పొందుతామా అనేది అనుమానం. మన హృదయం సిద్ధంగా వుండకపోవడంవల్ల ఈ ఫలితాలను పొందలేకపోతున్నాం. ఈలాంటప్పుడు పరిశుద్ధాత్మ జ్ఞానస్నానం మన హృదయాన్ని శుద్ధిచేసి మనం పై ఫలితాలను పొందేలా చేస్తుంది. క్రీస్తు మన లోనికి పంపిన దివ్యాత్మ ఓ వైపు మనలను పితసుతులతోను, మరోవైపు తోడి క్రైస్తవ జనంతోను ఐక్యపరుస్తుంది. మనకు దైవప్రేమ సోదరప్రేమ ప్రసాదిస్తుంది.

5. కనుక పరిశుద్ధాత్మ లోనికి జ్ఞానస్నానం పొందడమంటే సంగ్రహంగా :

1) ఉత్థాన క్రీస్తు తన ఆత్మను మన హృదయంలోకి ప్రవేశపెడతాడు. మనం క్రొత్తగా ఆత్మను పొందుతాం.

2) ఆత్మ మన జీవితాన్ని అదుపులో పెట్టుకొంటుంది. మనలను క్రీస్తువైపు నడిపిస్తుంది.

3) ఆత్మ మనకు తన వరాలనూ ఫలాలనూ పుణ్యాలనూ ప్రసాదిస్తుంది.

4) ఆత్మ దేవునిపట్లా తోడి నరులపట్లా మనకుండే సంబంధబాంధవ్యాలను చక్కదిద్దుతుంది. మన జీవితాన్నీ ఈ జీవితంలోని బాధ్యతలనూ సవరిస్తుంది.

6. ఆత్మజ్ఞానస్నానం ద్వారా మనలో ఆత్మశక్తి పెరుగుతుంది. ఇంతకుముందు మనకు మనమే నడుపుకొంటూన్న జీవితాన్ని ఇపుడు ఆత్మ నడిపించడం మొదలిడుతుంది. మన జీవితనౌకకు అతడు కర్ణధారి ఔతాడు. ఒకవేళ ఇంతకు ముందే మనం ఆత్మకు వశులమైయుంటే ఇప్పుడు ఆత్మ మనలను ఇంకా తనవశంలోకి తెచ్చుకొంటుంది. పౌలు "మీరు ఆత్మతో నిండివుండండి" అని చెప్పాడు - ఎఫే 5,18. ఈ వాక్యాన్నిబట్టి మనం మళ్ళామళ్ళా హృదయాన్ని ఆత్మతో నింపుకొంటూండాలి. ఆ యాత్మ తనతరపున తాను మనం రోజురోజుకీ వరప్రసాదంలో పెరిగేలా చేస్తుంది.

## 9. ఆత్మను పొందడం అంటే యేమిటి?

1. ఓ రాజకుమారుణ్ణి ఓ పేద వడ్రంగి పెంచి పెద్దవాణ్ణి చేసాడు. ఆ కుర్రవాడు పెద్దవాడయ్యాక ఓదినం అకస్మాత్తుగా తాను పేదవాళ్ళ బిడ్డను కాననీ రాజకుమారుణ్ణనీ తెలిసికొన్నాడు. మనంకూడ పరలోకరాజు కుమారులం. జ్ఞానస్నానంద్వారా దేవునికి

దత్తపుత్రులమయ్యాం. కాని ఈ సంగతి మనకు అట్టే తెలియదు. ఇప్పుడు ఈ యాత్మను పొందడంద్వారా మనం సామాన్య జనులంగామనీ దేవుని బిడ్డలమనీ తెలిసికొంటాం. ఆత్మను పొందడమంటే ఈ తెలివిడి అలవడ్డమే.

2. ఆత్మ మనలో వుంటుంది కాని అనేక కారణాలవల్ల పని చేయదు. పొయ్యిలో నిప్పుందిగాని నుసిబట్టివుంది. దాన్ని ఊదితే మళ్ళా రాజుకొంటుంది. గదిలో విద్యుచ్ఛక్తి వుంది గాని బల్బు వెలగడంలేదు. మీట నొక్కితే విద్యుత్తు ప్రసారమై బల్బు వెలుగుతుంది. ఇదేవిధంగా జ్ఞానస్నాన సమయం నుండే మన హృదయంలో ఆత్మ వుంటుంది గాని మన సహకారం లేకపోవడంవల్ల అట్టే పనిచేయదు. ఇప్పుడు మళ్ళా ఆత్మను పొందడమంటే, ఈవరకే మన హృదయంలో వున్న ఆత్మను పనిచేసేలా చేయడం. ఏలా? ఆ యాత్మతో సహకరించడం ద్వారా.

3. ఆత్మను పొందడమంటే పరిశుద్ధాత్మను మళ్లా స్వీకరించడం. ఆ యాత్మ దేవుడు, మనం మనుష్య మాత్రులం. కనుక మనతరపున మనం ఆత్మను ఎన్నిసార్లు స్వీకరించినా పూర్తిగా స్వీకరించలేం. ఒక్కొక్క తడవ మనం స్వీకరించిన ఆత్మ మన జీవితాన్ని ధన్యం చేస్తూనే వుంటుంది.

4. ఆత్మను పొందడమంటే పరిశుద్ధాత్మ వరప్రసాదాన్ని నూత్నంగాను అధికంగాను స్వీకరించడం. ఆయాత్మ మనలోనికి విజయంచేసి మనలను క్రొత్త వ్యక్తులనుగా మారుస్తుంది. మనం క్రీస్తుకి పోలికగా వుండేలా చేస్తుంది.

5. ఆత్మను పొందడమంటే క్రొత్తగా క్రీస్తుతో నిబంధనం చేసికోవడం. "నీవు మా దేవుడవూ మేము నీ ప్రజలమూ" అని చెప్పడం. అతన్ని మనరక్షకునిగా, ప్రభువునిగా, స్నాపకునిగా అంగీకరించడం.

6. ఆత్మను పొందడంలో ముఖ్యోద్దేశం, క్రీస్తుని ప్రభునిగా అంగీకరించడం. బైబుల్లోని ప్రధానాంశం ఇదే. యేసు మన కోసం పేద నరరూపం తాల్చాడు. నీచాతినీచమైన సిలువ మీద మరణించాడు. అందుకుగాను తండ్రి అతన్ని తన సొంత బిరుదమైన "ప్రభువు" అనే పట్టంతో సత్కరించాడు. అప్పటినుండి పరలోక భూలోక పాతాళవాసులంతా ఈ క్రీస్తు ప్రభువుకి చేతులెత్తి మ్రొక్కాలి - ఫిలి 2,7-11. ఇప్పుడు ఆత్మను పొందడం ద్వారా క్రీస్తు మన ప్రభువని విశ్వశిస్తాం.

కనుక పెంతెకోస్తు ఉద్యమం అంటే కేవలం పరిశుద్ధాత్మ పట్ల భక్తినిచూపడంగాదు, ఆ యాత్మ సహాయంతో క్రీస్తుని చేరడం. ఆ క్రీస్తుకి విధేయులం కావడం. మన జీవితమూ పనులూ ఆ క్రీస్తు వశం చేయడం. ఆ ప్రభువుకి మన హృదయాన్ని అర్పించుకోవడం.

మన జీవితంలో ముఖ్యాంశం మనమూగాదు, మన పనీగాదు. మరి ఆ ప్రభువు జీవితాన్ని జీవించడం. - గల 2, 20; ఫిలి 1,21.

ఆత్మ చేసే కృషంతా గూడ మనలను క్రీస్తు చెంతకు చేర్చడమే. కనుక ఆయాత్మ మనలను కేవలం తనచెంతకు రాబట్టుకోదు. తనద్వారా క్రీస్తుచెంతకు రాబడుతుంది. ఈలా మనం క్రీస్తు కేంద్రీకృత జీవితం జీవించడమనేది పెంతెకొస్తు ఉద్యమంలోని ప్రధానాంశం.

# 10. ఆత్మతెచ్చే మార్పు

1. ఆత్మ క్రీస్తు జీవితంలో మార్పు కలిగించింది. శిష్యుల జీవితంలో మార్పు కలిగించింది. ఆలాగే మన జీవితంలోను మార్పు కలిగిస్తుంది. మొదట క్రీస్తుజీవితంలో కలిగిన మార్పును పరిశీలిద్దాం.

జ్ఞానస్నానం పొందిందాకా క్రీస్తు మామూలు మనిషిగానే కన్పించేవాడు. తోడి జనమంతా అతడు కేవలం వడ్రంగివాని కుమారుడు అనుకొంటూండేవాళ్లు - మత్త 13, 55-57. అందుకే సువిశేషాలుగూడ క్రీస్తు బాల్యాన్ని గూర్చి అట్టే ప్రస్తావించవు. కాని ఓమారు జ్ఞానస్నానం పొందాక క్రీస్తు మారిపోయాడు. క్రీస్తు జ్ఞానస్నాన సమయంలో ఆకాశం తెరువబడగా దేవుని ఆత్మ పావురం రూపంలో అతనిమీదికి దిగివచ్చింది - మత్త 3,16. అనగా అతడు పరిశుద్ధాత్మను పొందాడు. దానితో అతనికి దివ్యశక్తి కలిగింది. ఆ శక్తితోనే అతడు పిశాచాన్ని ఎదిరించడానికి ఎడారికి వెళ్ళాడు. అటుపిమ్మట అద్భుతాలు చేయడం మొదలెట్టాడు. పరలోక రాజ్యాన్ని గూర్చి జనసమూహానికి బోధించడం ప్రారంభించాడు. అనగా అతడు మన రక్షకుడుగా వ్యవహరించడం మొదలెట్టాడు. పూర్వం వడ్రంగివాని కుమారుడుగా ఊరూపేరూ లేకుండా నజరేతు అనే కుగ్రామంలో జీవించిన క్రీస్తుకీ ఇప్పుడు బహిరంగజీవితం జీవించే క్రీస్తుకీ ఎంత వ్యత్యాసం ! ఈ మార్పు క్రీస్తు ఆత్మను పొందడంద్వారానే జరిగింది.

2, ఆత్మ శిష్యుల జీవితంలో గూడ పెద్దమార్పు తెచ్చింది. వాళ్లు మూడేండ్లపాటు క్రీస్తుతో తిరిగారు. అతని బోధలు చెవులారా విన్నారు. అద్భుతాలు కండ్లారా చూచారు. ఐనా వాళ్ళల్లో పెద్ద మార్పేమీ కలుగలేదు. అసలు వాళ్ళు క్రీస్తు సందేశాన్ని అర్థం చేసికోనేలేదు. అతడెందుకు వచ్చాడో గ్రహించనేలేదు. కనుకనే ప్రభువు మోక్షారోహణం చేసేపుడు గూడ "నీవు యిప్పుడు యిస్రాయేలుకు రాజ్యాన్ని మళ్ళా సంపాదించిపెట్టవా"? అని అడిగారు - అకా 1,6. అనగా నీవు రోమను ప్రభుత్వంతో యుద్ధంచేసి పాలస్తీనా

దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం సంపాదించిపెట్టవా అని వాళ్ళ ప్రశ్న. క్రీస్తు వచ్చింది ఇందుకా? ఈ ప్రశ్ననుబట్టే మూడేండ్లతరువాత గూడ వాళ్ళు క్రీస్తుని అట్టే అర్థంచేసికోలేదని రుజువౌతుంది గదా!

కాని ఓమారు ఆత్మ దిగివచ్చినంక వాళ్ళ బుద్ధులూ తలంపులూ పూర్తిగా మారిపోయాయి. ఇక వాళ్ళు రాజకీయాల గొడవ పట్టించుకోలేదు. క్రీస్తులోనికి జ్ఞానస్నానంపొంది పాపాలను పరిహారం చేసికోవాలి అని తలంచడం ప్రారంభించారు. అటుతోలే గాలి ఇటు తోలడం మొదలెట్టింది. అంతకుముందు పేత్రు మొదలైన శిష్యులు ఓ పనిపిల్లకు భయపడిపోయి క్రీస్తుని ఎరుగమని బొంకారు – మత్త 26, 69-70. క్రీస్తు ఉత్థానానంతరం గూడ వాళ్ళు యూదులకు భయపడి తలుపులు మూసివేసిన యింటిలో దాగుకొని వున్నారు – యోహా 20,19. ఇప్పుడు అదే శిష్యులు యెరూషలేము వీధుల్లోకి వచ్చి బాహాటంగా ఆ క్రీస్తునిగూర్చి బోధించడం మొదలెట్టారు. మొదటిరోజుననే యెరూషలేము వీధుల్లోనే మూడువేల మందికి జ్ఞానస్నానం ఇచ్చారు – అచ 2,41. యూదుల న్యాయస్థానమైన సానేడ్రిన్ మహాసభ యెదుటికివెళ్ళి యేసు పేరుమీదుగా దప్పితే మరోపేరుమీదుగా రక్షణం లేదని బల్లగ్రుద్ది వాదించారు – అచ 4,12. పూర్వపు శిష్యులెక్కడ ఈ శిష్యులెక్కడ? వీళ్ళకు ఈ ధైర్యమూ ఈ శక్తీ ఎక్కడనుండి వచ్చాయి? ఆత్మవలననేగదా? క్రీస్తుతో మూడేండ్లు జీవించినా వాళ్ళల్లో ఆ చైతన్యం పుట్టలేదు. ఇప్పుడు ఆత్మ దిగివచ్చాక ఒక్కరోజులోనే ఇంత చైతన్యం కలిగింది. ఆత్మ కలిగించే మార్పు ఈలాంటిది – అచ 1,8.

3. ఆత్మ మన జీవితంలోగూడ గొప్ప మార్పు తెస్తుంది. ఆ యాత్మ క్రీస్తుబోధలను గైకొని మనకు మళ్లా బోధిస్తుంది – యోహా 16,14. క్రీస్తుని మనకు తెలియజెప్తుంది. ఆ ప్రభువు గ్రంథాన్ని చదువుకొని అర్థంచేసికొనేలా చేస్తుంది. ఆ ప్రభువు సంస్కారాలను భక్తితో స్వీకరించేలా చేస్తుంది. దైవప్రేమనూ సోదరప్రేమనూ మన హృదయంలో కుమ్మరిస్తుంది. మనం తోడి ప్రజలకుగూడ క్రీస్తుని చాటిచెప్పేలా చేస్తుంది. ఈ క్రియలద్వారా మనం పూర్తిగా మారిపోతాం. మనం వెలుపలికి పూర్వక్రైస్తవులమే. మన హృదయంమాత్రం మారిపోతుంది. ఇంతకు ముందు అనుభవానికిరాని క్రైస్తవ జీవితం జీవిస్తుంటాం. ఇప్పుడు క్రైస్తవ సత్యాలు అనుభవానికి వస్తాయి. ఇంతకుముందు భక్తిలేని క్రైస్తవ జీవితం గడుపుతుంటాం. ఇప్పుడు మన హృదయం భక్తిపారవశ్యంతో నిండిపోతుంది. గ్రుడ్డివాడు చూపు పొందితే ఏలా వుంటుందో ఆత్మను పొందిన మన జీవితంకూడ ఆలా వుంటుంది.

పెంతెకోస్తు ఉద్యమంలో చేరినవాళ్ళల్లో చాలమందిలో ఈ మార్పు గోచరిస్తుంది. వాళ్ళ హృదయం క్రొత్తదనం పొందుతుంది. వాళ్ళ భావాలు క్రొత్తవౌతాయి. ఆత్మ కొనివచ్చే ఈ మార్పును మనంకూడ అభిలషించాలి.

# 11. ఆత్మను పొందడానికి కొన్ని షరతులు

1. ఒట్టినే పరిశుద్ధాత్మ జ్ఞానస్నానం పొందితే ఏమీ ఫలితం కలుగదు. కనుక సోమరిపోతులూ చిత్తశుద్ధిలేని వాళ్ళూ దీనివల్ల ప్రయోజనం పొందలేరు. బైబులు భగవంతుడు గ్రుడ్డివాడు కాదు, నరుల హృదయాల్లోనికి తేరపారజూచేవాడు - 1 సమూ 16,7. కనుక ఎవరెలాంటివాళ్ళో అతనికి బాగా తెలుసు. ఆత్మజ్ఞానస్నానం పొందినవాళ్ళ నుండి దేవుడు కచ్చితమైన లెక్క అడుగుతాడు. కాని యోగ్యంగా జీవించే వాళ్ళను దండిగా దీవిస్తాడుగూడ. మొత్తంమీద పరిశుద్ధాత్మ జ్ఞానస్నానం మంచివాళ్ళకీ మంచిజీవితం జీవిద్దామనే కోరిక కలవాళ్ళకేగాని సోమరిపోతులకుగాదు. ఆత్మతో మనకు జ్ఞానస్నానమిచ్చేది క్రీస్తు - అతడుమాత్రమే. కనుక మన ప్రవర్తనం అతనికి యోగ్యంగా వుండాలి. ఆత్మలోనికి జ్ఞానస్నానం పొందాలంటే మనతరపున మనం చక్కగా తయారు కావాలి. ఏలాగ?

2. ఆత్మ దిగివచ్చాక పేత్రు యెరూషలేములోని యూదులకు బోధిస్తూ "మీరు పరివర్తనంచెంది యేసుక్రీస్తు నామాన జ్ఞానస్నానం పొందినట్లయితే పాపపరిహారాన్నీ ఆత్మనీ పొందుతారు" అని చెప్పాడు - అచ 2, 38. ఈ వాక్యంలో మూడంశాలున్నాయి. మొదటిది, మనం హృదయ పరివర్తనం చెందాలి. బైబులు భగవంతుడు మహాపవిత్రుడు. అపవిత్రప్రాణిలో ప్రవేశించేవాడు కాదు. అందుచేత మనం పూర్వపాపాలనూ దురభ్యాసాలనూ పూర్తిగా మానుకోవాలి. పైగా రోషమూ ద్వేషమూ పగా మొదలైన పిశాచ గుణాలను వదులుకోవాలి. శత్రువులను హృదయపూర్వకంగా క్షమించాలి - మార్కు 11,25-26. మొత్తంమీద మన పరివర్తనం ఏలాగుండాలంటే, మనం చిన్న బిడ్డల్లా తయారు కావాలి. మన హృదయం చిన్న బిడ్డల హృదయంలా రూపొందితేనేగాని మనకు పరలోకప్రాప్తి లేదు - మత్త 18,3. ఈలాంటి హృదయాన్ని ఈయమని ఆ ప్రభువునే అడుగుకోవాలి.

3. రెండవది, ప్రభుని రక్షకునిగా స్వీకరించాలి. అతడు చావును జయించి ఉత్థానమైన ప్రభువని విశ్వసించాలి - రోమా 10,19. యేసుని అంగీకరించడమంటే, యికమీద మన స్వార్థం కోసం గాక ఆ ప్రభువుకోసం జీవించడానికి సిద్ధంకావాలి. ఇది చాల పెద్ద బాధ్యత, చాల కష్టమైన షరతు. ఇంకా ప్రభుని అంగీకరించడమంటే, మన పూర్వ పాపజీవితాన్ని అతని ముందుంచి తన నెత్తుటి ధారలతో మన హృదయాన్ని కడిగి శుభ్రంచేయమని అడుగుకోవాలి - దర్శ 1,5. ఆ ప్రభుని మనయందు జీవించమని

అడుగుకోవాలి - ఫిలి 1, 21. ప్రభువుపట్ల యథార్థమైన ప్రేమ కలవారికిగాని ఈలాంటి భావాలు కలుగవు. చిత్తశుద్ధి కలవాళ్లు గాని ఆ ప్రభుని అంగీకరించి అతని భక్తులుగా జీవించలేరు.

4. మూడవది, పరిశుద్ధాత్మను మన నాయకునిగా స్వీకరించాలి. అతని చెప్పుచేతల ప్రకారం జీవించాలి. ప్రభువు తన యాత్మను మనయందుంచి తన ఆజ్ఞలప్రకారం మనంజీవించేలా చేస్తాడు - యెహెజ్కేలు 36,27. దేవుని బిడ్డలను దేవునిఆత్మే నడిపిస్తుంది - రోమా 8,14. మనజీవితం ఆత్మే గనుక, ఆ యాత్మచేతనే మనం నడిపింపబడాలి - గల 5,25. మనకంటె ముందుగా ఆత్మ క్రీస్తుని నడిపించింది. అలాగే ఈనాడు మనలను గూడ నడిపిస్తుంది. ఆ యాత్మ మన మనస్సులో వుండి మనకు వెలుగును ప్రసాదిస్తుంది. మంచి ఆలోచనలు పుట్టిస్తుంది. ఆ యాలోచనలను మనం ఆచరణలో పెట్టి వాటిప్రకారం జీవించేలా చేస్తుందిగూడ. ప్రాచీన క్రైస్తవులు ఆత్మను బిడ్డను నడిపించే తల్లితోను, పడవను నడిపించే తెరచాపతోను పోల్చారు. ఆత్మ రోజురోజు మనలను నడిపించుకొని పోతూనే వుంటుంది. ఎక్కడికి? క్రీస్తు వద్దకీ, తండ్రివద్దకీ.

కడన, మనకు దేవునియందు విశ్వాసం వుండాలి. మనం ఆ ప్రభువునుండి ఎంత పొందుతామని విశ్వసిస్తామో అంత మాత్రమే పొందుతాం. మన విశ్వాసానికి ఆధారం ప్రభువు చేసిన ప్రమాణమే. పరలోకంలోని తండ్రి తన్నడిగిన వాళ్ళకు తప్పకుండా పరిశుద్ధాత్మ నిస్తాడు - లూకా 11,13. క్రీస్తుని విశ్వసించిన వాళ్ళకు అద్భుతశక్తులు లభిస్తాయి - మార్కు 16,17.

ఓమారు పదిమంది కుష్ఠరోగులు ప్రభుని ఆరోగ్యం ప్రసాదించమని అడిగారు. ప్రభువు వాళ్ళను దేవాలయంలోని యాజకుల వద్దకు వెళ్ళి కన్పించమని చెప్పాడు. ఆ పలుకులు నమ్మి వాళ్లు వెళ్లారు. అలా వెళ్తూండగా ప్రభువు వాళ్ళకు త్రోవలో వ్యాధి నయమయ్యేలా చేసాడు. కనుక నరుల విశ్వాసమనేది దేవుని ప్రమాణానికీ, ఆ ప్రమాణాన్ని అతడు కార్య రూపేణ నెరవేర్చడానికి మధ్యలో వస్తుంది. పై ఉదాహరణంలో కుష్ఠరోగులు క్రీస్తు వాక్యాన్ని నమ్మి యాజకుల వద్దకు వెళ్ళడం వాళ్ళ విశ్వాసం. వాళ్లు అలా వెళ్ళకముందు ప్రభువు ప్రమాణం చేసాడు, అలా వెళ్ళాక తన ప్రమాణాన్ని నిలబెట్టుకొన్నాడు. మనకుగూడ ప్రభువు పలుకులందు ఈలాంటి విశ్వాసముంటే, అతడు మనకుగూడ మేలికార్యాలు చేస్తాడు.

ప్రభువునందు విశ్వాసంగల భక్తుడు అతన్ని స్తుతించి కొనియాడతాడు. అతని ఉపకారాలను వేనోళ్ళ ఉగ్గడిస్తాడు. పైగా అతడు తన విశ్వాసాన్ని వేరేవాళ్ళకు

అందిస్తాడుగూడ. దీపంతో మరో దీపాన్ని వెలిగించినట్లుగా తన విశ్వాసంతో తోడి నరునికిగూడ విశ్వాసం పుట్టించి అతన్ని గూడ ప్రభువు వద్దకు తీసికొని వస్తాడు - రోమా 1, 12. కనుక ఆత్మను పొందాలి అంటే మన తరపున ఈ షరతులన్నీ నెరవేరాలి. దీన్నిబట్టి పెంతేకోస్తు ఉద్యమం చిత్తశుద్ధిలేనివాళ్ళకు ఎంతమాత్రమూ పనిచేయదని గుర్తించాలి.

## 12. ఆత్మనుపొందామనడానికి గురుతు ఏమిటి?

1. ఆత్మ తన్ను పొందిన వాళ్ళల్లో గొప్పమార్పు తెచ్చిపెడుతుందని చెప్పాం. శిష్యులు ఆత్మను పొందకముందు బలహీనులు, పిరికివాళ్ళు, జ్ఞానం లేనివాళ్లు, ఆసబోతులు. కాని ఆత్మ వచ్చాక ఈ దుర్గుణాన్నీ సమసిపోయి గొప్ప ప్రేషితుల్యారు. ఈనాడు పెంతెకోస్తు ఉద్యమంలో జేరి ఆత్మలోనికి జ్ఞానస్నానం పొందిన వాళ్ళల్లోగూడ ఈలాంటి మార్పే కన్పిస్తుంది. కొంతమందిలో ఈ మార్పు హఠాత్తుగా కన్పిస్తుంది. కొంతమందిలో నిదానంగా కన్పిస్తుంది. కాని మార్పేమో తథ్యం.

2. ఈ మార్పుకి కారణం? ఇది మానుషశక్తి వలన కలిగిన మార్పుకాదు. దైవశక్తివలన, అనగా పరిశుద్ధాత్మ వలన కలిగిన మార్పు. ఈ మార్పువలన భక్తుల్లో ఆనందమూ ఉత్సాహమూ గోచరిస్తుంది. స్వతంత్ర ప్రవర్తనం కన్పిస్తుంది. లోకం యెదుట ప్రభువుకి సాక్ష్యమీయాలనే కోరిక వెల్లడి ఔతుంది. కనుకనే పెంతెకోస్తు ఉద్యమంలో చేరినవాళ్ళు "మేము క్రొత్త జీవితం జీవిస్తున్నాం" అని చెప్తారు. మామూలుగా ఆత్మ దిగివచ్చినపుడు భక్తుని అంతరాత్మలో ఓ విధమైన అనుభూతి కలుగుతుంది. అతనిహృదయం పులకిస్తుంది. ఓ విధమైన సంతోషమూ సమాధానమూ గోచరిస్తాయి. ఐనా అందరిలోను ఈ యనుభూతి కలుగకపోవచ్చు.

3. ప్రోటెస్టెంటు పెంతెకోస్తు సభ్యులు ఆత్మను పొందామనడానికి ప్రధాన చిహ్నం భాషల్లో ప్రభువుని స్తుతించడం అని చెప్తారు. కాని క్యాతలిక్ పెంతెకోస్తు సభ్యులు ఈ భావాన్ని అంగీకరించరు. ఐనా క్యాతలిక్ సభ్యులకుకూడ తరచుగా భాషల్లో ప్రభుని స్తుతించడమనే వరం లభిస్తూనే వుంటుంది. ఇక క్యాతలిక్ సభ్యుల భావాల ప్రకారం, ఆత్మను పొందాము అనడానికి ప్రధాన చిహ్నం ప్రేమ. పరిశుద్ధాత్మ గొప్ప ప్రేమశక్తి. ఆ యాత్మద్వారా దేవుని ప్రేమ మనహృదయంలోకి కుమ్మరింపబడుతుంది - రోమా -5,5. కనుక మనం ఆత్మను పొందాము అనడానికి గురుతు ప్రేమ ఒక్కటే. అనగా మన హృదయంలో పూర్వంకంటె ఇప్పుడు ప్రేమ ఎక్కువగా కన్పించాలి. ఈ ప్రేమ దైవప్రేమ సోదరప్రేమ అని రెండురకాలుగా వుంటుంది.

4. ఆత్మద్వారా మన హృదయంలో ప్రేమ పెరిగినట్లయితే అది మన ఆలోచనల్లోను పనుల్లోను కన్పిస్తుంది. పండునుబట్టి చెట్టును నిర్ణయిస్తాంగదా! - లూకా 6, 43-45.

1) మొదట, మనకు ముగ్గురు దైవవ్యక్తుల పట్ల ప్రేమ పెరుగుతుంది. పితను సుతుణ్ణి ఆత్మను పూజించి ఆరాధిస్తాం. భక్తితో ప్రార్థన చేసికొంటాం. ప్రభువాక్యమైన బైబులు గ్రంథంపట్ల భక్తీ ఆదరమూ వృద్ధిచెందుతుంది. సంస్కారాలపట్ల, విశేషంగా దివ్యసత్ప్రసాదం పట్ల, భక్తి ఎక్కువౌతుంది.

2) తరువాత, నునకు తోడిజనంపట్లగూడ ప్రేమ పెరుగుతుంది. ఇతరుల యెడల రోషానికి మారుగా ప్రేమ చూపుతాం. అసహనానికి మారుగా దయ చూపెడతాం. వివాదానికి మారుగా గౌరవమర్యాదలు ప్రదర్శిస్తాం. సంకుచిత మనస్తత్వానికి మారుగా విశాల హృదయం అలవర్చుకొంటాం.

3) కడన మన జీవితంకూడ మారుతుంది. మన ఆశయాలూ కోరికలూ, విలువలూ మారిపోతాయి. భౌతిక వస్తువులకంటె ఆధ్యాత్మిక వస్తువులపట్ల ఎక్కువ శ్రద్ధ చూపుతాం. స్వార్థంకంటె పరార్థాన్ని ఎక్కువగా గణిస్తాం. మన బాధ్యతలను మనం సంతృప్తికరంగా నిర్వహిస్తాం.

మనం ప్రేషితులంగా మెలుగుతాం. ఇతరులకుగూడ ప్రభుని తెలియజేద్దాం అనే కోరిక పుడుతుది. మనలో ఏదో దైవశక్తి పనిచేస్తూ క్రీస్తుకి సాక్ష్యమీయమని మనలను పురికొల్పినట్లుగా కన్పిస్తుంది. మన హృదయంలో శాంతీ ఆనందమూ సంతృప్తీ నెలకొంటాయి.

దైవప్రేమ సోదరప్రేమ అనే ఈ రెండు ఫలాలను బట్టి మనం ఆత్మను పొందామని నమ్మవచ్చు. కనుక ఆత్మ జీవిత మంటే ఎప్పటికప్పుడు మన పాపాలకు పశ్చాత్తాపపడి హృదయాన్ని శుద్ధి చేసికోవడం. ఆత్మద్వారా క్రీస్తుకి సన్నిహితంగా మెలుగుతూండడం. ప్రభువునీ తోడిజనాన్నీ ప్రేమ భావంతో సేవిస్తూండడం.

# 13. పరిశుద్ధాత్మ వరాలు

1. దేవుడు నరులకిచ్చే ప్రధానవరం ప్రేమ. ఈ ప్రేమే పరిశుద్ధాత్మ. కనుక భగవంతుడు పరిశుద్ధాత్మ ద్వారా మన హృదయాన్ని ప్రేమతో నింపుతాడు.

ఈ పరిశుద్ధాత్మ మన జీవితంలో రెండు పనులు చేస్తుంది. మొదటిది, ఆ యాత్మ మనలను పవిత్రపరుస్తుంది. తండ్రి కోరుకొన్నట్లుగనే మనలను క్రీస్తు చెంతకు

చేరుస్తుంది. ఆ యాత్మ మనకు ఎన్నో వరాలను ప్రసాదిస్తుంది. ఈ వరాల్లో కొన్ని మనవ్యక్తిగత పావిత్ర్యానికి ఉపయోగపడతాయి. అవి మనలో విశ్వాసం నమ్మిక ప్రేమ అనే పుణ్యాలను వృద్ధిచేసి మనలను క్రీస్తుకి మరింత సన్నిహితులనుగా చేస్తాయి. మన క్యాతలిక్ సంప్రదాయం ప్రకారం ఈ వ్యక్తిగత పావిత్ర్యానికి తోడ్పడే పరిశుద్ధాత్మ వరాలు ఏడు. అవి జ్ఞానం, బుద్ధి, తెలివి, ఆలోచనం, దృఢత్వం, దైవభయం, దైవభక్తి. పరిశుద్ధాత్మ మెస్సియాను ఈ వరాలతో నింపుతుందని యెషయా ప్రవచించాడు -11,2. ఇవే వరాలను ఆత్మ మనకు కూడ ఇస్తుంది.

2. ఇక ఆత్మ చేసే రెండవ కార్యం, మనలను సమాజ పరిచర్యకు పురికొల్పుతుంది. క్రైస్తవ సమాజంలోని ప్రేషిత ఉద్యమం, సేవ, పరిచర్య అంతా ఆత్మద్వారానే. ఆత్మ సహాయంతో మనం దేవుని ప్రేమను ఇతరులకు చాటిచెప్తాం. ఇతరులకు క్రీస్తుని బోధిస్తాం. ఇదే ప్రేషిత ఉద్యమం. ఈ సేవద్వారా మనం క్రీస్తు జ్ఞానశరీరమైన క్రైస్తవ సమాజాన్ని వృద్ధిలోకి తీసికొనివస్తాం.

ఈలా మనం తోడి ప్రజలకు ప్రేషితసేవ చేయడానికిగాను ఆత్మ యెన్నో వరాల నిస్తుంది. వీటిని ప్రేషితవరాలు లేక సేవావరాలు అనాలి. ఈ సేవావరాలను పౌలు తన జాబుల్లో చాల తావుల్లో పేర్కొన్నాడు. ఇవి యెన్ని అన్న ప్రశ్నకు తృప్తికరమైన సమాధానం లభించదు.

3. పౌలు తనజాబుల్లో నాల్గు తావుల్లో ఈ సేవావరాలను పేర్కొన్నాడు. వాటి పట్టికలను ఈ క్రింద పొందుపరుస్తున్నాం.

| 1కొ 12,8-10 | 1కొ 12,28 | రోమా 12,6-8 | ఎఫే 4,11 |
|---|---|---|---|
| బుద్ధి | అపోస్తలులు | ప్రవచనం | అపోస్తలులు |
| జ్ఞానం | ప్రవక్తలు | పరిచర్య | ప్రవక్తలు |
| విశ్వాసం | బోధకులు | బోధ | సువార్తకారులు |
| స్వస్థత | అద్భుతకారులు | ప్రోత్సాహము | కాపరులు |
| అద్భుతాలు | ఆరోగ్యదాతలు | దానం | బోధకులు |
| ప్రవచనం | సహాయకులు | పర్యవేక్షణ | |
| వివేచనం | పరిపాలకులు | కరుణకార్యాలు | |
| భాషలు | భాషకులు | | |

4. ఈ పట్టికల్లో కొన్నివరాలు రెండుమూడుసార్లు వచ్చాయి. అలాంటి వాటిని తొలగించినాగాని ఇక్కడ పౌలు పేర్కొన్న సేవావరాలు ఇరవైదాకా వున్నాయి. ఇవి ఆ తొలినాటి పౌలు సమాజాల్లోని క్రైస్తవభక్తుల్లో కన్పించిన వరాలు. పౌలుకూడ ఈ వరాలను

గూర్చి అంత విపులంగా వివరించి చెప్పలేదు. కావున వీటి స్వభావం ఈనాడు మనకు అంత స్పష్టంగా బోధపడదు. ఇక వీటిని గూర్చిన కొలదిపాటి వివరణం :

1) అపోస్తలులు, ప్రవక్తలు, బోధకులు, సువార్తకారులు – ఈ మొదలైన వన్నీ క్రైస్తవ మతబోధకులకు సంబంధించిన వరాలు. ఈ వరాలతో భక్తులు క్రైస్తవ సత్యాలను క్షుణ్ణంగా అర్థంచేసి కొని వాటిని ఇతరులకు కూడ బోధిస్తారు. గ్రంథాలు వెలువరిస్తారు. బుద్ధి, జ్ఞానం అనే వరాలు కూడ ఈ రంగానికి చెందినవే. వీటి ద్వారా మన మతసత్యాలను లోతుగా ఆలోచించి చూచే శక్తి కలుగుతుంది.

2) స్వస్థత – ఈ వరం తొలినాటి క్రైస్తవ సమాజంలో విరివిగా వుండేది. నేడు ప్రోటస్టెంటు సమాజాల్లో కొందరికి ఈ వరమున్నట్లుగా తెలుస్తుంది. ఇటీవల మన క్యాతలిక్ సమాజంలో ఈ వుద్యమం ప్రచారంలోకి వచ్చాక మన ప్రజల్లో కూడ కొందరు ఆరోగ్యదానం చేసేవాళ్ళు కన్పిస్తున్నారు.

3) ప్రోత్సాహం అంటే తోడిజనాన్ని మతవిషయాల్లో ప్రోత్సహించడం. ఓదార్చి హెచ్చరించడం.

4) పరిచర్య అంటే తోడి ప్రజలకు రకరకాల రూపాల్లో సేవలు చేయడం. విద్యాసేవ, వైద్యసేవ, సాంఘికసేవ మొదలైనవి ఈ వరానికి సంబంధించినవే. దానం అంటే మన కున్న సిరిసంపదలను పేదలకు పంచి యీయడం. కరుణ కార్యాలు కూడ పై పరిచర్యలాంటివే. విశేషంగా పేద సాదలనూ కష్టాల్లో వున్నవాళ్ళనూ వ్యాధి గ్రస్తులనూ ఆదుకోవడం. ఈ వరం వల్ల బాధపడేవాళ్ళపట్ల మనకు కనికరమూ సానుభూతీ కలుగుతుంది. ఈ జాలిగుణంతో మనం ఇతరులకు తోడ్పడతాం. క్రీస్తులో ఈ గుణం సమృద్ధిగా వుండేది – మత్త 11, 28–30.

5) విశ్వాసం – ఈ వరం వల్ల ప్రభువు మనకు మేలు చేస్తాడనీ మన వ్యాధిబాధలను తొలగిస్తాడనీ నమ్ముతాం. ఇది తరచుగా ఆరోగ్యదానానికీ అద్భుతాలకూ సంబంధించింది. అనగా ప్రభువు ఇప్పుడు ఈ వ్యక్తికి వ్యాధి తొలగిస్తాడని నమ్ముతాం.

6) వివేచనం – మనలను పవిత్రాత్మే నడిపిస్తుందో అపవిత్రాత్మే నడిపిస్తుందో తెలిసికొనే శక్తి. ఈ వరంవల్ల ఉచితానుచితాలను గ్రహించి వివేకంతో ప్రవర్తిస్తాం.

7) ప్రవచనం – ఇది ప్రభు సందేశాన్ని విన్పించే వరం. పెంతెకోస్తు సమావేశాల్లో కొందరు భక్తులు ఈవర సహాయంతో ప్రభు చిత్తాన్ని తెలియజెప్తుంటారు. ఈవరం సమృద్ధిగా కలవాళ్ళే ప్రవక్తలు.

8) పర్యవేక్షకులు, పరిపాలకులు, సహాయకులు, కాపరులు - ఈ వరాలన్నీ సమాజ కార్యనిర్వహణకు సంబంధించినవి. ఈ వరాలు కలవాళ్ళు ప్రజలను ప్రోగుజేసి కార్యక్రమాలు నిర్వర్తిస్తారు, అధికారులుగా మెలుగుతారు, ఉద్యమాలు నడుపుతారు.

9) భాషకులు - ఈ వరంలో ప్రధానాంశం అన్యభాషల్లో మాట్లాడ్డం కాదు, ప్రభుని స్తుతించడం. కనుక ఇది ఓ ప్రార్థనావరం. ఒకోమారు ఇది రెండు వరాలుగా పనిచేస్తుంది. ఒకరు అజ్ఞాత భాషలో ప్రభుని స్తుతింపగా మరియొకరు దాని అర్థం తెలియజేస్తారు. పై వాటిల్లో భాషలు, వివేచనం ప్రవచనం ప్రేషితులు అనే వరాలను మీదటి వ్యాసాల్లో విపులంగా వివరించి చెప్తాం.

5. ఈ వరాలు వ్యక్తి లాభంకోసంగాదు, సమాజ లాభంకోసం అని చెప్పాం. పౌలు ఇవి క్రీస్తు దేహనిర్మాణంకొరకు ఉద్దేశింపబడినవి అని చెప్పాడు - ఎఫే 4,12. అనగా వీటితో మనం క్రైస్తవ సమాజాలకు సేవచేసి వాటిని వృద్ధిలోకి తీసికొనిరావాలి.

విశ్వాసం, ప్రేమ, నమ్మిక అనే వరాలు పుణ్యాత్ముల్లో మాత్రమే వుంటాయి. కాని ఈ సేవావరాలు పాపాత్ముల్లో కూడ వుండవచ్చు -మత్త 7, 15-23. కనుక వీటి విలువ చాల స్వల్పం. మనకు తెలియక ఈ వరాలు కలవాళ్ళను ఘనంగా ఎంచుతాం. కాని వ్యాధులు నయంచేయడం, దయ్యాలను పారద్రోలడం మొదలైన అద్భుతాలు చేయడంకంటె సోదరప్రేమతో జీవించడం గొప్ప.

6. ఇక మనకందరికీ ఈ వరాలున్నాయా? పరిశుద్ధాత్మ అందరికీ ఏవో కొన్ని వరాలిస్తుంది - 1కొ 12,7. పౌలు తన నాటి క్రైస్తవ సమాజాల్లోని వరాలను కొన్నిటిని పేర్కొన్నాడు. నేటి మన సమాజానికి ఇంకా వేరే వరాలు కూడ అవసరం. కనుక నేటి యవసరాలను పురస్కరించుకొని ఆత్మ ఈనాటి క్రైస్తవులకు వివిధ వరాలనిస్తుంది. ఈనాడు మనకు విశేషంగా కావలసింది సమాజ చైతన్యం, సమాజ సేవ, సమాజనాయకత్వం. పేదప్రజలకు జరిగే సాంఘిక అన్యాయాన్ని అరికట్టి వాళ్ళకు మేలుచేయడం నేటి యవసరం. ఈ యక్కరలకు అనుగుణంగా ఆత్మ నేటి క్రైస్తవులకు ప్రత్యేక వరాలనిస్తుంది.

కాని ముఖ్యాంశ మేమిటంటే, భక్తులు ఒక్కొక్కరూ ఆత్మ తమకు ప్రత్యేకంగా యిచ్చిన వరాలేమిటివో పరిశీలించి చూచుకోవాలి. అనగా మన శక్తిసామర్థ్యాలూ, అభిరుచులూ, అవకాశాలూ ఏమిటివో గుర్తించాలి. ఇవే మన ప్రత్యేక వరాలు. ఈ వరాలను వినియోగించుకొంటూ మనం క్రైస్తవ సమాజాభివృద్ధికి కృషిచేయాలి. ఇదే మన సేవ - 1పేత్రు 4, 10-11. మన గురువులూ మఠకన్యలూ గృహస్థుల ప్రత్యేక వరాలను అణచివేయగూడదుగదా, వాటినింకా వృద్ధిలోకి తీసికొని రావాలి.

7. ఈ వరాలను సాధించడం ఏలా? మనంతట మనం స్వీయశక్తితో ఈ వరాలను పొందలేం. ఆత్మే వీటిని తన భక్తులకు అవసరమైన కొలదీ పంచిపెడుతుంది - 1కొ 12, 7. కనుక మనం ఈ వరాలకోసం ఆ యాత్మనే అడుగుకోవాలి. ఆత్మ వరాలను పొందడంకోసమై మన తరపున మనం తయారయ్యే మార్గాలు కొన్ని వున్నాయి. ప్రార్థనం చేసికోవాలి. బైబులు వాక్యాన్ని శ్రద్ధతో పఠించాలి. చిత్తశుద్ధి అలవరచుకోవాలి. పేదసాదలపట్ల దయా సానుభూతీ పెంపొందించుకోవాలి. వినయమూ, నిరాడంబరగుణమూ సరళస్వభావమూ సేవాభావమూ అలవర్చుకోవాలి. ఈలా తమ్ముతాము తయారుచేసికొన్నవాళ్ళు ఆత్మ వరాలను పొందుతారు.

8. కడన రెండంశాలను గుర్తించాలి. మొదటిది, సేవావరాలు మంచివేకాని ఇవి క్రైస్తవ జీవితానికి ప్రధానంకావు. ఇవి వున్నవాళ్ళు తప్పకుండా మంచివాళ్లూ గొప్పవాళ్లూ అని చెప్పలేంగూడ. కనుక వీటికి విపరీతమైన విలువ నీయకూడదు. రెండవది, ఈ వరాలను చిన్నచూపు చూడనూ కూడదు. కొందరు వరాలను చిన్నచూపుచూచి సంప్రదాయబద్ధతా విధేయతా అనే గుణాలను ఎక్కువగా మెచ్చుకొంటారు. కాని ఇది పొరపాటు. ఆత్మవరాలను మనం ఆదరంతో అంగీకరించాలి. వాటిని సరిగా వాడుకోవాలి. పౌలు ఆత్మను ఓ దీపంలా ఆర్పివేయవద్దని హెచ్చరించాడు -1 తెస్స 5,19.

వరాలన్నిటికీ విలువిచ్చేది ప్రేమ. ప్రేమలేనికాడ వరాలు స్వోత్కర్షను ప్రకటించుకోడానికి ఉపయోగపడతాయి కాని సేవ చేయడానికి ఉపయోగపడవు. కనుకనే పౌలు అన్నిటికంటె ప్రేమకు అధికమైన విలువనీయమని కొరింతీయులకు బోధించాడు- 1కొ 13,13.

# 14. భాషల్లో మాటలాడ్డం

1. భాషల్లో మాటలాడ్డం అంటే నూత్న వేదంలో మూడర్థాలున్నాయి :

1) ఈ భాషలు సమాచార సాధనం కావచ్చు. అనగా మనం శ్రోతలకు తెలియని భాషలో మాటలాడినా ఆ మాటల భావాన్ని వాళ్ళు గ్రహిస్తారు. పెంతెకోస్తుదినాన అపోస్తలులు వాళ్ళ భాషయైన అరమాయిక్ లో మాట్లాడుతున్నారు. కాని విదేశాలనుండి వచ్చి అక్కడ గుమిగూడియున్న యూదులందరికీ ఆ యపోస్తలులు వాళ్ళవాళ్ళ భాషల్లో మాటలాడుతున్నట్లుగా విన్పించింది - అచ 2,6. ఇక్కడ అద్భుతం మాటలాడేవాళ్లల్లో గాదు, వినేవాళ్ళల్లోవుంది. ఇది అసాధారణమైన సంఘటనం.

2) ఈ భాషలు దైవసందేశంకూడ కావచ్చు. సమావేశంలో ఒకడు తనకు అర్థంకాని స్వరాలతో మాట్లాడతాడు. మరొకడు ఆ స్వరాల అర్థం తెలియజేస్తాడు. ఈ యర్థం చెప్పడమే దైవ సందేశాన్ని వివరించడమౌతుంది. తరువాత ఆ సందేశం వర్తించే వాళ్లను విచారించి చూడగా అతడు అందించిన దైవ సందేశం నిజమేనని తేలుతుంది. పౌలు ఈలాంటి ఉదంతాలను 1కొ 14,5లో పేర్కొన్నాడు. ఈ నాడును పెంతెకోస్తు సమావేశాల్లో ఈలాంటి సంఘటనలు జరుగుతూంటాయి.

3) ఈ భాషలు ప్రార్థనంకూడ కావచ్చు. పెంతెకోస్తు సమావేశాల్లో భక్తులు నెమ్మదిగా పెదవులు కదిలిస్తూ ప్రార్థనం చేస్తారు. ఈ ప్రార్థనా శక్తికూడ దేవుడిచ్చే వరమే. ఇక ఈ యధ్యాయంలో చెప్పాబోయే అంశాలన్నీ ఈ మూడవ అర్థమైన ప్రార్థనకు సంబంధించినవే.

2. భాషలలో మాటలాడి ప్రార్థనం జేయడమంటే గ్రీకుహీబ్రూ లాంటి ప్రజలకు తెలియని భాషలు మాటలాడ్డంగాదు. తనకు అర్థంగాని పదాలు వాడి ప్రార్థనం చేయడమని భావం. పౌలు "భాషలలో మాటలాడే వాళ్లు మానవులతోగాక దేవునితో మాటలాడతారనీ, ఆ మాటలను ఎవరూ అర్థంచేసికోలేరనీ వ్రాసాడు - 1కొ 14,2. ఆ భాషను వాడి ప్రార్థనలుచేసే అతనికి గూడ ఆ మాటలు అర్థంకావు, 14,14. ఈలాంటి ప్రార్థనలో మనయాత్మ దేవునియాత్మ సహాయంతో, మన బుద్ధికీ భాషకీ గూడ అందని ధోరణిలో ప్రార్థన చేస్తుంది - రోమా 8,26, 27.

3. ఈ ప్రార్థనం ప్రాముఖ్యం ఏమిటి?

1) భాషలలో మాటలాడి ప్రార్థనం చేసేపుడు మన బుద్ధిశక్తిని దాటిపోతాం. ఎటూ మన భాషద్వారాగానీ మన బుద్ధిశక్తి ద్వారాగానీ ఆ భగవంతుణ్ణి అందుకోలేం గదా! అందుకే పూర్వ తాత్వికులు అతన్ని గూర్చి చెప్తూ "నేతి నేతి" అన్నారు. అనగా ఆ భగవంతుడు ఈలాంటివాడుకాదు, ఆలాంటివాడుకాదు అని భావం. మరి అతడు ఏలాంటివాడు అంటే మన బుద్ధి శక్తితో గ్రహించలేనివాడు అని అర్థం. కనుక ఈ ప్రార్థనం మన విజ్ఞాన గర్వానికి విరుగుడు మందులాంటిది. అల్ప మానవుని విజ్ఞానంతోనే అన్నీ సాధించలేమని భాషా భావాలూ కూడ కొరతపడిన ఈ ప్రార్థనాపద్ధతి నేర్పుతుంది.

2) మన నాలుక చిన్నదైనా చాల గొప్పగా డాబులుకొడుతుంది - యాకో 3,5. మనం ఈ నాలుకను ఉపయోగించి మాటలాడేప్పుడూ, కడకు ప్రార్థనం చేసేపుడు గూడ మనలను గూర్చి మనమే గొప్పగా ఎంచుకొంటాం. మనమే తెలివైన వాళ్లం అనుకొంటాం. కాని భాషల్లో మాటలాడే ఈ ప్రార్థనలో భగవంతుడు మన నాలుకను అణచివేస్తాడు.

దాని ప్రమేయం లేకుండానే మనచే ప్రార్థనం చేయిస్తాడు. ఈ ప్రార్థనంలో మనం దేవునికి లొంగిపోతాం, మన మిడిసిపాటు సమసిపోతుంది.

3) పైగా ఈ రకపు ప్రార్థనలో "మీరు పరివర్తనంచెంది చిన్నబిడ్డల్లా తయారు కావాలి" అన్న ప్రభువాక్యం నెరవేరుతుంది - మత్త 18,3. ఎవరు సరళస్వభావులు గాను వినయవంతులుగాను మెలుగుతూంటారో వాళ్లకు అందరికంటే ముందుగా ఈ ప్రార్థనం అలవడుతుంది.

4. ఈ ప్రార్థనంవల్ల ఏమి లాభం? పౌలు భాషల్లో మాట్లాడేవాడు తన క్షేమాభివృద్ధిని సాధిస్తున్నాడు అన్నాడు - 1కొ 14,14. ఈ ప్రార్థనవల్ల మనకు ఎన్నో మేళ్లు కలుగుతాయి.

1) దీనివల్ల దేవునియందు మనకు విశ్వాసం పెరుగుతుంది. ధ్యానానికి ముందు ఈ ప్రార్థనం చేసికొన్నట్లయితే ఆ ధ్యానం సుకరమౌతుంది. బైబులు పఠనానికి ముందుకూడ ఈ జపాన్ని వాడుకోవడం మంచిది.

2) సందేహాలు కలిగినపుడు మన అనుమానం తీర్చుకోవడానికీ, తగిన పద్ధతిలో నిర్ణయాలు చేసికోవడానికీ, ఇతరులకు మంచి ఆలోచన చెప్పడానికీ ఈ జపం ఉపయోగ పడుతుంది. ఈ జపంద్వారా పవిత్రాత్మ మనలను మంచి త్రోవలో నడిపిస్తుంది.

3) ఒకోమారు మన అవసరాలేమిటివో, ఇతరుల అవసరాలేమిటివో మనకు తెలియనే తెలియవు. ఐనా అవి అతిముఖ్యమైన అవసరాలే కావచ్చు. ఆలాంటప్పుడు ఈ విధానం ద్వారా ఆ తెలియని అవసరాలకొరకు గూడ ప్రార్థనం చేయగలం. ఉదాహరణకు, మనందరిలోను బాధాకరమైన పూర్వస్మృతులు కొన్ని వుంటాయి. అవి యేమి స్మృతులో ఇప్పుడు మనకు స్పష్టంగా తెలియదు. కాని ఈ జపం ద్వారా ఆ పూర్వ స్మృతులకు చికిత్స పొందగలం - రోమా 8, 26-27.

4) ఈ వరాన్ని వినయంతోను సరళస్వభావంతోను అంగీకరించేవాళ్లు ఆత్మయిచ్చే ఇతర వరాలను పొందడానికి గూడ అర్హులౌతారు.

5. భాషలలో ప్రార్థనచేసే వరాన్ని సంపాదించడం ఏలా? అది ప్రభువే ఇచ్చే వరం. అతడు దప్పికిగొన్నవాళ్లు తనవద్దకు వచ్చి దప్పిక తీర్చుకోవచ్చు అన్నాడు. ఆయనను నమ్మినవాళ్ళ అంతరంగంలో నుండి జీవజల ప్రవాహం పొంగి పారుతుంది అన్నాడు. ఆ ప్రవాహమే పరిశుద్ధాత్మ. కనుక పరిశుద్ధాత్మను మనమీదికి పంపి ఆ యాత్మద్వారా మనకు ఈ ప్రార్థనా వరాన్ని దయచేయమని క్రీస్తుని అడుగుకోవాలి - యోహా 7, 37-38.

కొందరికి ఈ ప్రార్థన సులభంగానే అలవడుతుంది. కొందరికి అంత సులభంగా అలవడదు. ఈలాంటివాళ్లు ఈ జపాన్ని బాహ్యంగా అభ్యాసం చేయాలి. మామూలుగా ఈ ప్రార్థనను జపించేవాళ్లు పెదవులతో "బెబ్బెబ్బెబ్బె" అన్నట్లుగా శబ్దంచేయడంకద్దు. ఈ ప్రార్థనను కోరుకొనేవాళ్లు కూడ ఇదేపద్ధతిలో అభ్యాసం చేయవచ్చు. రోజూ కొన్ని నిమిషాలపాటు ఈలా అభ్యాసం చేసికొంటూపోతే కొంతకాలంమైనంక ఆత్మ ఈ యభ్యాసాన్ని ప్రార్థనగా మారుస్తుంది. ఈలా చేయాలంటే కొంత నమ్మికా వినయమూ పట్టుదలా అవసరం.

చాలాకాలం అభ్యాసం చేసినంకగూడ కొందరికి ఈ ప్రార్థనాపద్ధతి స్వల్పంగా అలవడుతుంది. కాని ఎంత స్వల్పంగా అలవడినా దీన్ని జపించాలేగాని వదలివేయకూడదు. ఎందుకంటే ఇది చాల శ్రేష్ఠమైన ప్రార్థనం. మన భాషనూ మన భావాలనూ త్రోసిపుచ్చి పరిశుద్ధాత్మే స్వయంగా మన ఆత్మలో చేసే ప్రార్థనం అని ముందే చెప్పాంగదా!

# 15. వివేచనం

1. వివేచనం అంటే మంచి చెడ్డలను ఆలోచించి చూచే శక్తి. మనం ఆత్మలోకి జ్ఞానస్నానం పొందినపుడు పరిశుద్ధాత్మ మనమీదికి బలంగా వేంచేసి వస్తుంది. మనలను తనవశం చేసికొని తన ఇష్టంవచ్చినరీతిగా నడిపిస్తుంది. అది చూచి పిశాచం కూడ మనలను శోధించాలని కోరుకొంటుంది. మనమీద తన ప్రభావం చూపుతుంది. ఈలాంటి పరిస్థితుల్లో పవిత్రాత్మే మనలను ప్రబోధిస్తుందో లేక అపవిత్రాత్మే ప్రబోధిస్తుందో తెలిసికోకలిగి వుండాలి. ఇదే వివేచనం.

పిశాచం ఒకోమారు దేవుని యనుమతితో మనలను శోధించడం కద్దు. సైతాను పేత్రుని జల్లెడలోని ధాన్యాన్ని లాగ జల్లించాలని కోరుకుంది - లూకా 22,31. అనగా అతన్ని పట్టుకొని బలంగా ఊపాలని - అంటే తీవ్రంగా శోధించాలని - కోరుకొంది. దైవవాక్యమనే విత్తనం మన హృదయంలో పడి వేరు పాతుకోకపూర్వమే సైతాను దాన్ని దొంగిలించుకొని పోతుంది - మార్కు 4,15. దయ్యం మనలను శోధిస్తుందనడానికి ఈ యుదాహరణలు చాలు.

పిశాచం ఎప్పుడూ దైవరాజ్యాన్ని చెరచాలని చూస్తూంటుంది. కనుక అది దైవమార్గాన్ని అనుసరించేవాళ్ళని అపమార్గం పటిస్తుంది. ప్రభువు ఎడారిలో ప్రార్థన చేసికొంటూ తండ్రిని పూజించుకొంటున్నాడు. ఇది పిశానిచాకి గిట్టలేదు. కనుక, నీవు దేవాలయం గోపురంమీద నుండి క్రిందికి దూకమని శోధించింది - లూకా 4,9. దయ్యం

ఈలా మనలను పెడత్రోవ పట్టిస్తుంది. పైగా పిశాచం ఎవరైనా ఓ మంచిపని చేసినపుడుగూడ మనం అదేదో చెడ్డకార్యం అని శంకించేలా చేస్తుంది. క్రీస్తు అన్ని అద్భుతాలు చేసినాగూడ యూదుల పెద్దలు అతడు పిశాచ నాయకుని సహాయంతోనే ఆ యద్భుతాలన్నీ చేస్తున్నాడని భావించారు - మార్కు 3,22. ఈలాగే మనంకూడ పిశాచ ప్రబోధితులమై ఇతరులు చేసిన మంచిపనికిగూడ చెడుగును ఆరోపిస్తాం. ఈలా పిశాచ శోధనలు బహువిధాలుగా వుంటాయి. ఈలాంటప్పుడు దురాత్మ మనలను పురికొల్పే తీరును గుర్తించడం అత్యవసరం కదా!

2. పౌలు "ఆత్మను ఆర్పివేయవద్దు, సమస్తాన్నీ పరీక్షించి తెలుసుకొనండి" అన్నాడు - 1 తెస్స 5,19,22. యోహాను కూడ తన మొదటి జాబులో "ఆ యాత్మలు దైవసంబంధమైనవో కావో పరీక్షించి చూడండి" అన్నాడు - 4,1. ఈలా పరీక్షించి చూచే శక్తే వివేచనం. కొందరిలో ఈ శక్తి గొప్పగా వుంటుంది. ఇది పవిత్రాత్మ యిచ్చే ప్రత్యేకవరం. దీన్నే పౌలు 1కొ 12, 10లో పేర్కొన్నాడు. ఈ శక్తికలవాళ్లు తమ్ము పలానా కార్యం చేయమని పవిత్రాత్మే ప్రేరేపిస్తుందో లేక పిశాచమే ప్రేరేపిస్తుందో వెంటనే గుర్తుపడతారు. కొలదిగానో గొప్పగానో ఈ వరం మన కందరికీ అవసరమే. ఇదిలేందే సరియైన ఆధ్యాత్మిక జీవితం జీవించలేం. కనుక మనం ఈ వరంకోసం ఆత్మను ప్రార్థించాలి.

3. కాని ఈ వివేచనాన్ని పాటించడం ఏలా? ప్రభువు ఫలాన్నిబట్టి చెట్టును నిర్ణయించవచ్చు - అనగా వారివారి ప్రవర్తలను బట్టి నరులను నిర్ణయించవచ్చు అన్నాడు - మత్త 7, 15-20. ఇది సర్వత్ర వర్తించే గొప్ప సూత్రం. మంచి పండుకాస్తే అది మంచి చెట్టు. చెడుపండు కాస్తే అది చెడ్డ చెట్టు. ఉమ్మెత్తకాయ కాసేది పాడు చెట్టు. మామిడికాయ కాసేది మంచి చెట్టు. ఇక, మన పండ్లు మనం చేసే పనులే. కనుక మంచిపనులు చేసేవాడు మంచివాడు. చెడుపనులు చేసేవాడు చెడ్డవాడు. లోకంలో మన జీవితానికి గాని ఇతరుల జీవితానికి వర్తించే ప్రాథమిక సూత్రం ఇది.

మనచేత మంచిపండు కాయించేది పరిశుద్ధాత్మే. పౌలు ఆత్మఫలాలను తొమ్మిదింటిని పేర్కొన్నాడు. వాటి వివరణాన్ని మీదటి అధ్యాయాల్లో విపులంగా పరిశీలించి చూద్దాం. ఒకోమారు ఈ ఫలాలుకూడ మన పాపకార్యాలతో మిళితమై వుంటాయి. కనుక వాటిని గుర్తుపట్టడం అంత సులభం కాదు.

4. ఆత్మ నడిపించే వాళ్లల్లో రెండుమూడు ప్రధాన లక్షణాలు కన్పిస్తాయి. ఇవి ఆత్మ మన జీవిత వృక్షంమీద కాయించిన పండ్లు అనాలి. మొదటిది, ప్రభుని ప్రగాఢంగా విశ్వసించడం. క్రీస్తుని అంగీకరించేలా చేసే ఆత్మ దైవసంబంధమైంది - 1 యోహా 4,2.

కనుక ఈ యాత్మ మనలో పని చేస్తున్నట్లయితే మనం ఆ ప్రభుని నిండు హృదయంతో నమ్ముతాం. మన హృదయం కోరుకొనే ప్రధాన కోరికకూడ క్రీస్తే ఔతాడు - 2కొ 12,3. క్రీస్తుని అంగీకరించినవాళ్ళకు ప్రభువాక్యమైన బైబులుపట్ల ఆసక్తీ శ్రద్ధా కలుగుతుంది.

రెండవది, తండ్రి మనలను ప్రేమించేవాడని నమ్మడం. దేవుణ్ణి ప్రేమించేవాళ్ళకు అన్ని సంఘటనలుకూడ అనుకూలంగానే పనిచేస్తాయి అన్నాడు పౌలు - రోమా 8,28. కనుక ప్రేమమయుడైన ఆ తండ్రి మనలను చేయి వదిలేవాడుకాదు అని నమ్మాలి.

మూడవది, వినయం. వినయంలేందే ప్రభువుకి ప్రియపడేలా జీవించలేం. వినయవంతులు పిశాచ శోధనలను వెంటనే గుర్తుపడతారు. పిశాచం మనలను పెడత్రోవ పట్టించకుండా వుండాలన్నాగానీ, లేదా మనం ఇతరులు చేసిన మంచి పనికిగూడ చెడుగును ఆరోపించకుండా వుండాలన్నాగానీ వినయం అవసరం. ఇక, వినయమూ విధేయతా కలసిపోతూంటాయి. ఆత్మ నడిపించేవాళ్ళకు వినయమూ విధేయతా రెండూ భూషణాలుగా వుంటాయి.

# 16. ప్రవచన వరం

పౌలు "మీరు భాషల్లో మాటలాడాలని నాకోరిక. కాని మీరు ప్రవచనం చెప్పాలని నేను మరీ అధికంగా కోరుకొంటున్నాను" అన్నాడు - 1కొ 14,5. అతడు సేవా వరాల్లో ప్రవచనాన్ని ఘనంగా యెంచినట్లు కన్పడుతుంది - 1కొ 14,1.

1. ప్రవచనం అంటే యేమిటి? చాలమంది క్రైస్తవులు ప్రవచనం పూర్వవేదానికి సంబంధించిన వరం అనుకొంటారు. కాని ఇది విశేషంగా నూత్నవేదానికి చెందిన వరం. పేత్రు యెరూషలేములో చేసిన పెంతెకోస్తు మొదటి ఉపన్యాసంలో "అంత్యదినాల్లో నా యాత్మను మీ మీద కుమ్మరిస్తాను, మీ కుమారులూ కొమార్తెలూ ప్రవచనం చెప్తారు" అన్న యోవేలు ప్రవచనాన్ని ఉదాహరించాడు - అచ 2,17. దీన్ని బట్టి నూత్న వేదంలోని భక్తులకు ప్రవచనం సమృద్ధిగా లభిస్తుందని అర్థం చేసికోవాలి. అందుకే నూత్నవేదం చాల తావుల్లో ప్రవచనాన్ని పేర్కొంటుంది - 1తెస్స 5,20.

మామూలుగా మనం ప్రవక్త అంటే భవిష్యత్తును తెలియజెప్పేవాడనో లేక రహస్యాలను వెల్లడిచేసేవాడనో భావిస్తాం. కాని ఇది పొరపాటు. ఆత్మ ప్రబోధంతో ప్రభు సందేశాన్ని విన్పించేవాడు ప్రవక్త. ఈ సందేశంకూడ తరచుగా వర్తమానానికి సంబంధించింది వుంటుంది. ప్రవచనం ద్వారా ప్రభువు తన ప్రజలకు మూడు ఉపకారాలు చేస్తాడు.

1) ప్రజలను నడిపిస్తాడు. ఓ వ్యక్తిగాని లేక ఓ సమాజంగాని ఏమిచేయాలో, ఏలా నడుచుకోవాలో తెలియజేస్తాడు. అంతియోకయలోని క్రైస్తవ సమాజంలో పౌలునీ బర్నబానీ ప్రేషితోద్యమానికి పంపాలని ప్రవచనం ద్వారా తెలియజేసాడు ప్రభువు - అచ 13,2.

2) ప్రోత్సాహం. ప్రవచనం ద్వారా ప్రభువు తన ప్రజలకు ఓదార్పునీ ఉపశాంతినీ ప్రోత్సాహాన్నీ కలిగిస్తాడు -1కొ 14,3. ఇప్పుడు మన కాలంలో ప్రవచనం నెరవేర్చే ప్రధాన ప్రయోజనం ఇదే.

3) తప్పు దిద్దడం. ప్రవచనం ద్వారా ప్రభువు ఆయావ్యక్తుల దుష్కార్యాలను వెల్లడిచేసి వాళ్లు తమ తప్పిదాలను సరిదిద్దుకొనేలా చేయడం గూడ కద్దు - 1కొ 14,24.

2. మన క్యాతలిక్ సమాజంలో ప్రవచనం అంతగా లేదు. ఇప్పుడు పెంతెకోస్తు ఉద్యమం ఈ వరాన్ని పునరుద్ధరిస్తూంది. ఈ వుద్యమం సమావేశాల్లో చాలా మంది భక్తులు ప్రవచనం చెప్తూంటారు. ప్రవచనమంటే దైవ సందేశాన్ని తెలియ జేయడం మాత్రమేనని చెప్పాం. ఈ భక్తులు సమావేశాల్లో చెప్పే ప్రవచనాలు ఇంచుమించు ఈలా వుంటాయి. "ప్రభువు ఈలా అంటున్నాడు : మీరు ఏమీ ఆందోళనం చెందకండి. నేను మిమ్ము ఉన్నవాళ్ళను ఉన్నట్లుగా అంగీకరిస్తాను, ఆదరిస్తాను గూడ." "నా ఆరోగ్యశక్తి మీమీద పనిచేస్తుంది. మీ హృదయాలను విప్పి నాశక్తిని పొందండి." "భక్తులారా! మీరు నా ప్రేమను చవిజూస్తారు, నా రక్షణాన్ని అనుభవిస్తారు."

ఈలాంటి ప్రవచనాలు మనకు ఏమి మేలు చేస్తాయి? ఇవి మనం ఏలా నడచుకోవాలో చెప్తాయి. మనకు ఓదార్పునీ ప్రోత్సాహాన్నీ ఇస్తాయి. వీటిద్వారా ప్రభువు మనకు ఊరటను కలిగించే వాక్యాలను విన్పిస్తాడు.

3. ప్రవచనం చాలారకాలుగా వుంటుంది :

1) ఒకోమారు ప్రభువు దర్శనాలద్వారా తన భక్తులతో మాటలాడతాడు. దర్శనాల ద్వారా వాళ్ళను ప్రోత్సాహపరుస్తాడు - సంఖ్యా 12,6.

2) కొందరితో ప్రభువు తన సందేశాల ద్వారా మాట్లాడతాడు. ప్రభువే భక్తుని హృదయంలో ఓ సందేశం విన్పిస్తాడు. లేదా ప్రభు ప్రబోధంవల్ల భక్తుడే ఓ సందేశాన్ని పలుకుతాడు, ఆ సందేశం అతన్ని ప్రోత్సాహపరుస్తుంది. అనగా భక్తుడు తన్ను ప్రోత్సాహపరచే సందేశాన్ని తానే ఉచ్చరిస్తాడు.

3) మన చుట్టూరా ఉన్నవాళ్ళు ప్రభువు వలన ప్రబోధితులై ఏదో ఓ మాట పలుకుతారు. లేదా అదివరకే జరిగిన ఓ సంఘటనం భావాన్ని వివరిస్తారు. లేదా ఓ

బైబులు వాక్యాన్ని ఉదాహరిస్తారు. లేదా ఓ ఓదార్పు వాక్యం చెప్తారు. ఇది మనకు ప్రవచనంగా పనిచేస్తుంది. అనగా ఈ మాట ద్వారా ప్రభువు మనలను ప్రోత్సాహపరుస్తాడు. ఉదాహరణకు మదర్ తెరీసా డిసెంబరులో దివిసీమను సందర్శించినపుడు "ఈ విషాద సంఘటనం ద్వారా ప్రభువు మనకు ఏదో నేర్పుతున్నాడు" అంది. ఇది ప్రవచనమే.

4) ఒకోమారు మనవద్దనున్న ఓ వ్యక్తి మనకు తెలియని అన్యభాషలో ఏదో అంటాడు. మరోవ్యక్తి ప్రభువువలన ప్రబోధితుడై అతని మాటలకు అర్థం చెపుతాడు. తరువాత ఆ మాటలు యథార్థమేనని మనం పరిశీలించి తెలిసికొంటాం. అనగా ఆ మాటలు ఎవరికి వర్తిస్తాయో వాళ్ళే వాటి యాథార్థ్యాన్ని రుజువు చేస్తారు - 1కొ 14, 27-29.

5) కొందరిచేత ప్రభువు తన సందేశాన్ని చెప్పిస్తాడు. ఈ సందేశహరులు తాము చెప్పేది ప్రభు సందేశమనీ భావిస్తారు. ప్రభువే తమ్ము ఆ సందేశం చెప్పమని కోరుకొంటున్నాడనీ భావిస్తారు. వీళ్ళల్లో కొందరికి ప్రభువు తన సందేశాన్నీ, ఆ సందేశాన్ని చెప్పే భాషనూకూడ అందిస్తాడు. కాని కొందరికి తన సందేశాన్ని మాత్రమే ఇస్తాడు.. దాన్ని తెలియజేసే భాష ఆ సందేశహరుడే వెతుక్కోవాలి.

ఇక్కడ పేర్కొన్న ఐదురకాల ప్రవచనంలోను ఇప్పుడు పెంతెకోస్తు సమావేశాల్లో బహుళ ప్రచారంలో వుంది మూడవరకం ప్రవచనం.

4. ప్రవచనం చెప్పడానికి సంసిద్ధులం కావడం ఏలా? కొందరు అంతసులభంగా ప్రవచన వరానికి లొంగరు. మేమేమిటి, ప్రవచనం చెప్పడ మేమిటి అని భయపడి సిగ్గుతో జంకుతూ వెనుకాడతారు. కాని ప్రభువు ఈలాంటి వాళ్ళనుగూడ ప్రోత్సహించి వాళ్ళ చేత తన సందేశం విన్పిస్తుంటాడు. వాళ్ళ మనసుల్లో కేవలం సందేశాన్నో లేక ఆ సందేశాన్నీ దాన్ని చెప్పవలసిన భాషనూ రెండింటిని గూడానో, తానే పొందుపరుస్తూంటాడు. ఇక వాళ్ళు ఓ విధమైన నిర్బంధానికి గురై ప్రవచనం చెప్తారు. ఈలాంటి వాళ్ళల్లో మామూలుగా రెండులక్షణాలు కన్పిస్తాయి. తాము పలానా సందేశాన్ని విన్పించాలి అనే కోరిక వాళ్ళల్లో బలంగా వుంటుంది. ఆ సందేశమూ దాన్ని విన్పించాలనే కోరికా రెండూ గూడ ఆత్మ నుండి వచ్చాయన్న నమ్మిక కూడ వీళ్ళల్లో వుంటుంది. పెంతెకోస్తు సమావేశాల్లో ఈలాంటి ప్రవక్తలను చాలామందిని చూస్తూంటాం.

ఐనా మనం ఓ డాక్టరుమో ఉపాధ్యాయుడిమో కావాలని నిర్ణయించుకొన్నట్లుగా ఓ ప్రవక్త కావాలని నిర్ణయించుకోలేం. మనంతట మనం ప్రవచనం చెప్పలేం. మనకు ప్రవచన వరమిచ్చేది ప్రభువే. మన బాధ్యత, ప్రభువు ఆ వరాన్ని ఇచ్చినపుడు దానికి లొంగిపోవడం - అంతే.

ఈ వరాన్ని పొందడానికి మన తరపున మనం తయారు కావచ్చు గూడ. దానికి మనం చేయవలసిన పనులివి.

1. ప్రభు గ్రంథాన్ని చక్కగా చదివి బైబులు వాక్యంతో పరిచయం కల్గించుకోవాలి. 2. ప్రభువు ప్రవచనం ద్వారా తన ప్రజల అక్కరలు తీర్చి వాళ్ళను ప్రోత్సాహపరుస్తాడని నమ్మాలి. 3. ప్రార్థనాభ్యాసం కలిగించుకొని అంతర్నివాసియైన ప్రభువు మన అంతరాత్మలో మెల్లగా పలికే సందేశాన్ని వినడానికి అలవాటుపడాలి. 4. ప్రజల యెడల సానుభూతీ దయా అలవరచుకొని వాళ్ళ గోడు వినగలిగివుండాలి. ప్రవక్త బాధల్లో వున్న ప్రజలమీద గల ప్రేమచేత వాళ్ళకు ప్రభు సందేశాన్ని విన్పించాలిగాని, పదిమంది దృష్టి తనవైపు ఆకర్షించుకొని పేరు సంపాదించుకొందామనే స్వార్థ బుద్ధితో ప్రవచనం చెప్పగూడదు. అనగా ప్రవక్తకు ప్రధానాంశం దైవసందేశం చెప్పడం గాని, తాను పేరు తెచ్చుకోవడం కాదు.

5. ప్రవచనం చాల రకాలుగా వుంటుందని చెప్పాం. ఒకోమారు ఎవరైనా అతిముఖ్యమైన విషయాలను గూర్చి ప్రవచనం చెప్పవచ్చు. అలాంటప్పుడు ఆ ప్రవచనాన్ని మనం ఎంతవరకు నమ్మాలి? అనగా ప్రవచనాన్ని పరిశీలించి చూచే పద్ధతి యేమిటి? పౌలు "ప్రవచనాన్ని అనాదరం చేయకండి. కాని పరిశీలించిచూడండి" అని చెప్పాడు – 1తెస్స 5,19–20. ఎవరైనా ప్రవచనం చెప్తే అక్కడివాళ్లు దాన్ని పరిశీలించి చూడ గలిగి వుండాలి – 1కొ 14, 29. అనగా సమావేశంలో ఆ ప్రవచనం ఎవరికి వర్తిస్తుందో వాళ్ళు దాని నిజానిజాలు రుజువు చేయగలిగి వుండాలి.

ఇక, మామూలుగా ప్రవక్త చెప్పే సందేశాన్ని పరిశీలించి చూడ్డానికి మూడంశాలు ఉపయోగ పడతాయి.

1) ప్రవక్త జీవితం యోగ్యంగా వుండాలి. పండును బట్టి చెట్టును నిర్ణయిస్తాంగదా? – లూకా 6,43. ప్రవక్త మంచి వాడైతే మంచిపనులు చేస్తుండాలి. పొట్టకూటి కోసమూ కీర్తికోసమూ ప్రవచనం చెప్పేవాణ్ణి నమ్మకూడదు.

2) భక్తులు చెప్పే సందేశం బైబులు సత్యాలకూ శ్రీసభ బోధలకూ వ్యతిరేకంగా పోదు. భగవంతుని కరుణాస్వభావానికి గూడ వ్యతిరేకంగా పోదు. కనుక శాపవచనాలు ప్రవచనం కానేరవు.

3) యథార్థమైన ప్రవచనంవల్ల శ్రోతల్లో ఆత్మఫలాలు పుడతాయి. అనగా శ్రోతల హృదయంలో ప్రేమ, ఆనందం, సమాధానం, దయ మొదలైన భావాలు ఏర్పడతాయి – గల 5, 22. మంచి ప్రవక్త ప్రవచనం విన్నపుడు ప్రభువు స్వయంగానే ఆ సందేశం విన్పిస్తున్నాడు అన్నట్లుగా వుంటుంది. మన హృదయం ఆ సందేశాన్ని నమ్ముతుంది

మామూలుగా ప్రభువు తన భక్త సమాజానికి ప్రవచన వరాన్నీ, ఆ వరాన్ని గుర్తించే వివేచనా వరాన్నీ గూడ ప్రసాదిస్తుంటాడు. ఈనాడు మన సమస్య ప్రవచనాన్ని ఏలా పరిశీలించి చూడాలా అన్నదికాదు. అసలు ప్రవచనం చెప్పేవాళ్ళే కరువైపోయారు. కనుక పెంతెకోస్తు భక్తులు ఈ వరంకోసం పవిత్రాత్మను ప్రార్థించాలి. కొందరు దైవసందేశాన్ని విన్పించి భక్త సమాజాన్ని ప్రోత్సహించాలని వేడుకోవాలి. ప్రవచనం చక్కని వరం. ప్రవక్త ఓ స్నేహితుల్లాంటివాడు. మన మేలు కోరి దైవవాక్కుతో మనలను ప్రోత్సహించేవాడు. ఈలాంటి ప్రోత్సాహకుల మయ్యే భాగ్యం మనకుగూడ అబ్బితే ఎంత బాగుంటుంది!

# 17. ప్రేషితరంగం

1. పౌలు 1 కొరింతీయులు 12, 28లోను, రోమీయులు 12,7లోను ఎఫేసీయులు 4,11లోను ప్రేషిత వరాన్ని పేర్కొన్నాడు. ప్రేషితులంగా పని చేయడమనేది ఆత్మయిచ్చే వరాల్లో ఒకటి. మన క్యాతలిక్ సమాజంలో చాలమంది, గురువులూ మఠకన్యలూ మాత్రమే ప్రేషితులనీ, గ్రుహస్థులు ప్రేషితులుకారనీ భావిస్తుంటారు. అందుకే మనవాళ్ళు కొంతమంది మన మతాన్ని "స్వాములవారి మతం" అని అంటుంటారు. కాని ఇది పెద్ద పొరపాటు. గురువులూ మఠకన్యలతో పాటు మన గృహస్థులు కూడ సువిశేష సేనకు పూనుకోవాలి. విశేషంగా మన ఉపదేశులూ ఉపాధ్యాయులూ ఈ సేవ అమితంగా చేయాలి.

2. పూర్వవేద ప్రజలు ఎన్నిక ద్వారా ప్రభుప్రజలయ్యారు. సీనాయి కొండ వద్ద ప్రభువు యిస్రాయేలుతో ఒడంబడిక చేసికొన్నాడు. వాళ్ళు యావేను ఆరాధించే పవిత్రప్రజా, యాజకరూప రాజ్యమూ అయ్యారు - నిర్గ 19, 5-6. అప్పటి నుండి ఆ ప్రజలు సకలజాతులకూ యావే ప్రభువును ఎరిగించడం తమ బాధ్యత అనుకొన్నారు. ఇక పూర్వవేద ప్రజలకు ఎన్నిక ఏలాంటిదో నూత్నవేద ప్రజలమైన మనకు జ్ఞానస్నానం అలాంటిది. దాని ద్వారా మనం కూడ ప్రభువు పవిత్రప్రజలమూ, అతన్ని పూజించే యాజకరూప రాజ్యమూ ఔతాం - 1 పేత్రు 2,9-10. ఆ యిస్రాయేలు లాగే మనం కూడ క్రీస్తుని లోకానికి తెలియజేయాలి. అతని అద్భుత కృత్యాలను ప్రకటించాలి. క్రీస్తులోకి జ్ఞానస్నానం పొంది ఆ ప్రభువులోనికి ఐక్యం కావడంవల్ల అతని లక్షణాలు మనకు కూడ సంక్రమిస్తాయి. ఆ క్రీస్తు ప్రేషితుడు. అనగా తండ్రిచే పంపబడినవాడు. అతనిలాగే మనంకూడ ప్రేషితులంగా మెలగాలి - యోహా 20,21.

3. క్రైస్తవ సమాజ మంతా కలసి క్రీస్తు జ్ఞానదేహం. ఈ దేహానికి మనమే అవయవాలం. కనుక మనం పనిచేయందే ఈదేహం వృద్ధి చెందదు. మనం కృషి చేసి క్రీస్తు దేహమైన క్రైస్తవ సమాజాన్ని పెంపులోకి తీసికొని రావాలి - ఎఫే 4,16.

4. పైగా మనం దీపస్తంభంమీద పెట్టిన దీపంలాంటి వాళ్ళం. పర్వతంమీద నిర్మించిన నగరం లాంటివాళ్ళం. మన వెలుగూ ఉనికీ ఇతరులు గుర్తించాలి - మత్త 5, 14-16. ఇంకా మనం ఇతరులకు క్రీస్తును బోధించాలి అంటే మొదట ఆ క్రీస్తు మన హృదయంలో వుండాలి. తల్లితీగలోనికి అతుకుకొని వున్న రెమ్మల్లోకి ఆ తీగ సారం ప్రవేశిస్తుంది. ఆలాగే మనం కూడ ప్రార్థన ద్వారా క్రీస్తులోకి ఐక్యమైతే అతని సారమూ శక్తీ మనలోనికి ప్రసరిస్తుంది - యోహా 15,5.

5. ఒకోమారు మన గురువులూ మఠకన్యలూ గృహస్థ ప్రజలను ప్రోత్సహించరు. ప్రేషితకార్యాలన్నీ చేస్తే తామేచేయాలి కాని మరెవ్వరూ చేయకూడదు అనుకొంటారు. గృహస్థులను ప్రేషిత కార్యానికి ప్రేరేపించరు. కాని ఇది పెద్ద పొరపాటు. ఆత్మ గురువులకూ మఠకన్యలకూ మాత్రమే కాదు, గృహస్థులకూడ వరాలిస్తుంది - 1కొ 12, 7; 11. ఆత్మ గృహస్థులకు ఇచ్చే యీప్రత్యేక వరాలను గురువులు అణచివేయకూడదు. దీపాన్ని ఆర్పివేసినట్లుగా వాళ్ళ వరాలను ఆర్పివేయకూడదు - తెస్సి 5,12; 19-20 గురువులు గృహస్థులను ప్రోత్సహించి వాళ్ళచేత ఆయా ప్రేషిత సేవలు చేయించుకోవాలి. గృహస్థులు తమ తరుపున తాము గురువు మాట విని అతని సలహాలను పాటిస్తుండాలి. తాము అతని నాయకత్వం క్రింద పనిచేస్తుండాలి. ఈ సమన్వయం కుదిరిన తావుల్లో చక్కని సువిశేష బోధ జరుగుతుంది. చూడు, వాటికన్ చట్టం - గృహస్థుల ప్రేషిత ఉద్యమం - నంబరు 3.

6. క్రీస్తుకి పండ్రెండు మంది శిష్యులేగాక 72 మంది శిష్యులు కూడ వుండేవాళ్ళు. ప్రభువు వాళ్ళను తనకంటె ముందుగా ఆయా వూళ్ళకు పంపాడు. వాళ్ళు వెళ్ళి ప్రజలను క్రీస్తు రాకకు సిద్ధం చేసేవాళ్ళు - లూకా 10,1. మన గృహస్థనాయకులు కూడ ఈలాగే పల్లెలకు వెళ్ళి మున్ముందుగా అక్కడి సమాజాలను సిద్ధం చేయాలి. వారి తరువాత గురువులూ మఠకన్యలూ ఆ పల్లెలకు వచ్చి అక్కడి ప్రజలకు నానారూపాల్లో క్రీస్తును అందిస్తారు.

7. మనకు ప్రేషిత వాంఛ పుట్టించేది పరిశుద్ధాత్మే. అపోస్తలుల చర్యల్లో ఆయాత్మ ప్రేషితులను నడిపించిన తీరు అద్భుతంగా వర్ణింపబడివుంది. ఆత్మ ఫిలిప్పును ఇతియోపీయుని వద్దకు కొని పోయింది - 8, 29. పేత్రుని కొర్నేలి వద్దకు నడిపించుకొని

పోయింది -10,1,19. అంతియోకయ సమాజం నుండి పౌలుని బర్నబాను సువిశేషసేవకు పిలిచింది - 13, 2-4. రెండవ ప్రేషిత ప్రయాణంలో పౌలుని బితూనియా ఆసియా రాష్ట్రాల్లో వాక్యం బోధింపకనీయకుండా నేరుగా మాసెడోనియాకు తోడ్కొని పోయింది - 16, 6-7. మూడవ ప్రేషిత ప్రయాణంలో పౌలుకు యెరూషలేములో బాధలూ శ్రమలూ కాచుకొనివున్నాయని చెప్పింది - 20, 22-23. క్రైస్తవ మతంలో చేరిన గ్రీకుప్రజలు మోషే ధర్మశాస్త్రాన్ని పాటించనక్కర లేదని యెరూషలేము మహాసభలో నిర్ణయం చేసింది. ఆత్మే - 20, 28. ఈవిధంగా పరిశుద్ధాత్మ ప్రేషితులను పురికొల్పుతుంది. ఈ యాత్మ మనలను గూడ ప్రేరేపించి ప్రేషితోద్యమానికి పంపాలని ప్రార్థన చేసికొందాం.

8. అపోస్తలుల కార్యాల గ్రంథం ఆనాటి గృహస్థ ప్రేషితులను చాలమందిని పేర్కొంటుంది. స్తెఫను మరణానంతరం యెరూషలేమునుండి చెల్లాచెదరైన యూద గృహస్థులు ఫినీష్యా, సైప్రసు, అంతియోకయ ప్రాంతాల్లో క్రీస్తును బోధిస్తూ వెళ్ళారు - 11, 19-20. ప్రిస్కిల్లా అక్విలా అనే దంపతులు పౌలుకు చాల తోడ్పడ్డారు - రోమా 16,3. వీళ్ళు అపొల్లో అనే ఉపన్యాసకునికి గూడ క్రీస్తుని బోధించారు - అచ 18,26. యువోదియ, సుంటకే అనే స్త్రీలు క్లెమెంటు అనే అతనీ పౌలుతో కృషి చేసారు - ఫిలి 4, 2-3. ఈ గృహస్థుల్లాగే మనం కూడ క్రీస్తు పరిచర్యలో పాల్గొంటే జీవితం ధన్యమౌతుంది.

9. యిర్మీయా ప్రభువుని బోధించకుండా వుండలేక పోయాడు. ప్రభువుని బోధించకుండా ఊరుకొందామనుకొంటే ప్రవక్త ఉదరంలో ఏదో అగ్ని మండి అతన్ని బోధచేయమని నిర్బంధం చేసేది - యిర్మీ 20,9. అలాగే పౌలు కూడ సువార్తను బోధించక పోయినట్లయితే తాను శాపానికి గురౌతానని భావించాడు - 1కొ 9,16. మరి మనం ఈ విషయంలో పట్టీపట్టనట్లుగా వుండవచ్చా?

10. బోధకుల్లో కొందరు ధైర్యం కలవాళ్ళు. వీళ్ళు ఎషయాలాగ "ప్రభూ! నేనున్నాను కదా! నన్ను పంపండి" అని ముందుకి వస్తారు - యెష 6,8. కాని కొందరు పిరికివాళ్ళు. వీళ్ళు యిర్మీయాలాగ "ప్రభో! నేను బాలుణ్ణి. నన్ను పంపవద్దు" అని వెనక్కువెనక్కు పోతారు - యిర్మీ 1,6. ఐనా పిరికివాళ్ళనూ ధైర్యశాలులనూగూడ ప్రేషితరంగానికి తోడ్కొనిపోయేది పరిశుద్ధాత్మే. నాయకత్వవరం ఆయాత్మ ద్వారా లభిస్తుంది.

11. పౌలు తన ప్రేషిత జీవితాన్ని ఓ దీపంతో పోల్చాడు. దీపం తన చమురును తాను వ్యయంచేసికొంటూ మన కోసం వెల్గుతుంది. తాను కాలిపోతూ మనకు వెలుతురు నిస్తుంది. ఆలాగే పౌలుకూడ తన ప్రాణాన్ని సమర్పిస్తూ కొరింతీయుల కోసం కృషి చేసాడు - 2కొ 12,15. ప్రేషితులు కాగోరేవాళ్ళల్లో ఈ స్వార్థరాహిత్యం వుండాలి. ప్రభువు కూడ తన్నుతాను సంతోషపెట్టుకోకుండా మనకోసం సిలువమీద బలి అయ్యాడు - రోమా

15,3. అతడు తన సుఖాన్ని తాను వెతుక్కున్నట్లయితే మనకు రక్షణం లభించివుండేదేనా? ఈలా స్వార్థాన్ని జయించందే, ఓ తల్లిలా తండ్రిలా తోడి ప్రజలకోసం మన జీవితాన్ని సమర్పించుకోందే, ప్రేషితులంగా చలామణి కాలేం.

12. ప్రోటస్టెంటు సమాజాల్లో గృహస్థులు ఉత్సాహంతో సువిశేషబోధ చేస్తారు. ప్రార్థనా సమావేశాలు జరుపుతారు. బైబులు బోధిస్తారు. కాని క్యాతలిక్ సమాజంలోని గృహస్థులకు ఈ దృక్పథం లేకపోవడం మన దురదృష్టం. ప్రోటస్టెంటు స్త్రీలతో పోల్చి చూస్తే మన స్త్రీలు చేసే ప్రేషితసేవ సున్న. ఇప్పటి నుండైనా మన ప్రజలు ఉత్సాహంతో ఉదారబుద్ధితో ముందంజవేయాలి. చెలమలో నీళ్లు తీస్తూవుంటే ఇంకా ఊరుతుంటాయి. ఆలాగే మనం కూడ క్రీస్తుని ఇతరులకు తెలియజెప్తూంటే ఆ ప్రభువు తన్ను గురించి ఇంకా తెలియజెప్పాలి అన్న కోరికను మన హృదయాల్లో పుట్టిస్తాడు. మన ద్వారా ప్రభువు తోడిజనానికి బహుమతులీయ గోరుతున్నాడు. ఆనాడు మరియ తూర్పుదేశ జ్ఞానులకు తన్ను అందించినట్లుగా మనమూ అతన్ని తోడి జనానికి అందీయాలని కోరుకొంటున్నాడు - మత్త 2,11. మరి మనం కాదనవచ్చా? పైగా ఆ ప్రభువు అధికంగా యిచ్చినవాళ్ళ వద్దనుండి అధికంగా లెక్క అడగడా? - లూకా 12, 48.

# 18. ఆత్మ ఫలాలు

1. పిశాచం మనలను నానా శోధనలతో బాధిస్తుంది. ఈ శోధనలనే పౌలు శరీరకార్యాలు అనే పేరుతో గలతీయులు 5, 19-21లో పెద్దజాబితాగా పేర్కొన్నాడు. ఈలాంటి శోధనలనుండి మనలను కాపాడ్డానికీ, భగవంతుణ్ణి మన అనుభవానికి తీసికొని రావడానికీ, ఆత్మ కొన్ని ప్రత్యేక వరప్రసాదాలనిస్తుంది. వీటికే ఆత్మఫలాలు అనిపేరు. వీటిని పౌలు గలతీయులు 5,22లో పేర్కొన్నాడు. ఈ ఫలాలు మొత్తం తొమ్మిది. ఇవి ప్రేమ, సంతోషం, సమాధానం, ఓర్పు, దయ, మంచితనం, విశ్వసనీయత, సాధుశీలత, ఇంద్రియనిగ్రహం.

పూర్వధ్యాయాల్లో చెప్పిన సేవావరాలు క్రైస్తవసమాజ లాభంకోసం ఉద్దేశింపబడినవి. కాని ఈ ఫలాలు వ్యక్తిలాభం కోసం ఉద్దేశింపబడ్డాయి. వీటిద్వారా మన జీవితం భగవదనుభవం తోను భక్తిభావంతోను నిండిపోతుంది.

2. ఇక యీ ఫలాలను వివరంగా పరిశీలించి చూద్దాం.

1) ప్రేమ. క్రీస్తుశిష్యులను ప్రధాన చిహ్నం ప్రేమే. దీని ద్వారానే లోకం మనలను క్రీస్తు అనుచరులనుగా గుర్తించేది - యోహా 13,35. ఈ ప్రేమ దైవప్రేమ, సోదరప్రేమాను.

దైవప్రేమ అంటే క్రీస్తుప్రభువునీ అతని ద్వారా తండ్రినీ ప్రేమించి పూజించడం. సోదరప్రేమ అంటే తోడి జనాన్ని ఆదరించడం –రోమా 13,8. ఇక ఈ ప్రేమ శక్తిని మనకు ప్రసాదించేది ఆత్మే. ఆ యాత్మద్వారా తండ్రి కుండతో నీళ్ళు పోసినట్లుగా ప్రేమశక్తిని మన హృదయంలో సమృద్ధిగా కుమ్మరిస్తాడు – రోమా 5,5.

2) సంతోషం. క్రీస్తుని అంగీకరించేవాళ్ళకు ఆత్మ ఓ విధమైన సంతోషమూ సంతృప్తీ ప్రసాదిస్తుంది – రోమా 14,17. ఈ సంతోషాన్ని అనుభవించే భక్తులు ప్రభుని స్తుతించి కొనియాడతారు. ఆనందంతో గానం చేస్తారు.

3) శాంతి. పిశాచం కలహాన్ని తెచ్చిపెడుతుంది. కాని పరిశుద్ధాత్మ శాంతిని అనుగ్రహిస్తుంది – రోమా 8,6. ఈ శాంతి గూడ రెండువిధాలుగా వుంటుంది. మొదటిది, దేవునికీ మనకీ పొత్తు కుదురుతుంది. ఆ ప్రభవు క్రీస్తు ద్వారా మన పాపాలను పరిహరిస్తాడు. మనకీ ఆ తండ్రికీ రాజీ కుదురుతుంది – రోమా 5,1. రెండవది, తోడి ప్రజలకూ మనకూ పొందిక యేర్పడుతుంది. పరిశుద్ధాత్మే క్రైస్తవ సమాజాన్నంతటినీ ఒక్కటిగా బంధిస్తుంది – ఎఫే 4, 3. అనగా మనలో మనకు ఐక్యత సిద్ధిస్తుంది.

4) ఓర్పు. బైబులు భగవంతుడు చాలా ఓర్పు కలవాడు –రోమా 15,5. అతడు త్వరపడి పాపాత్ములను శిక్షించేవాడు కాదు. భగవంతుడు మనపట్ల ఓర్పు చూపినట్లే మనమూ తోడి ప్రజల పట్ల ఓర్పు చూపాలి. ఆత్మ ఈ వరాన్ని అనుగ్రహిస్తుంది.

5) దయ. పరలోకంలోని తండ్రి కనికరం కలవాడు – లూకా 6,36. ప్రభువులాగే మనం కూడ తోడి మానవుల పట్ల దయ చూపెడుతుండాలి – కోలో 3,12. ఇతరులపట్ల కచ్చితంగా మెలగడం సులభం. దయగా మెలగడం కష్టం. ఆత్మే మనకు ఈ వరాన్ని ఈయాలి.

6) మంచితనం. మనం చేసే పనులు ధర్మబద్ధంగాను న్యాయ సమ్మతంగాను ఉండాలి. ఆత్మ ఈ శక్తిని ప్రసాదిస్తుంది.

7) విశ్వసనీయత. ప్రభువు నమ్మదగినవాడు – 2కొ 1, 18–20. అతడు ఆడినమాట తప్పేవాడు కాదు. నేను మిమ్ము రక్షిస్తాను అంటే క్రీస్తుద్వారా రక్షించి తీరతాడు. ఈ ప్రభువు లాగే మనం కూడ నమ్మదగినవాళ్ళమై యుండాలి. నిత్య వ్యవహారంలో ఇతరులకు మనమిచ్చిన మాటను చెల్లించుకోవాలి. దేవునిపట్లగూడ మన విధులను నిర్వర్తించుకోవాలి. కనుక ఈ ఫలంద్వారా ఆత్మ మనకు నమ్మదగిన తనం అనే గుణాన్ని ప్రసాదిస్తుంది.

8) సాధుశీలత. ఈ గుణం కలవాళ్లు ఇతరులతో మృదువుగా సౌమ్యంగా మెలుగుతారు. స్నేహశీలంగా ప్రవర్తిస్తారు. గలతీయులు 1,6లో పౌలు క్రైస్తవులకు ఈ

గుణం వుండాలని చెప్పాడు. విశేషంగా ఇతరులు మన హక్కులను భంగపరచినపుడు ఈ గుణం అవసరం. క్రీస్తులో ఈ గుణం సమృద్ధిగా వుండేది. అతడు సాధుశీలుడు - మత్త 11, 28.

9) ఇంద్రియనిగ్రహం. పిశాచం కామాన్ని కలిగిస్తుంది. ఇది ఆ కామానికి వ్యతిరేకగుణం. దీనివల్ల మన అంతరంగిక భావాల్లోను బాహ్య ప్రవర్తనంలోను సంయమనం అలవడుతుంది. మనం భగవంతుని ఆజ్ఞలకు కట్టుపడి వుంటాంగూడ.

3. అపోస్తలుల చర్యలు 2, 43-47లో లూకా యెరూషలేములోని తొలినాటి క్రైస్తవ సమాజాన్ని వర్ణించాడు. ఈ సమాజపు భక్తుల్లో పైన పేర్కొన్న ఆత్మవరాలు స్పష్టంగా కన్పిస్తాయి. ఆత్మే ఈభక్త సమాజాన్ని నడిపించింది. ఈ భక్తులంతా ప్రేమ భావంతో ఐక్యమై సమష్టిజీవితం జీవించారు. తమ ఆస్తిని ఒకరితో ఒకరు పంచుకొన్నారు. దేవాలయంలో అంతా కలసి ప్రార్థన చేసారు. ఇండ్లల్లో అంతా కలసి భుజించారు. వాళ్ళ ప్రవర్తనలో సంతోషమూ, వినయమూ, సోదరప్రేమా కన్పించింది. ఇవే ఆత్మ ఫలాలు. ఈనాడుకూడ మనం కొందరు క్రైస్తవుల్లో ఈ ఫలాలను చూస్తుంటాం. వాళ్ళు పెద్ద మనుషుల్లాగ, ఓ అమ్మలాగ ఓ నాన్నలాగ, సౌమ్యంగా ప్రవర్తిస్తుంటారు. ఈలాంటి వాళ్ళంటే మనకు పూజ్యభావం కలుగుతుంది.

## 19. ప్రభుని స్తుతించాలి

1. క్రైస్తవ ప్రజలు విశేషంగా ప్రభుని స్తుతించి ఆరాధించేవాళ్లు. "మీరు ఎన్నుకొనబడిన జాతి. యాజక రూపమైన రాజ్యం. పవిత్ర జనం. దేవుని సొంత ప్రజలు. దేవుని అద్భుత కృత్యాలను ప్రకటించడానికి ఏర్పరుపబడినవాళ్ళు" - 1 పేత్రు 2,9. కనుక ప్రభుని స్తుతించడం మన బాధ్యత.

పూర్వవేదం భగవంతుని స్తుతించే బాధ్యత యూద ప్రజల దొక్కరిదేనని మొదట్లో భావించింది. అటుపిమ్మట యూదేతరులు కూడ ఆ ప్రభుని స్తుతించవచ్చునని తలచింది. కడపట ప్రకృతి శక్తులు కూడ ఆ ప్రభుని స్తుతించాలని హెచ్చరించింది. యిస్రాయేలుకు మారుగా ఎన్నుకోబడినవాళ్ళు నూత్న వేదంలో క్రైస్తవ ప్రజలు. కనుక ఆ ప్రభుని స్తుతించి కొనియాడ్డం మన ధర్మం. పౌలు తన జాబుల్లో మాటిమాటికీ ఈ స్తుతి ప్రార్థనను పేర్కొంటాడు - ఎఫే 5,19. పెంతెకోస్తు ఉద్యమం ఈ స్తుతి ప్రార్థనను చాలా ఘనంగా ఎంచుతుంది.

2. స్తుతి ప్రార్థనలో ప్రభువు వరాలను కాదు, అతన్నే స్తుతిస్తాం. ఆ ప్రభువు మంచివాడు, కరుణ కలవాడు, పవిత్రుడు, యోగ్యుడు. కనుక అతని కోసమే అతన్ని

స్తుతించి పూజిస్తాం. "ప్రభువు మహాదేవుడు, ఆయన అత్యధికంగా పూజింపదగినవాడు" అంటాం - కీర్త 145,3. ఈ కారణంచేత ప్రార్థనలన్నిటిలోను స్తుతి ప్రార్థనం శ్రేష్ఠమైంది.

3. కొందరు ఎప్పుడూ మనవి ప్రార్థనం చేస్తూంటారు. అదీయమనీ ఇదీయమని దేవుణ్ణి అడుగుతుంటారు. కాని ఆ ప్రభువు మాహాత్మ్యాన్ని అర్థం చేసికొని అతన్ని ఆరాధించనే ఆరాధించరు. ఈలాంటివాళ్లు అనతి కాలంలోనే స్వార్థపరులైపోతారు. ఈ సత్యాన్ని గుర్తించి పెంతెకోస్తు ఉద్యమం స్తుతి ప్రార్థనను ప్రోత్సహిస్తుంది. ఈ వుద్యమం భక్తులు బృందాలుగా కూడి ఉత్సాహంతో ప్రభుని స్తుతించి గానం చేస్తూంటారు. ఈలాంటి స్తుతి ప్రార్థనం వలననే ఆత్మ నుండి మనకు సేవా వరాలు లభిస్తాయి. విశేషంగా మనం సోదరప్రేమలో వృద్ధిచెందుతాం.

4. స్తుతించడం అంటే ఆశ్చర్యపడ్డం, మెచ్చుకోవడం తన్మయత్వం చెందడం. ఈ స్తుతిభావాలను చప్పట్లు కొట్టడం ద్వారా, చేతులు పైకెత్తడం ద్వారా నినాదాలు చేయడం ద్వారా, పాటలు పాడ్డం ద్వారా వ్యక్తం చేస్తాం. కనుకనే కీర్తనకారుడు "సర్వజనులారా! చప్పట్లు కొట్టండి, జయజయ ధ్వానాలతో ప్రభుని గూర్చి నినాదాలు చేయండి, యావేను కీర్తించండి" అంటాడు - 47,1. "నా చేతులెత్తి నీకు ప్రార్థన చేస్తాను" అంటాడు - 63,6, "రండి నమస్కారం చేసి చాగిలపడదాం, మనలను సృజించిన యావే సన్నిధిని మోకరిల్లుదాం, రండి యావేను గూర్చి ఉత్సాహధ్వని చేద్దాం" అంటాడు - 95,7. మన స్తుతి ప్రార్థనంలో గూడ ఈలాంటి ఉత్సాహచిహ్నాలు కన్పించాలి. ఆనంద భావం గోచరించాలి.

5. ప్రభుని మనం ఏలా స్తుతిస్తాం? అతని పట్ల మనకు ఓ గాఢానుభవం కలుగుతుంది. అతడు మనలను ప్రేమించాడనీ మనలను రక్షించాడనీ గుర్తిస్తాం. ఈ గుర్తింపు వలన మన హృదయం ద్రవించిపోతుంది. వెంటనే పవిత్రాత్మ మన హృదయాన్ని ఓ వీణనులాగ మీటుతుంది. దానితో మన యెడద పులకించిపోతుంది. మన అంతరంగంలోనుండి ఆరాధనా స్తుతీ గానమూ పెల్లుబుకుతాయి. ప్రభుని గూర్చిన ప్రేమానుభవమే స్తుతి ప్రార్థనకు ఆధారం.

6. స్తుతి ప్రార్థనలో గొప్ప శక్తి వుంది. ఈ ప్రార్థన మన హృదయాన్ని మార్చి వేస్తుంది. దీనివల్ల మన విచారం ఆనందం గాను, నిరాశ ఆశగాను, వ్యాధి ఆరోగ్యం గాను మారిపోతుంది. అందుకే స్తుతి ప్రార్థన చేసేవాళ్ళ వ్యాధులు తటాలున నయమౌతుంటాయి. ఈ ప్రార్థన వల్ల మానసిక రుగ్మత కూడ తొలగిపోయి హృదయాహ్లాదం చేకూరుతుంది.

7. మోక్షవాసులు చేసేది స్తుతిప్రార్ధనే. అక్కడి భక్తులు అహోరాత్రులు ప్రభుని స్తుతించి కొనియాడుతుంటారు. వాళ్ళిలా పాడుతున్నారు - "సింహాసనాసీనునకూ, గొర్రెపిల్లకూ సదాకాలం స్తుతీ, గౌరవం, వైభవం, ప్రాభవం కలగాలి" - దర్శ 5,13. కాని మోక్షజీవితం మన యీ భూలోకజీవితంలోనే ప్రారంభమౌతుంది. మనం ఆత్మ జ్ఞానస్నానంలో క్రీస్తునీ, క్రీస్తు ఆత్మనీ, తండ్రినీ పొందాం. ఈ ముగ్గురు దైవవ్యక్తులతో ఐక్యంగావడమే మోక్ష జీవితం. ఇది ఇక్కడే ప్రారంభమౌతుంది. కనుక మన యీ యిహలోక జీవితంలో కూడ స్తుతిప్రార్థన లోపించకూడదు. మనం పెంతెకోస్తు ప్రార్థనా సమావేశాలకు హాజరైనపుడు ఉత్సాహంతో ప్రభుని స్తుతించాలి. హృదయం పులకించేలా భక్తిభావంతో కీర్తనలు పాడాలి. హృదయంలోని ఆనందం మన ముఖంలో కూడ కన్పించేలా పెద్ద యెలుగున ప్రభుని కొండాడాలి. ఇక, మనం వ్యక్తిగత జపంలో కూడ ఈ స్తుతి ప్రార్థనను విరివిగా వాడుకోవాలి. వేయేల, మనం ఎతంగా స్తుతిప్రార్థన చేస్తామో అంతగా మన హృదయం ఆనందంతో, పారవశ్యంతో, భక్తితో, సోదర ప్రేమతో నిండిపోతుంది. స్తుతి ప్రార్థనలో ఇంతటి సత్తువ వుంది.

# 20. పెంతెకోస్తు భక్తురాలు మరియ

1. ప్రభువు మరియకు ఓ రక్షణప్రణాళికను అప్పజెప్పాడు. ఆమె మెస్సియాకు తల్లికావాలి. కాని ప్రభువు ఆమెను నిర్బంధం చేయలేదు. మరియు స్వయంగానే ఉదారబుద్ధితో ప్రభువు ప్రణాళికను అంగీకరించింది. విశ్వాసంతో ప్రేమభావంతో తాను మెస్సియాకు తల్లి కావడానికి ఒప్పుకొంది - లూకా 1,38. దీన్నిబట్టి మనం మరియను మొట్టమొదటి పెంతెకోస్తు భక్తురాలినిగా గుర్తించాలి.

ప్రభువు మనకు కూడ ఓ రక్షణ ప్రణాళికను ఇస్తాడు. ఆ ప్రణాళికను కార్యరూపేణ సాధించమని మనలను కోరుకొంటాడు. ఐనా అతడు మనలను నిర్బంధం చేయడు. అతడు మనం ఇష్టపూర్తిగా చేసే పనినిమాత్రమే చేయించుకొంటాడు. కాని, భక్తురాలు అవిలా తెరెస చెప్పినట్లు, మొదట మనలను మనం ప్రభువుకి అర్పించుకోందే అతడు తన్నుతాను మనకు అర్పించుకోడు.

2. మరియ నేను కన్యనుగదా మెస్సియాకు ఏలా తల్లినౌతానని ప్రశ్నించింది. దేవదూత ఆత్మశక్తి వలన నీవు గర్భవతి వౌతావని చెప్పాడు. కాని ఈ సమాధానంతోనే ఆమె సందేహాలన్నీ తీరిపోలేదు. ఆమె ఏలా తల్లి కావాలి? శిశువు ఏలా పుడతాడు? పుట్టి ఏమౌతాడు? - ఇవన్నీ మరియను వేధించిన సమస్యలు. పైగా క్రీస్తు జీవితం కొనసాగిపోయే

కొలదీ, యూదులు అతన్ని ఎదిరించిన కొలదీ, ఆమె సందేహాలు ఎక్కువయ్యాయి. క్రీస్తు మరణం కూడ ఆమె విశ్వాసాన్ని నిశితంగా కలచివేసింది. ఈ విధంగా మరియ జీవితకాలమంతా గూడ ఆమె విశ్వాసాన్ని పరీక్షించిచూచాడు ప్రభువు. ఐనా మరియ మహాభక్తురాలు. ప్రభువు మీదనే భారంవేసి అతన్నే నమ్మింది. ఎలిసబేత్తు మరియను కొనియాడింది విశేషంగా ఆమె నమ్మికను బట్టే – లూకా 1,45.

మన విశ్వాసజీవితంలో కూడ ఈలాంటి సందేహాలే ఎదురౌతాయి. భగవంతుడు మనలను రకరకాల రూపాల్లో పరీక్షిస్తాడు. మనలను గూర్చిన ఆ ప్రభువు ప్రణాళికలూ, ఆయన ఆత్మ మనలను నడిపించేతీరూ మనకు అర్థం కావు. ఐనా మన తరుపున మనం కష్టమైనా బాధైనా అతన్ని విశ్వసించి తీరాలి. నీతిమంతులు విశ్వాసంతో జీవిస్తారు. – రోమా 1,17.

3. మరియ దేవదూతతో నీ మాట చొప్పుననే నాకు జరగాలి అంది. ఈ వాక్యం ద్వారా ఆమె దైవ ప్రణాళికను అంగీకరించింది, దైవ చిత్తానికి లోపడింది.

ప్రభువుకి లొంగిపోయి అతనికి ఆత్మార్పణం చేసికోందే మనం భక్తులం కాలేం. ఈ యాత్మార్పణం అనే గుణం ఆడవాళ్లకు సులభంగా వస్తుంది. అందుకే స్త్రీలకు బాల్యం నుండే భక్తి కుదురుతుంది. కాని మగవాళ్లకు ఆత్మార్పణం అంత సులభంగా అలవడదు. పురుషులు తాము ఈ భూమి మీద ఏవో మహత్తర కార్యాలు సాధించాలి అనుకొని భగవంతునికి లొంగిపోవడానికి ఒప్పుకోరు. ఏ వృద్ధాప్యంలోనోగాని పురుషుడు భగవంతునికి ఆత్మార్పణం చేసికోడు. అందుకే భక్తి అనేది స్త్రీలకు బాల్యంనుండే అలవడినా పురుషులకు మామూలుగా వృద్ధాప్యంలోగాని అలవడదు. ఒక్క కన్యాజీవితమూ గురుజీవితమూ మాత్రమే తీసికొందాం. ఏటేట ఎందరు యువతులు భక్తి భావంతో కాన్వెంటుల్లో చేరిపోవడం లేదు! కాని యువతులతో పోల్చుకొంటే ఏటేట ఎంతమంది యువకులు సెమినరీల్లో చేరుతున్నారు?

4. మరియ భగవంతునితో తోడ్పడ్డానికి అంగీకరించగానే ఆత్మ ఆమెమీద పనిచేయడం మొదలుపెట్టింది. ఆమె కన్యగర్భాన్ని మాతృగర్భంగా మార్చివేసింది. మరియ సాధించిందంతా పవిత్రాత్మ అనుగ్రహం వలననే సాధించింది.

మనం ఓ మారు ఆత్మకు వశులమైపోగానే ఆ పవిత్రాత్మ మన జీవితంలోకూడ అద్భుతాలు చేస్తుంది. మనంతట మనం సాధించలేని మహత్తర కార్యాలను ఆయాత్మ మనకు సాధించి పెడుతుంది. ఎందుకంటే సర్వోన్నతుని శక్తి మనలనుకూడ ఆవరిస్తుంది. ఆ శక్తికి అసాధ్యమైన దేదీ లేదు – లూకా 1, 35; 37. మదర్ తెరీసా, పోప్‌జాన్ వంటి భక్తుల చరిత్రలే ఇందుకు తార్కాణం.

5. ఆత్మ ప్రభావంవలన మరియ జీవితం క్రీస్తు మీద కేంద్రీకృతమైంది. ఆమె తన సర్వస్వాన్నీ క్రీస్తుకే అర్పించుకొంది. హృదయ పూర్వకంగా క్రీస్తుని ప్రేమించింది. ఆనందంతో అతనికి సేవ చేసింది. నేడు భక్తులందరికీ ఆ క్రీస్తుని అందిస్తూంది.

ఓమారు ఆత్మకు వశులమైపోతే మన జీవితంకూడ క్రీస్తుకు కేంద్రమౌతుంది. ఎప్పుడూ ఆత్మ క్రీస్తుని మన జీవితకేంద్రానికి తీసికొని వస్తుంది. మన జీవితాన్నే గనుక ఆత్మ నడిపించినట్లయితే, మన సర్వస్వాన్నీ ఆ ప్రభువుకే అర్పించుకొంటాం. క్రీస్తుకోసం తోడి ప్రజలకు సేవచేస్తాం. స్వార్థాన్ని జయించి పరోపకారం జీవితం జీవిస్తాం.

6. మరియ తన బంధువైన ఎలిసబేత్తును దర్శించడానికి వెళ్ళింది. వృద్ధాప్యంలో గర్భవతియైన ఎలిసబేత్తుకు పురుడుపోసి సహాయం చేసింది. ప్రభువు తన్ను కటాక్షించిన విధానాన్ని ఆమెకు విన్పించింది. తన కష్టసుఖాలను ఆమెతో చెప్పుకొంది - లూకా 1, 39.

ఈలాగే పెంతెకోస్తు భక్తులుకూడ తోడిజనానికి తోడ్పడతారు. ప్రభువు తమకుచేసిన మేలి కార్యాలను తోడి జనానికి తెలియజేస్తారు. "సర్వశక్తిమంతుడు మాకు గొప్ప కార్యాలు చేసాడు" అని తోడిజనం ఎదుట ప్రభుని స్తుతిస్తారు. ఆ ప్రభువు కారుణ్యానికి వేనోళ్ళ సాక్ష్యం పలుకుతారు.

7. మరియ మొట్టమొదట మనకు బైబుల్లో కన్పించేది పరిశుద్ధాత్మ నీడలోనే. మంగళవార్త సమయంలో సర్వోన్నతుని శక్తి ఆమెను ఆవరించి వుండగానే - లూకా 1, 35. ఆమె కట్టకడన బైబుల్లో కన్పించేదికూడ పరిశుద్ధాత్మ నీడలోనే. పెంతెకోస్తు దినాన శిష్యులతో పాటు మరియకూడ ప్రార్థన చేస్తూండగా వాళ్ళతో పాటు తానూ ఆత్మను పొందింది - అకా 1, 14. ఈ మంగళవార్త పెంతెకోస్తు సంఘటనలద్వారా మరియ పూర్తిగా పరిశుద్ధాత్మకు వశవర్తిని ఐపోయింది. కనుకనే ఆమె ప్రభువునకు ప్రియపడిన మహా దాసురాలు. క్రైస్తవ సమాజంలో వెలసిన తొలి పెంతెకోస్తు భక్తురాలు. ప్రభువు ప్రసాదించిన రక్షణ భాగ్యం మనకు పరిశుద్ధాత్మద్వారా మరియ నుండి సిద్ధించింది.

ఈలాగే మన జీవితంకూడ మొదటినుండి కడపటిదాకా ఆత్మకు వశమైయుండాలి. అనగా ఆత్మ మనలను నడిపిస్తూండాలి - రోమా 8,14. అప్పుడు మనం తోడిప్రజలకు రక్షణకారకుల మౌతాం.

8. భక్తులు భగవంతునితో ఐక్యమౌతారు. ఆ మీదట భగవంతుడే వాళ్ళద్వారా పనిచేస్తూంటాడు. ఆత్మే వాళ్ళల్లో వుండి కృషి చేస్తూంటుంది. మరియ జీవితంకూడ ఈలాగే నడచింది. ఆమె నిజంగా భగవంతుణ్ణి పొందింది. తాను పొందిన ప్రభువుని తన కిష్టమైన వాళ్ళకందరికీ అందించిందికూడ.

ప్రభువు అపోస్తలులకుమల్లె మరియకు క్రైస్తవ సమాజంమీద అధికారం ఈయలేదు. ఆమెశక్తి అధికార రంగానికి చెందిందికాదు. మరి ఆధ్యాత్మికమైంది. ఆమెశక్తి ఈనాడు మనమీద రెండు రూపాల్లో పనిచేస్తుంది. మొదటిది, మరియ మనకు ప్రబోధం కలిగిస్తుంది. ఆత్మ వశవర్తినియైన మరియ ఈనాడు మనంకూడ ఆత్మకు లొంగివుండాలనీ ఆయాత్మచే నడిపింపబడాలనీ హెచ్చరిస్తుంది. రెండవది, ఆమె మనకోసం విజ్ఞాపనం చేస్తుంది. మోక్షక్రీస్తు మనకోసం విజ్ఞాపనం చేస్తూంటాడు - హెబ్రే 7,25. అతనితో ఐక్యమై మరియ కూడ మోక్షంనుండి మనకోసం విజ్ఞాపనం చేస్తూంటుంది. ఉత్థాపిత మరియ శక్తి అంతా ఈ రెండంశాల్లోనే ఇమిడి వుంది.

మరియలాగే పెంతెకోస్తు ఉద్యమంలో చేరిన భక్తులుకూడ భక్తిమంతమైన జీవితం జీవించి ఇతరులకు ప్రబోధం కలిగించాలి. ఇతరులనుకూడ ఆ యాత్మ దగ్గరికి రాబట్టాలి. పైగా వాళ్ళు తోడి జనం కోసం రోజూ విజ్ఞాపనం చేయాలి.

9. దేవుని, ఆత్మ దేవుని ప్రేమను మన హృదయాల్లో కుమ్మరిస్తుంది - రోమా 5,5. ఆయాత్మ మరియ హృదయంలో ఈ ప్రేమను కుమ్మరించింది. కనుకనే ఆమె జీవితం ప్రేమమయమైంది.

ఆత్మ మనకు సేవా వరాలూ ఫలాలూ ఇస్తుందని చెప్పాం. ఇవన్నీ ప్రేమను పెంపొందించడం కొరకే. కనుక ఆత్మ ఆ మరియ హృదయాన్నిలాగే మన హృదయాన్నికూడ రోజురోజు ప్రేమతో నింపుతుండాలని మనవిచేసికొందాం.

# 21. సాంఘిక న్యాయం

పెంతెకోస్తు భక్తులకు సామాజిక స్ఫురణం లేదనే అపనింద వుంది. కేవలం ప్రార్థనా సమావేశాలు జరుపుకొని పాటలు పాడకొంటేనే చాలదు. సామాజిక స్ఫురణం కూడ అవసరం. విశేషంగా పేదప్రజలు అసంఖ్యాకమైన అన్యాయాలకు గురై బాధపడే ఈ రోజుల్లో సమాజంలో అట్టడుగున వున్నవారిని ఆదుకోవడం అత్యవసరం. బైబులు భగవంతుడు ఎప్పుడు కూడ పేదసాదలను పరామర్శించేవాడు.

1. పూర్వవేదం. పూర్వవేదంలో ప్రభువు ఐగుప్తున ఫరోకు దాసులై మూల్గుతూన్న యిస్రాయేలు ప్రజను బానిసంనుండి విడిపించాడు. యిస్రాయేలీయులకు జరిగే సాంఘిక అన్యాయాన్ని భరించలేక మోషే అనే నాయకుని ద్వారా ఆ ప్రజను ఐగుప్తు నుండి వెలుపలికి నడిపించుకొని వచ్చాడు -నిర్గ 3, 7-9. ప్రభువు మొదట వాళ్ళను రక్షించింది పాపం నుండిగాదు, పరపీడనం నుండి. అటుపిమ్మట ఆ జనం యావే ప్రజలై అతన్ని పూజించారు.

యిస్రాయేలీయులకు ధర్మశాస్త్రం అతిముఖ్యమైంది. ఈ ధర్మశాస్త్రం యిస్రాయేలు సమాజంలో సాంఘికన్యాయాన్ని పెంపొందించడంకోసం ఎన్నో విధులు జారీ చేసింది. ఉదాహరణకు ఓవిధి యిది. "పేదకూలివాణ్ణి పీడించవద్దు. సూర్యుడు అస్తమించకమునుపే ఏనాటికూలి ఆనాడు వాడికి ముట్టజెప్పాలి. వాడు నిరుపేద కనుక ఆ కూలికోసం కనిపెట్టుకొని ఉంటాడు. వాడు నాకు మొరపెడితే నేను మిమ్ము దోషులనుగా గణిస్తాను" - ద్వితీ 24, 14-15.

యూదులు సాంఘిక న్యాయాన్ని ఉల్లఘించినపుడెల్ల ప్రవక్తలు వాళ్ళను మందలిస్తూండేవాళ్లు. కనుకనే యెషయా ప్రవక్త ఈలా హెచ్చరించాడు.

"మీ యొడలు కడుగుకొని శుద్ధిచేసికొనండి
ఇక నాయెదుట దుష్కార్యాలు చేయకండి -
మీ పాపపుపనులనుండి వైదొలగి
సత్కార్యాలకు పూనుకొనండి
న్యాయాన్ని పాటించండి
పీడితులకు మేలు చేయండి
అనాథుల హక్కులు నిలబెట్టండి
వితంతువులను ఆదుకొనండి" -1, 16-17

ఇంకా ఆమోసు ప్రవక్త ఈలా మందలించాడు.

"నీతి ఓ నదిలాగ పొంగిపారాలి
న్యాయం ఓ జీవనదిలాగ ప్రవహించాలి" - 5,24

2. నూత్నవేదం. మామూలుగా మనం క్రీస్తు బోధలూ, క్రైస్తవ మతమూ ఆత్మకు సంబంధించినవి అనుకొంటాం. మనమతం శారీరకావసరాలను పట్టించుకోదు అనుకొంటాం. కాని నరుణ్ణి ఈలా శరీరంగాను ఆత్మగాను విభజించడం పొరపాటు. క్రీస్తు హీబ్రూ జాతికి చెందినవాడు. హీబ్రూ ప్రజలకు నరుళ్ళో దేహమూ ఆత్మ అనేవి రెండున్నాయని తెలియనే తెలియదు. ఈ భావం మనకు గ్రీకు ప్రజలనుండి వచ్చింది. యూదులకు తెలిసిందల్లా నరుడు ఏకవ్యక్తి అని. అనగా పూర్వవేదం నరుణ్ణి గూర్చి మాట్లాడినపుడెల్ల దేహమూ ఆత్మా రెండిటినీ ఉద్దేశిస్తుంది. ఇక క్రీస్తు కూడ నరుని దేహాత్మలను రెండిటినీ లెక్కలోనికి తీసికొనే బోధించివుండాలి. దేహానికి సంబంధించిన కూడూ గుడ్డా యిల్లూ వాకిలీ మొదలైనవాటిని అతడు ఉపేక్షించి వుండడు. కనుక క్రైస్తవమతం శారీరకావసరాలను ఉపేక్షించేది కాదు.

క్రీస్తునాడు యూదుల్లో రెండు వర్గాలుండేవి. పైవర్గం  వాళ్ళు పరిసయులూ సద్దూకయిలూ. వీళ్లు ధనవంతులూ, పదవుల్లో వున్నవాళ్లూ, ధర్మశాస్త్రాన్ని బోధించేవాళ్ళూ, ప్రజలకు నాయకులూను. రెండవవర్గం వాళ్లు సుంకరులు. వీళ్ళు నిరుపేదలూ, పామరులూ, ధర్మశాస్త్రాన్ని పాటించని పావులూను. అంచేత మొదటివర్గంవాళ్ళు వీళ్ళను చిన్నచూపు చూచేవాళ్ళు. కాని క్రీస్తు ఈ రెండవవర్గం వాళ్ళకోపు తీసికొన్నాడు. వాళ్ళ యిండ్లల్లో భుజించి, వాళ్ళతో తిరుగుతూ వాళ్ళకు చేరదీయడం మొదలెట్టాడు. అందువల్ల అగ్రవర్గం వాళ్ళకు అతని మీద కన్నుకుట్టింది - లూకా 15, 1-2. ఆవిధంగా అతడు సమాజంలో అట్టడుగున వున్నవాళ్ళని పరామర్శించాడు. అతని శిష్యులంతా  ఈ వర్గానికి చెందినవాళ్ళే.

క్రీస్తు కథలో ఒకటైన కడతీర్పు సామెత పేదలను ఆదరించాలని చెప్తుంది. ఈకథలో ప్రభువు "అత్యల్పులైన నా సోదరుల్లో ఒకనికి మీరు మేలుచేస్తే దాన్ని నాకు చేసినట్లె భావిస్తాను" అన్నాడు - మత్త 25, 40.

క్రీస్తు శిష్యులు సాంఘికన్యాయాన్ని గూర్చిన తమగురువు బోధలను క్షుణ్ణంగా అర్థంచేసికొన్నారు. యెరూషలేములో కరువురాగా పౌలు కొరింతులో చందాలు వసూలు చేసి పంపాడు. అనగా కాటకంవల్ల బాధపడే యూదక్రైస్తవులను గ్రీకుక్రైస్తవులు ఆదుకొన్నారు. 2కొ 9,12-14. ఇంకా యాకోబు తన జాబులో ధనవంతులు పేదలను ఆదుకోవాలని బోధించాడు. "తోడి జనం కూడుగుడ్డకోసం అలమటిస్తుంటే మనం వాళ్ళ అవసరాలను తీర్చాలి. దానికి బదులుగా - దేవుడు మిమ్ము దీవిస్తాళ్లే! మీరు మస్తుగా భుజిస్తూ మంచి బట్టలు ధరిస్తూండండి - అని వట్టి వుపచారవాక్యాలు పలికితే యేమిలాభం?" - 2, 14.

3. నేటి పరిస్థితి. నేడు ప్రపంచంలో ఎక్కడ చూచినా రెండువంతులు పేదలు, ఒకవంతు ధనికులు. పేదలకు రావలసిన సొమ్ముకూడ ఏదో రూపంలో ధనికులకు ముడుతూంది. పెద్ద చేప చిన్న చేపను మింగి తాను ఇంకా పెద్దదైనట్లుగా సమాజంలో ధనికుడు పేదవాడి నోరుకొట్టి తానింకా ధనికుడౌతూంటాడు.

మన దేశంలో ఈ యన్యాయం ఇంకా యెక్కువ. నరుడు రోజూ కనీసం పాతికరూపాయల తిండైనా తింటేనేగాని జీవితయాత్ర సాగించలేదు. కాని ఇండియాలో రోజుకి పాతికరూపాయల ఆదాయంకూడ లేనివాళ్ళు నలభై శాతంమంది వున్నారు. అరవైశాతం మంది వున్నారని కూడ కొందరు చెప్తున్నారు. ఈలాంటి పేదలను ఆర్థికవేత్తలు దారిద్ర్యరేఖకు క్రింద జీవించేవాళ్లు అంటారు.

కూడు గుడ్డా యిల్లూ వాకిలీకి నోచుకోలేని అభాగ్యులు దేశంలో యింతమందుంటే పెంతెకోస్తు ఉద్యమం సభ్యులంగా మనపూచీ యేమిటి? మనం ప్రార్థనలుచేస్తూ, దయ్యాలనూ వెళ్ళగొడుతూ, భాషల్లో మాటలాడుతూ, పాటలు పాడుకొంటూ వుంటే

సరిపోతుందా? ఎంతమాత్రమూ చాలదు. అందుకే పెంతెకోస్తు ఉద్యమం సభ్యులు అవశ్యం సామాజిక స్ఫురణను అలవర్చుకోవాలని చెప్పాం. కాని సామాజిక స్ఫురణం అంటే యేమిటి?

మనం రెండు పనులు చేయాలి. మొదటిది, మనకున్నది లేనివాళ్ళతో పంచుకోగలిగివుండాలి. మనమే పేదవాళ్ళమైతే ఇక వేరేవాళ్ళకు ఏమి సహాయం చేయగలం అనుకోగూడదు. పాలల్లోకి పంచదార లేక ఒకమ్మ ఏడుస్తూంటే నీళ్ళల్లోకి ఉప్పుగల్లు లేక మరొకమ్మ ఏడుస్తూంటుందట! కనుక మనకంటె పేదవాళ్లుగూడ చాలమంది వుంటారు. ఈలాంటి నిరుపేదలతో మనకున్నది తులమో ఫలమో పంచుకో గలిగి వుండాలి. ఈలా పంచుకోనివాడు క్రీస్తు శిష్యుడు కాలేడు.

రెండవది, దేశంలో పేదలకు ఎన్నయినా అన్యాయాలు జరుగుతూన్నాయి. ఈలాంటి అన్యాయాలను చక్క దిద్దడానికి పూనుకోవాలి – మనకు చేతనయినంతవరకు. అనగా అన్యాయాన్ని ఎదిరించాలి. ఇది కష్టమైన కార్యం. ఇంకా పేదలను ప్రోత్సహించి వాళ్ళు స్వయం ఉపాధి పథకాలతో వృద్ధిలోకి వచ్చే కార్యక్రమాలను గూడ చేపట్టాలి. చదువుకొని ఉద్యోగాలు చేస్తున్నవాళ్ళు ఈ రంగంలో బోలెడంత సేవచేయవచ్చు. పేదలకు దానధర్మాలు చేయడం కంటెగూడ వాళ్ళకున్న అవకాశాలను గూర్చి, వాళ్ళకు జరిగే అన్యాయాలను గూర్చి వాళ్ళకు చైతన్యం కలిగించడం ఎక్కువ లాభకరం. మనం వ్యక్తిగతంగా కంటె ఓ బృందంగా ఈలాంటి సాంఘికసేవ చేయడం మేలు. ఏమైతేనేమి, మన తరపున మనం ఏదోవొక సాంఘికసేవా కార్యక్రమంలో పాల్గొనాలి. అప్పుడేగాని మన పెంతెకోస్తు భక్తి యథార్థమైన భక్తి కాదు. ఇక్కట్టుల్లో వున్న తోడినరుణ్ణి పట్టించుకోకుండా దేవుడికి వంకవంక దండాలు ఎన్ని పెడితే మాత్రం ఏమిలాభం?

# 22. పెంతెకోస్తు భక్తిని నిల్పుకోవడం ఏలా?

1. ఆత్మలోనికి జ్ఞానస్నానం పొందడం ఓ వివాహంలాంటిది. వివాహంద్వారా భార్యకు భర్తతో క్రొత్తసంబంధం ఏర్పడుతుంది. ఆలాగే ఈ ఉద్యమం ద్వారా భక్తునికి భగవంతునితో నూత్న సంబంధం కలుగుతుంది.

ఆత్మలోనికి జ్ఞానస్నానం పొందడం అంటే బాధ్యతాంతంకాదు. బాధ్యతారంభం. తల్లి బిడ్డను కనడంతోనే పని ముగియదు. ఇంకో క్రొత్తబాధ్యత ప్రారంభమౌతుంది. ఆలాగే ఆత్మ జ్ఞానస్నానం కూడాను. దీని ద్వారా జీవితరథం కదులుతుంది, అంతే. ఇక ఈ రథాన్ని లాగుకొనిపోయే బాధ్యత మనది.

పౌలు "నాకు జీవించడం అంటే క్రీస్తుని జీవించడమే" అన్నాడు – ఫిలి 1,21. "ఇప్పుడు నేను కాదు, నాయందు క్రీస్తే జీవిస్తున్నాడు" అని చెప్పాడు – గల 2,20.

ఈలా మన జీవితం క్రీస్తు జీవితం కావాలంటే మనము అతనితో ఐక్యం గావాలి. రెమ్మలు తల్లితీగలోనికి ఐక్యమైనట్లుగా మనమూ క్రీస్తులోనికి ఐక్యంగావాలి - యోహా 15,4.

కొందరు తొలిసారిగా ఆత్మలోనికి జ్ఞానస్నానం పొందినపుడు గొప్ప భక్తిభావాన్ని అనుభవిస్తారు. కాని ఈ భక్తిభావం నిలుస్తుందా? మనం రోజురోజు క్రీస్తుప్రేమలో పెరుగుతూంటే ఈ భక్తిభావం నిలుస్తుంది. పెంతెకోస్తుభక్తిని నిలుపుకొనే మార్గాలు విశేషంగా నాల్గున్నాయి. ఇవి దైవవాక్కు, ప్రార్థనమూ, భక్తసమాజమూ, సేవాను. ఇక వీటిని క్రమంగా పరిశీలించి చూద్దాం.

2. దైవవాక్కు. పెంతెకోస్తు ఉద్యమానికి చెందిన భక్తుడు దినదినమూ దైవవాక్కును పఠించాలి. ఈ చదవడం కూడ జ్ఞానార్జనం కోసంగాదు, భక్తిభావాన్నీ భగవదనుభవాన్నీ పెంపొందించుకోవడానికి. మామూలుగా ఈ వుద్యమానికి చెందిన భక్తులు ఆత్మ ప్రేరణంవలన బైబులు పఠనంలో గొప్ప ఆసక్తి చూపుతారు. బైబులు వాక్కు వాళ్ళ హృదయాన్ని వెలిగించి వశం చేసికొంటుంది.

మనకు ఓ వ్యక్తిమీద ప్రేమ గౌరవమూ కలిగితే ఇక అతనికి అంటిపెట్టుకొని వుంటాం. కాని మనకు తెలియని వ్యక్తి మీద ప్రేమ గౌరవాలు పుట్టవు. ఇందుకే మన కిష్టమైనవాళ్ళ జీవిత విశేషాలను ఆసక్తితో తెలిసికొంటుంటాం. ఇక క్రీస్తు విషయంలోకూడా ఇంతే. ఆ ప్రభువుమీద మనకు ప్రేమ ఏర్పడాలంటె మొదట అతన్ని గూర్చి మనకు క్షుణ్ణంగా తెలియాలి. ఈలా తెలిసికోవడానికి బైబులు తప్పితే వేరేమార్గంలేదు. నాల్గవ శతాబ్దంలోనే భక్తుడు జెరోము బైబులు తెలియని వాళ్ళకు క్రీస్తంటే యేమిటో తెలియదని చెప్పాడు. కనుక క్రైస్తవ భక్తుడు బైబులు చక్కగా చదువుకోవాలి.

బైబులు పఠించేవాళ్ళకు ప్రభువువాక్కు నిష్ఫలంకాదు. వానా మంచూ నేలను తడిపి పంట పండించినట్లుగా దైవవాక్కుకూడా వాళ్ళ హృదయాన్ని ఫలభరితం చేస్తుంది - యెష 55,10. వాళ్లు ప్రభువు శిష్యులౌతారు - యోహా 8,31. ఆ ప్రభువు సందేశంతో నిండుకొంటారు. ఆ సందేశాన్ని ఇతరులకు అందిస్తారుకూడ. పైగా ప్రభుని కృతజ్ఞతతో ఎలుగెత్తి స్తుతిస్తారు - కొలో 3, 16

ప్రభువు వాక్కు గొప్ప వివేచనాన్ని ప్రసాదిస్తుంది - హెబ్రె 4,12. భక్తితో దైవవాక్కును పఠించేవాళ్ళు తమ్ము గూర్చిన దైవసంకల్పాన్ని గుర్తిస్తారు - రోమా 12, 2. ఈ వాక్కు అనే ఆయుధంతో భక్తులు జీవితంలోని దుష్టశక్తులతో పోరాడగలరు - ఎఫే 6,17. వేయేల, దేవుని వాక్కును పాటించేవాడు రాతిపునాది మీద యిల్లుకట్టిన బుద్ధిమంతుని లాంటివాడు - మత్త 7, 24.

3. ప్రార్థనం. ప్రార్థనం అంటే భగవంతుని సన్నిధిలో మెలగడం. ఆ ప్రభువు సాక్షాత్కారం కలిగించుకొని స్నేహితుడు స్నేహితునితో మాటలాడినట్లుగా అతనితో మాటలాడ్డం. పరిచయం ద్వారాగానీ స్నేహం ఏర్పడదు. కనుక భక్తుడు ప్రార్థనద్వారా భగవంతునితో గాఢపరిచయం కలిగించుకోవాలి.

క్రీస్తు తన తండ్రికి ప్రార్థన చేసేవాడు. అలాగే మనం కూడ క్రీస్తుద్వారా పరలోకంలోని తండ్రికి ప్రార్థన చేయాలి. ఆత్మే మనకీ శక్తి నిస్తుంది - గల 4,6. ఇంకా, క్రీస్తు అందరికోసం ప్రార్థన చేసేవాడు - హెబ్రే 7, 25. అతనిలాగే మనం కూడ విశ్వమానవాళికోసం ప్రార్థన చేయాలి. ఈ సృష్టి అంతా పునీతం కావాలి అని జపించాలి. పెంతెకొస్తు ఉద్యమంలో భక్తులు విశేషంగా స్తుతిప్రార్థనం చేస్తారు. దానితోపాటు ఇతరులకోసం విజ్ఞాపన ప్రార్థనం కూడ చేస్తారు.

మన క్యాతలిక్ సమాజంలో చాలమందికి ప్రార్థన చేసి కోవడమంటే మోక్షవాకిలివంటి పుస్తకాలు తెరచి ఏవో కొన్ని అచ్చు జపాలు వల్లెవేయడం. కాని ఇది చాలదు. ప్రార్థన ఓ అనుభవం. ప్రార్థనలో మనం భగవంతునితో హృదయం విప్పి మాట్లాడాలి. ఆ ప్రభువుని మనతో మాట్లాడనీయాలి కూడ. అతని సంభాషణను మన హృదయాంతరాళంలో వినాలి. అప్పుడే మనకు భగవంతునిపట్ల ఓ అనుభవమంటూ కలిగేది.

భార్య భర్తదగ్గరికి వస్తుంది. తన కాలాన్ని అతని సేవలో వినియోగిస్తుంది. అతనిపట్ల ఆప్యాయంగా మెలుగుతుంది. దానివల్ల ఆమెకు అతనిపట్ల ఓ మధురమైన అనుభూతి కలుగుతుంది. భగవత్సేవలో కూడ ఈలాగే జరగాలి. మనం కొంత కాలాన్ని ప్రార్థనకు వినియోగించాలి. దీర్ఘప్రార్థనాభ్యాసం వలనకాని భగవంతుడు అనుభవానికిరాడు. చిరకాల ప్రార్థనంద్వారా భక్తిపుడుతుంది. ఈ భక్తికి భగవంతుడు వశుడైపోతాడు. చాలమంది క్రైస్తవులు ప్రార్థనకు సమయాన్ని వినియోగించనే వినియోగించరు. ఇక వీళ్ళకు ప్రభువుపట్ల అనుభవం ఏలా కలుగుతుంది?

4. భక్త సమాజం. పెంతెకోస్తు ఉద్యమం ద్వారా మనం క్రీస్తుతో సంబంధం పెట్టుకొంటాం. ఈలా క్రీస్తుతో సంబంధమున్నవాళ్ళకు అతని జ్ఞానదేహమైన తోడి జనంతో కూడ సంబంధం వుండాలి - రోమా 12, 25. ఇదే భక్తసమాజం. యిస్రాయేలు మతంలోగాని క్రైస్తవమతంలోగాని ప్రధానమైంది వ్యక్తిగత రక్షణంకాదు, సామాజిక రక్షణం.

మనం తోడి భక్తులతోకూడి ప్రార్థనం చేసేపుడూ ప్రభుని స్తుతించి గానం చేసేపుడూ మన విశ్వాసం కూడ పెరుగుతుంది. మన హృదయంకూడ గాఢప్రేమతో పొంగిపోతుంది. కనుక మనం ఇరుగుపొరుగు వాళ్ళతోకూడి ఓ ప్రార్థనాసమావేశాన్ని

ఏర్పాటు చేసికోవాలి. ఈ సమాజం నియమిత సమయాల్లో సమావేశమై ప్రార్థనలు జరుపుకోవాలి. ఈ బృందంలో ఒకరితో ఒకరికి హృదయాలు కలవాలి. పరిచయాలు ఏర్పడాలి.

మనకు ఆత్మతో సహవాస మేర్పడినకొలదీ తోడి ప్రజలతో కూడ స్నేహం పెరుగుతుంది - 2 కొ 13, 13. ఈ యాత్మే మనమందరమూ ఒక్కటిగా ఐక్యమయ్యేలా చేస్తుంది. మనలోని భేదభావాలూ, పరస్పర అనిష్టాలూ, ఫిర్యాదులూ తొలగిపోయి ఒకరినొకరం ప్రేమభావంతో ఆదరించుకోవడం మొదలిడతాం. ఇదే సోదరప్రేమ. ఆత్మ యిచ్చే సేవా వరాలద్వారా క్రైస్తవ సమాజాన్ని వృద్ధిలోకి తెస్తాం.

పెంతెకోస్తు ఉద్యమం ప్రేమోద్యమం. ఈ వుద్యమంలో జనులు ఒకరినొకరు ప్రేమించడానికీ ఒకరి నుండి ఒకరు ప్రేమను పొందడానికీ సమావేశమౌతారు. కనుక మన తరపున మనం ఇతరులను ప్రేమించి అంగీకరించాలి. ఇతరుల ప్రేమాదరాలను పొందాలి కూడ.

5. సేవా జీవితం. భగవంతుడు నరులను తనకు పోలికగా కలిగించాడు. తాను వాళ్లల్లో జీవిస్తుంటాడు. కనుక మనం తోడి మానవుల్లో వున్న భగవంతుణ్ణి గుర్తించగలిగి వుండాలి. వాళ్లకు సేవ చేయాలి. తోడి నరులకు సేవ చేస్తే ప్రభువు ఆ సేవ తనకు చేసినట్లే భావిస్తాడు - మత్త 25, 40.

క్రీస్తు ప్రభువు మహా సేవకుడు - మార్కు 10, 45. ఆ ప్రభువులాగే అతని శిష్యులు కూడ తోడి జనానికి సేవలు చేయడం నేర్చుకోవాలి - లూకా 22, 26. కాని ఈ క్రీస్తు చేసింది కేవలం సాంఘికసేవ కాదు. అతడు సేవ చేయడానికి దేవునిచే నియుక్తుడయ్యాడు. ఆత్మచే ప్రభోధితుడయ్యాడు - లూకా 4,18. హృదయపూర్వకంగాను ప్రేమ భావంతోను ఆ సేవ చేసాడు. ఆ ప్రభువులాగే మనం కూడ చిత్తశుద్ధితో తోడి నరులకు సేవ చేయాలి. ఈ సేవ స్వార్థలాభానికీ గాదు. కీర్తిప్రతిష్ఠలకూ గాదు. సేవ చేయడం క్రీస్తు శిష్యులమైన మన విధి.

ఇక్కడ కూడ ప్రేమ చూపడం ముఖ్యం. అసలు ప్రేమకు మించిన సేవ లేనేలేదు. జీవితంలో చాలమంది ప్రేమాదరాలకు నోచుకోరు. కనుక మనం కొంచెం ప్రేమతో ప్రవర్తించగానే తోడినరుల హృదయాలు సూర్యకిరణాలు సోకిన పద్మంలా వికసిస్తాయి. ఈ సత్యాన్ని గుర్తించి మనం తోడి జనంతో మెలిగేపుడు వాళ్లపట్ల ఆప్యాయంగా ప్రవర్తించాలి.

మన ప్రార్థనాసమాజానికి చెందిన భక్తులకు సేవ చేయాలి. మన కుటుంబానికి సేవ చేయాలి. మన వూళ్ళో, మన చుట్టూరా వున్న జనానికీ సేవ చేయాలి. తోడి జనం

కోసం ప్రార్థన చేస్తే అది ప్రార్థనాసేవ ఔతుంది. ఈ ప్రార్థనా సేవకూడ పెంతెకోస్తు సేవలో ఒక భాగమై యుండాలి.

చెలమలోని నీళ్ళు తీస్తూంటే ఇంకా ఊరతాయి. తీయక పోతే తెప్పకట్టి చేడిపోతాయి. అలాగే మనం కూడ తోడి జనులకు సేవ చేస్తూంటే ఆత్మ మన సేవా వరాలను ఇంకా అభివృద్ధి చేస్తుంది. కాని సేవ చేయకపోతే మనకు ఉన్న వరాలు కూడ త్రుప్పుపట్టిపోతాయి – మత్త 25, 25. 28. ఈ సత్యాన్ని గుర్తించి పెంతెకోస్తు ఉద్యమానికి చెందిన భక్తులు ఎప్పుడూ ఏదోవొక రూపంలో ఎవరికో వొకరికి సేవ చేస్తూండాలి. ఇక ఈ సేవ, ప్రార్థనం, భక్తసమాజం, వాక్పఠనం అనే వాటి ద్వారా మనం నాడునాటికి క్రీస్తులోకి పెరుగుతాం – ఎఫే 4, 15.

## 23. పరిశుద్ధాత్మను పొందడానికి జపం

పరలోకంలోని తండ్రీ! నీవు యేసుక్రీస్తు ద్వారా మానవులందరికీ పాప విమోచనం కలిగించావు. ఆ క్రీస్తే మాకు రక్షకుడు ప్రభువు అని విశ్వసిస్తున్నాం. తండ్రీ! జ్ఞానస్నానం ద్వారా మమ్ము నీ బిడ్డలనుగా చేసి క్రీస్తుతో ఐక్యపరచినందులకూ, మాకు ఆత్మను ప్రసాదించినందులకూ నీకు వందనాలు అర్పిస్తున్నాం.

క్రీస్తుప్రభూ! మాకు రక్షకుడవు నీవే. పిశాచ దాస్యాన్నుండీ, మా స్వార్థాన్నుండీ మాకు విముక్తి నిచ్చేవాడవు నీవే. మా జీవితానికి యజమానుడవూ ప్రభువువూ కూడ నీవే. జీవితాంతమూ మేము నిన్నే పూజిస్తాం. నీ యాజ్ఞలకు బద్ధులమైయుంటాం.

ప్రభూ! మాకు నీ యాత్మతో జ్ఞానస్నానం దయచేయి. నీనుండి తండ్రినుండీ బయలుదేరే ఆత్మ మామీదికి దిగివచ్చునుగాక. ఆ పరిశుద్ధాత్మ తన వరాలతో, ఫలాలతో, పుణ్యాలతో మా హృదయాలను నింపునుగాక. ఆ యాత్మశక్తి వలన మా నాలుకలు పట్టువదలి తండ్రి కుమారులైన మిమ్ము స్తుతించి గానము చేయునుగాక. మేము నానా భాషలలో మిమ్ము కీర్తింతుము గాక. ఆయాత్మ శక్తితోనే క్రైస్తవ సమాజాన్ని ఓ భవనంలాగ నిర్మించి వృద్ధిలోకి తీసికొనివత్తుముగాక. మా తరపున మేము ఆ దివ్యాత్మ చెప్పుచేతలకు లోపడి వుంటామనీ, ఆ యాత్మ నడిపించినట్లల్లా నడుచుకొంటామనీ ప్రమాణం చేస్తున్నాం.

క్రీస్తుప్రభూ! నీవు పరిశుద్ధాత్మతోను అగ్నితోను జ్ఞానస్నానం ఇచ్చేవాడివి. ఇప్పుడు నీ యాత్మను మామీద కుమ్మరించు. మేము నిన్ను విశ్వసించే భక్తులం. (మౌనంగా ఆత్మ దిగిరావాలని (ప్రార్థించాలి) నీవు పరిశుద్ధాత్మను మాకు ప్రసాదించావని విశ్వసిస్తున్నాం. ఆ యాత్మను అనుగ్రహించినందుకు గాను నీకు వందనాలు అర్పిస్తున్నాం. ఆమెన్.

# 4. పరిశుద్ధాత్మ

బైబులు భాష్యం -1

## 1. ప్రభువు వాగ్దానం - యోహా 16,7

ప్రభువు శిష్యులను వీడి మోక్షానికి వెడలి పోకముందే పరిశుద్ధాత్మను పంపిస్తానని వాగ్దానం చేసాడు. ఈ వచ్చే ఆత్మ పేరు "ఆదరణకర్త". అనగా ఈ యాత్మ శిష్యులను హెచ్చరిస్తుంది, ప్రోత్సహిస్తుంది, ఓదారుస్తుంది, ఆదరిస్తుంది. ఈయాత్మ వచ్చినపుడు శిష్యులను సర్వసత్యంలోనికి నడిపిస్తుంది - యో 16,13. ఈ సర్వసత్యం క్రీస్తే. కనుక ఆత్మ, శిష్యులు క్రీస్తును అర్థం చేసికునేలా చేస్తుంది. వాళ్లు క్రీస్తు సిలువ మరణాన్ని గ్రహించేటట్లు సహాయపడుతుంది. క్రీస్తును ప్రేమించేలా చేస్తుంది. ఈనాడు మనలనుగూడ క్రీస్తువైపు ఆకర్షించేది, మనమూ క్రీస్తును ప్రేమించేలా చేసేది ఈ ఆత్మే.

## 2. శిష్యులకు అర్థంకాలేదు - అ.చ. 1,6

ప్రభువు రక్షణ ప్రణాళికను ముగించుకొని మోక్షానికి ఆరోహణంగావడం కోసమై పర్వతానికి వెళ్లాడు. ఆ చివరి గడియల్లో శిష్యులు "ప్రభూ! యిస్రాయేలు రాజ్యానికి స్వాతంత్ర్యం ఇప్పించవా" అని అడిగారు. ఆ రోజుల్లో పాలస్తీనా రోమను సామ్రాజ్యం అధీనంలో వుండేది. మెస్సియా వచ్చి పాలస్తీనా దేశానికి దాస్య విముక్తి కలిగిస్తాడని కొందరు యూదులు భావించేవాళ్లు. శిష్యులు క్రీస్తే మెస్సియా అని నమ్మారు. కనుక ఈ క్రీస్తు పాలస్తీనా దేశానికి స్వాతంత్ర్యం ఇప్పిస్తాడని వాళ్ల నమ్మకం. అందుకే వాళ్లు ఈలా అడిగింది.

కాని వాళ్లు ప్రభువును అర్థం చేసుకోలేదు. ప్రభువు సాధించిన రక్షణ కార్యంగూడ వాళ్లకు బోధపడలేదు. అంతకు ముందే పిలాతుని యెదుట ప్రభువు "నా రాజ్యం ఈ లోకసంబంధమైంది కాదు" అన్నాడు. కాని ఈ పలుకులేవీ వాళ్ల చెవికి ఎక్కలేదు. శిష్యులు క్రీస్తు అద్భుతాలు కండ్లార చూచారు. బోధలు చెవులార విన్నారు. ఐనా క్రీస్తు ఉత్థానమయ్యేప్పుడుకూడ అతడు సాధించిన కార్యమేమిటో వాళ్లకు తెలిసిందికాదు. అసలు క్రీస్తు మనుష్య రక్షణాన్ని సాధించాడనైనా వాళ్లు ఊహించలేదు. మరి వాళ్లకు కనువిప్పు కలిగించింది ఎవరు? క్రీస్తుగాదు, క్రీస్తు బోధలు గాదు, అద్భుతాలు గాదు. పరిశుద్ధాత్మ. మనంగూడ ఆత్మ సహాయం లేందే దైవసత్యాలను గ్రహించలేం. బైబులు అర్థం చేసికోలేం.

## 3. ఆత్మ దిగిరావడం - అ.చ. 2,1-4.

శిష్యులు యెరూషలేములో సమావేశమై ఓ మేడ గదిలో ప్రార్థన చేసికుంటూ వుండగా పరిశుద్ధాత్మ దిగివచ్చింది. ఆత్మ దిగివచ్చినపుడు అగ్నీ వాయువూ ప్రత్యక్షమయ్యాయి. ఇవి రెండూ పూర్వవేదంలో భగవత్సాక్షాత్కారాన్ని సూచిస్తుంటాయి. హోరెబు పర్వతంమీద ప్రవక్త యేలీయాకు దేవుడు కనిపించినపుడు పెనుగాలి వీచింది, నిప్పు మంటలు లేచాయి - 1రాజు 19, 11-15. సీనాయి పర్వతంమీద ప్రభువు మోషేకు సాక్షాత్కారమయినపుడూ ఉరుములు మెరపులు పొగమంటలు కనుపించాయి. కనుక ఇక్కడ యీ గుర్తులు దేవుడు మళ్లీ దిగి వస్తున్నాడని, దేవునికీ మానవులకూ మధ్య మరో నిబంధనం జరుగబోతుందని సూచిస్తాయి.

శిష్యులు పరిశుద్ధాత్మను పొంది నానా భాషల్లో మాటలాడారు. అక్కడ పండుగ కోసమై గుమిగూడిన జనులుగూడ శిష్యులు మాటలాడే భాషలను అర్థం చేసికున్నారు. ఈ బహుభాషా జ్ఞానంగూడా పరిశుద్ధాత్మ యిచ్చే వరాల్లో వొకటి.

ఈ సంఘటనకు కొన్ని వందల సంవత్సరాలకు పూర్వమే యోవేలు అనే ప్రవక్త పవిత్రాత్మనుగూర్చి ప్రవచనం పలికాడు. ఈ ప్రవచనం ప్రకారం"కడపటి దినాలు వచ్చినపుడు నరులందరిమీద నా యాత్మను కుమ్మరిస్తాను" అన్నాడు ప్రభువు. ప్రభువు ఆనతిచ్చిన విధంగానే యిక్కడ పవిత్రాత్మ దిగివచ్చింది. అ. చ 2, 16-18. ఆనాడు శిష్యులు పొందిన ఆత్మనే ఈనాడు మనమూ పొందుతున్నాం.

## 4. శిష్యులు పూర్తిగా మారిపోయారు - అ చ. 2, 22-24

శిష్యులు ప్రభువుతో కలసి జీవించారు. ప్రభువు అద్భుతాలు చూచారు, బోధలు విన్నారు. ఐనా వాళ్లల్లో పెద్దమార్పేమీ కలుగలేదు. క్రీస్తు వెళ్లిపోయాకగూడ అతన్ని వాళ్లు అర్థం చేసికోలేదు. కాని, ఆలాంటివాళ్లుకూడ పవిత్రాత్మ దిగి రాగానే పూర్తిగా మారిపోయారు. ప్రభువు తన మరణోత్థానాల ద్వారా పాప క్షమాపణం చేకూర్చి పెట్టాడని తెలిసికున్నారు. యావే ప్రభువు క్రీస్తును పరలోక భూలోకాలకు ప్రభువుగా నియమించి రక్షణ కర్తగా ప్రకటించాడని అర్థం చేసికున్నారు. ఈ విషయాలనే పేత్రు యెరూషలేములో బాహాటంగా బోధించాడు. అంతకుముందు ఓ బానిసపిల్లకు భయపడి క్రీస్తును అంగీకరించడానికి వెనుకాడిన యీ పేత్రు యెరూషలేం వీధుల్లో క్రీస్తే ప్రభువని ధైర్యంగా ప్రకటింపసాగాడు.

అపోస్తులుల బోధలు విని ఆ రోజే 3000 మంది క్రీస్తును విశ్వసించారు, జ్ఞానస్నానం పొందారు - అ.చ. 2, 42. వీటన్నిటికీ కారణం ఒక్కటే : పరిశుద్ధాత్మ. ఆ యాత్మే శిష్యులను పూర్తిగా మార్చివేసింది. ఆత్మ అనుగ్రహించినపుడు మనకూ క్రీస్తు క్రొత్తగా కనుపిస్తాడు. క్రీస్తుకోసం దీక్షతో పని చేస్తాం.

**5. ప్రభువు ఆత్మనే శిష్యులూ పొందారు** - అ.చ. 2, 33.

ప్రభువు తండ్రినుండి పరిశుద్ధాత్మను పొందాడు. ఈ పరిశుద్ధాత్మ ద్వారానే ప్రభువు మృతదేహం మళ్ళా జీవించింది. ప్రభువు మహిమను పొందిందికూడా ఈ యాత్మ ద్వారానే. ఇక తాను స్వీకరించిన ఆత్మను శిష్యులకు గూడ అనుగ్రహించాడు. అందుకే "నేను వెళ్లిన తరువాత ఆదరణ కర్తను పంపిస్తాను" అన్నాడు క్రీస్తు.

ప్రభువు ప్రసాదించే ఈ యాత్మ ఆ తొలినాటి శిష్యులకే గాదు మనకూ లభిస్తుంది. జ్ఞానస్నానం పుచ్చుకునేపుడే మనమూ ఆత్మను పొందుతాం. జ్ఞానస్నానం వలన కలిగే ఫలితాలు రెండు : పాప క్షమాపణం, ఆత్మ స్వీకారం - అ.చ. 2, 38. మనమూ ప్రభువు ఆత్మను పొందాం. ప్రభులోనికి ఐక్యమయ్యాం. ఈ సత్యాన్ని ఎప్పుడూ మరచిపోకూడదు.

**6. ఆత్మ శిష్యులను నడిపిస్తుంది** - అ.చ. 13, 2-4.

అంతియోకయ పట్టణంలో ఓ చిన్న క్రైస్తవ సమాజం ఏర్పడింది. పౌలు బర్నబా మొదలైన శిష్యులు ఈ సమాజానికి చెందినవాళ్ళు. ఇంతవరకూ వీళ్లంతా విశేషంగా యూదులకే క్రీస్తును బోధిస్తూండేవాళ్లు. కాని పవిత్రాత్మ ఇకమీదట గ్రీకు ప్రజలకుగూడ క్రీస్తును బోధించాలని సంకల్పించుకుంది. పౌలును బర్నబాను ఈ పనికి ఎన్నుకుంది. వాళ్లిద్దరిని తానే స్వయంగా నడిపించుకొని పోయింది.

పౌలు బర్నబా రోమను సామ్రాజ్యంలోని గ్రీకు రాష్ట్రాలకు ప్రయాణమై పోయారు. ఆసియా అనే రాష్ట్రంలో క్రీస్తును బోధిద్దామనుకొని పని ప్రారంభించారు. కాని ఆత్మ వాళ్ళను హెచ్చరిస్తూ మాసెడోనియాకు వెళ్లమంది. ఆత్మ నాయకత్వం క్రింద పౌలు బర్నబా మాసెడోనియాకు ప్రయాణమై పోయారు. అ.చ. 16, 6-10. మనహృదయాల్లో పుట్టే మంచి కోరికలు ఆత్మవలన కలుగుతూవుంటాయి. మనం పదిమందికి ఉపయోగపడే మంచి పనిని ప్రారంభించేలా చేసేదిగూడ ఈ యాత్మే.

**7. ఆత్మ నిర్ణయాలు** - అ చ. 15,28.

యెరూషలేంలోని తొలినాటి క్రైస్తవ సమాజంలో కొన్ని భేదాభిప్రాయాలు పొడచూపాయి. అంచేత పేత్రు పౌలు యెరూషలేంలో ఓ పెద్ద సమావేశం ఏర్పాటు

చేసారు. ఈ సమావేశానికి వచ్చిన పెద్దలు కదన కొన్ని తీర్మానాలు తయారుచేసారు. ఈ తీర్మానాలు పౌలు పేత్రు మొదలైన అపోస్తలులు తయారుచేసినవి మాత్రమేకావు. అపోస్తలులతోపాటు పరిశుద్ధాత్మ కూడ ఈ నిర్ణయాలను ఏర్పాటు చేసింది.

## 8. ఫిలిప్పు వృత్తాంతం - అ.చ. 8, 26-40.

ఇతియోపియా రాణి ఉద్యోగి యొకడు యెరూషలేమునకు వెళ్లి ప్రభువును సేవించుకొని తిరిగిపోతూ యెషయా ప్రవక్త గ్రంథం విప్పాడు. “అతన్ని గొర్రెలాగ వధ్యస్థానానికి నడిపించుకొని వెళ్ళారు. ఐనా గొర్రెపిల్లలాగ అతడు మౌనంగావుండి పోయాడేగాని నోరు తెరువలేదు” అన్న ప్రవక్తవాక్యాలు అతని కంట బడ్డాయి. ప్రవక్త ఎవరిని గూర్చి ఈలా వ్రాసాడబ్బా అని విస్తుపోయాడు ఆ వుద్యోగి. అంతలోనే ఆత్మ ఫిలిప్పును అతని యొద్దకు పంపింది. ఫిలిప్పు రథంమీది కెక్కి ఆ వుద్యోగిప్రక్కనకూర్చున్నాడు. ప్రవక్త క్రీస్తును గూర్చే ఈ వాక్యాలు వ్రాసాదని వివరించి చెప్పాడు. అంతలో వాళ్లు ఓ మడుగు దగ్గరకు వచ్చారు. ఫిలిప్పు ఆ ఉద్యోగికి జ్ఞానస్నానం ఇచ్చాడు. అటు పిమ్మట ఆత్మ మళ్లా ఫిలిప్పును తీసుకొని వెళ్లిపోయింది.

పరిశుద్ధాత్మ అపోస్తలుల ద్వారా చాలా అద్భుతాలు చేయించింది. ఈ అద్భుతాలు చూచి చాలమంది క్రైస్తవ సమాజంలో చేరిపోయారు - అ.చ. 2, 43. క్రైస్తవమతాన్ని అవలంబించిన విశ్వాసులకు ఆత్మ ఆదరణాన్ని సంతోషాన్ని ప్రసాదిస్తుండేది - అ.చ. 9,31. ఈ వృత్తాంతాలన్నీ ఆత్మ నాయకత్వానికి చక్కని ఉదాహరణలు.

## 9. ఆత్మను మోసపుచ్చరాదు - 5, 1-11.

యెరూషలేములోని తొలినాటి క్రైస్తవులు ఉమ్మడి జీవితం జీవిస్తుండేవాళ్లు. వాళ్లకు సొంత ఆస్తి అంటూ వుండేది కాదు. అననీయ అనే ఓ గృహస్థుకూడ ఈ క్రైస్తవ సమాజంలో చేరాడు. అతడు తన ఆస్తిని అమ్మి, కొంత దబ్బు మోసంతో జేబులో వేసుకొని, మిగిలిన డబ్బును మాత్రమే పేత్రునకు ఒప్ప జెప్పాడు. ఈ లాంటి పని చేసి పరిశుద్ధాత్మను మోసపుచ్చావుగదా అని పేత్రు అతన్ని శపించాడు. వెంటనే అననీయ ప్రాణాలు విడిచాడు.

తరువాత అననీయ భార్య సఫీరా వచ్చింది. భర్తకు పట్టిన దుర్గతి ఆమెకింకా తెలియదు. ఘూ ఆస్తిని ఈ పాటి వెలకే అమ్మామని ఆమెకూడ పేత్రు నెదుట బొంకింది. పరిశుద్ధాత్మను ఈలా శోధించావు గదా అని పేత్రు ఆమెనూ శపించాడు. వెంటనే ఆమె కూడ అక్కడే ప్రాణం విడిచింది. మనం కూడ బుద్ధి పూర్వకంగా దుష్కార్యం చేసినపుడెల్ల ఆత్మనే మోసపుచ్చు తూన్నాం. ఆత్మనే శోధిస్తున్నాం. కనుక ఈలాంటి పనులు చేయగూడదు.

## 10. ఆత్మ ఒకటుందనే మాకు తెలీదు - అ.చ. 19,2.

ప్రభువు పితయొద్దనుండి ఆత్మను పొందాడన్నాం. తాను పొందిన ఆత్మనే జ్ఞానస్నాన సమయంలో మనకూ ప్రసాదిస్తాడన్నాం. ఈ విషయాన్ని మనమట్టే జ్ఞాపక ముంచుకోం. ఓ మారు పౌలు ఎఫేసు పట్టణానికి వెళ్లాడు. అక్కడ స్నాపక యోహాను శిష్యులు కొందరు ఉండేవాళ్లు. వాళ్లు యోహాను వద్దనే జ్ఞానస్నానం పొందారు. పౌలు వాళ్లను చూచి "మీరు పరిశుద్ధాత్మను పొందారా" అని అడిగాడు. "ఎవరాయాత్మ? అసలు పరిశుద్ధాత్మ అనే వ్యక్తి ఒకడున్నాడనే మాకు తెలీదే" అన్నారు వాళ్లు. వెంటనే పౌలు వాళ్లకు క్రీస్తు పేరట జ్ఞానస్నానం ఇచ్చాడు. వాళ్లమీద చేతులు చూచాడు. తత్ క్షణమే ఆత్మ వాళ్ల మీదికి దిగివచ్చింది.

మనప్రవర్తనంగూడ ఈ యెఫెసీయుల్లాగే వుంటుంది. ఆత్మ ఒకటుందనే మనకు రూఢిగా తెలియదు. సరే, ఆత్మ ఒక టుందనుకున్నాం. కాని ఈ యాత్మ యెవరు? ఏం చేస్తుంది? క్రిందరాబోయే అంశాల్లో ఈ ప్రశ్నలకు జవాబులను విచారించి చూద్దాం.

## 11. ఆత్మ ఓ ముద్ర లాంటిది - ఎఫే 1, 13-14.

జ్ఞానస్నానం పొందినపుడే ఆత్మ మన హృదయాల్లోనికి ప్రవేశిస్తుంది. ఆలాప్రవేశించి మనహృదయంమీద ఓ ముద్రవేస్తుంది. పౌలు ఉద్దేశం ప్రకారం ఈ ముద్రకు మూడు భావాలున్నాయి.

1) అతని నాటి గ్రీకు రోమను సమాజాల్లో బానిసలమీద యజమానులు ముద్ర వేసేవాళ్లు. సైనికుల మీద రాజులు ముద్ర వేసేవాళ్లు. అనగా ఆ బానిసలు సైనికులు, యజమానులకు రాజులకు చెందినవాళ్లన్నమాట. ఈ లాగే మనం గూడ జ్ఞానస్నానం పొందాక ప్రాత యజమానుడైన పిశాచాన్ని విడనాడి క్రొత్త యజమానుడైన క్రీస్తును సేవిస్తాం. ఆలా సేవిస్తా మనదానికి ఈ ముద్ర గురుతు.

2) నాటి సమాజంలోని భక్తులు భక్తురాళ్ళు దేవతలకు తమ్ముతాము అర్పించుకునేవాళ్ళు. ఆ దేవతలకే పూర్తిగా చెందిపొయ్యేవాళ్ళు, ఆ దేవతలనే సేవించే వాళ్ళు. ఇప్పుడు, ఈ ముద్ర పొందాక క్రైస్తవుడు కూడ క్రీస్తుకే అంకితమౌతాడు, క్రీస్తునే సేవిస్తాడు అని సూచింపబడింది. 3) ఈ ముద్ర రాబోయే మోక్ష మహిమకు గూడ చిహ్నం. క్రయవిక్రయాల్లో ముందుగా బయానా చెల్లిస్తాం. ఈ బయానా ముందు రాబొయ్యే డబ్బునకు చిహ్నంగా వుంటుంది. మన హృదయంలోని పరిశుద్ధాత్మ అనే ముద్ర కూడ పిత మనకిచ్చిన ఓ బయానా లాంటిది. మనకు లభింపబోయే సొమ్ము మోక్షం. ఈ ముద్ర ద్వారా మోక్ష

మహిమను ఇక్కడే కొంతవరకు పొందుతాం. పూర్తిమహిమ మరణానంతరం లభిస్తుంది. ఆలా లభిస్తుంది అనడానికి గుర్తు ఈ ముద్ర.

పరలోకపు తండ్రే మన హృదయాల్లో ఆత్మ అనే ముద్రను నిలుపుతాడు. ఇది జ్ఞానస్నాన సమయంలో జరుగుతుంది అన్నాం - ఈ సంస్కారంద్వారా క్రీస్తుతో ఐక్యమౌతాం. ఈ సంస్కారంద్వారా, జలం పాత్రలోలాగ, ఆత్మ మన హృదయాల్లో నిండుకొంటుంది - 1కొ 12, 13.

ఈలా హృదయంమీద నెలకొనివున్న ఈ ముద్రను మనం గౌరవిస్తూవుండాలి. పాపంవలన ఈ ముద్ర విచ్ఛేదమై పోతుంది. ఆలా విచ్ఛేదమై పోకుండా వుండేలా చూచుకునే బాధ్యత మనదే.

## 12. ఆత్మ వలన దేవుని పుత్రులమౌతాం - రోమ 8, 14-16

సీనాయి నిబంధనం ద్వారా పూర్వవేదపు యూదులు యావే ప్రజలయ్యారు. కాని ఆ ప్రజలు యావేను తండ్రీ, అని పిలవడానికి భయపడిపోయి "ప్రభూ" అని మాత్రం పిలిచేవాళ్లు. అతడు యజమానుడు. వాళ్లు బానిసలు. యూదులు అతన్ని జూచి జంకేవాళ్లు కనుక అతని పేరైన ఉచ్చరించేవాళ్లుకాదు. ఇక, నూత్నవేదపు జనులమైన మనంకూడ జ్ఞానస్నానం ద్వారా దేవుని ప్రజలమౌతాం. కాని మనం దేవుణ్ణి ప్రభూ అని పిలవడానికి బదులుగా "తండ్రీ" అని పిలుస్తాం. ఈ స్వాతంత్ర్యమూ చనువూ మనకు ఎక్కడనుండి లభించింది? పరిశుద్ధాత్మను పొందడంద్వారానే. ఆ యాత్మద్వారా మనం దేవుని దత్తపుత్రలమౌతాం. క్రీస్తునకు తమ్ముళ్లంగాను చెల్లెళ్లంగాను మారిపోతాం. ఆ క్రీస్తులాగే మనంగూడ పరలోకంలోనిపితను "అబ్బా" లేక "తండ్రీ" అని పిలుస్తాం. బిడ్డల్లాగ ఆ తండ్రిని ప్రేమిస్తాం.

పరలోకంలోని తండ్రికి క్రీస్తు సహజ పుత్రుడు. క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందిన మనం ఆ తండ్రికి దత్త పుత్రులం. ఈ భాగ్యాన్ని మనకు అనుగ్రహించిన ఆత్మపట్ల ఎంతైన కృతజ్ఞులమై వుండాలి.

## 13. మూడు రకాల నరులు

పౌలు నరులందరిని మూడు రకాలుగా విభజించాడు. మొదటి రకంవాళ్లు ప్రాకృతిక మానవులు. వీళ్లు దేహేచ్ఛల ప్రకారం ప్రాపంచిక జీవితం జీవించేవాళ్లు. తమో గుణాలతో నిండినవాళ్లు. వీళ్లు ఆత్మను పొందలేదు, ఆత్మ వీళ్లల్లో వసింపదు. ఈ రకంవాళ్లు దేవుని రక్షణ ప్రణాళికను, క్రీస్తును క్రీస్తు చేకూర్చిపెట్టిన పాపవిమోచనాన్ని లెక్కచేయరు.

అసలు రక్షణమంటేనే వీళ్లకు అపహాస్యంగా వుంటుంది. అంచేత వీళ్ళు క్రీస్తును అంగీకరింపరు - 1కొ 2, 14.

రెండవ రకంవాళ్లు, అపరిపూర్ణమైన ఆధ్యాత్మిక జీవితం జీవించేవాళ్లు. వీళ్లు క్రీస్తును అంగీకరించారు, జ్ఞానస్నానం పొందారు. ఆత్మను స్వీకరించారు. కాని ఆ యాత్మ చెప్పుచేతల ప్రకారం నడచుకోరు. దేహేచ్ఛల ప్రకారం జీవిస్తారు. ఆధ్యాత్మిక జీవితంలో పెరిగి పెద్దవాళ్లు కారు. ఎప్పుడూ చిన్నపిల్లల్లా వుండిపోతారు. బలవర్ధకమైన భోజనాన్ని స్వీకరించలేరు. పిల్లలు త్రాగే పాలు త్రాగుతూంటారు. వీళ్లు తమలోని ఆత్మను ఆర్పివేయరుగాని, నిరోధిస్తూ వుంటారు. కొరింతు క్రైస్తవులు ఈలాంటివాళ్లు - కొ 3, 1-4.

మూడవ రకంవాళ్ళు పరిపూర్ణమైన ఆధ్యాత్మిక జీవితం జీవించేవాళ్ళు. వీళ్ళు దేవుని రక్షణ ప్రణాళికను, దేవుని విజ్ఞానమైన క్రీస్తును అర్థం చేసికుంటారు. పరిశుద్ధాత్మ చూపించే మార్గంలో నడస్తూంటారు. వీళ్లల్లోను దేహం ఆత్మతో పోరాడుతుంది. కాని వీళ్ళు దేహానికి వశులుకారు. ఆధ్యాత్మిక జీవితంలో వీళ్ళు పిల్లల్లా కాదు, పెద్ద వాళ్లల్లా ప్రవర్తిస్తారు. నిత్యం ఆత్మ ఆధీనంలో వుండి, ఆత్మ ఎటువైపు నడిపిస్తుంటే అటువైపు నడచి పోతూంటారు. కనుక వీళ్ళు ఆధ్యాత్మిక మానవులు అనబడుతారు - 1కొ 2, 15-16.

మనం మొదటి తరగతికి చెందం. మూడవ తరగతికి చెందవలసినవాళ్లం గాని, బలహీనతవల్ల రెండవ తరగతిలోనే వుండిపోతాం. ఆత్మ మనలను మూడవ తరగతికి చెందిన పరిపూర్ణ ఆధ్యాత్మిక మానవులనుగా తయారు చేయాలని ప్రార్థిద్దాం.

## 14. దేహాత్మల వైరుధ్యం - గల 5, 16-17 ; రోమ 8,5-6

మనలో ప్రాకృతిక మానవుడూ జీవిస్తుంటాడు, ఆధ్యాత్మిక మానవుడూ జీవిస్తుంటాడు. ఈ యిద్దరకూ నిత్యం ఘర్షణ జరుగుతూంటుంది. ప్రాకృతిక మానవుడు ప్రకృతికి అనుగుణంగా పాప జీవితం జీవింప గోరుతాడు. ఆధ్యాత్మిక మానవుడు ప్రకృతిని అరికట్టి దివ్యజీవితం జీవింప గోరుతాడు. దీన్నే పౌలు "దేహాత్మల వైరుధ్యం" అని పిలుస్తుంటాడు. ఇక్కడ దేహం ప్రాకృతిక మానవుని సూచిస్తుంది. ఆత్మ ఆధ్యాత్మిక మానవుని సూచిస్తుంది. ఇక పరిశుద్ధాత్మ మనలోని ప్రకృతి శక్తులను దేహేచ్ఛలను నిరోధిస్తుంది. ఆధ్యాత్మిక శక్తులను అభివృద్ధి చేస్తుంది. మనం దివ్య జీవితం జీవించేలా సాయపడుతుంది - రోమ 8, 13.

మనం జీవించినంత కాలం మనలోని ప్రాకృతిక ఆధ్యాత్మిక శక్తులకు అనగా మనలోని దేహాత్మలకు పోరాటం జరుగుతూనే వుంటుంది. ఈ పోరాటంలో ఆత్మ మనకు

అండగాను దండగాను వుంటుంది. మనం క్రమేణ ప్రాకృతిక మానవుణ్ణి జయించి ఆధ్యాత్మిక మానవుణ్ణి పెంపొందించుకునేలా చేస్తుంది. కనుక ఈ విషయంలో మనం నిత్యం ఆత్మ సహాయం అడుక్కుంటూ వుండాలి.

## 15. నైతిక జీవితం - గల 5, 25

మనం క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొంది క్రీస్తు ఉత్థానంలో పాలు పొందాం. కావున మన జీవితం విశుద్ధంగా వుండాలి. అనగా మనం రోజురోజు నైతిక జీవితం జీవిస్తుండాలి. ఇక, మనం నైతిక జీవితం జీవించే శక్తిని ఇచ్చేది పరిశుద్ధాత్మ. ప్రాకృతిక మానవుడు శరీరేచ్ఛల ప్రకారం నడుస్తూవుంటాడు. ద్వేషం, విభేదం, కలహం, కాముకత్వం మొదలైన దుష్టగుణాలు శరీరేచ్ఛలు. నరులు ఈ దుష్ట గుణాలను జయించేలా చేస్తుంది పవిత్రాత్మ - గల 5, 19-21.

ఆయాత్మ తన ఫలాలను గూడ అనుగ్రహిస్తుంది. సంతోషం, శాంతం, ప్రేమ మొదలైనవి ఆత్మ యిచ్చే ఫలాలు. వీనిద్వారా నరుడు ఆధ్యాత్మిక జీవితం జీవిస్తాడు - గల 5,22-23.

మనం శరీరేచ్ఛల ప్రకారం జీవిస్తున్నామో ఆత్మ ఫలాల ప్రకారం జీవిస్తున్నామో విచారించి చూచుకుందాం.

## 16. ఆత్మ వరాలు - 1కొ 12, 8-12

ఆత్మ క్రైస్తవ సమాజానికి వరాలు ఇస్తుంది. వ్యాధులు నయంజేసే శక్తి, అద్భుతకార్యాలు, ప్రవచనం, బహుభాషాజ్ఞానం మొదలైనవి ఆత్మ దయచేసే వరాలు. మొదటి కొరింతీయుల జాబులోని 12వ అధ్యాయమందంతటా ఈ వరాలు వర్ణింపబడ్డాయి. ఇవన్నీ గలసి ఇంచుమించు 20 వరాలదాక వున్నట్లు తెలుస్తుంది. ఇవి వ్యక్తి లాభం కోసం గాదు, సమాజలాభం కోసం ఉద్దేశింపబడ్డాయి. వీని ద్వార క్రైస్తవ సమాజం బలపడి వృద్ధిలోనికి వస్తుంది.

పై వర్గాల ద్వార వ్యక్తి యేమో ప్రత్యేకంగా పరిశుద్ధుడు కాడు. అందుచేత వీటిని అత్యాశతో ఆశించవద్దన్నాడు పౌలు. వీటికంటే మిన్నయైనవి విశ్వాసం, నిరీక్షణ, ప్రేమ అనే పుణ్యాలు. వీటిల్లోను ప్రేమ శ్రేష్ఠమైంది. అందుచేత ప్రేమను పెంపొందించు కొమ్మన్నాడు 1కొ 14,1. ఈ మూడు పుణ్యాలు కూడ పవిత్రాత్మ ప్రసాదించే భాగ్యాలే.

ఇంతకు ముందే ఆత్మ ప్రసాదించే ఫలాలను చూచాం. ఇప్పుడు ఆత్మ అనుగ్రహించే వరాలను పుణ్యాలను వివరించాం. ఈ ఫలాలు, వరాలు, పుణ్యాలు - వీని

ద్వారా క్రైస్తవ జీవితం పటిష్ఠమౌతుంది. కనుక ఆత్మ ఈ భాగ్యాలన్నీ మనకు కరుణించాలని వేడుకుందాం.

## 17. ఓ దేవాలయంగా మారిపోతాం - 1కొ 6, 19; 3, 17

జ్ఞానస్నాన సమయంనుండి ఆత్మ మనహృదయంలో వసిస్తుంది అన్నాం. ఆలా వసించి మనలను తన ఆలయంగా తయారు చేసికుంటుంది, పవిత్ర పరస్తుంది. పరిశుద్ధాత్మ మనలను మూడురూపాల్లో పవిత్ర పరస్తుంది : 1) మనలను దేవుని ఆరాధనకు అంకితం చేస్తుంది. దీనిద్వారా దేవుని పరిచారకులమౌతాం. దేవుని పూజిస్తాం - ఫిలి 3,3. 2) యెరూషలేం దేవాలయంలో నిర్మలమైన గొర్రెపిల్లలను బలిగా సమర్పించేవాళ్లు. ఈ యాత్మ మనలనుగూడ మచ్చలేని గొర్రెపిల్లల్లాగ తీర్చి దిద్దుతుంది, ప్రభువునకు బలిగా సమర్పిస్తుంది - రోమ 15, 16. 3) మనలను ప్రభువు రెండవ రాకడకు సిద్ధం చేస్తుంది. ప్రభువు రాకడకు మనం వేచివుండేలా చేస్తుంది. అప్పటిదాకాగూడ పాపంవలన నాశమై పోకుండా వుండేలా కాపాడుతుంది- 1 తెస్స 5, 19-23.

ఇన్నివిధాల ఆత్మ మనలను పవిత్రపరుస్తుంది. దైవ వ్యక్తులు ముగ్గురున్నాగానీ, పవిత్రీకరణం మాత్రం విశేషంగా పరిశుద్ధాత్మకే ఆరోపింపబడుతుంది. ఈ ఆత్మద్వార మనం రోజురోజుకి పవిత్రులమౌతూండాలి.

## 18. ప్రేమవరం - రోమ 5,5.

ఈ యాత్మద్వారా దేవుని ప్రేమ మన హృదయాల్లోనికి కుమ్మరింపబడుతుంది. పవిత్రాత్మ మూడురూపాల్లో మనకు ప్రేమవరాన్ని అందిస్తుంది: 1) మొట్టమొదట క్రీస్తుద్వారా పిత మనలను ప్రేమించాడు - రోమ 8, 39. పిత మనపట్లచూపే యీ యపార ప్రేమను అర్థంచేసికునేలా చేస్తుంది ఈ యాత్మ. ఆ పిమ్మట మన ప్రేమను పితకు అర్పిస్తుంది. 2) "ఆయాత్మ వచ్చినపుడు మీకు సంపూర్ణ సత్యాన్ని బోధిస్తుంది" అంటాడు ప్రభువు - యోహా 16, 13. ఈ సంపూర్ణ సత్యం మరేమో గాదు, క్రీస్తే. అనగా మనం క్రీస్తును అర్థంచేసికునేలా, క్రీస్తు ప్రేమను గ్రహించేలా చేసేది ఈ యాత్మే. ఈయాత్మ సహాయంవల్లనే క్రీస్తు సిలువమరణాన్ని, రక్షణాన్ని అర్థంచేసికుంటున్నాం, అంగీకరిస్తున్నాం. ఇక మనం క్రీస్తుపట్ల బదులుప్రేమ చూపేలా చేసేదికూడ ఈ యాత్మే. క్రీస్తును ప్రేమించమని పరిశుద్ధాత్మ మనలను నిర్బంధిస్తుంది - 2కొ 5, 14. 3) ఇక, పిత సుతులను ప్రేమించినట్లే తోడి ప్రజలనుగూడ ప్రేమించేలా చేసేదీ ఈ యాత్మమే - ఎఫే 5, 1-2. ఈ యాత్మ ప్రసాదించే ప్రేమవరం వల్లనే మనమంతా ఒకరినొకరం అంగీకరిస్తున్నాం, ఆదరిస్తున్నాం, ఒకరి భారాన్నొకరు భరించుకుంటూ పోతున్నాం - గల 6,2.

## 19. నరునకు నరుడు తోడేలు

"మానవుడు మానవుణ్ణి తోడేలులాగ కబళించివేస్తాడు" అంటుంది ఓ రోమను సామెత. కాని ఈయాత్మ ప్రభావంవల్ల నరుడు నరుణ్ణి ప్రేమిస్తున్నాడు, సేవిస్తున్నాడుకూడ - గల 5,13. అందుకే దేహానికి ఆత్మ యేలాంటిదో క్రైస్తవ సమాజానికి పరిశుద్ధాత్మ ఆలాంటిది అన్నారు పితృపాదులు. శరీరంలోని అవయవాలను ఒక్కటిగా బంధించి దేహం పెంపొందేలా చేసేది మన ఆత్మ. ఆలాగే క్రైస్తవ ప్రజలను ఒక్కటిగా ఐక్యపరచి పరస్పర ప్రేమభావంతో పెంపునకు గొనివచ్చేది పవిత్రాత్మ. క్రైస్తవ ప్రజలు ఏదేశంవాళ్లైన, ఏ కాలంవాళ్లైన, ఏవర్గం వాళ్లైన ఒకరికొకరు ప్రియపడుతూనే వుంటారంటే, అది ఈ యాత్మ అనుగ్రహమే. ఈ యాత్మ క్రైస్తవ ప్రజలను ఓ సమాజంగాను ఓ దేవాలయంగాను నిర్మించుకుంటూ పోతుంది - ఎఫే 2, 22.

క్రైస్తవ జీవితానికి ప్రాణంవంటిది ప్రేమశక్తి. ఈశక్తిని పవిత్రాత్మ మనకూ అనుగ్రహిస్తుండాలని ప్రార్థిద్దాం.

## 20. అంతరాత్మను ప్రబోధిస్తుంది - రోమ 9,3.

పూర్వవేదపు యూదులు రాతిపలక మీద వ్రాయబడిన పదియాజ్ఞల ప్రకారం జీవించేవాళ్ళు. కాని నూత్నవేద ప్రజలమైన మనం మోషే ధర్మశాస్త్రం ప్రకారం జీవింపం. పవిత్రాత్మ పలకకు మారుగా మన హృదయంమీద, పదియాజ్ఞలకు మారుగా ప్రేమాజ్ఞను వ్రాస్తుంది. ఇది క్రొత్తయాజ్ఞ. మనమంతా ఈ క్రొత్తయాజ్ఞ ప్రకారం జీవిస్తాం - హెబ్రే 8,10.

ఈ యాత్మ మన అంతరాత్మను ప్రబోధిస్తుంది. ఈ ప్రబోధం ప్రకారం నడచుకుంటే చాలు పరిశుద్ధుల మౌతాం. జీవితంలో రకరకాల గడ్డు సమస్యలు ఎదురుపడుతుంటాయి. త్రోవ తిన్నగా కనిపింపదు. ఐనా ఈ సమస్యలను గూర్చి ఓ నిర్ణయానికి వస్తుండాలి. ఏలాగ? పరిశుద్ధాత్మ సహాయం ద్వారానే. ఈ యాత్మ మన యాత్మకు వెలుగును అనుగ్రహిస్తుంది. మనం మంచి నిర్ణయాలు చేసికొని దైవచిత్తం ప్రకారం జీవితాన్ని కొనసాగించుకునేలా సహాయపడుతుంది. అందుకే నూత్నవేదం పెక్కుతావుల్లో ఈ యాత్మను "వెలుగు" అని పిలుస్తుంది - హెబ్రే 6,4. పునీతులు ఈ యాత్మ ప్రబోధం విన్నారు, ఈయాత్మచూపించే వెలుగుబాటలో నడచిపోయారు.

పరిశుద్ధాత్మ మన అంతరాత్మతో తిన్నగా మాటలాడుతూందిగూడ. మనం ఆయాత్మస్వరాన్ని వినే అలవాటు కలిగించు కోవాలి. ఆయాత్మ ప్రబోధాలను పెడుచెవిని పెట్టకుండా వుండేలా చూస్తుండాలి. మహానుభావులు పోప్ జాన్ మొదలైనవాళ్లు హృదయంలో వినిపించే ఆత్మ స్వరాన్ని ఆలిస్తూ వుండేవాళ్లని వింటున్నాం.

## 21. ఆత్మ మన నాయకుడు

ఆత్మ నాయకుడై తొలినాటి క్రైస్తవ సమాజాన్ని నడిపించింది. పౌలు, బర్నబా, ఫిలిప్పు మొదలైన వాళ్లంతా ఆత్మ చూపించిన మార్గంలోనే నడిచిపోయారన్నాం. పవిత్రాత్మ విశ్వాసులను నడిపించుకొని పోవడం మాత్రమే గాదు. వాళ్లకు అద్భుతమైన శక్తిని గూడ అనుగ్రహిస్తుంది - రోమా 15, 13 వాళ్లను నిత్యం ఆదుకుంటూ వుంటుంది. ఓ తల్లిలా విశ్వాసులనే బిడ్డలను ఆదరిస్తూ వుంటుంది - ఫిలిప్పి 2, 1-2. కొందరు విశ్వాసులకు వేరేవాళ్లను కుస్తరించే వరం అనుగ్రహిస్తుంది. కొరింతులో ఈలాంటి వాళ్ళు ఉండేవాళ్లు -1 కొ 14,3.

క్రైస్తవ ప్రజలు ఈ ఆత్మకు వశులౌతూ వుండాలి. ఈ యాత్మచే నడిపింపబడుతూ వుండాలి. ఈ యాత్మ అందించే ఆదుకోలును కుస్తరింపును పొందుతూండాలి. దేవుని బిడ్డలు దేవుని ఆత్మచే నడిపింపబడతారు అంటాడు - పౌలు - రోమ 8,14.

## 22. స్వాతంత్ర్య దాత - రోమ 8, 1-2

పూర్వవేద ప్రజలు పాపానికి, పిశాచానికి, మరణానికి, ధర్మశాస్త్రానికి దాసులయ్యారు. వీటన్నిటి నుండి మనకు స్వాతంత్ర్యాన్ని అనుగ్రహిస్తుంది ఆత్మ. ఎవరి హృదయాల్లో దేవుని ఆత్మ నెలకొని వుంటుందో వాళ్ళు స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తారు - 2కొ 3, 17. ఈ స్వాతంత్ర్యం గూడ మరేమో కాదు, ఆత్మ అనుగ్రహించే ప్రేమశక్తే. ఈ శక్తిద్వారా మన యిష్టం వచ్చినట్లు విచ్చలవిడిగా సంచరించం. మరి దేవుణ్ణి తోడి ప్రజలను ప్రేమిస్తాం - గల 5,13.

పరిశుద్ధాత్మ పాపాన్ని సహింపదు. పాపం చేసినపుడెల్ల స్వాతంత్ర్యాన్ని కోల్పోయి పిశాచానికి బానిసలమౌతూంటాం. కనుక మనలను పాపంలో పడిపోకుండ కాపాడుతూండాలని ఈ యాత్మను అడుక్కుందాం.

## 23. ప్రార్థనం నేర్పుతుంది - రోమ 8, 26-27

ఆత్మ మన అంతరాత్మలో నెలకొనివుండి మనలో ప్రార్థిస్తుంది. మనచే ప్రార్థన చేయిస్తుంది. ఆత్మ సహాయంలేందే, ఏలా ప్రార్థించాలో దేనికొరకు ప్రార్థించాలో మనకేమీ బోధపడదు. పునీతులకు ప్రార్థన నేర్పింది ఈ యాత్మ. మహాభక్తులు ప్రార్థన ద్వారా భగవంతునితో ఐక్యమయ్యేలా చేసింది ఈ యాత్మ. కావున మనం ఈ యాత్మతో కలసి ఈ యాత్మయందు ప్రార్థన చేస్తువుండాలి - ఎఫే 6,18.

శిష్యులు ఓమారు ప్రార్థించే విధానం నేర్పమని క్రీస్తు నడిగారు. ప్రభువు వాళ్లకు పరలోకజపం నేర్పించాడు. ప్రభువు నేడు మన మధ్యలోలేడు. క్రీస్తు వెళ్లిపోయాక క్రీస్తుస్థానాన్ని పొందింది పరిశుద్ధాత్మ. కనుక ఆ శిష్యుల్లాగే మనం కూడ ప్రార్థించే విధానం నేర్పమని ఈ యాత్మను అడుక్కుంటూ వుండాలి.

ఉత్థానక్రీస్తు మోక్షంలో పితయెదుట మనకోసం ప్రార్థన చేస్తూవుంటాడు - హెబ్రీ 7,25. క్రీస్తు మోక్షంలో ప్రార్థనచేస్తూ వుంటే, ఆత్మయిక్కడే మనహృదయంలోనే ప్రార్థిస్తూవుంటుంది. కావున క్రైస్తవ భక్తుడు ఈ యాత్మతో కలసి, ఈ యాత్మ సహాయంతో ప్రార్థన చేసికుంటూ వుండాలి.

## 24. ఉత్థానభాగ్యం ప్రసాదిస్తుంది - రోమ 8,11.

పిత పవిత్రాత్మద్వారా ప్రభువును ఉత్థానంతో లేపాడు. క్రీస్తు మృత దేహంలోనికి ఆత్మ ప్రవేశించి చైతన్యం కలిగించింది. ఆ చైతన్యంతోనే క్రీస్తు ఉత్థానమయ్యాడు. క్రీస్తును ఉత్థానంతో లేపిన ఆత్మేమనకు గూడ ఉత్థానభాగ్యం అనుగ్రహిస్తుంది. భూమిలో పడిన బీజం నశించిపోదు. మళ్లా మొలకెత్తి చెట్టుగా ఎదుగుతుంది. ఆలాగే భూమిలో పాతిపెట్టబడిన మానుష దేహంగూడ నశించిపోదు. కడపటి దినాన ఆత్మశక్తిద్వారా మళ్లా ఉత్థానమౌతుంది. ఆయాత్మ మన మృత దేహంలోనికి ప్రవేశించి మనకూచైతన్యం కలిగిస్తుంది.

యూదుల వారసభూమి పాలస్తీనాదేశం. మన వారసభూమి మోక్షం. మోక్షానికి మనలను వారసులుగా జేసేది, మోక్షంలో మనం ప్రవేశించేలా చేసేది ఆయాత్మే - ఎఫే 1, 14. మోక్షం మన తండ్రి రాజ్యం. బిడ్డలమైన మనం ఈ రాజ్యంలో ప్రవేశించాలి. ఏయాత్మద్వార మనం దేవుని బిడ్డలమౌతామో ఆయాత్మ ద్వారానే మోక్షంలో ప్రవేశించే అర్హతను గూడ పొందుతాం.

ఈ దేహం మళ్లా ఓనాడు ఉత్థానమై ప్రభుసన్నిధిలో నిలుస్తుంది. ఆలాంటి ఈ మానుష దేహాన్ని - అది స్త్రీ దేహమైనా సరే పురుష దేహమైనాసరే - పవిత్ర భావంతో చూస్తుండాలి. ఈ పావిత్ర్యాన్ని ప్రసాదించమని కూడ ఆ యాత్మనే అడుగుకుందాం.

## 25. జీవించే ప్రాణి - జీవమిచ్చే ప్రాణి - 1కొ 15, 45.

సృష్టి జరిగినప్పుడు ప్రభువు ఓ పిడికెడు మట్టి ముద్దను తీసికొని దానిలోనికి శ్వాస ఊదాడు. వెంటనే ఆ మట్టిముద్ద జీవించే ప్రాణి ఐంది. ఆ ప్రాణే తొలి మానవుడు, ఆదాము. మళ్ళా యావే ప్రభువు క్రీస్తు మృత దేహంలోనికిగూడ శ్వాసను ఊదాడు.

అనగా తన ఆత్మను ప్రవేశపెట్టాడు. వెంటనే ఆ మృతదేహంగూడ జీవించింది. అనగా క్రీస్తు జీవంతో లేచాడు. ఆదాము జీవించే ప్రాణి అయ్యాడు. అనగా తాను జీవించాడు. తన భౌతిక జీవితాన్ని నరజాతికి అందించాడు. కాని రెండవ ఆదాము క్రీస్తు జీవించటం మాత్రమేగాదు, జీవమిచ్చే ప్రాణిగాగూడ తయారయ్యాడు. ఆ తొలి ఆదాము నరజాతికి భౌతిక జీవితాన్ని అందిస్తే ఈ రెండవ ఆదాము ఆధ్యాత్మిక జీవితాన్ని అందిస్తాడు. మనం దివ్యజీవితం జీవించేలా చేస్తాడు.

మృతక్రీస్తు ఉత్థాన సమయంలో పరిశుద్ధాత్మను పొందాడు. ఆత్మ అనుగ్రహించే జీవితంతో నిండిపోయాడు. అందుకే పౌలు "ప్రభువే ఆత్మ" అని వ్రాసాడు - 2కొ 3,17. క్రీస్తు పరిశుద్ధాత్మగా మారిపోయాడనిగాదు ఆ వాక్యోద్దేశం. పరిశుద్ధాత్మ ప్రసాదించే జీవశక్తితో నిండిపోయాడని భావం. ఇక, తాను పొందిన ఆత్మను క్రీస్తు మనకూ అనుగ్రహించాడు. క్రీస్తు నుండి ఆత్మను పొందుతాం. ఈలా పొందిన ఆత్మ మనలను మళ్లా క్రీస్తువద్దకు చేరుస్తుంది. క్రీస్తుతో జోడిస్తుంది.

జీవమిచ్చే ప్రాణి క్రీస్తు. అతనికి జీవమిచ్చిన పరిశుద్ధాత్మ మనకూ జీవశక్తిని ప్రసాదించాలని మనవి చేద్దాం. ఈ జీవశక్తే వరప్రసాదం.

## 26. మహిమనుండి మహిమను పొందుతాం -2కొ 3,18

మోషే సీనాయి పర్వతంమీదికెక్కి ప్రభువును దర్శించాడు. ప్రభుమహిమ సోకి అతని ముఖం ప్రకాశించింది. ఆ ముఖ వర్చస్సు చూచి యూదులు భయపడిపోయారు. మోషేను సమీపించడానికి జంకారు. అంచేత మోషే ముఖంమీద ముసుగువేసికొని యూదులతో మాటలాడేవాడు - నిర్గ 34, 29-35. ఉత్థాన క్రీస్తు కూడ ఆత్మను పొంది, ఆత్మ మహిమతో ప్రకాశించాడు. జ్ఞానస్నానం ద్వారా క్రీస్తులోనికి ఐక్యమైన మనంగాని క్రీస్తుగాని మోషేలాగ ముఖంమీద ముసుగువేసికోవలసిన అవసరమేమీలేదు. ప్రభువులోనికి ఐక్యమొందిన కొద్దీ, ప్రభువు ఆత్మను పొందిన కొద్దీ, మన ఆత్మలోని వర్చస్సుకూడ అధికమౌతుంది. అనగా మనం రోజురోజుకి క్రీస్తురూపాన్ని పొంది క్రీస్తులా జీవిస్తాం.

## 27. తొలి ఫలాలు, సంచకరువు - రోమ 8,23; 2కొ 1,22

భూమి, పశువులు మొదలైన వానిని కొనేప్పుడు బయానా ఇస్తాం. తరువాత పూర్తి సొమ్ము చెల్లిస్తా మనడానికి ఈ బయానా గుర్తు. బయానా లేక సంచకరువును పుచ్చుకొన్న ఆస్తిదారుడు తరువాత పూర్తి సొమ్మును పొందుతాడు.

పంట పొలాల్లో ముందుగా పండిన వెన్నులు ఫలాలు మొదలైన వాటిని, మందలలో మొదట పుట్టిన పిల్లలను యూదులు యెరూషలేం దేవాలయంలో కానుక పెట్టేవాళ్ళు. దీని ద్వారా ఆ పంటా మందలూ పూర్తిగా యావేకు చెందినవనీ యావేకు లభింపవలసినవనీ సూచించబడింది. పైగా కానుకగా అర్పింపబడిన యీ బలివస్తువులు పూర్తి పంటను పూర్తి మందలను పవిత్రం చేస్తాయనిగూడ సాంకేతికంగా తెలుపబడింది.

ఇక, "తొలిఫలాలు" "సంచకరువు" అనే యీ రెండు శబ్దాలను పవిత్రాత్మకు నామాలుగా వాడాడు పౌలు. అతని ఉద్దేశం యిది. మనం పరలోకపు తండ్రి బిడ్డలం. ఆ తండ్రి మోక్షం మనకు వారసభూమి. ఈ వారసాన్ని ఈ జీవితంలోనే కొంతవరకు అనుభవిస్తాం. ఉత్థానం తరువాత పూర్తిగా అనుభవిస్తాం. ఇట్లు మోక్షాన్ని పూర్తిగా పొందుతాం అనడానికి నిదర్శనంగా, పరిశుద్ధాత్మ మనకు బయానాగాను, తొలిఫలాలుగాను ఈయబడింది. కావున ఈ యాత్మ ద్వారానే మనకు మోక్షం లభిస్తుంది.

పరిశుద్ధాత్మ అనే వో గొప్ప నిధి మన హృదయంలోనే గుప్తమై వుంది. ఈ నిధిని గుర్తించి సద్వినియోగం చేసికుందాం.

## 28. క్రీస్తు రూపం

ఆత్మ మన తరపున ఇన్ని మంచి పనులు చేస్తుంది అన్నాం. కాని వీటన్నిటినీ ఒకే పనిగా భావించవచ్చు. క్రీస్తుకు మనకు సంబంధం కలిగించడం, క్రీస్తు వైపునకు మనలను ఆకర్షించడం – ఇదీ ఆత్మ చేసేపని.

ప్రభువు మోక్షానికి ఆరోహణంచేసి వెళ్ళిపోయాక ఈ భూమిమీద ప్రభువు ప్రారంభించిన పనిని కొనసాగించుకుంటూ పోయేది పవిత్రాత్మ. కావుననే ప్రభువు వెళ్ళిపోయాక ఆత్మ వేంచేసి వచ్చింది. ప్రభుస్థానాన్ని పొందింది. ఇక, మనలను క్రీస్తువైపు ఆకర్షించడంద్వారా ఆత్మ ప్రభుకార్యాన్ని కొనసాగిస్తుంది. ఈయాత్మ సహాయం లేందే క్రీస్తును విశ్వసించలేం. అసలు "యేసు" అనే పేరుకూడ ఉచ్చరించలేం – 1కొ 12, 3.

క్రీస్తు మరణం ఉత్థానం, పాపపరిహారం, రక్షణం – ఇది పిత సంకల్పించుకున్న రక్షణ ప్రణాళిక. దీన్నే "రహస్యం" లేక "మర్మం" అని పిలుస్తుంటాడు పౌలు. ఇక, పిత నిర్ణయించుకున్న రక్షణ ప్రణాళికను, అనగా క్రీస్తు మరణోత్థానాలను మనంతట మనం అర్థంచేసికోలేం. మనంతట మనం క్రీస్తును ప్రేమింపలేం. పరిశుద్ధాత్మ మన హృదయంమీద పనిచేసి మనం క్రీస్తు మరణోత్థానాలను అర్థంచేసికునేలా చేస్తుంది – 1కొ 2, 13–15. కనుక ఈ యాత్మ సహాయం లేందే మనం క్రైస్తవులం గాలేం, క్రైస్తవుల్లా జీవించలేం, క్రీస్తును అనుసరించలేం.

తొలిమానవుల్లో దేవుని పోలిక వుండేది. కాని అతని పాపంద్వార ఈ పోలిక మాసిపోయింది. క్రీస్తు మరణంద్వార దేవుని యీపోలిక మళ్లా మానవుల్లో నెలకొంటుంది. నూత్నవేద ప్రజలమైన మనలోను జ్ఞానస్నానంతోనే క్రీస్తుపోలిక నిలుస్తుంది. చిత్రకారుడు గోడమీదబొమ్మను చిత్రిస్తాడు. అలాగే ఆత్మ మన హృదయాల్లో క్రీస్తురూపాన్ని చిత్రిస్తుంది. కావున మనం క్రీస్తును పోలివుండాలనీ, క్రీస్తు రూపురేఖలు మన హృదయంతో ప్రస్ఫుటం కావాలనీ ఆయాత్మను అడుగుకుందాం.

## 29. ఆత్మతో నిండి వుండాలి - ఎఫే 5,18

పాత్ర జలంతో నిండివుంటుంది. అలాగే ఆధ్యాత్మిక మానవుడూ ఆత్మతో నిండివుండాలి. మత్తులు మద్యంతో నిండివుంటారు. అలాకాకుండ క్రైస్తవుడు ఆత్మతో పూరింపబడి వుండాలి. పూర్వవేదంలోని ప్రవక్తలు ఆత్మతో, ఆత్మావేశంతో నిండివుండేవాళ్లు. ఈలా ఆత్మతో నిండినవాడు పసివాడు కాడు. క్రీస్తులోనికి ఎదిగినవాడు - ఎఫే 4, 15. పరిపూర్ణమానవుడన్నా, ఆధ్యాత్మిక మానవుడన్నా అతడే - గల 6,1.

ఆత్మతో నిండినవాళ్ళు సంతోషంతో ప్రభువును గానంచేస్తూంటారు. దేవునికి కృతజ్ఞతాస్తుతులు అర్పిస్తుంటారు. తోడివారిని ఆదరిస్తుంటారు - ఎఫే 5, 19-21.

కాని హృదయాన్ని ఆత్మతో నింపుకోవడం ఎలా? పాత్రను పాలతోనింపాలి అంటే ముందుగా దానిలోని నీళ్లను పారబోయాలి. ఆమీదట ఖాళీఅంతా నిండేలా దాన్ని పాలతో నింపాలి. అలాగే మన హృదయాన్నీ ఆత్మతో నింపుకోవాలి అంటే, మొదట హృదయంలోని పిశాచాన్ని పాపాలను నిర్మూలించాలి. ఆపిమ్మట ఏఖాళీ మిగలకుండా హృదయాన్ని పూర్తిగా ఆత్మతో నింపుకోవాలి. ఆత్మ మన హృదయమనే పాత్రలో నిండుకొని వుండాలని మనవి చేద్దాం.

## 30. మన బాధ్యతలు

మనం పుట్టి జ్ఞానస్నానం పొందేది మొదలుకొని చనిపోయి మోక్షంలో అడుగువెట్టిందాకా ఆత్మ వెట్టిచాకిరి చేస్తుంది. మనపట్ల దాదిలా మెలగుతుంది. అందుకే గ్రీకు పితృపాదులు ఈ యాత్మను తల్లిలేక దాది అని పిలచేవాళ్ళు. అనగా ఓ తల్లిగా ఈయాత్మ మనలను సాకుతుంది. ఓ దాదిలా పెంచి పెద్దజేస్తుంది. తెరచాప పడవను నడపించుకొని పోయినట్లుగా మనలనూ ఆధ్యాత్మిక జీవితంలో ముందుకు నడిపించుకొని పోతుంది.

ఈలాంటి ఆత్మపట్ల మనం బాధ్యతాయుతంగా ప్రవర్తిస్తుండాలి. ఈయాత్మను తల్లిలా గౌరవిస్తుండాలి. ఈపవిత్రాత్మను ఎప్పుడూ దుఃఖపెట్టకూడదు - ఎఫే 4, 30. పాపం చేసినపుడెల్ల ఈయాత్మను హృదయంలో నుండి గెంటివేస్తుంటాం. పిశాచానికి హృదయంలో ప్రవేశం కలిగిస్తుంటాం. ఈలా తన విరోధికి స్థానమిచ్చి తన్ను ఇంటిలోనుండి తరిమివేసిన అవివేకపు బిడ్డలనుజూచి ఈయాత్మ తల్లిలా బాధపడుతుంది. దుఃఖిస్తుంది. పైగా తాను పవిత్రాత్మ కావున, అపవిత్రమైన పిశాచాన్ని పాపాన్ని ఎంతమాత్రం సహింపలేదు.

ఇంకా హృదయంలోని ఆత్మను ఆర్పివేయకూడదు - 1 తెస్స 5,19. ఆత్మ మన అంతరాత్మలో వెలుగులా ప్రకాశిస్తుంది అన్నాం. మనం ఏపని చేయాలో ఏపని మానుకోవాలో తెలియజేస్తుంది అన్నాం. కాని మనం అంతరాత్మ ప్రకారం ప్రవర్తించనపుడెల్ల బుద్ధిపూర్వకంగా చెడుత్రోవలు త్రొక్కినపుడెల్ల హృదయంలో వెలిగే యీ వెలుగును ఆర్పివేస్తుంటాం. గృహిణి దీపాన్ని ఆర్పివేసినట్లుగా, హృదయంలోని ఈ దీపాన్ని గుప్పున ఆర్పివేస్తుంటాం. ఇంతకన్న అవివేకం మరొకటుండదు.

ఈలా హృదయంలోని ఆత్మను ఆర్పివేసినవాళ్ళు, ఆత్మలో నెలకొనివున్న ఆత్మను దుఃఖపెట్టి వెళ్లగొట్టినవాళ్లు, తల్లిలేని బిడ్డల్లా చెడిపోతారు. తల్లిలేని పిల్లలు దిక్కుమొక్కులేక బావురుమంటుంటారు. ఆత్మనుపోగొట్టుకున్న క్రైస్తవులూ ఆధ్యాత్మిక జీవితం జీవింపలేక అలమటించి కృశించి నశించిపోతారు. ఈ దీనావస్థ మనకు ప్రాప్తించకుండా వుండాలని ఆయాత్మనే మనవి చేసుకుందాం.

## 31. పరిశుద్ధాత్మ సహవాసం - 2 కొ 13,14

"పరిశుద్ధాత్మ సహవాసం మీతో వుండాలి" అని దీవిస్తూ రెండవ కొరింతీయుల జాబును ముగించాడు పౌలు. క్రీస్తు జీవించినపుడు శిష్యులంతా ప్రభువుతో కూడిమాడి జీవించారు. వాళ్లంతా ఓ చిన్న సమాజంగా ఏర్పడ్డారు. ఇక, క్రీస్తు ఉత్థాన అనంతరం వేంచేసివచ్చిన ఆత్మ ఈ సమాజం విచ్ఛినమై పోకుండా కాపాడింది. రోజురోజుకు ఈ సామాజాన్ని వృద్ధిచేస్తువచ్చింది. ఈలా వృద్ధిపొందిన సమాజమే నేటి తిరుసభ.

పరిశుద్ధాత్మ మనతోను మనం పరిశుద్ధాత్మతోను వసిస్తూవుండడంవల్లనే వృద్ధిచెందుతూన్నాం. క్రైస్తవులమైన మనమందరం ఐక్యభావంతో జీవింపగలుగుతూన్నాం. ఒకరినొకరం అంగీకరించి ఆదరించి ప్రేమింపగలుగుతున్నాం. పరిశుద్ధాత్మ సహవాసమంటే యిదే.

# 5. అపోస్తలుల చర్యలు - పరిశుద్ధాత్మ

## ఉపోద్ఘాతం

పరిశుద్ధాత్మ తొలినాటి క్రైస్తవ సమాజాన్ని నడిపించిన విధానాన్ని గూర్చి అపోస్తలుల చర్యల గ్రంథంలో చదువుతూన్నాం. ఆత్మ యీనాటి క్రైస్తవులనూ, విశేషంగా మఠ జీవితంద్వారా తమ జీవితాన్ని క్రీస్తునకు అంకితం జేసికున్న స్త్రీ పురుషులనూ, నడిపిస్తూనేవుంటుంది. కనుక ప్రస్తుతం మనం చూచే అంశం, ఆత్మచేత నడిపింపబడ్డం.

## 1. క్రీస్తు వాగ్ధానం

క్రీస్తు ఉత్థానమై మోక్షానికి వెళ్ళిపోతూ, తండ్రి వాగ్దానమైన ఆత్మను పొందిందాక యెరూషలేమును వీడిపోవద్దని శిష్యులను ఆజ్ఞాపించాడు - అ. చ. 1,4. అందుచేత శిష్యులు ఆ యాత్మకోసం ఎదురుచూస్తూ, యెరూషలేములో వుండిపోయారు. ఉత్థానక్రీస్తు ఇకమీదట తన యాత్మ ద్వారాగాని శిష్యులతో సంబంధం పెట్టుకోడు. ఆత్మద్వారాగాని భూమిమీద తాను ప్రారంభించిన రక్షణకార్యాన్ని కొనసాగించడు. అందుచేతనే ఈ యాత్మకు "క్రీస్తుఆత్మ" అనిపేరు -16.7. శిష్యులు ఈ యాత్మ యందు గాని జ్ఞానస్నానం పొందరు -1, 5. అనగా ఆత్మ దిగిరావడమే వాళ్ళజ్ఞానస్నానం. ఆత్మద్వారానే శిష్యులు శక్తినిపొంది క్రీస్తుకు సాక్షులౌతారు - 1,8.

## 2. ఆత్మ దిగిరావడం

శిష్యుల మీదకు ఆత్మ దిగివచ్చినపుడు బలమైన గాలి వీచింది. నిప్పు నాలుకలు కనుపించాయి. సీనాయి పర్వతంమీద ప్రభువు దిగివచ్చి మోషేతో నిబంధనం చేసికున్నపుడు నిప్పులు గాలి కనుపించాయి - ద్వితీ 4,11 -12. ఇక్కడ మళ్లా దేవుడు ప్రజలతో మరో నిబంధనం చేసికుంటున్నాడు. ఇది క్రొత్త నిబంధనం. భగవంతుడు ప్రత్యక్ష మయ్యేప్పుడు గాలి, నిప్పులు, మబ్బులు కనుపించాయని చెప్పడం బైబుల్లోని ఓరచనా ప్రక్రియ. ఇక, యిక్కడ గాలి దేనికంటే, ఆత్మ పేరు హీబ్రూ భాషలో "రూవాః". ఈ రూవాః అనేశబ్దానికి గాలి అనే అర్థం. కనుక తన పేరునకు తగినట్లుగా ఆత్మ గాలిరూపంలో ప్రత్యక్షమైంది. ఇక నిప్పు నాలుకలు దేనికంటే, ప్రాచీన క్రైస్తవ సమాజంలో ఆత్మను పొందినవాళ్లంతా

అన్యభాషల్లో మాటలాడి ప్రభువును స్తుతించేవాళ్లు. శిష్యులూ ఆలాగే స్తుతించారు - 2,4. కనుక నాలుకలు భాషలకు చిహ్నం.

ఆత్మ దిగివచ్చిన యీ సంఘటనకు 400 సంవత్సరాలకు ముందే యోవేలు అనే ప్రవక్త "అంత్య దినాల్లో నరులందరి మీద నా యాత్మను కుమ్మరిస్తాను, నా దాసులు దాసురాళ్లు ప్రవచనం చెప్తారు" అని పలికాడు - అ.చ. 2.16-18. అతని ప్రవచనం ప్రకారమే ఆత్మ దిగివచ్చింది. ఈ యాత్మ యెవరోకాదు. క్రీస్తు తాను పొందిన ఆత్మే. ప్రవక్తలద్వారా తండ్రి వాగ్దానం చేసిన ఆత్మను క్రీస్తు మొదట తాను పొందాడు. ఆపిమ్మట తాను పొందిన ఆత్మను శిష్యుల మీదా కుమ్మరించాడు - 2, 33. పాపాలకోసం పశ్చాత్తాపపడి మారుమనసు పొంది, క్రీస్తు పేరుమీదిగా జ్ఞానస్నానం పొందేవాళ్లంతా ఈయాత్మను పొందుతారు - 2, 38-39. మనమూ జ్ఞానస్నాన సమయంలోనే ఈ యాత్మను పొందాం.

## 3. తొలి సమాజం ఆత్మతో నిండుకొని వుండేది

యెరూషలేములోని తొలి క్రైస్తవ సమాజం ఆత్మతో నిండుకొనివుండేది. దాని ఫలితంగా వాళ్ళు ఏక మనస్కులై ఏకంగా కూడివుండేవాళ్ళు. ఓ విధమైన సామాజిక జీవితం జీవించేవాళ్ళు. ఆస్తిని సమష్టిగా వాడుకునేవాళ్ళు. దేవాలయానికివెళ్లి ప్రార్థనం చేసికునేవాళ్ళు. దివ్యసత్రప్రసాదంలో పాల్గొనేవాళ్ళు. క్రీస్తు ఉత్థానానికి సాక్ష్యంగా వుండేవాళ్ళు. అపోస్తలుల చర్యల గ్రంథం రెండు పట్టుల్లో ఈ సమాజిక జీవితాన్ని స్పష్టంగా వర్ణిస్తుంది -2. 43-17. 4, 32-37.

ఈ సామాజిక జీవితానికి వ్యతిరేకంగా పోయినవాళ్ళు ఆత్మకు వ్యతిరేకంగా పోయినట్లే. అందుకే సమాజపు పెద్దయైన పేత్రును మోసంజేసిన అననీయ ఆత్మనే మోసంజేసాదని చెప్పబడింది - 5. 3. పేత్రును శోధించిన అననీయ భార్య సఫీరా పరిశుద్ధాత్మనే మోసం జేసినట్లు నుడువబడింది - 5,9.

## 4. అపోస్తలులు క్రీస్తునకు సాక్షులుగా నిలిచారు

ఆత్మ అపోస్తలులచేత క్రీస్తుకు సాక్ష్యం ఇప్పించింది. పేత్రు అద్భుతంగా కుంటివాణ్ణి నడిపించాడు. అది చూచి యూదుల ఆచార్యులు అసూయపడి పేత్రును యోహానును వారి మహాసభయెదుటకు పిలిపించారు. ఇంతకుముందు పనిపిల్లకు

భయపడిపోయిన పేత్రు ఇప్పుడు మహాసభయెదుట ధైర్యంగా నిలిచి క్రీస్తునామం మీదుగానే ఈ యద్భుతాన్ని చేసానని సాక్ష్యంబలికాడు - 4,8. ఆపిమ్మట ఈ సంఘటనను పురస్కరించుకొని క్రైస్తవసమాజంవాళ్లంతా ఓతావులో గుమిగూడి ప్రార్థనంచేసారు. ఆత్మవాళ్లున్న తావు కంపించేలాచేసింది. అటుపిమ్మట శిష్యులు ఆత్మ శక్తివల్ల క్రీస్తునుగూర్చి ధైర్యంగా బోధింపసాగారు 4,31. అటుతరువాత అపోస్తలులు చేసే అద్భుతాలు చూచి కన్నుగుట్టి మహాసభవాళ్లు మళ్లా పేత్రు మొదలైన నాయకులను పిలిపించారు. అపుడు పేత్రు "మేము మనుష్యులకుగాక దేవునికి లోబడాలి. మేమూ పరిశుద్ధాత్మ క్రీస్తు ఉత్థానానికి సాక్షులంగా వున్నాము" అని చెప్పాడు -- 5, 32.

శిష్యులు నానాభాషల్లో మాటలాడ్డంద్వారా, ప్రవచనం చెప్పడం ద్వారా క్రీస్తుకు సాక్షంగానిలచారు. కాని యివిరెండు ఆత్మ యిచ్చిన వరాలే. కనుక ఆత్మే వాళ్లను సాక్షులనుగాజేసింది అనాలి. అపోస్తలులు అన్యభాషల్లో మాటలాడారు - 2,6. అలాగే ఎఫేసులోని శిష్యులూ అన్యభాషల్లో మాటలాడారు - 19,6. అగబు ప్రవక్త యెరూషలేములో రాబోయే కరవును ముందుగానే ప్రవచనంద్వార సూచించాడు - 11,28. పౌలును యెరూషలేములో బంధిస్తారనీ అతడక్కడ శ్రమలనుభవిస్తాడనీ ముందుగానే యెరింగించాడు - 21,11.

పైగా ఆత్మ ఆ తొలినాటి పాలస్తీనాదేశంలోని క్రైస్తవసమాజానికి ఆదరణనిచ్చింది - 9,31. అంతియోకయలోని క్రైస్తవులకు ఆనందాన్ని అనుగ్రహించింది - 13,52. క్రీస్తు సందేశాన్ని ప్రతిఘటించినవాళ్లు ఆత్మను ప్రతిఘటించినట్లుగానే భావింపబడతారు. అందుకే స్తెఫను తన విరోధులనుజూచి "మీరు పరిశుద్ధాత్మను ఎదిరిస్తున్నారు" అని నిందించాడు - 7,51.

## 5. సమాజ నాయకులు ఆత్మతో నిండుకొని వుండేవాళ్లు

తొలిసమాజంలోని నాయకులందరు ఆత్మతో నిండుకొనివున్నవాళ్లే. సంఘపెద్దలుగా వ్యవహరించిన డీకనులు లేక పరిచారకులు ఈలా ఆత్మతో నిండుకొనినవాళ్లే - 6, 3,5. స్తెఫను ఆత్మచేత నిండుకొనినవాడై వేదసాక్షి మరణానికి సంసిద్ధుడయ్యాడు - 7.55. పౌలు స్నేహితుడైన బర్నబా ఆత్మతో నిండుకొనిన సత్పురుషుడు - 11,24. పౌలుకూడ జ్ఞానస్నానం పొందినవెంటనే ఆత్మచేత నింపబడ్డాడు - 9,17. ఈలా ఆత్మచేత నింపబడినవాళ్లు గనుకనే, ఈ నాయకులు ఆ తొలిరోజుల్లో అంతకృషి చేయగలిగారు.

## 6. ఆత్మ ప్రేషితులను నడిపించింది

ఆత్మ ప్రేషితులను ప్రేషితకార్యానికి నడపించుకొని పోతుంది. ఫిలిప్పును ఇతియోపీయుని యొద్దకు నడపించుకొని పోయింది-8,29. ఇతియోపీయుడు క్రీస్తును అంగీకరించి జ్ఞానస్నానంపొందాక ఫిలిప్పును మళ్ల ఆజోతుపట్టణానికి తీసికొనివెళ్లింది-8,39. ఆలాగే పేత్రుని కొర్నేలియొద్దకు నడిపించుకొని పోయింది - 10,19;11,12.

ఆత్మ అంతియోకయ సమాజంనుండి సౌలును బర్నబాను తన పనికోసం ప్రత్యేకపరచుకొని మొదట ప్రేషిత ప్రయాణానికి తీసికొని పోయింది - 13,2-4. రెండవ ప్రేషిత ప్రయాణంలో పౌలును బితూనియా ఆసియారాష్ట్రాల్లో వాక్యం బోధింపనీయలేదు. నేరుగా మాసెడోనియాకు నడిపించుకొనివెళ్లింది - 16, 6-7. పౌలు మూడవప్రేషిత ప్రయాణంలో వుండగా యెరూషలేములో బాధలు శ్రమలు అతనికోసం కాచుకొనివున్నాయని ముందుగానే యెరుకపరచింది - 20, 22-23.

యెరూషలేము మహాసభలో, గ్రీకు క్రైస్తవులు మోషే యిచ్చిన ధర్మశాస్త్రాన్ని పాటించనక్కరలేదని నిర్ణయాన్ని చేయించిందిగూడ ఈ యాత్మే - 15,29. ఎఫేసు శ్రీసభకు పెద్దలను నిర్ణయించిందీ ఆత్మే-20,28 ఈలా ఆత్మ తొలినాటి క్రైస్తవులను ప్రేషితకార్యానికి నడపించుకొనిపోయేది. వారికి త్రోవచూపించేది. నిర్ణయాలు చేసిపెట్టేది.

## 7. తొలిసమాజంలోని అవకతవకలు

తొలినాటి క్రైస్తవసమాజాన్ని ఆత్మే నడపించిందన్నాం. ఐనా ఆ సమాజంలోగూడ చాల అవకతవకలుండేవి. విశేషంగా తగాదాలుండేవి. హెబ్రేయ యూదులు గ్రీకుమాటలాడే యూదుల విధవలను చిన్నచూపుచూచారు. వాళ్లను అన్నంవడ్డించడం మొదలైన పరిచర్యల్లో పాల్గొననీయలేదు. అందుచేత ఓ తగాదా వచ్చింది. పేత్రు ఈ తగాదాను పరిష్కరించి సమాజపరిచర్యకై డీకనులను నియోగించాడు -6,1.

అననీయ సఫీరా పొలం అమ్ముకొని, డబ్బుమిగుల్చుకొని పేత్రునెదుట బొంకులాడారు. దానిఫలితాన్ని వెంటనే అనుభవించారు -5,3. 9. మార్కును వెంటతీసుకొని వెళ్లాలా వద్దా అన్న అంశంపై రెండవ ప్రేషితప్రయాణంలో పౌలు బర్నబా తీవ్రంగా పోట్లాడుకొన్నారు. ఆ పిమ్మట వాళ్లిద్దరూ మళ్లా ఒకరితోనొకరు కలువలేదు. ఎవరిత్రోవనవాళ్లు వెళ్లిపోయారు - 15,39.

గ్రీకు క్రైస్తవులు కూడ యూదుల ధర్మశాస్త్రాచారాలను పాటించాలి అన్నారు యాకోబు పేత్రు మొదలైన యెరూషలేము పెద్దలు పాటించనక్కరలేదన్నారు పౌలుమొదలైన అంతియోకయ పెద్దలు. ఈ యంశంపై పౌలు పేత్రు పోట్లాడుకున్నారు. దానిని పురస్కరించుకొనే మొదటి యెరూషలేము మహాసభ జరిగింది - అచ 15. ఈ పోట్లాటలో పౌలుకు పేత్రే తగ్గిపోయాడు - గల 2,11-12.

మానవుల బలహీనతలు ఈలాగుంటాయి. పరిశుద్ధాత్మ నరులకు సహాయంచేస్తుంది. కాని నరుల బలహీనతలన్నీ ఒక్క క్షణంలో రూపుమాపదు.

## 8. అన్వయం

ఇంతవరకు పరిశుద్ధాత్మ తొలినాటిశిష్యులను ఏలానడిపిందో వివరించాం. ఇక, యీ సత్యాలు మన జీవితానికి ఏలా అన్వయిస్తాయో విచారించి చూద్దాం.

1. తొలినాటి యెరూషలేం సమాజం ఆత్మతో నిండుకొని వుండేది. ఆత్మ అనుగ్రహంవల్ల వాళ్లు సమష్టిగా సమాజ జీవితం జీవించేవాళ్లు. ఏక మనస్కులై వుండేవాళ్లు. ఆరాధనలో ప్రార్థనలో పాల్గొనేవాళ్లు. నేడు మనక్రైస్తవ జీవితంలో గూడ ఆత్మ ఈ యానుగ్రహాలను ప్రసాదిస్తువుందా? క్రైస్తవ జీవితం ప్రధానంగా సామాజిక జీవితం అన్న అంశాన్ని మనం గుర్తిస్తున్నామా?
2. ఆత్మ ప్రేషితులను క్రీస్తునకు సాక్షులనుగా జేసింది. వాళ్లూ తమ బోధలవల్ల, బాధలవల్ల, ధైర్యప్రవర్తనంవల్ల, ప్రార్థనవల్ల, సోదరప్రేమవల్ల, క్రీస్తుకు సాక్ష్యంగా నిలచారు. నేడు మనమూ క్రైస్తవ జీవితం జీవిస్తూ క్రీస్తు తరపున ప్రపంచానికి సాక్ష్యంగా వుంటున్నామా?
3. తొలి సమాజంలోని నాయకులు ఆత్మతో నిండుకొనివుండేవాళ్లు. నేటి మన సమాజాల్లోని పెద్దలు ఈలా ఆత్మతో నిండుకొని వుంటున్నారా? అసలు మన పెద్దలు ఆత్మ ద్వారా అధికారంలోకి వస్తున్నారా? ఆత్మయందు అధికారం నెరుపుతూన్నారా? - 20,28.
4. ఆత్మ తొలినాటి క్రైస్తవులను ప్రేషిత కార్యానికి నడిపించుకొని పోయింది. నేడు మనం పాల్గొనే వివిధ ప్రేషిత రంగాల్లో ఆత్మచే నడిపింప బడుతూన్నామా? ఈ కాలానికి తగినట్లుగా క్రొత్తక్రొత్త ప్రేషిత కార్యాలు ప్రారంభిస్తున్నామా?

5. "దేవుని బిడ్డలు దేవుని యాత్మచే నడిపింపబడతారు" - రోమా 8,14. మనం కూడ ఈలా నడిపింపబడుతున్నామని అనుభవపూర్వకంగా చెప్పగలమా?

6. యెరూషలేము మహాసభలో ఆత్మ ప్రేషితులకు నిర్ణయాలు చేసిపెట్టింది. మన జీవితంలో ఆత్మ యేమైన నిర్ణయాలు చేసిపెట్టిందా? అసలు మనకు కష్టాల్లోను చిక్కుల్లోను ఆత్మను సంప్రతించే అలవాటు అంటూ వుందా?

7. తొలినాటి క్రైస్తవ సమాజాలకు ఆత్మ ఆదరణను ఆనందాన్ని ఇస్తూ వుండేది - 9,31; 13, 52. మనకూ క్రైస్తవ జీవితంలో ఆత్మ యథార్థమైన ఆనందాన్ని సంతృప్తిని ఉత్సాహాన్నీ అనుగ్రహిస్తుందా?

8. ఆత్మ చేత నడిపింపబడిన తొలినాటి క్రైస్తవ సమాజంలోనే అవకతవకలు ఉండేవి అన్నాం. ఇక మన సమాజాల్లోని అవకతవకలను ఆయా వ్యక్తుల బలహీనతలను జూచి నిరుత్సాహపడుతూండాలా?

9. పౌలు ఎఫేసీయులను జూచి "మీరు ఆత్మను పొందారా" అని అడిగాడు. ఈ ప్రశ్నే మనల నడిగితే ఏంసమాధానం చెప్పగలం? 19,1. ఆత్మ అనుగ్రహించే ఫలాలను మనం అనుభవిస్తున్నామా? - గల 5,22.

# 6. పాపపుణ్యాలూ

## మనవిమాట

ఈ గ్రంథంలోని విషయాలను పూర్వమే బైబులు భాష్యం 60,64,65 సంచికల్లో ప్రచురించాం. దీనిలో పాపాలు, పుణ్యాలు అనే అంశాలున్నాయి.

పూర్వ క్రైస్తవులు ఈ పాపపుణ్యాలను ఘనంగా యెంచేవాళ్లు. ఆధ్యాత్మిక జీవితంలో వీటి ప్రాముఖ్యాన్ని గూర్చి పదేపదే ఆలోచించి చూచుకొనేవాళ్ళు. సంసారజీవితం గడిపే నేటి క్రైస్తవులకు గూడ ఈ పాపపుణ్యాలను గూర్చిన పరిజ్ఞానం ఎంతైనా అవసరం.

## విషయ సూచిక

# 1. ఏడు మూలపాపాలు

## 1. గర్వం

ఆదాము పాపంవల్ల మన మనుష్యస్వభావం గాయపడి దెబ్బతింది. నరులందరిలోను పాపాభిలాష పెరిగింది. ఈ పాపాభిలాషనుగూర్చి చెప్తూ యోహాను "ఈ లోకంలో వున్నదంతా శారీరక వ్యామోహం, నేత్ర వ్యామోహం, జీవితం నందలి అహంభావం" అని చెప్పాడు - 1యోహా 2,16. ఈ యహంభావం నుండి అసూయ, కోపం, పొగడ్తలపట్ల ప్రీతి మొదలైన దుర్గుణాలు పుట్టుకవస్తాయి. శారీరక వ్యామోహం నుండి భోజన ప్రియత్వం, కామం, సోమరితనం మొదలైనవి పుడతాయి. నేత్రవ్యామోహంనుండి దురాశ పుడుతుంది. ఈ విధంగా మూలపాపాలు ఏడు మన హృదయంలో చోటు చేసికొంటాయి. ఈ మూల పాపాలనుండి చాల యితర పాపాలు కూడ పుట్టుక వస్తాయి. ఇక, యీ మూలపాపాలను క్రమంగా పరిశీలిద్దాం.

### 1. గర్వం అంటే ఏమిటి?

నరుల్లో అధికంగా కన్పించే దుర్గుణం గర్వం. లోకంలో గర్వాత్ములు కానివాళ్ళు అరుదు. నరుడు తన్నుతాను మితంమీరి ప్రేమించుకోవడమే గర్వం. ఈ గర్వంవల్ల మనకు మనమే సృష్టికర్తలం అన్నట్లు భావిస్తాం. మన గమ్యం కూడ మనమే అన్నట్లు ఎంచుతాం. మన సృష్టికర్త, మనం చేరవలసిన తీరం దేవుడేనని గ్రహించం. ప్రతి నరుడు కూడ గాలి పీల్చినంత సహజంగా తన్ను తాను ప్రేమించుకొంటాడు. కాని ఈ స్వీయ ప్రేమకు హద్దులుండాలి. లేకపోతే అది పొగరైపోతుంది.

గర్వం విశేషంగా రెండు రూపాల్లో కన్పిస్తుంది. మొదటిది, మనకు మనమే సృష్టికర్తలం అన్నట్లుగా భావిస్తాం అని చెప్పాం. రెండవది, మన గమ్యం మనమే అన్నట్లు తలుస్తాం అని చెప్పాం. ఈ రెండంశాలను కొంచెం విపులంగా పరిశీలిద్దాం.

### 1) మనకు మనమే సృష్టికర్తలమా?

ప్రత్యక్షంగా తమకు తామే సృష్టికర్తలమనుకొనేవాళ్ళు తక్కువే. నాస్తికులు ఈలా భావిస్తారు. వాళ్ళు దేవుణ్ణి నిరాకరిస్తారు. "మూర్ఖుడు దేవుడు లేడులే అని ఎంచుతాడు" - కీర్త 14,1. పిశాచంకూడ దేవుని అధికారాన్ని నిరాకరించింది. అలాగే ఆది దంపతులుకూడ తాము పాపం చేసినప్పుడు దేవుని అధికారాన్ని ధిక్కరించారు. కొందరు హేతువాదులు కూడ దేవుణ్ణి నిరాకరిస్తారు. ఈలాంటి వాళ్ళంతా తమకు తామే సృష్టికర్తల మనుకొంటారు.

చాలమంది ప్రత్యక్షంగా కాదుగాని, పరోక్షంగా తమకు తామే సృష్టికర్తల మనుకొంటారు. అనగా వీళ్ళు తమలోని మేలిగుణాలకు తమ్ము తామే స్తుతించుకొంటారు. ఆ గుణాలను తామే స్వయంగా కృషిచేసి సాధించామనుకొంటారు. తాము దేవునిమీద ఆధారపడి జీవిస్తున్నాం అన్న సంగతి మర్చిపోతారు. మోషే "మీరు ఏనాడు కూడ మా శక్తితోనే మేము సంపన్నుల మయ్యాం అని భావించవద్దు" అని చెప్పాడు - ద్వితీ 8,17. ఈ సత్యాన్ని వీళ్లు మర్చిపోతారు. తమ్ముతాము అతిగా పొగడుకొనేవాళ్ళంతా యీ వర్గంవాళ్ళే.

ఇంకా కొందరు తమ మేలిగుణాలను పెద్దజేసి చూపిస్తుంటారు. అతిశయోక్తులు పలుకుతుంటారు. కొంచెం దానంజేసి తామేమో గొప్ప దాతలైపోయినట్లుగా భావిస్తారు. తామే నీతిమంతులమనుకొని ఇతరులను చిన్నచూపు చూస్తారు.

కాని మనకు మనం ఏనాడూ సృష్టికర్తంలగాము. మనలోని మేలిగుణాలకు మనం కర్తలంగాము. మనకున్నవన్నీ దేవుడిచ్చినవే. కనుక మనం నిరంతరమూ అతనిమీద ఆధారపడి జీవించాలి.

### 2) మన గమ్యం మనమేనా?

చాలమంది తమకుతామే గమ్యమన్నట్లుగా ఊహిస్తారు. తమ కార్యాలనూ విజయాలనూ తామే స్వయంగా సాధించామన్నట్లుగా మాట్లాడుతారు. దైవ సహాయాన్ని గుర్తించరు. తమ విజయాలకుగాను ప్రజలు తమ్ము పొగడాలని కోరుకొంటారు. స్వార్థంతో అందరిదృష్టిని తమవైపు ఆకర్షించుకోబోతారు. ప్రజలు దేవునిదగ్గరికి గాక తమ దగ్గరికి రావాలని కోరుకొంటారు. ఇంకా కొందరు ఆధ్యాత్మికంగా తాము పొందిన వరాలను తామే స్వయంగా సాధించినట్లుగా ఎంచుతారు. తమ పుణ్యానికి తామే కారకులమనీ, ఆ పుణ్యానికి దేవుడు తమకు తప్పకుండా మోక్షభాగ్యం దయచేయాలనీ భావిస్తారు.

కాని దేవుడొక్కడే తనకుతాను గమ్యం. మనకు మనం గమ్యం కాము. ఈ లోకంలో మనకొరకు మనం లేము. మన గమ్యమూ, మనం చేరవలసిన రేవూ, ఆ భగవంతుడే.

పై సంగతులను పరిశీలిస్తే మనలో వినయం తక్కువనీ గర్వం ఎక్కువనీ తేలుతుంది. మనమందరమూ ఎప్పుడూ, ఏదో వొకరూపంలో గర్వాన్ని ప్రదర్శిస్తూనే వుంటాం. అందుకే గర్వాత్ములు కానివాళ్ళు చాల అరుదని చెప్పాం.

## 2. గర్వం నుండి పుట్టే కొన్ని దుర్గుణాలు

అరటి చెట్టునుండి పిలకల్లాగ, గర్వంనుండి చాల దుర్గుణాలు పుట్టుకవస్తాయి. ప్రస్తుతానికి ఓ మూడింటిని మాత్రం పరిశీలిద్దాం. మొదటిది, అతి సాహసం. ఈ గుణం

కలవాళ్ళు తమ శక్తికి మించి కార్యాన్ని సాధించగలమని భావిస్తారు. అనగా వీళ్ళు తమ్మతాము అతి ఘనంగా అంచనా వేసికొంటారు. కొందరు తమకు చేతగానిపని చేయబోయి వెల్లకిల బడతారు. మరికొందరు తాము చాల తెలివైన వాళ్ళమని తలుస్తారు. తాము పొరపాటుపడవచ్చునని సందేహించనే సందేహించరు. ఇంకాకొందరు మంచిచెడ్డలన్నీ తమకే తెలుసు అనుకొంటారు. ఇతరులను సంప్రతించనే సంప్రతించరు. కడన పప్పులో కాలువేస్తారు. వేరుకొందరు తాము చాలా పుణ్యాత్ములం అనుకొంటారు. కాని లోకం వాళ్ళ బలహీనతలను నిత్యం గమనిస్తూనే వుంటుంది.

రెండవది, కీర్తి కాంక్ష. దీనివల్ల మనం పదవి, పలుకుబడి, గొప్పపేరు మొదలైన వాటిని ఆశిస్తాం. ప్రతి నరుల్లోను ఈ కోరికలు కొంతవరకైనా వుంటాయి. రాజకీయాలు కీర్తికాంక్షలమీదనే ఆధారపడివుంటాయి. చాలమందికి జీవితధ్యేయం కీర్తే. ఆ మాటకొస్తే తిరుసభలోని అధికారుల్లోను ఈ దుర్గుణం అరుదేమి కాదు. ఈ యవలక్షణం వల్ల మనం మన తాహతును మించి కీర్తిని పొందాలని కోరుకొంటాం. దేవుని మహిమ కొరకు గాక మన మహిమకొరకే దాన్ని సంపాదించాలని అభిలషిస్తాం. ఇతరులకు రావలసిన కీర్తిని గూడ మనమే దక్కించుకో జూస్తాం.

మూడవది, ఇతరుల పొగడ్తలకు అఱ్ఱులు చాచడం. ఈ దుర్గుణం కలవాళ్ళు జనులు దేవునికంటెగూడ తమ్ము అధికంగా పొగడాలని కోరుకొంటారు. కొందరు తమ రూపాన్నీ అలంకరణనూ దుస్తులనూ చూచి లోకం తమ్ము కొనియాడాలని కోరుకొంటారు. ఇంకా కొందరు తమ శక్తిసామర్థ్యాలనూ ఉద్యోగాన్నీ, ధనాన్నీ, పెద్దకులాన్నీ చూచి ఇతరులు తమ్ము మెచ్చుకోవాలని అభిలషిస్తారు. వేరుకొందరు తాము సాధించిన విజయాలకు జనులు తమ్ము పొగడాలని ఉబలాటపడతారు. ఇవన్నీ అవివేకపు కోరికలని వేరుగా చెప్పనక్కరలేదు. ఈ పొగడ్తమీది ప్రీతివలననే ప్రజలు తమ్ముగూర్చి తాము గొప్పలు చెప్పుకొంటారు. ఇతరులు మమ్ము మెచ్చుకోకపోతే మమ్ము మేమే మెచ్చుకొంటాం అన్నట్లుగా ప్రవర్తిస్తారు. నటన చేస్తారు. వేషాలు వేస్తారు. అనగా తాము యథార్థంగా వున్నదానికంటె గొప్పవాళ్ళుగా కన్పించి ఇతరుల ప్రశంశలు అందుకోవాలని చూస్తుంటారు. ఈ తాపత్రయాలకు అంతే లేదు.

## 3. గర్వంలోని దుష్టత్వం

అన్ని పాపాలకంటె గర్వం గొప్పది. ఎందుకంటే గర్వంవలన దేవునికి ఎదురుతిరుగుతాం. దేవుని నుండి పొందిన లాభాలను మనమే స్వయంగా సాధించినట్లుగా భావిస్తాం. మన గమ్యం కూడ మనమే అన్నట్లుగా ఎంచుతాం. వేదాంతి తోమాసు అక్వినాసు చెప్పినట్లుగా, అన్ని పాపాలు దేవునినుండి పారిపోజూస్తాయి. కాని ఈ పాపం మాత్రం దేవుణ్ణి ఎదురిస్తుంది. కనుక పూర్ణగర్వం ఎప్పుడు కూడ చావైన పాపమౌతుంది.

ఐనా పూర్ణగర్వాత్ములు అరుదు. మనబోటి వాళ్ళం దరిలో మదం ఒక మోస్తరుగా వుంటుంది. మనం దేవుణ్ణి అంగీకరిస్తాం. అతడు మనకు సృష్టికర్త అనీ, మనం చేరవలసినతీరం అనీ ఒప్పుకొంటాం. కాని అతనికి చెందవలసిన కీర్తి మహిమలను మాత్రం మనకు ఆరోపించుకొంటాం. ఈలాంటి గర్వం తరచుగా స్వల్పపాప మౌతుంది.

గర్వం వలన ఎన్నో దుష్ఫలితాలు కలుగుతాయి. భగవంతుడు గర్వాత్ముణ్ణి అసహ్యించుకొంటాడు. అతనికి తన వరప్రసాదాలు ఈయడు. "దేవుడు అహంకారులను ఎదిరించి వినమ్రులకు తన కృపను దయచేస్తాడు" - యాకో 4,6. అహంభావం కలవాళ్ళు తరచుగా ఇతరుల పొగడ్తల కోసం తమ కార్యాలు చేస్తారు. దానివల్లకూడ వాళ్ళు వరప్రసాదాన్ని కోల్పోతారు. "పదుగురికంటబడ్డానికై మీరు మీ మతకర్మల్ని బహిరంగంగా చేయవద్దు. అలాచేస్తే పరలోకంలోని మీ పితనుండి ఏలాంటి బహుమానమూ పొందలేరు" - మత్త 6,1. ఇంకా గర్వాత్ములు తోడిజనాన్ని అనాదరం జేస్తారు, విమర్శిస్తారు. అణచివేస్తారు. కనుక సోదరప్రేమను భగ్నం జేస్తారు. దీనివల్ల వైరమూ ద్వేషమూ తగాదాలూ పెరుగుతాయి. పైపెచ్చు గర్వితులు మనశ్శాంతిని కోల్పోతారు. వాళ్ళు ఇతరులను ఓడించి తాము అందరికంటె పై చేయిగా వుండాలని కోరుకొంటారు. కాని తాము అనుకొన్నంత సులభంగా యితరులను ఓడించలేరు. అందువల్ల నిరుత్సాహనికీ మానసిక వ్యధకూ గురౌతుంటారు. ఈలా గర్వం వలన కలిగే అనర్థాలు చాలా వున్నాయి.

అహంకారమంటే నరుడు తన్నుతాను పూజించుకొనడం, తనకు తాను దేవుడు కావడం. దీనిని బట్టే గర్వంలో ఎంత దుష్టత్వముందో ఊహించుకోవచ్చు.

## 4. బైబులు దృష్టాంతాలు

1. గర్వానికి మొదటి ఉదాహరణం ఆదామే. అతడు నరమాత్రుడై యుండికూడ తాను దేవుడు కావాలని కోరుకొన్నాడు - ఆది 3,5. ఈ పాపానికి పరిహారం చేయడానికే క్రీస్తు తన దైవత్వాన్ని వదులుకొనేటంతగా వినయవంతుడయ్యాడు - ఫిలి 2,6-8.

2. ఐగుప్తురాజు ఫరో అహంకారానికి పెట్టింది పేరు. మోషే ఫరోతో నీవు మా జనాన్ని పంపివేయాలి. ఇది మా దేవుడైన యావే ఆదేశం అని చెప్పాడు. ఆ మాటకు ఫరో మండిపడి ఎవడా యావే? అతడు చెప్పినట్లుగా నేనెందుకు మీ జనాన్ని పంపాలి అన్నాడు - నిర్గ 5,1-2.

3. ఆదిమానవులు అహంకారంతో ఆకాశాన్నంటే గోపురం కట్టి కీర్తి తెచ్చుకోవాలి అనుకొన్నారు. కాని దేవుడు వాళ్ళ భాషను తారుమారుచేసి వాళ్ళకు బుద్ధి చెప్పాడు - ఆది 11,4.

4. హిజ్కీయా గొప్పరాజు. ఒకసారి బాబిలోనురాజు దూతలు అతన్ని చూడ్డానికి వచ్చారు. హిజ్కీయా పొంగిపోయి తన సంపదలనూ కోశాగారాన్ని వాళ్ళకు చూపించాడు. ప్రభువు అతనిమీద కోపించి బాబిలోను ప్రజలు వచ్చి నీవు చూపించిన ఈ సొత్తంతా కొల్లగొట్టుకొని పోతారు అని యెషయాచేత ప్రవచనం చెప్పించాడు - 2రాజు 20,12-17.

5. గొల్యాతు ఫిలిస్తీయుల వీరుడు, మహాగర్వి. అతడు యిస్రాయేలీయులనూ వారు కొల్చే దేవుణ్ణీ తిట్టి దావీదు మీదికి యుద్ధానికి వచ్చాడు. దావీదు "నీవు కత్తి యీటె బాకు గైకొని నా మీదికి వచ్చావు. కాని నేను నీవు నిందించిన యిస్రాయేలీయుల దేవునిపేర నీ మీదికి వస్తున్నాను" అన్నాడు. దైవబలంతో అతడు గొల్యాతును గెల్చాడు -1సమూ 17,45.

6. ఉజ్జీయా తెలివైనరాజు. అతడు మారణ యంత్రాలను కనిపెట్టగా ప్రజలతన్ని పొగడారు. దానితో ఆ రాజు తలతిరిగి దేవుని పీఠంమీద సాంబ్రాణి పొగ వేయబోయాడు. ఇది యాజకులు చేయవలసిన పనికాని రాజు చేయవలసిన పనికాదు అని ఎనభైమంది యాజకులు అతనికి అడ్డం వచ్చారు. కాని అతడు అధికార మదంతో సాంబ్రాణిపొగ వేయడానికి పూనుకొన్నాడు. వెంటనే దైవ శిక్షవల్ల అతని నొసటిమీద కుష్ఠ పుట్టుక వచ్చింది. యాజకులు అతన్ని దేవళం నుండి బయటికి గెంటివేసారు - 2దినవృ 16,16-21.

7. మూడవ హేరోదురాజు వైభవంగా కొలువు తీర్చి ప్రజకు ఉపన్యాస మిచ్చాడు. బంటులు నీవు దేవుళ్లా మాట్లాడావని అతన్ని పొగిడారు. హేరోదు ఆ పొగడ్తకు ఉబ్బిపోయి తాను నిజంగా దేవుణ్ణేనని భావించాడు. ఆరాజు మిడిసిపాటునకు ఓ దేవదూత అతన్ని అక్కడికక్కడే ఘోరంగా శిక్షించాడు. అతడు పురుగులుపడి చచ్చాడు - అచ 12,22-23.

8. ఓ పరిసయుడూ సుంకరీ దేవళానికి వెళ్లారు. సుంకరి వినయంగా ప్రభూ! ఈ పాపిని మన్నించు అని ప్రార్థించాడు. పరిసయుడు గర్వంతో "ప్రభూ! నేను ఈ సుంకరిలాగ పాపిని గాదు, నీతిమంతుణ్ణి. నీకు తెలియందేముంది?" అని ప్రార్థించాడు. దేవుడు సుంకరి మనవిని ఆలించి పరిసయుని వేడికోలును త్రోసిపుచ్చాడు - లూకా 8,10-14.

9. 1) పొగరుబోతుతనం వినాశాన్ని తెచ్చిపెడుతుంది. మిడిసిపాటు పతనానికి దారితీస్తుంది - సామె 26,18.

2) ప్రభువు అధిపతుల్ని ఆసనంనుండి పడత్రోసి దీనులను లేవనెత్తుతాడు - లూకా 1,52.

## 5. గర్వాన్ని జయించే మార్గాలు

ఈ క్రింది ఆలోచనలు అహంభావాన్ని అణచుకోవడానికి ఉపయోగపడతాయి.

### 1) నా గొప్ప యేమీ లేదు

నేను దేవుళ్లాగ స్వయంభువుని కాను. ప్రభువు నన్ను శూన్యం నుండి సృజించాడు. అతడు పట్టు వదలితే నేను మళ్లా శూన్యంలో కలసిపోతాను. నాలోని వూపిరి అతని నుండి అరువుతెచ్చుకొన్నది. నేను దుర్బల ప్రాణిని. వ్యాధిబాధలూ జరామరణాలూ, నన్ను పీడిస్తాయి. నేను నిత్యమూ ప్రభువు మీద ఆధారపడి జీవించవలసినవాణ్ణి. ఐనా నేను అతనికి వందనాలు అర్పించను. పైగా నేనేమో మొనగాణ్ణి అన్నట్లుగా అదిరిపడుతుంటాను. నాకున్న ఆధ్యాత్మిక భాగ్యాలు కూడ దేవుడిచ్చినవే. "నీకున్నదంతా దేవుడే యిచ్చాడు. నీకున్నదంతా దేవుడి దానం కాదని నీవు గర్వించడం తగునా? -1కొ 4,7. అసలు మన పాపాలు తప్పితే మనసొంతం ఏమీ లేదు.

### 2) నాయంతట నేను ఏమీ చేయలేను

దైవ సహాయం లేకపోతే నేను ప్రాకృతిక రంగంలో కాని ఆధ్యాత్మిక రంగంలో కాని ఏమీ చేయలేను. ఐనా నాకున్నవన్నీ నేనే కృషిచేసి సాధించాను అని విర్రవీగుతుంటాను. నా జయాలకు నేనే కారకుడను అనుకొని మిడిసిపడుతుంటాను. ఇంతకంటె గ్రుడ్డితనం ఏముంటుంది?

### 3) నాకు ఏలాంటి విలువ లేదు

ప్రభువు తన నెత్తురోడ్చి నన్ను రక్షించాడు. "అతడు వెలనిచ్చి మిమ్ముకొన్నాడు" - 1కొరి 6,20. క్రీస్తు మనలను రక్షించడంవల్ల మనకు విలువ వచ్చింది. చిత్రకారుడు సుందరమైన చిత్రం గీస్తే గౌరవం చిత్రకారుడికిగాని చిత్రానికిగాదు. ఐనా నేను దేవునికి గౌరవమీయక నాకు నేనే గౌరవాన్ని ఆపాదించుకొంటుంటాను. ఇంతకంటె కృతఘ్నత ఏముంటుంది!

### 4) నేను పాపిని

నేను చేసిన పాపాలు ఎన్నో వున్నాయి. ఈ పాపాల ద్వారా నేను దేవునికి ద్రోహం చేసాను. కనుక ప్రభువు నన్ను శిక్షించి వుండవలసింది. అతని పక్షాన తోడినరులు నన్ను అవమానించి వుండవలసింది. ప్రకృతి శక్తులు నన్ను హింసించి వుండవలసింది. ఐనా నేను సురక్షితంగానే వున్నాను. పునీతులు వాళ్ళ పాపాలు తలంచుకొని యెంతో పశ్చాత్తాపపడ్డారు. కాని నాలో పశ్చాత్తాపభావాలు చాల తక్కువ. ఈలాంటి పాపినైన

నేను ఏలా తలయెత్తుకొని తిరుగగలను? పైపెచ్చు భగవంతుడు నన్ను చాలపాపాలనుండి కాపాడాడు. అతని అను(గ్రహమే లేకపోతే నేను యింకా యెన్నో ఘోరపాపాలు చేసివుండేవాణ్ణి.

## 5) నేను ఇతరులను చిన్న చూపు చూడకూడదు

నేను నా కంటె తక్కువ సామర్థ్యం కలవాళ్లని చిన్నచూపు చూడ్డం తగదు. దేవుడు నాకు ఐదు సంచుల డబ్బిచ్చి (ప్రక్కవాడికి రెండు సంచులే యిచ్చి వుండవచ్చు. నేను పొందిన ఐదు సంచులకు మరి ఐదు సంచుల సొమ్ము సంపాదించి దేవుడికి చూపించాలి. ఇది పెద్ద బాధ్యత. (ప్రక్కవాడికి రెండు సంచుల సొమ్మే వుందని వాణ్ణి ఎగతాళి చేస్తూ కూర్చోవడం కంటె, నాబాధ్యత నేను తీర్చుకోవడం వివేకం. లేకపోతే నా మిడిసిపాటునకు దేవుడు నన్ను శిక్షిస్తాడు.

అగస్టీను భక్తుడు “భగవంతుడు వినయాన్ని (ప్రదర్శిస్తుంటే అల్ప మానవుడు గర్వాన్ని (ప్రదర్శించడం విడ్డూరం కదా!” అన్నాడు. ఈ విడ్డూరం నాలో మా(త్రం ఎంత లేదు?

## 6. ఆత్మ శోధనం

1. నీవు పొగరుబోతువా లేక అణకువ కలవాడివా?
2. నీవు సాహసంతో నీ శక్తికి మించిన కార్యాలు చేపట్టి నగుబాట్లు తెచ్చుకొంటూంటావా?
3. నీవు మాట్లాడే తీరులో డాబూ బడాయీ కన్పిస్తుంటాయా?
4. నీ దుస్తులు, రూపం, తెలివితేటలు, కులం, మొదలైనవాటిని పురస్కరించుకొని నీవు గర్వపడుతూంటావా?
5. నీవు ఇతరుల పొగడ్తలు పొందాలని తాప(త్రయ పడుతుంటావా?
6. నీవు తప్పుచేసి పట్టుపడినపుడు నిజాయితీతో నీదోషాన్ని ఒప్పుకొంటావా? ఇతరుల మనస్సు నొప్పించినపుడు క్షమాపణం చెప్పుకొంటావా?
7. పెద్దలు నీ తప్పుని తెలియజేసినపుడు నీవు వినయంతో దాన్ని అంగీకరిస్తావా?
8. నీవు ఇతరులను చిన్నచూపు చూడ్డం, విమర్శించడం, తగాదాలాడ్డం మొదలైనవి చేస్తుంటావా?
9. నీవు తోడి జనంతో మర్యాదగా మెలుగుతుంటావా లేక అమర్యాదగా (ప్రవర్తించి వాళ్ళ అనిష్టానికి గురౌతుంటావా?
10. నేనితరులకంటె భక్తిమంతుణ్ణి అనే ఆధ్యాత్మికగర్వం నీకు లేదుకదా?

# 2. అసూయ

## 1. అసూయ అంటే ఏమిటి?

లోకంలో అసూయకు గురికాని నరుడుండడు. అసూయ లేనివాడు దేవుడంతటివాడు.

ఇతరుల వృద్ధిని సహింపక బాధపడ్డమే అసూయ. నిర్మల పద్మకు ఎక్కువ మార్కులు వచ్చాయని బాధపడింది. రామారావుచేను తనచేను కంటె ఎక్కువగా పండిందని సుబ్బారావు బాధపడ్డాడు. ఇదే అసూయ. ఇతరుల వృద్ధివల్ల మనకు హాని కలుగుతుందేమోనని భయపడతాం. ఇతరులు అధికులైతే మనం అణగారిపోతామేమో ననుకొంటాం.

అసూయ గర్వం వలన పుడుతుంది. లోకంలో మనకంటె పైవాడు ఉండకూడదని మన భావం. అందుకే మనకంటె అధికుణ్ణి చూచినప్పుడు మనం ఓర్చుకోలేం. అన్యులు మన యెదుట ఇతరుణ్ణెవరినైనా మెచ్చుకొంటే మనం సహించలేం. ఆ మెప్పు పొందినవాణ్ణి విమర్శించి దూయబడతాం. అతడు మనకంటె తక్కువ వాడని నిరూపించబోతాం. ఈ దుర్విమర్శవల్ల పాపం మూటగట్టుకొంటాం.

అందరి హృదయాల్లోను అసూయ వుంటుంది. మన శత్రువులకు కలిగిన లాభానికి మాత్రమేకాదు, మిత్రులకు సిద్ధించిన లాభానికి గూడ బాధ చెందుతాం. తోడి నరుని భౌతిక లాభాలకు మాత్రమేకాదు, ఆధ్యాత్మిక వరాలకు గూడ వ్యధ చెందుతాం. దీన్నిబట్టి ఈ దుర్గుణం విశ్వవ్యాప్తమైందని అర్థం చేసికోవాలి. ఐనా చాల మందికి తాము అసూయ పడుతున్నామని తెలియను గూడ తెలియదు. ఇది చాలా విచిత్రమైన సంగతి.

## 2. అసూయ వలని అనర్థాలు

ఎవని మీద అసూయ పడతామో అతని మీద మనకు ద్వేషభావాలు జనిస్తాయి. "ప్రేమ అసూయపడదు" అన్నాడు పౌలు - 1కొ 13,4. నిజమైన ప్రేమ వున్నకాడ అసూయ వుండదు. అసూయ వున్నకాడ నిర్మలమైన ప్రేమ వుండదు. కనుక అసూయ ద్వారా తోడి నరుల మీద ద్వేషమూ అనిష్టమూ పెంచుకొంటాం.

ఇంకా, నరులు బృందాలుగా పనిచేసేకాడ అసూయాపరులైనవాళ్లు ముఠాలు లేవదీస్తారు. సరోజ టీచరు. ఆమె నిర్మల టీచరుని సహించలేదు. కనుక సరోజ కొందరు ఉపాధ్యాయులను కలుపుకొని ఓ ముఠాను తయారుచేసికొంది. ఆమె వర్గం ఎప్పుడూ నిర్మల వర్గాన్ని వ్యతిరేకిస్తుంది.

చుప్పనాతితనం చిత్తశాంతిని హరిస్తుంది. ఎదుటివాని వృద్ధిని సహించలేడు కనుక అసూయగ్రస్తుడైనవాడి హృదయం రంపంతో కోసినట్లుగా వుంటుంది. చుప్పనాతితనం కలవాడు తనకుతానే శత్రువు. ఇక అతనికి వేరే శత్రువులంటూ వుండనక్కరలేదు. తెలుగు కవి తిక్కన

"పరుల ధనమునకు విద్యా
పరిణతికిం దేజమునకు బలమునకు మనం
బెరియగ నసహ్యపడు న
న్నరుడు తెవులు లేని వేదనంబడు నధిపా"

అన్నాడు. ఓర్వలేని తనంవల్ల పుట్టే మనోవ్యాధికి మందు లేదు.

## 3. బైబులు దృష్టాంతాలు

1 సృష్ట్యాదిలో కయీను హేబెలు మీద అసూయపడ్డాడు. కయీను పొలంలో పండిన పంటను దేవునికి కానుక పెట్టాడు. హేబెలు గొర్రెపిల్లలను కానుక పెట్టాడు. కాని కయీనుది కపట హృదయం. అందుచేత ప్రభువు హేబెలు కానుకను స్వీకరించి కయీను కానుకను నిరాకరించాడు. కనుక కయీను తమ్ముడి మీదపడి అతన్ని చంపివేసాడు - ఆది 4,3-8.

2. ఈసాకు దైవబలం కలవాడు. అతడు పొలంలో యెదవెట్టగా నూరురెట్లు పంట చేతికి వచ్చింది. అతని గొడ్లూ గొర్రెలూ విస్తరించాయి. ఈసాకు భోగభాగ్యాలను చూడగా ఫిలిస్టీయులకు కన్నుకుట్టింది - ఆది 26,13-14.

3. యాకోబు భార్యలైన లెయా రాహేలు అక్కాచెల్లెళ్లు. అక్కకు సంతానం కలిగిందిగాని చెల్లెలు గొడ్రాలుగా వుండిపోయింది. లెయా పిల్లలను జూచి రాహేలు కండ్లల్లో నిప్పులు పోసికొంది. నాకుగూడ పిల్లలను పుట్టిస్తావా లేక నుయ్యో గొయ్యో చూచుకొమ్మంటావా అని భర్తమీద విరుచుకపడింది - ఆది 30,1-2.

4. యాకోబుకి తన పండ్రెండుమంది కొడుకుల్లోను యోసేఫంటే యిష్టం. ఆ ముద్దుల కొడుక్కి పొడుగుచేతుల నిలుపుటంగీని కుట్టించాడు. అదిచూచి సోదరులు కడుపుమండి యోసేపుతో మాట్లాడ్డం మానివేసారు. అతన్ని గోతిలో పడద్రోసి నానాబాధలు పెట్టారు - ఆది 37,3-4. 19-28.

5. సౌలు యిస్రాయేలీయులకు తొలిరాజు. దావీదు అతని కొలువులో బంటు. ఫిలిస్టీయులు యిస్రాయేలీయులకు ప్రబల శత్రువులు. ఓసారి సౌలుదావీదులు ఫిలిస్టీయుల మీదికి యుద్ధానికి వెళ్లి వాళ్లను చితుకగొట్టి తిరిగివస్తున్నారు. దారిలో ఓ వూరిలో కొందరు స్త్రీలు నాట్యంచేసి రాజుకు స్వాగతం పలికారు. వాళ్లు "సౌలు వేయిమందిని చంపాడు, కాని దావీదు పదివేలమందిని చంపాడు" అని పాట పాడారు. ఆ పాట విని సౌలు

దావీదుమీద అసూయ పడ్డాడు. అతన్ని అణగద్రొక్కాలని యత్నం చేసాడు. ఇంకోమారు దావీదు తన ముందట సితారా వాయిస్తుండగా అతనిమీద బల్లెం విసిరాడు. దావీదు నేర్పుతో ప్రక్కకు తప్పుకొన్నాడు. బల్లెం పోయి గోడకు గ్రుచ్చుకొంది - 1సమూ 18,6-11; 19,8-10.

6. క్రీస్తు శిష్యులకు మొదటిలో దైవరాజ్యమంటే యేమిటో సరిగా అర్థంకాలేదు. అదికూడ ఈలోకరాజ్యం వంటిదే ననుకున్నారు. వాళ్లు ఆ రాజ్యంలో ఎవరికి వాళ్లే ప్రథమస్థానాలు ఆక్రమించుకోగోరారు. ఈ కోరికతోనే వాళ్లు ఒకరిమీద ఒకరు పోటీకి దిగేవాళ్లు. ఒకరినిజూచి ఒకరు అసూయ పడేవాళ్లు. అందుకు ప్రభువు వాళ్లను మందలించాడు. మీలో ప్రథముడు కాగోరేవాడు సేవకుడుగాను, చిన్నబిడ్డగాను తయారుకావాలని హెచ్చరించాడు - మార్కు 9,33-37.

7. శిష్యులైన యోహాను యాకోబులు క్రీస్తుకి దగ్గరి బంధువులు. వాళ్లు ఓసారి తమ తల్లిని వెంటబెట్టుకొని క్రీస్తు దగ్గరికి వచ్చారు. ఆమె నా కుమారులిద్దరికీ నీ రాజ్యంలో ప్రథమ స్థానాలీయమని అడిగింది. ఈ సంగతి యితర శిష్యులకు తెలిసింది. ముఖ్య పదవులను మాకు చిక్కనీయకుండా మీరే కొట్టివేయబోతున్నారా అని వాళ్లు వీళ్లమీద మండిపడ్డారు - మత్త 20,20-24.

8. ఓసారి ఓ అనామక శిష్యుడు క్రీస్తు పేరుమీదిగా దయ్యాలను వెళ్లగొడుతున్నాడు. శిష్యులు అతన్ని జూచి ఓర్వలేక నీవు మా గురువు పేరుమీదిగా భూతాలను వెళ్లగొట్టవద్దని ఆజ్ఞాపించారు. కాని అతడు వాళ్లను కాతరు చేయలేదు. శిష్యులు అసూయతో క్రీస్తుకు ఫిర్యాదు చేసారు - లూకా 9,49-50.

9. తూర్పుదేశపు జ్ఞానులు హెరోదు కొలువుకూటంలోకివచ్చి "యూదులకు రాజుగాపుట్టిన శిశువేడి? మేము తూర్పున అతని నక్షత్రాన్ని చూచి అతన్ని ఆరాధించడానికి వచ్చాం" అని అడిగారు. ఆ మాటలకు హెరోదు తల్లడిల్లాడు. ఆ శిశువు తన సింహాసనాన్ని ఆక్రమించుకొంటాడేమోనని అసూయ పడ్డాడు. కావుననే అతడు ఘాతుకబుద్ధితో పసిబిడ్డలను చంపించాడు - మత్త 2,1-3.16.

10. స్నాపక యోహాను గొప్ప రబ్బయిగా వచ్చి బోధిస్తున్నాడు. అతడు చాలమంది శిష్యులను ప్రోగుజేసికొని యోర్దానులో ప్రజలచే శుద్ధీకరణ స్నానాలు చేయిస్తున్నాడు. అంతలో క్రీస్తువచ్చి యోహానుకంటే గొప్ప రబ్బయిగా దర్శనమిచ్చాడు. కాని క్రీస్తునిచూచి యోహాను అసూయ పడలేదు. "అతడు హెచ్చాలి, నేను తగ్గాలి" అని పల్కాడు - యోహా 3,30.

11. యూద ప్రజలు క్రీస్తు బోధలకూ అద్భుతాలకూ మురిసిపోయి అతనివెంట బోవడం మొదలెట్టారు. అందువలన ప్రధానాచార్యులకు మత్సరం పుట్టింది. వాళ్ళు ఓర్వలేనితనంతో క్రీస్తుని పిలాతున కప్పగించారు - మార్కు 15,10.

12. 1) దేవుడు నరుని అమరునిగా జేసాడు
అతనిని తనవలె నిత్యునిగా జేసాడు
కాని పిశాచం అసూయవలన
మృత్యువు లోకంలోకి ప్రవేశించింది
పిశాచ పక్షాన్ని అవలంబించేవాళ్ళు
చావుని చవిజూస్తారు - సలోమోనుజ్ఞాన 2,23-24.

2) అసూయా కోపం ఆయస్సుని తగ్గిస్తాయి
- సీరా జ్ఞాన 30,34.

3) శాంతగుణంవల్ల ఆయురారోగ్యాలు కలుగుతాయి
అసూయ యెముకలలో పుట్టిన కుళ్ళులాంటిది
- సామె 14,30.

పై ఉదాహరణలనుబట్టి అసూయ యెంతటివారినైనా పట్టి పీడిస్తుందని అర్థం చేసికోవాలి. ఈ దుర్గుణంవల్ల నరులు నీచకార్యాలకు పాల్పడతారని గూడ గుర్తించాలి.

## 4. అసూయను జయించే మార్గాలు

అసూయాభావాలు అందరికీ కలుగుతాయి. భావాలూ కోరికలూ మన అదుపులో వుండవు. ఈర్ష్యాభావాలు కలిగినంతనే పాపం చేసినట్లుకాదు. ఆ భావాలకు బుద్ధిపూర్వకంగా లొంగిపోయినపుడు మాత్రమే పాపమౌతుంది. మన తరపున మనం అసూయాభావాలు కలిగినపుడు వాటిని గుర్తించాలి. నేను అసూయకు గురౌతున్నానని చిత్తశుద్ధితో ఒప్పుకోవాలి. అటుపిమ్మట మన హృదయంలోని ఈర్ష్యాభావాలను త్రోసిపుచ్చాలి. నేను వాటికి సమ్మతి జూపను అని నిశ్చయించుకోవాలి.

బహుశః అసూయను జయించడానికి ఉపయోగపడే ఓ వుత్తమ మార్గం యిది. మన ఈ భౌతిక శరీరంవుంది. ఈలాగే జ్ఞానదేహం కూడ వుంది. ఈ జ్ఞానదేహానికి క్రీస్తు శిరస్సు, మనం అవయవాలం. జ్ఞానస్నానంద్వారా క్రీస్తుతో ఐక్యమైనవాళ్ళంతా అతనితో కలసి జ్ఞానదేహ మౌతారు. మామూలు దేహంలోని అవయవాల్లో ఒకదాని బాగోగులు మరొకదాని బాగోగులౌతాయి. అలాగే జ్ఞాన దేహంలోని అవయవాల్లో గూడ ఒకదాని బాగోగులు మరొకదానివి కావాలి. అనగా క్రీస్తుతో ఐక్యమైన మనం ఇతరుల లాభనష్టాలను మన లాభనష్టాలుగా ఎంచాలి. కనుక ఇతరుల వృద్ధిని మన వృద్ధిగా ఎంచాలేగాని వారినిజూచి అసూయ పడకూడదు - రోమా 12,5.15.

తరచుగా మనం ఇతరుల మంచిపేరును జూచి ఓర్వలేని తనంతో బాధపడిపోతాం. ఇతరులనెవరైనా కొంచెం పొగడితే సహించలేం. అనగా మనకే కీర్తిప్రసిద్ధులు రావాలని కోరుకొంటుంటాం అన్నమాట. ఆ మంచిపేరు మనకు గాక

ఇంకొకరికి వచ్చేప్పటికల్లా సహించలేక బాధపడిపోతాం. కాని మనం ఈ కీర్తిప్రసిద్ధుల కొరకు అర్రులు చాచకుండా మన పని మనం చేసికొంటూ పోవడం మంచిది. అప్పుడు ఆ మంచి పేరు మనకు రాలేదనిగాని ఇతరులకొచ్చిందనిగాని బాధపడం. ఇతరుల మంచిపేరును గూర్చి విన్నపుడు అనవసరంగా అసూయ పడం.

మామూలుగా మనం ఎవరిమీద అసూయ పడతామో వాళ్ల ప్రస్తావనం వచ్చినపుడు చాల కటువుగా మాట్లాడతాం. విమర్శకు దిగుతాం. ఈ దుర్గణాన్ని మనం ప్రయత్నపూర్వకంగా అణచుకోవాలి. మన మట్టుకు మనం ఆ వోర్చుకోలేని వాళ్ళను గూర్చి మాట్లాడేపుడు సోదరప్రేమను గుర్తుంచుకోవాలి. చేతనైతే వాళ్ళనుగూర్చి ఓ మంచిమాట చెప్పాలి. చేతగాకపోతే నోరుమూసుకొని వూరకుండాలి. అంతేగాని వాళ్ళమీద ఏటుమాటలూ పోటుమాటలూ విసరకూడదు.

గ్రీకు తాత్వికుడైన అరిస్టోటలు "దేశ కాల ప్రాయ వృత్తి ప్రసిద్ధి బంధుత్వాల్లో మనకు దగ్గరివాళ్ళెవరో వాళ్ళను గూర్చి అసూయపడతాం" అని చెప్పాడు. అతని వాక్యంలో ఆరంశాలున్నాయి. మనకు దూరంగావున్న వాళ్ళను జూచిగాక దగ్గరగా వున్నవాళ్ళను జూచి అసూయపడతాం. మన సమాకాలికులనూ మన ప్రాయంవాళ్ళనూ జూచి ఈర్ష్యచెందుతాం. ఒకేవృత్తిలోవున్న వాళ్ళు ఒకరినొకరు సహించలేరు. ప్రసిద్ధిలోకి వచ్చినవాళ్ళనూ మనకు బంధువులైన వాళ్ళనూ జూచి అసూయచెందుతాం. నిత్య జీవితంలో తోడి జనంతో మెలిగేప్పుడు ఈ యారంశాలను గుర్తుంచుకోవడం మంచిది.

## 5. ఆత్మ శోధనం

1. నీ వెవరిని గూర్చి అసూయ పడుతుంటావో నీకు తెలుసా?
2. నీవు నీలోని ఈర్ష్యాభావాలను శీఘ్రమే గుర్తుపట్టి వాటిని అణచుకొనే ప్రయత్నం చేస్తుంటావా లేక అజ్ఞానంవల్ల వాటికి సులువుగా లొంగిపోతుంటావా?
3. ఇరుగుపొరుగువాళ్లు నీమీద కోపతాపాలు వెళ్ళగ్రక్కేపుడు నీవు వట్టి కుళ్లుబోతువాడివని నిన్ను నిందిస్తుంటారా?
4. నీకెవరిమీద అసూయ వుందో వాళ్ళ ప్రస్తావనం వచ్చినపుడు కటువుగాను విమర్శనాపూర్వకంగాను మాట్లాడుతుంటావా?
5. ఒకే వృత్తిలో వున్న వాళ్ళు ఒకరినొకరు సహించరు అన్న సూత్రం ప్రకారం నీవు పనిచేసేకాడే పనిచేసే ఇతరులను జూచి నీవు అసూయపడ్డం లేదా?
6. తరచుగా మన దగ్గరి బంధువుల వృద్ధిని జూచి మనం ఈర్ష్య చెందుతాం. ఈ విషయంలో నీ అనుభవం ఏమిటి?
7. నీవు తోడివారి కీర్తిని సహించకపోవడానికి కారణం నీకు కీర్తిరాలేదన్న గుర్రు కాదా?

8. వివాహ జీవితంలో బోలెడంత లైంగికాసూయ వుంటుంది. నీ యనుభవ మేమిటి?
9. ఓర్వలేని తనంవల్ల నీవెవరికీ యేమీ అపకారం చేయలేదా?
10. నీవు చుప్పనాతితనంతో చిత్తశాంతిని కోల్పోయి మానసిక వ్యధకు గురౌతూంటావా?

# 3. కోపం

## 1. కోపం అంటే ఏమిటి?

మనకు కీడు తలపెట్టినవాళ్ళని శిక్షించాలని కోరుకోవడమే కోపం. కోపం గర్వంనుండి పుడుతుంది. ఎదుటివాళ్ళు మనకు అప్రియం కలిగించినపుడు మనం సహించలేం. కనుకనే వాళ్ళమీద కోపపడతాం.

కోపం మంచిదీ కావచ్చు చెడ్డదీ కావచ్చు. క్రీస్తు దేవాలయంలో వ్యాపారం చేసేవాళ్ళమీద కోపపడ్డాడు - యోహా 2,13-17. అలాగే మోషే విగ్రహారాధనకు తలపడి దూడను కొల్చేవాళ్ళమీద కోపించాడు - నిర్గ 32,19. ఇవి మంచి కోపాలు.

కోపం మంచిది కావాలంటే మూడు నియమాలను పాటించాలి. మొదటిది, అది న్యాయయుక్తంగా వుండాలి. తప్పుచేసిన వాళ్ళను మాత్రమే శిక్షించేలా వుండాలి. రెండవది, అది మితంగా వుండాలి. అపరాధిని అతని తప్పుకి తగినంతగా మాత్రమే శిక్షించాలి. మూడవది, అది ద్వేషంతోగాక ప్రేమతో కూడివుండాలి. దోషిని మంచి త్రోవకు మరల్చాలన్న కోరికేగాని అతనిమీద పగతీర్చు కొందామన్న కోరిక వుండకూడదు. న్యాయాన్ని నిలబెడదామన్న ఉద్దేశమేగాని ఇతరులకు అపకారం చేద్దామన్న ఉద్దేశం వుండకూడదు. ఈ నియమాలను మీరిన కోపం చెడ్డకోప మౌతుంది.

మామూలుగా అధికారంలో వున్న వాళ్ళకీ, బాధ్యత కల వాళ్ళకీ కోపం తగుతుంది.

కోపంలో చాల మెట్లున్నాయి. మొదటలో అది ఓర్పుని కోల్పోవడంగా వుంటుంది. తరువాత అది కోపంగా మారుతుంది. ఈ దశలో ముఖం ఎర్రబడ్డం, పెద్దగా అరవడం మొదలైన లక్షణాలు కన్పిస్తాయి. అటుతరువాత అది ఉగ్రకోపంగా మారుతుంది. ఈదశలో తిట్టడం, కొట్టుకోవడం, తన్ను తాను అదుపులో పెట్టుకోలేకపోవడం మొదలైన చిహ్నాలు కన్పిస్తాయి. కడన అది ద్వేషంగా మారుతుంది. ఈ దశలో శత్రువుమీద పగతీర్చుకోవడం, అతనికి కష్టనష్టాలూ చావూ దాపురించాలని కోరుకోవడమూ మొదలైన లక్షణాలు గోచరిస్తాయి. ఈ చివరి దశలో కోపం ఘోరపాప మౌతుంది. పైన పేర్కొన్న వాటిలో మొదటి మూడు దశలను మాత్రమే మనం మామూలుగా కోపం అంటాం. కాని నాల్గవది కూడ కోపమే. అది తీవ్రకోపం.

## 2. కోపంలోని దుష్టత్వం

ఓర్పుని కోల్పోవడం, తాత్కాలిక కోపం ఇవన్నీ స్వల్ప పాపాలు మాత్రమే. ద్వేషంగా మారిన కోపం చావైన పాపమౌతుంది.

క్రోధంవల్ల శాంతి అంతరించి వైరాలు పెరుగుతాయి. ఆస్తినష్టమూ హత్యలూ జరుగుతాయి. ఇంకా దానివల్ల పరదూషణా పగా ప్రతీకారచర్యా చోటుచేసికొంటాయి. ఇవన్నీ పెద్ద అనర్థాలు.

కోపం వచ్చినపుడు మనకు విచక్షణాజ్ఞానం నశిస్తుంది. బుద్ధిశక్తి మందగిస్తుంది. ఏది మంచో, ఏది చెడ్డో తెలియదు. పశుప్రాయమైన ఆవేశానికి గురౌతాం. క్రూరంగా ప్రవర్తిస్తాం. న్యాయాన్ని మీరుతాం. చిత్తశాంతి అంతరిస్తుంది. మానసికారోగ్యాన్ని కోల్పోతాం. కావుననే సీరా గ్రంథం "అసూయ కోపం ఆయుస్సుని తగ్గిస్తాయి" అని చెప్తుంది. - 30,24.

ప్రజాకవి వేమన

"కోపముసను ఘనత కొంచెమైపోవును
కోపమునను మిగుల గోడు జెందు
కోప మడచెనేని కోరిక లీడేరు"

అని చెప్పాడు. నీతుకోవిదుడైన సుమతీశతకకారుడు కూడ

"తన కోపమె తన శత్రువు
తన శాంతమె తనకు రక్ష"

అని పల్కాడు. కోపిని జనం మెచ్చరు. ప్రజలు చిర్రుముర్రులాడేవాని దగ్గరికి రావడానికి జంకుతారు. అందుచే మనం ఈ దుర్గుణాన్ని జయించాలి.

## 3. బైబులు దృష్టాంతాలు

1. దేవుడు తమ్ముని కానుకను స్వీకరించి తన కానుకను నిరాకరింపగా కయీనుకి కోపం వచ్చింది. అతడు ఆగ్రహంతో గ్రుడ్డివాడైపోయి తమ్ముణ్ణి హత్య చేసాడు - ఆది 4,3-8.

2. యేసావుకి రావలసిన తండ్రి దీవెనను యాకోబు కొట్టివేసాడు. కనుక యేసావు యాకోబుమీద పగబట్టి అతని తిత్తి తీయాలనుకొన్నాడు - ఆది 27,41.

3. రాజకీయోద్యోగులంతా హామానుకి కాలువంచి దండం పెట్టేవాళ్ళు. యూదుడయిన మొర్దేకయి మాత్రం అలా చేయలేదు. అందుచేత హామాను అతనిమీద మండిపడ్డాడు. అతని చంపించాలని కుట్రలు పన్నాడు - ఎస్తేరు 3,5.

4. హేరోదు జ్ఞానులను సాగనంపుతూ వాళ్ళు తిరిగి తన అస్థానానికి రావలసిందిగా కోరాడు. వాళ్లనుండి క్రీస్తుశిశువు వివరాలు తెలిసికొని అతన్ని వధించాలని

ఆ దుష్టుని పన్నాగం. ఐనా జ్ఞానులు అతని వద్దకు తిరిగి రాలేదు. కనుక హెరోదుకి శివమెత్తి బేత్లెహేముకి చుట్టుపట్లగల మగబిడ్డల నందరినీ చంపించాడు - మత్త 2,1-8.

5. క్రీస్తు అద్భుతాలను చూచి యూదనాయకులు అసూయ చెందారు. అతడు విశ్రాంతిదినాన గూడ అద్భుతాలు చేయగా వాళ్లు పండ్లు పటపట గొరికారు. వెర్రికోపంతో అతన్ని సంహరించడానికి కుట్రలు పన్నారు - లూకా 6,6-10.

6. హెరోదురాజు తన సోదరుని భార్యయైన హెరోదియాను చేపట్టాడు. నీవు నీసోదరుని భార్యను ఉంచుకోవడం ధర్మంకాదని స్నాపక యోహాను అతన్ని గద్దించాడు. అందువలన హెరోదియా యోహానుమీద పగబట్టి అతని అంతుచూడ గోరింది - మార్కు 6,18-19.

7. స్తెఫను ధర్మశాస్త్రం వలనగాని యెరూషలేము దేవళంవలనగాని రక్షణం కలుగదని బోధించాడు. ఈ బోధకు ఆగ్రహంచెంది యూదనాయకులు స్తెఫనుని రాళ్లతో కొట్టి చంపారు - అచ 7,54.

8\. 1) మూర్ఖుడు అవమానాన్ని పొందగానే
కోపాన్ని ప్రదర్శిస్తాడు
కాని మతిమంతుడు తనకు కలిగిన
అవమానాన్ని లెక్కజేయడు - సామె 12,16.

2) ఓర్పుగలవాడు వీరునికంటె ఘనుడు
నగరాన్ని గెల్వడం కంటె
తన్నుతాను గెల్చుకోవడం లెస్స - 16,32.

3) ప్రభువు మన పాపాలను గమనిస్తాడు
పగతీర్చుకొనే వాడిమీద అతడు పగ తీర్చుకొంటాడు
నీవు తోడి నరుని అపరాధాలను మన్నిస్తే
నీవు మొరపెట్టినపుడు దేవుడు నీ యపరాధాలు మన్నిస్తాడు
నీవు తోడి నరునిమీద కోపంగా వుంటే
నిన్ను క్షమించమని భగవంతుణ్ణి ఏలా అడగ్గలవు?
తోడి నరుణ్ణి మన్నించనివాడు
తన తప్పిదాలను మన్నించమని
దేవుణ్ణి యేలా వేడుకోగలడు?
నరమాత్రుడైనవాడు కోపాన్ని అణచుకోలేకపోతే
ఇక అతని తప్పిదాలను ఎవడు మన్నిస్తాడు?
నీవు చనిపోతావని జ్ఞప్తికి తెచ్చుకొని నీ పగ నణచుకో

నీవు చనిపోగా నీ దేహం క్రుళ్ళిపోతుందని గ్రహించి
దైవాజ్ఞలను పాటించు
దేవుని కట్టడలను స్మరించుకొని ఇతరునిమీద కోపం మానుకో
దేవుని నిబంధనాన్ని తలంచుకొని
అన్యుని తప్పులను మన్నించు - సీరా 28,1-7.

4) ఇష్టులారా! మీరు పగతీర్చుకోక దాన్ని దేవుని
ఆగ్రహానికే వదలివేయండి. పరిశుద్ధ గ్రంథం ఈలా చెప్తుంది :
నీ శత్రువు ఆకలిగొనివుంటే వాని యాకలితీర్చు
దాహంగొని వుంటే వాని దాహంతీర్చు
ఈలా చేస్తే నీవు వానికి సిగ్గు పుట్టిస్తావు

- రోమా 12,19-20.

## 4. నివారణ మార్గాలు

కొన్నిసారులు శరీరారోగ్యం సరిగా లేకపోవడంవల్లా బాగా అలసిపోయి వుండడంవల్లా సులభంగా కోపం వస్తుంది. అప్పుడు తగినంత విశ్రాంతి తీసికొని కోపాన్ని అణచుకోవాలి.

కోపస్వభావం కలవాళ్ళు తమ దుర్గుణాన్ని ఓ కంట కనిపెడుతూండాలి. ఆ కోపాన్ని గూర్చి ముందుగానే ఆలోచించుకొనివుండి దానికి లొంగిపోకుండావుండే ప్రయత్నం చేయాలి. కోపం వచ్చిన వెంటనే దాన్ని అదుపులో పెట్టుకోవాలి. పెద్ద పులులు సింహాలు మొదలైన వన్యమృగాలకు తర్ఫీదు ఇస్తుంటాం. మనకు మనం తర్ఫీదు ఇచ్చుకోవడం అంత కష్టంకాదు. ఫ్రాన్సిస్ డిసేల్స్ భక్తుడు ఇరవైయేండ్లు కృషిచేసి తన కోపాన్ని అణచుకొన్నాడు.

ఒకోసారి మన క్రింద పనిచేసేవాళ్ళల్లో కొందరు వట్టి అసమర్థులు వుంటారు. వాళ్ళు మనం ఒప్పజెప్పిన పనిని సంతృప్తికరంగా చేయలేరు. అందువలన మనకు చిరాకు కలిగి కోపం వస్తుంటుంది. కాని ఈలాంటి సందర్భాల్లోకూడ మనం స్తిమితంగా ఆలోచించి చూచుకొని మన ఆగ్రహాన్ని అణచుకొంటూండాలి. మన క్రింద పనిచేసేవాళ్ళకి శక్తీ చురుకుదనమూ, తెలివీ లేకపోవచ్చు. కనుక మనం వాళ్ళను దయదల్చి వదలివేయాలి. వాళ్ళనుండి అధిక కృషిని ఆశించగూడదు. వాళ్ళను తిట్టుకొంటూ కోపతాపాలకు గురైనందున ప్రయోజనం కలుగదు.

కొందరు ఇతరులు పూర్వం తమకు చేసిన అపకారాలూ అన్యాయాలూ మనసులోకి తెచ్చుకొని వాటిని గూర్చి సుదీర్ఘంగా ఆలోచించుకొంటూ కూర్చుంటారు. ఈ తలంపులవల్ల కోపతాపలకూ ఆవేశాలకూ గురౌతుంటారు. ఇది చెడ్డ పద్ధతి. ఇతరులు

మనకు చేసిన చెడ్డను ఎప్పటికప్పుడు మరచిపోతుండాలి. మనం ప్రస్తుతకార్యాల్లో నిమగ్నులమౌతుండాలే గాని ఈలాంటి విచారపూరితమైన ఆలోచనలతో కాలం వెళ్లబుచ్చగూడదు. ఆమాటకొస్తే, మనంమాత్రం ఇతరులకు అన్యాయాలూ అపకారాలూ చేయలేదా? ప్రభువు ఆనాడు గాలివానను శాసించగా సరస్సులోని అలలు సమసిపోయి నెమ్మది యేర్పడింది - మార్కు 4,39. మన యీ జంతుదేహం కూడ కోపంతో అలలు లేపుతూంటుంది. కాని ప్రభువు అనుగ్రహంవల్ల మన కోపాన్ని కొంతవరకైనా అణచుకోవచ్చు.

కొన్నిసారులు మనకోపం ద్వేషంగా మారుతుంది. శత్రువుమీద పగతీర్చుకోగోరుతాం. ప్రతీకారచర్యకు పూనుకొంటాం. ఈలాంటికోపం చాల చెడ్డది. చావైన పాపం కూడ. ఏలాగైనా ప్రయత్నంచేసి ఈ రాక్షస గుణాన్ని అణచుకోవాలి. "మాయొద్ద అప్పుబడిన వారిని మేము మన్నించినట్లే మా యప్పులను మీరు మన్నించండి" అని రోజురోజు ప్రార్థిస్తాం - మత్త 6-12. మనం ఇతరులను మన్నించకపోతే దేవుడు మనల నేలా మన్నిస్తాడు? కనుక మనం శత్రువుని మన్నించాలి. క్రీస్తు తన విరోధులను మన్నించి మనంకూడ శత్రువులను మన్నించాలని ఉదాహరణ పూర్వంగా చూపించాడు - లూకా 23,34. కనుక మనలోని ద్వేషభావాలను అణచివేయమని మనం ఆ ప్రభువునే అడుక్కోవాలి. పైన ఉదాహరించిన సీరా వాక్యాలనుగూడ జాగ్రత్తగా మననం చేసికోవాలి. ఇంకా యీ పట్టున వేమన యీలా చెప్పాడు :

"చంపదగినయట్టి శత్రువు తనచేత
చిక్కెనేని కీడు సేయరాదు
పొసగ మేలు చేసి పొమ్మనుటే చావు".

ఈ హిందూ ప్రవక్త బోధించిన ధర్మాన్ని క్రైస్తవులమైన మనం పాటించలేక పోయాంగదా అని సిగ్గుపడాలి.

## 5. ఆత్మ శోధనం

1. కొందరు తొందరపాటు మనుషులు. ప్రతిదానికీ సులభంగా కోపపడతారు. మరికొందరు నిదానంగాను శాంతంగాను వుంటూంటారు. నీమట్టుకు నీ వేలాంటివాడివి?
2. కోపంవల్ల నీవు మనశ్శాంతిని కోల్పోతుంటావా?
3. నీ కోపం ద్వేషంగా మారి నీ విరోధులమీద పగతీర్చుకొనే కాడికి పోతుందా?
4. నీవు నీకు గిట్టనివాళ్ళతో దీర్ఘకాల వైరం పెట్టుకొంటుంటావా లేక వాళ్ళను సులభంగా క్షమిస్తుంటావా?

5. నీవు నీ క్రిందివాళ్ల తప్పులను కరుణతో మన్నిస్తుంటావా లేక చీటికిమాటికి వాళ్ళను తిట్టి రద్దిచేస్తుంటావా?
6. నీవు అయాపనులు నీ వనుకొన్నట్లుగా జరగకపోతే సులభంగా కోపం తెచ్చుకొంటుంటావా?
7. నీకు కోపం వచ్చినపుడు చండాలంగా మాట్లాడి ఎదుటివాళ్ళ హృదయాన్ని నొప్పిస్తుంటావా?
8. నీవు తల్లివిగా లేక తండ్రివిగా వ్యవహరించేపుడు నీ పిల్లలమీద విపరీతమైన కోపం చూపిస్తుంటావా?
9. కష్టాలు దురదృష్టాలు వచ్చినపుడు దేవునిమీద విరుచుకపడి ఆ ప్రభువుని నిందించవు కదా?
10. ఒకవేళ నీవు ముక్కోపివైతే ఆ కోపాన్ని అణచుకోవడానికి ఏలాంటి ప్రయత్నం చేస్తున్నావు?

# 4. భోజనప్రీతి

## 1. భోజనప్రీతి అంటే ఏమిటి?

మితంమీరి తినడమూ త్రాగడమూ భోజనప్రీతి క్రిందికి వస్తాయి. చాలామందికి తిండిమీద రంది వుంటుంది. బహుశ లోకంలో కత్తివలన చచ్చిన వారికంటె భోజనప్రీతి వలన చచ్చినవాళ్ళే యెక్కువ. పౌలు పాపాత్ములను గూర్చి చెప్తూ "వాళ్ళ కడుపే వాళ్ళకు దేవుడు" అని వాకొన్నాడు - ఫిలి 3,9. కోరిందల్లా తినేవాళ్ళకి ఉదరమే దైవమౌతుంది.

తిండిపోతుతనం చాల విధాలుగా వుంటుంది. కొందరు ఆకలి వేయకపోయినా, అవసరం లేకపోయినా, తింటుంటారు. మరికొందరు రుచిగల పదార్థాలను ఏరికోరి తింటుంటారు. భోజనం రుచి ననుభవించడమే వీరి ధ్యేయం. ఇంకా కొందరు పొట్టనిండా భోజనం కుక్కుకొంటారు. కడుపును బస్తాలాగ నింపుకొంటారు. మరికొందరు అత్యాశతో గుంజుకొని తింటుంటారు. మృగాలు ఈలా తింటాయి. ఇవన్నీ పాడు పద్ధతులని వేరుగా చెప్పనక్కరలేదు.

## 2. భోజన ప్రీతిలోని దుష్టత్వం

భోజన ప్రీతిలోని దుష్టత్వం ఇది. అది మనలను పశువులతో సమానం చేస్తుంది. మన ఆత్మ మన దేహానికి బానిస అయ్యేలా చేస్తుంది. మామూలుగా భోజనప్రీతి చావైన పాపంకాదు. కాని అతిగా తినిత్రాగడంవల్ల మన బాధ్యతలను మనం నిర్వర్తించలేనపుడూ, కాముకత్వానికి దారి తీసినపుడూ, ఉపవాస నియమాలను ఉల్లంఘించేలా చేసినపుడూ

అది పెద్ద పాపం కావచ్చు. పైగా తిని త్రాగేపుడు ప్రజలు ఏవేవో గాలిసుద్దులు చెప్పుకొంటూ వాళ్ళనీ వీళ్ళనీ ఆడిపోసుకొంటారు. దీనివల్ల సోదరప్రేమను భగ్నంజేసే పాపాలను మూటకట్టుకొంటారు. ఇంకా, మితంమీరి తినేవాళ్ళు సంయమనాన్ని కోల్పోతారు. తమ్ముతాము అదుపులో పెట్టుకోలేరు. తిని త్రాగి కైపెక్కి నోటికివచ్చినట్లల్లా వదరేవాళ్ళను లోకం గౌరవించదు.

## 3. బైబులు దృష్టాంతాలు

1. నెబుకద్నెసరు కుమారుడూ బాబిలోను ప్రభువూ ఐనా బెల్షస్సరు దుష్టరాజు. ఓమారు అతడు పెద్ద విందు చేయించాడు. అందులో ద్రాక్షాసారాయాన్ని త్రాగడానికి యెరూషలేము దేవళంనుండి కొల్లగొట్టి తెచ్చిన పవిత్రపాత్రలను వాడాడు. తాను ద్రాక్షాసవం సేవిస్తుండగానే అతనికి దైవశిక్ష ప్రాప్తించినట్లుగా తెలియజేస్తూ ఒక హస్తం గోడమీద వ్రాయడం మొదలుపెట్టింది. ఆ వ్రాత సూచించినట్లుగానే అతడు తర్వాత నాశమైపోయాడు - దాని 5,1-6.

2. యిస్రాయేలీయులకు ఎడారి ప్రయాణంలో సరైన భోజనం లభించలేదు. వాళ్ళు మాటిమాటికి తాము ఐగుప్తులో తిన్న మంచి అన్నం జ్ఞప్తికి తెచ్చుకొని మోషేమీద గొణగేవాళ్ళు. ఐగుప్తులో మాంసమూ చేపలూ ఉల్లిపాయలూ మస్తుగా తిన్నాం. ఈ యెడారిలో ఏమీ దొరకడం లేదని తిరగబడేవాళ్ళు. అందుకు ప్రభువు వాళ్ళను శిక్షింపవలసి వచ్చింది. - సంఖ్యా 11,4-6.

3. ఏసావు ఒట్టి తిండిపోతు. ఓసారి అతడు పొలంలో నుండి అలసిపోయి వచ్చి తన తమ్ముడు యాకోబు కమ్మని పులుసుచేసి వుంచుకోవడం గమనించాడు. ఆ పులుసుని తనకు వడ్డించమని అడిగాడు. యాకోబు నీ జ్యేష్ఠభాగం నాకిస్తే నా పులుసు నీకు వడ్డిస్తానన్నాడు. ఏసావు అతి తేలికగా తన జ్యేష్ఠభాగాన్ని వదలుకొని తమ్ముడి పులుసు ఆరగించాడు. అతడు అలాంటి తేలిక మనిషి - ఆది 25,29-34.

4. శత్రుసైన్యాధిపతియైన హోలోఫెర్నెసు యూదియాలోని బెతూలియా పట్టణాన్ని ముట్టడించివున్నాడు. అతడు తన సైనికోద్యోగులందరికి విందు చేసాడు. యూదితుకూడ ఆ విందులో పాల్గొంది. సేనాధిపతి తప్పత్రాగి మత్తెక్కి పడకమీద తూలివున్నాడు. అప్పుడు యూదితు అతని ఖడ్గంతోనే అతని తల నరికేసింది. తమ సైన్యాధిపతి చావడం చూచి శత్రువులు చెల్లాచెదురై పోయారు - యూది 13,2-9.

5. విందుల్లో పాల్గొనేపుడు పాటించవలసిన నియమాలను గూర్చి చెప్తూ సీరా జ్ఞాన గ్రంథం ఈలా ఆదేశిస్తుంది.

"నీకు వడ్డించిన భోజనాన్ని మర్యాదగా భుజించు
ఆత్రంతో తిన్నావంటే అందరికీ రోత పుడుతుంది
భోజనం ముగించేవారిలో నీవు మొదటివాడి వైతే
ఎంతో మర్యాదగా వుంటుంది
నీవు మితిమీరి తింటే జనం నిన్ను మెచ్చరు
పదిమందితో కలసి భుజించేపుడు
అందరికంటె ముందుగా నీవు పదార్థాలను తీసికోవద్దు
మర్యాద తెలిసినవాడు స్వల్పంగా భుజిస్తాడు
కొద్దిగా తింటే నిద్రించేపుడు ఆయాసపడనక్కరలేదు
మిత భోజనంవల్ల బాగా నిద్రపడుతుంది
వేకువనే వుత్సాహంతో లేవవచ్చు
మితంమీరి తింటే కడుపునొప్పి, నిద్రపట్టమి
మొదలైన అనర్థాలు దాపురిస్తాయి" - 31,16-20.

6. నూత్నవేదాన్ని పరిశీలిస్తే, క్రీస్తు మూడు శోధనల్లో మొట్టమొదటిది తిండిపోతుతనాన్ని గూర్చే. పిశాచం రాళ్ళను రొట్టెలుగా మార్చి ఆరగించమని క్రీస్తుని శోధించింది - మత్త 4,3. అలా చేస్తే అతడు దేవుని ఆజ్ఞ మీరతాడు, పిశాచం పన్నాగం ఫలిస్తుంది. కాని క్రీస్తు ఆ శోధనకు లొంగలేదు.

7. ఓ ధనవంతుడు రోజూ విందులు చేసికొని మస్తుగా భుజించేవాడు. కాని అతడు తన వాకిట పడియున్న నిరుపేద యైన లాజరుని ఎంతమాత్రం పట్టించుకొనేవాడు కాదు. ధనవంతులగుండె బండబారుతుంది అనడానికి ఇది చక్కటి నిదర్శనం - లూకా 16,19-21.

8. హేరోదు జన్మదినోత్సవం జరుపుకొంటూ ప్రముఖులందరికీ విందు చేయించాడు. ఆ విందులో అతని వుంపుడుకత్తెయైన హేరోదియా కుమార్తె నాట్యంచేయగా నీ వేమడిగినా యిస్తానని ఆమెకు పిచ్చి ప్రమాణం చేసాడు. ఆ బాలిక తల్లివలన ప్రేరేపితురాలై స్నాపక యోహాను శిరస్సుని ఇప్పించమని అడిగింది. ఈ విధంగా ఆ రాజు పుణ్యపురుషుడైన యోహాను తల కొట్టించాడు. తిని త్రాగివున్నవాళ్ళు అవివేకంతో ప్రవర్తిస్తారు - మార్కు 6,21-29.

## 4. భోజనప్రీతిని వారించే మార్గాలు

భోంచేసేపుడు మనకు నిర్మలమైన ఉద్దేశాలు వుండాలి. మనం తిన్నా త్రాగినా మరేంచేసినా దేవుని మహిమ కొరకే చేయాలన్నాడు పౌలు - 1కొ 10,21. జంతువులు నోటి రుచికొరకు తిండి తింటాయి. నరులమైన మనం అలా తినకూడదు. మనం దేవుని

కొరకు పనిచేస్తాం. దేవుని కొరకు జీవిస్తాం. భగవంతుని మహిమమకొరకే అన్నంకూడ తింటాం.

ప్రభువు తండ్రిలాంటివాడు. తన బిడ్డలమైన మనకు అనుదినాహారాన్ని దయచేస్తాడు. కనుక అతనికి కృతజ్ఞత జూపుతూ మన రోజువారి అన్నాన్ని భుజించాలి. నిజం చెప్పాలంటే, పాపులమైన మనం అనుదినాహారానికి కూడ అర్హులంకాము. కనుక చాల వినయంతో దేవుడు మనకు దయచేసిన ఆహారాన్ని పుచ్చుకోవాలి. ఈ యన్నం వలన మనం పుష్టిచెంది దేవుణ్ణీ తోడిప్రజలనూ సేవించడానికి శక్తిని పొందుతాం. కనుక భగవంతుణ్ణీ నరులనూ ప్రేమభావంతో సేవిద్దామనే ఉద్దేశంతో అన్నం తినాలి.

మనం అన్నం తినడానికి జీవించకూడదు. ఇది తిండిపోతుల లక్షణం. జీవించడానికి తినాలి. ఇది సంయమనం కలవాళ్ళ లక్షణం. తమిళ కవి తిరువళ్ళువర్ "ముందు తిన్నది అరిగిందాక మళ్ళా తిననివాడికి ఏమందూ అక్కరలేదు" అన్నాడు. కనుక అతిగా తిని రోగాలు తెచ్చుకోగూడదు. ఎరుగక తిని అరుగక చస్తిని అన్నట్లుగా బాధపడకూడదు.

కొన్నిసారులు బుద్ధిపూర్వకంగానే మనకిష్టమైన భోజనపదార్థాలను తినడం మానుకోవడం మంచిది. కడుపునిండా తినకుండా కొంచెం ఆకలితో లేవడంకూడ వంటికి మంచిది. ఈలాంటి కార్యాలద్వారా ఈ జంతుదేహం మన అదుపులోకి వస్తుంది. ఇంద్రియాలను మన చెప్పుచేతల్లో వుంచుకొంటాం. అన్నమదమే అన్ని మదాలకు కారణమని చెప్తుంది ఓ తెలుగుసామెత. కనుక ఈ యన్నమదాన్ని కొంచెం తగ్గించుకొంటే మంచిది.

భోజనానికీ భోజనానికి మధ్య చిరుతిండ్లు పనికిరావు. దీనివల్ల ఆకలి చెడుతుంది. భోజనానికి ముందూ భోజనం ముగిసిన తర్వాతగూడ చిన్న ప్రార్థన చెప్పుకోవడం మంచిది.

మత్తుపానీయాలు సేవించడం మన దేశాచారం కాదు. తాహతుకు మించి వీటిని సేవించేవాళ్ళు ఇల్లూ వళ్ళూ గుల్ల చేసికొంటారు. భార్యాబిడ్డలను ఇరకాటాన బెడతారు. కనుక బుద్ధిమంతుడైనవాడు అసలు వీటిని ముట్టుకోగూడదు.

## 5. ఆత్మ శోధనం

1. నీవు తిండిపోతువా లేక మితభోజనాన్ని పాటించేవాడివా?
2. నీవు ఒక్కపొద్దు, మాంసనిషేధం మొదలైన ఉపవాస నియమాలను పాటిస్తూంటావా?
3. కడుపు నిండినా కళ్లు నిండవు అనే సామెత నీకు వర్తిస్తుందా?
4. నీవు మీ యింటిలో వండిన కూరలకు తరచుగా వంకలు పెడుతూ ఆడవాళ్ళమీద సుమ్మర్లు పడుతూంటావా?

5. నీవు భోంచేసేపుడు మృగంలాగ ఆత్రంతో తింటూంటావా, లేక సంయమనాన్ని పాటిస్తూంటావా?
6. నీవు మితంమీరి తిని రోగాలు తెచ్చుకొనేవాడివి కాదు గదా?
7. తిండికి తిండిపోతువీ పనికి పందుబోతువీ కాకుండ నీవు తిన్న దానికి మోయునుగా కష్టపడి పనిచేస్తుంటావా?
8. నీవు వున్నవాడివైతే నీ చుట్టూవున్న పేదసాదలకుగూడ ఓ ముద్ద పెడుతూంటావా లేక నీమట్టుకు నీవే తింటూంటావా?
9. నీవు త్రాగుబోతువి కాదు కదా?
10. భగవంతుడు నీకు దయచేసే అనుదినాహారానికి నీ వతనికి వందనాలు చెప్తూంటావా?

# 5. మోహం

## 1. మోహం అంటే ఏమిటి?

భగవంతుడు భోజనానికి రుచి పెట్టాడు. ఈ రుచికి మరిగి మనం అన్నం తింటాం. అన్నం తినడంవల్ల దేహపోషణం జరుగుతుంది. అలాగే అతడు లైంగిక క్రియకు సుఖం పెట్టాడు. ఆ సుఖానికి మరిగి స్త్రీపురుషులు కలుసుకొంటారు. ఈ కలయికవల్ల సంతానం కలుగుతుంది. భోజనంలోని రుచి దానంతట అది ప్రధానం కాదు. లైంగిక క్రియలోని సుఖం కూడ దానంతట అది ప్రధానం కాదు.

ఈ లైంగిక సుఖాన్ని వివాహ జీవితం జీవించే దంపతులు మాత్రమే అనుభవించవచ్చు. భార్యాభర్తలు కానివాళ్ళకు అది క్రియారూపేణ, మనోరూపేణకూడ నిషిద్ధం. ఆరు తొమ్మిదవ ఆజ్ఞలు పేర్కొనేది ఈ నిషేధాన్నే. ఐనా చాలమంది బలహీనతవల్ల ఈ లైంగిక పాపాల్లో పడిపోతుంటారు. మనం చిన్న వాళ్ళంగా వున్నప్పుడు లైంగిక శక్తి నిద్రావస్థలో వుంటుంది. యౌవనం వచ్చేకొద్దీ అది తన ప్రభావాన్ని చూపెడుతుంది.

## 2. మోహంలోని దుష్టత్వం

మనం ప్రత్యక్షంగా, అనగా బుద్ధిపూర్వకంగా, మోహక్రియలను ఆశిస్తే చావైనపాపం ఔతుంది. ఇక్కడ మనం చేసిన తప్పు పెద్దదా చిన్నదా అన్న ప్రస్తావనం లేదు. ప్రత్యక్షంగా ఆశించిన మోహక్రియ పెద్దదైనా చిన్నదైనాగూడ చావైన పాపమే. దొంగతనంలో పెద్దది చిన్నది అనే తారతమ్యాలున్నాయి. కాని బుద్ధిపూర్వకంగా ఆశించిన మోహక్రియలో అలాంటి తారతమ్యాలు లేవు. ఐతే ప్రత్యక్షంగా గాకుండ పరోక్షంగా ఆశించిన మోహక్రియలో మాత్రం చావైన పాపం స్వల్ప పాపం అనే వ్యత్యాసాలు

వుండవచ్చు. ఉదాహరణకు ఒక విద్యార్థి పాఠ్యగ్రంథంగా చదవవలసిన నవల వలన అతడు ప్రత్యక్షంగాగాక పరోక్షంగా మోహక్రియను ఆశిస్తున్నాడు. అతని ఆశలో వుండే హెచ్చు తగ్గులను బట్టి అది చావైనపాపమో స్వల్పపాపమో ఔతుంది.

నరులకు అహంకారం తర్వాత మోహమంత ప్రమాదకరమైన పాపం మరొకటి లేదు.

లైంగిక పాపాలవల్ల మనం కొన్ని దురభ్యాసాలకు గురౌతాం. ఈ చెడ్డ అలవాట్లను ఇక వదిలించుకోలేం. అవి మనలను పూర్తిగా వశం చేసికొంటాయి. ఈ యలవాట్లకు లొంగిపోయినవాళ్ళకు ఆధ్యాత్మిక విషయాలు ఎంతమాత్రమూ రుచించవు. పైగా, లైంగిక పాపాలవల్ల మనలోని స్వార్థం కొండంతగా పెరిగిపోతుంది. ఎప్పుడూ నేను, నా సుఖం అన్నట్లుగా ఆలోచిస్తాం. ఇక మన కుటుంబ సభ్యులపట్ల, మన బాధ్యతలపట్ల ఆసక్తి చూపం.

ఇంకా, మోహానికి లొంగినపుడు మన శరీరం ఆత్మను దాసినిగా ఏలుతుంది. మనలోని బుద్ధిశక్తి అట్టే పనిచేయక మసకలు కమ్మిపోతుంది. మన భావనాశక్తి ఎప్పుడూ శారీరక విషయాలనే ఊహించుకొంటుంది. మన హృదయం లైంగిక సుఖాన్ని దప్పితే మరొకదాన్ని కోరుకోదు. అనగా మనం మృగాల్లా తయారౌతాం.

మోహపాపాన్ని "చీకటి తప్పు" అంటాం. నరులు ఈ తప్పుని పదిమంది ముందు బట్టబయలుగా చేయడానికి సిగ్గుపడతారు. కనుక లోకం కన్నుగప్పి దాన్ని చీకటిలో చాటుమాటుగా చేస్తారు. ఇది అంత నీచమైన పాపం. ఎప్పుడైనా నరుని శీలాన్ని పరిశీలింపవలసివస్తే అతడు లైంగిక వాంఛలకు లొంగేవాడా కాదా అని నిశితంగా పరిశీలిస్తాం. అనగా మన శీలంలో ఇది ఓ ముఖ్యాంశం అన్నమాట. పవిత్రతకు అంతవిలువ వుంది. కామకార్యాలకు పాల్పడేవాడికి మోక్షరాజ్యంలో స్థానంలేదు అన్నాడు పౌలు - ఎఫె 5,5.

## 3. బైబులు దృష్టాంతాలు

యోసేపు ఐగుప్తున సైన్యాధిపతి యింట వసిస్తూండగా ఆ యధికారి భార్య అతన్ని కామించింది. కాని ఆ సత్పురుషుడు అమ్మా! దేవుడు చూస్తుండగా నేను ఇంత చెడ్డపనికి ఏలా వొడిగట్టేది అని ఆమె కోర్కెను నిరాకరించాడు. అందుకామె అతనిమీద నేరం మోపి అతన్ని చెరలో త్రోయించింది - ఆది 39,7-10.

2. ఇద్దరు వృద్ధులు సూసన్నను కామించి నీవు మా కోర్కెను తీర్చకపోతే మేము నీమీద నేరం మోపి నీకు శిక్ష విధిస్తామని బెదిరించారు. కాని ఆ సాధ్వి ఈలాంటి పాడు పనికి పూనుకొని దేవుని యెదుట పాపం చేయడం కంటె మీరు పెట్టే శిక్ష అనుభవించడమే మేలని పల్కింది. వారు సూసన్న మరెవరితోనే వ్యభిచరించిందని ఆమెమీద కూటసాక్ష్యం

పలికి ఆమెను చంపించబోయారు. అప్పుడు దానియేలు ఆ వృద్ధుల మోసాన్ని బట్టబయలుచేసి వాళ్ళ తలలు తీయించాడు - దాని 13,19-23.

3. దావీదు రాజు ప్రక్కయింటి ఆడగూతురు బత్షెబాను మోహించాడు. ఆమె భర్తయైన ఊరియాను మోసంతో యుద్ధంలో మొదటి వరుసలో పెట్టించి చంపించాడు. ఆమెను తన యింటికి రప్పించుకొని భార్యను చేసికొన్నాడు. ఈ పాపాలకు నాతాను ప్రవక్త అతన్ని కటువుగా చీవాట్లు పెట్టాడు - 2సమూ 11,2-5.

4. విజ్ఞాన గ్రంథ రచయితలు లైంగికాంశాలను గూర్చి చాల నీతులు చెప్పారు. ప్రస్తుతానికి కొన్నింటిని పరిశీలిద్దాం :

1) నీ సొంత బావినుండి మాత్రమే నీళ్ళు త్రాగు
నీ జలధారనుండి మాత్రమే స్వచ్ఛమైన నీరు సేవించు
నీవు యౌవనంలో పెండ్లి యాడిన భార్యతో గూడి సుఖించు
ఆమె దీవెనలు పొందునుగాక
ఆవిడ లేడిలాగ దుప్పిలాగ
నీ కంటికి అందంగా కన్పించుగాక - సామె 5,15-19.

2) నిప్పులను రొమ్ము మీద పెట్టుకొంటే
బట్టలు కాలకుండా వుంటాయా?
అగ్ని మీద నడిస్తే పాదాలు మాడకుండా వుంటాయా?
అన్యుని భార్యను కూడినవాడూ ఇంతే
ఆమెను స్పృశించిన వాడికి శిక్ష తప్పదు - సామె 6,27-29

3) శీలవతియైన భార్య మనోజ్ఞత యంతింత గాదు
ఆమె సచ్ఛీలాన్ని ఏ తక్కెడతోను తూయలేము
ప్రభువు ఆకాశాన ఉదయభానుడు ప్రకాశించినట్లే
మంచి యిల్లాలు తాను చక్కగా తీర్చిదిద్దుకొన్న యింటిలో
వెలుగొందుతూంటుంది
పవిత్ర దీపస్తంభంమీద దీపం వెలిగినట్లే
సుందరమైన తనువుమీద ఆమె మొగం మెరుస్తూంటుంది
- సీరా 26,15-17.

## 4. మోహాన్ని అరికట్టే మార్గాలు

క్రైస్తవులమైన మనం శారీరక పాపాలు చేయకూడదు. మనం జ్ఞానస్నానం పొందినప్పటినుండి పవిత్రాత్మ మన శరీరంలో ఓ దేవాలయంలోలాగ వసిస్తూంటుంది -

1కొ 6,19. మన శరీరం పవిత్రమైంది. కనుక అశుద్ధ పాపాలతో ఈ శరీరాన్ని అపవిత్రం చేసికోగూడదు. పైగా, మనం జ్ఞానస్నానంద్వారా క్రీస్తు శరీరమౌతాం. అతని దేహంలో అవయవాల మౌతాం - 1కొ 6,15. అలాంటి యీ పవిత్రదేహాన్ని - అది పురుష శరీరమైనా స్త్రీ శరీరమైనా - గౌరవంతో చూడాలి. దాన్ని మోహపాపాలతో కళంకితం చేయకూడదు.

అగస్టీను భక్తుడు తాను పాపజీవితం జీవిస్తున్న తొలిరోజుల్లో కామసంబంధమైన పాపాలను పరిత్యజించ లేమనుకొన్నాడు. పవిత్ర జీవితం జీవించడం అసాధ్యమనుకొన్నాడు. కాని అతడు జ్ఞానస్నానం పొందాక, దైవకృపచేత అలాంటి జీవితం జీవించడం సాధ్యమేనని గ్రహించాడు. కనుక ప్రతి వొక్కడూ, తాను కోరుకొంటేచాలు, నిర్మల జీవితం జీవించవచ్చు. దేవద్రవ్యానుమానాలూ ప్రార్థనా ఇందుకు తోడ్పడతాయి.

జీవితంలో మోహపాపాలను ప్రేరేపించే పరిస్థితులు తటస్థపడుతుంటాయి. ఈ పరిస్థితులనుండి మనం జాగ్రత్తగా తప్పుకొంటూండాలి. గాలం దగ్గరికి వచ్చిన చేప గాలానికి తగులుకొంటుంది. గాలానికి దూరంగా తొలగిపోయేది తప్పించుకొంటుంది. దొంగతనం మొదలైన పాపాలు చేద్దామనే శోధనలు వచ్చినపుడు మనం ఆ శోధనతో పోరాడాలి. కాని మోహపాపాలు చేద్దామనే శోధనలు వచ్చినపుడు వానితో పోరాడకూడదు. వాని నుండి పారిపోవాలి. లేకపోతే మన యీ జంతుదేహం కామావేశానికి గురై ఉద్రేకం చెందుతుంది. ఆధ్యాత్మిక జీవితంలో ఇది బాగా ఉపయోగపడే సూత్రం. పైగా, నేటి యుగం లైంగికయుగం. లోకం మనలను లైంగిక సుఖాల ననుభవించమని శతవిధాల ప్రోత్సహిస్తుంది. ఎటుమళ్ళినా లైంగిక దృశ్యాలను చూపిస్తుంది. లైంగిక విలువలే నిజమైన విలువలని చాటిచెప్తుంది. ఈలాంటి వాతావరణంలో ఎంతో చిత్తశుద్ధి కలవాళ్ళేగాని లైంగిక ప్రలోభాలకు తట్టుకొని నిలువలేరు.

తరచుగా మనం క్రియాపూర్వకంగా చేసినవి మాత్రమే పాపాలనుకొంటాం. హృదయాలలోని ఆశలుకూడ పాపాలేనని గ్రహించం. శారీరక వ్యభిచారంతోపాటు మానసిక వ్యభిచారం కూడ వుంది. "కామేచ్ఛతో పరస్త్రీవైపు చూస్తే ఆమెతో మనస్సున వ్యభిచరించినట్లే" - మత్త 5,28.

ఈ సందర్భంలో నేత్రవినీతి ఎంతో అవసరం. మనకండ్లు మన ఆత్మకు కిటికీల్లాంటివి. వాటిగుండా మంచి భావాలుగాని చెడ్డ భావాలుగాని మన ఆత్మలోకి ప్రవేశిస్తాయి. కనుక మనం గొంతెమ్మ కోరికలు కోరుకొంటూ దారినపోయే వారి నందరినీ చూస్తూంటే చెడుకోరికలను కొనితెచ్చుకొన్నట్లవుతుంది. లైంగిక రంగంలో స్పర్శకూడ చాల ప్రమాదకరమైంది. అసలు లైంగిక సుఖమంతా స్పర్శలోనే వుంటుంది. కనుక దురుద్దేశంతో పరస్త్రీ లేక పర పురుషుని శరీరాన్ని ఎంతమాత్రం ముట్టుకోకూడదు. ఇంకా, మోహాలోచనలను మనసులోనికి రానీయకూడదు. వాటిని మనసులో నిలవనీయకూడదు.

కొంతమంది తీరికగా గూర్చుండి లైంగికమైన కోరికలు కోరుకొంటూ తీయని ఊహలతో నిమిషాలూ గంటలూకూడ గడిపివేస్తూంటారు. ఇది చాల చెడ్డ పద్ధతి. నిప్పును పట్టుకొంటే కాలకుండా వుంటుందా? బొగ్గును తాకితే మసి కాకుండా వుంటుందా?

సోమరితనానికీ కామవాంఛలకూ దగ్గరి సంబంధం వుంది. మనం కష్టపడి పనిచేసుకొంటూన్నంత కాలం కామవాంఛలు అట్టే తలయెత్తవు. కాని సోమరితనంతో పనిని మానివేసి తీరికగా కూర్చుంటే ఈలాంటి కోరికలు ఎక్కువౌతాయి. కనుక కష్టపడి పనిచేసికోవడం ఈ దుష్టవాంఛలకు విరుగుడులాంటిది.

కామవాంఛలను అరికట్టడానికి ఒక సాధనం దైవసాన్నిధ్యాన్ని జ్ఞప్తికి తెచ్చుకోవడం. మనం గ్రహించినా గ్రహించకపోయినా అందరంకూడ నిరంతరం దేవుని సాన్నిధ్యంలోనే వుంటాం. ఆ ప్రభువు కర్మసాక్షి. నరుల పనులన్నిటిని గమనించేవాడు. మహాపవిత్రుడైన ఆ దేవుని సమక్షంలో చెడ్డపనులు ఏలా చేయగలం? ఈలాంటి భక్తి భావంతోనే యోసేపు సూసన్నలాంటి పుణ్యాత్ములు కామశోధనల నుండి తప్పించుకొన్నారు. ఆ మహానుభావులు మనకుకూడ ఆదర్శంగా వుంటారు.

ఇంద్రియ వాంఛలను జయించాలంటే ప్రార్థనం అత్యవసరం. మనకు సాధ్యమైంది మనం చేయాలి. సాధ్యంగానిదాని కొరకు దేవుణ్ణి ప్రార్థించాలి. మనంతట మనం భోగవాంఛలను జయించలేం. ప్రార్థన దయచేసే దివ్యశక్తి వల్ల క్రమేణ లైంగిక వాంఛలను జయించగల్గుతాం. అలాగే, దేవద్రవ్యానుమానాలుకూడ ఈ జంతువాంఛలను జయించడానికి సాయపడతాయి. భక్తిగల పాపోచ్చారణంవల్ల ఈ రంగంలో మనం చేసే పాపాలకు ప్రాయశ్చిత్తం చేసికొంటాం. భావి పాపాలనుండి తప్పించుకోవడానికి వలసిన శక్తినిగూడ పొందుతాం. దివ్యసత్ప్రసాదంలో మహా పవిత్రుడైన దేవుణ్ణి స్వీకరిస్తాం. ఆ ప్రభువు పావిత్ర్యం మన జంతు వాంఛలను అణచివేసి మనకు దివ్యత్వాన్ని ప్రసాదిస్తుంది. మోహవాంఛలను జయించాలంటే దివ్యసత్ప్రసాదాన్ని మించిన సాధనంలేదు. ప్రభువు అగస్టీను భక్తునితో "అన్ని భోజనాలు మీలోనికి మారతాయి. కాని ఈ భోజనం మాత్రం మిమ్ము నాలోనికి మార్చుకొంటుంది" అని చెప్పాడు. కనుక మనం ఈ దివ్యభోజనాన్ని యోగ్యంగా భుజించి దేవునిలోనికి మారుతూండాలి.

## 5. ఆత్మ శోధనం

1. ఒక్కొక్కడికి ఒక్కో ప్రధాన దుర్గుణం వుంటుంది. కొందరి బలహీనత ప్రధానంగా లైంగికరంగంలో కన్పిస్తుంది. నీవుకూడ ఈ బలహీనత కలవాడివి కాదు కదా?
2. నీవు మోహాన్ని రెచ్చగొట్టే పరిస్థితులనుండి చిత్తశుద్ధితో ప్రక్కకు తప్పుకొంటూంటావా లేక మూర్ఖంగా వాటిల్లో తలదూరుస్తుంటావా?

3. నీవు ప్రస్తుత లైంగికయుగ ప్రభావానికి సులభంగా లొంగిపోతుంటావా లేక దైవభక్తితో ఆ ప్రభావాన్ని ఎదిరించి నిలుస్తూంటావా?
4. సినిమాలు, టీవీలు, సెక్సుసాహిత్యం, చెడుస్నేహాలు మొదలైన వాటిద్వారా అనవసరంగా నిన్ను నీవు ఉద్రేకపరచుకోవు గదా?
5. లైంగిక వాంఛలకు సంబంధించినంత వరకు నీ హృదయంలోని కోర్కెలు ఏలా వుంటాయి? నీవు కామసంబంధమైన పగటికలలు కంటూంటావా?
6. నీవు నేత్రవినీతిని పాటించడం, కామేచ్ఛతోగూడిన స్పర్శకు దూరంగా వుండడం మొదలైన విషయాల్లో జాగ్రత్తగా వుంటూంటావా?
7. భిన్నలింగం గల వ్యక్తులతో మెలిగేప్పుడు నీ చూపులు నిర్మలంగా వుంటాయా? నీ మాటల్లో ద్వంద్వార్థాలు వుండవు కదా? నీవు పాపపు సరసాలకు దిగవు కదా?
8. ఏ పురుషుని మీదనైనా, లేక ఏ స్త్రీ మీదనైనా నీకు అక్రమమైన లైంగికవాంఛ వుందా?
9. తాజెడిన కోతి వనమెల్ల చెరిచింది అన్నట్లుగా నీవు చెడింది చాలక నీ స్నేహితులను గూడ చెడగొట్టడం లేదు కదా?
10. దేవమాతపట్ల భక్తి చూపితే ఆ తల్లి మనలను కామవాంఛల నుండి కాపాడుతుంది. ఈ యనుభవం నీకేమైనా వుందా?

# 6. సోమరితనం

## 1. సోమరితనం అంటే యేమిటి?

పనిపాటలు లేకుండా వుండిపోవడమే సోమరితనం. సోమరితనమనేది మొదట మనసులో వుంటుంది. ఆ మీదట క్రియల్లోకి ప్రవేశిస్తుంది. అనగా మనం మొదట పని మాని వేయాలని కోరుకొంటాం. తర్వాత, కోరుకొన్నట్లుగానే మానివేస్తాం. సోమరిపోతులు శ్రమను తప్పించుకొని తిరుగుతారు. పరాన్నభుక్కుల్లాగ ఇతరులమీద ఆధారపడి జీవిస్తారు.

సోమరితనంలోగూడ హెచ్చుతగ్గులుంటాయి. కొందరు అసలు పనిని చేపట్టనే చేపట్టరు. మరికొందరు పనిని చేపడతారు గాని దాన్ని ముగించరు. ఇంకా కొందరు పనిని ముగిస్తారు. కాని దాన్ని సంతృప్తికరంగా ముగించరు. పాలుమాలిక భౌతికరంగంలోను వుంటుంది. ఆధ్యాత్మికరంగంలోను వుంటుంది.

## 2. సోమరితనంలోని దుష్టత్వం

నరుడు కష్టపడి పనిజేయాలన్నది దైవశాసనం. తొలి మానవుడైన ఆదాము తోటలో పనిచేయవలసి వచ్చింది. ఏదెను తోటను సాగుచేయడానికీ కాపాడ్డానికీ ప్రభువు

అతన్ని ఆ తోటలో వుంచాడు - ఆది 2,15. భాగ్యస్థితిలో వుండికూడ అతడు పనిని ఎందుకు చేయవలసి వచ్చింది? కృషిద్వారా కాని ఆదాము పూర్ణ మానవుడు కాలేదు. అతడు దేవునిలాగ స్వయంపూర్ణుడైన ప్రాణికాదు. పనిద్వారా కాని అతనికి పరిపూర్ణత సిద్ధించదు. ఇది నరుడు పాపం చేయకముందటి పరిస్థితి. ఆ దశలో అతనికి పని కష్టమనిపించలేదు. ఐనా అతడు పనిమాత్రం చేసితీరాలి.

ఇక పాపంచేసాక పని ఆదాముకి శిక్షగా మారింది. అతడు నొసటి చెమటోడ్చి పొట్టకూడు సంపదించుకోవలసి వచ్చింది - ఆది 3,19. అతడు సేద్యంచేస్తుంటే నేల ముండ్ల తుప్పలనూ గచ్చపొదలనూ మొలపిస్తూంటుంది. ఈ దశలో నరునికి పని కష్టమనిపించింది.

కనుక నరుడు పరిపూర్ణుడు కావడం కొరకూ, శిక్షగా కూడ పనిచేయాలి. కావున పని నొల్లని సోమరిపోతు రెండందాల పాపం చేసినట్లవుతుంది.

## 3. బైబులు దృష్టాంతాలు

1. నరుడు చీమలను చూచి బుద్ధి తెచ్చుకోవాలన్నాడు సొలోమోనురాజు :

“సోమరీ! చీమలను చూడు
వాటి జీవితాన్ని చూచి బుద్ధి తెచ్చుకో
వాటికి నాయకుడు లేడు,
పర్యవేక్షకుడు లేడు, అధికారి లేడు
ఐనా అవి వేసవిలో ఆహారం చేకూర్చుకొంటాయి
కోతకాలంలో ధాన్యం సేకరించుకొంటాయి
సోమరీ! నీవు ఎంతకాలం పండుకొనివుంటావు?
ఎప్పుడు నిద్ర మేల్కొంటావు?
దారిద్ర్యం దోపిడికానివలె నీ మీదికి వస్తుంది
పేదరికం ఆయుధహస్తునివలె నీమీదికి వస్తుంది” - సామెత 6,6-11.

ఈ రాజే క్రియాపరుడు కాని నరుణ్ణి యీలా వర్ణించాడు :
“బయట సింహముంది అది నన్ను వీధిలో చంపుతుంది
అని సోమరిపోతు ఇల్లు కదలడు” - సామె 22,13.
ఇంకా, బద్ధకింపు మనుష్యులను గూర్చి అతడు ఈలా చెప్పాడు :
“సోమరిపోతు మూర్ఖుడూ ఐన ఒకానొక నరుని
పొలం ప్రక్కగాను ద్రాక్షతోట ప్రక్కగాను నేను నడచివెళ్ళాను
ఆ పొలంనిండా ముండ్లూ, కలుపూ ఎదిగి వున్నాయి
దాని చుట్టూవున్న రాతిగోడ కూలిపోయింది” - సామె 24,30-34

2. పాలుమాలికవల్ల ఎన్నో శోధనలు పుట్టుకవస్తాయి. కనుకనే సీరా గ్రంథం "సోమరియైన బానిస చెడ్డపనులకు పూనుకొంటాడు" అని చెప్తుంది - 33,27. సోమరిగా తిరిగే వాడికి విశేషంగా సుఖభోగాలమీద కోరికలు పుడతాయి. వాటివలన నరుని శీలం చెడుతుంది.

3. "మంచి పండ్లనీయని ప్రతిచెట్టునీ నరికి అగ్నిలో పడవేస్తారు" అన్నాడు ప్రభువు - మత్త 3,10. సోమరిపోతుకీ ఇదేగతి పడుతుంది. కనుక ఎవడి అంతస్తుకి తగినట్లుగా వాడు పనిచేయాలి. ఇక్కడ కష్టపడి పనిచేయడం చెట్టు బాగా ఫలించడం లాంటిది. పనిచేయకపోవడం చెట్టు ఫలించకపోవడం లాంటిది.

4. మనం మన పనులను చక్కగా చేసాకగూడ మేము అంత సాధించాం. ఇంత సాధించాం అని డప్పాలు కొట్టకూడదు. "మేము అయోగ్యులమైన సేవకులం, మేము మా కర్తవ్యాన్ని మాత్రం నెరవేర్చాం" అని పలకాలి - లూకా 17,10. క్రియాపరుడే డప్పాలు కొట్టకూడదు అంటే, ఇక అసలు పని చేయనివాని గతి యేమిటి?

5. పౌలు తన జీవితాంతంలో ఈలా చెప్పుకొన్నాడు. "నేను మంచి పోరాటం పోరాడాను. పందెంలో చక్కగా పరుగెత్తాను. నా విశ్వాసాన్ని నిలబెట్టుకొన్నాను. ఇప్పుడు నాకు పందెం బహుమానంగా నీతిమంతుల కిరీటం లభించబోతూంది. ఒక్క నాకే గాదు, ప్రభువుకోసం వేచివున్నవాళ్ళ కందరికీ ఈ కిరీటం లభిస్తుంది - 2తిమో 4,7-8. మనం కూడ ఈ పౌలులాగ కృషిచేసి ఇతనిలాగ కిరీటాన్ని సంపాదించుకొంటే ఎంతబాగుంటుంది!

6. పనిపాటలు మానివేసి వీధులవెంట తిరిగే పోస్కోలురాయుళ్ళు తెస్సలోనిక పట్టణంలో పౌలు కంటబడ్డారు. అతడు వాళ్ళను నిశితంగా మందలించి "పనిచేయని వాడు కూడు తినడానికి అర్హుడు కాదు" అని శాసించాడు -2తెస్స 3,10.

## 4. సోమరితనాన్ని అరికట్టే మార్గాలు

సోమరిపోతులకు పనిచేయబుద్ధి కాదు. ఏదో సాకుతో పనిని తప్పించుకో జూస్తూంటారు. మనం ఈ బుద్ధిని అవశ్యం మార్చుకోవాలి. దరిద్రులూ ధనికులూ అందరూ పని చేయవలసిందే. నరుడు తన కొరకూ ఇతరుల కొరకుకూడ పనిచేయాలి. కాయలు కాయడం చెట్టు ధర్మం. అలాగే పనిచేయడం నరుని ధర్మం - లూకా 13,7.

అందరూ జీవితాంతమూ శ్రద్ధతో పనిచేస్తూండవలసిందే. పనిని మానివేసిన మనిషికి విసుగు పుడుతుంది. తానెందుకు జీవించాలో అర్థంకాదు. అతడు తనకు తానే భారమౌతాడు. పైగా పరాన్నభుక్కు కూడా ఔతాడు. అలాంటివాణ్ణి లోకం అసహ్యించు కొంటుంది. మన కుటుంబంకూడ మనం పనిచేసి ప్రతిఫలాన్ని గడించాలనే కోరుకొంటుంది. మన కృషి వల్ల కుటుంబం బ్రతకాలి. కనుక మనం సోమరితనంగా కాలం వెళ్ళబుచ్చకూడదు.

మన మోక్షాన్ని మనమే సిద్ధం చేసికొంటాం. అది మనం ఈ లోకంలో చేసే కృషిమీద ఆధారపడి వుంటుంది. ఇక్కడ శ్రమపడి సత్కార్యాలు చేసినవాళ్ళు అక్కడ మహిమ గల సింహాసనాన్ని సిద్ధం చేసికొంటారు. కనుక మన పనిని మనం చక్కగాజేసి ప్రభువుకి అర్పించాలి. అతడు దానికి తగిన బహుమతిని దయచేస్తాడు. ద్రాక్షతోట యజమానుడు చివరిజట్టు కూలీలను జూచి "మీరు దినమంతా పనిపాటలు లేక ఇక్కడ నిలచి వున్నారేమి" అని ప్రశ్నించాడు - మత్త 20,6. ఈనాడు ప్రభువు మనల్ని కూడ ఈలాగే ప్రశ్నిస్తాడు. ఇంకా, శ్రమపడి పనిచేయడం ద్వారా మన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసికొంటాం. ఉత్తరించే స్థలంలో మనం అనుభవించే బాధలను కొంతవరకైనా తగ్గించుకొంటాం. కనుక మనం ఏ ప్రొద్దూ కష్టపడి పని చేయాలి.

పైగా, మనది పేదదేశం. మనవంతు పని మనం చేసి ఈ దేశాన్ని వృద్ధిలోకి తీసికొని రావాలి. దేశంలో రోజురోజుకీ సోమరితనం పెరిగిపోతూంది. పనిచేసేవాడు దద్దమ్మ, పనిని తప్పించుకొని తిరిగేవాడు తెలివైనవాడు అనే భావాలు ప్రచారంలోకి వస్తున్నాయి. కాని యివి దుష్టవిలువలు. వీటిని మనం అంగీకరించగూడదు.

చాలామందికి ప్రతిఫలాపేక్ష యెక్కువ. ఈలాంటివాళ్ళు తాము చేసేపనికి ఎంత సొమ్ము ముడుతుందా అని మాత్రమే ఆలోచిస్తారు. ఇది స్వార్థబుద్ధి. మనకు సేవాభావం వుండాలి. మన కృషివల్ల పదిమంది బాగుపడితే అదే మహాభాగ్యం అనుకోవాలి.

మనం చేసే పనిని గూడ చక్కగా చేయాలి. కొందరు పై యధికారులు చూస్తుంటే ఏదో కొంత పని చేస్తారు. లేకపోతే లేదు. ఇది వంచన. ఎవడు చూచినా ఎవడు చూడకపోయినా భగవంతుడు మన పనిని చూస్తాడు, మెచ్చుకొంటాడు. కనుక మన పనిని మనం అరకొరలుగా చేయకూడదు. ఏమి చేసినా మనసుపెట్టి చేయాలి. అప్పుడు ప్రభువు "ఓయి! నీవు మంచి బంటువి. నీవు స్వల్పకార్యాల్లో శ్రద్ధ చూపించావు కనుక అనేకకార్యాలు నీ కప్పగిస్తాను" అని మనలను మెచ్చుకొంటాడు - మత్త 25,23.

## 5. ఆత్మ శోధనం

1. నీవు శ్రమపడి పనిచేసేవాడివా లేక వళ్ళు దాచుకొనేవాడివా?
2. నీవు నీ వృత్తికి న్యాయం చేకూర్చుతున్నావని చెప్పగలవా? నీవు అరకొరలుగా, పట్టీపట్టనట్లుగా పనిచేసేవాడివి కాదు గదా?
3. నీవు నీ పనికి సకాలంలో హాజరవుతుంటావా? దానికి వినియోగించవలసినంత కాలం వినియోగిస్తుంటావా?
4. నీవు ప్రతిఫలాపేక్ష యెక్కువా, లేక సేవా భావమెక్కువా?
5. నీవు పై యధికారులు తనిఖీకి వచ్చినపుడూ, లేక వాళ్ళు మెప్పు కోరడానికీ మాత్రమే పనిచేస్తుంటావా లేక చిత్తశుద్ధితో నీ బాధ్యతను నీవు సంతృప్తికరంగా నెరవేరుస్తూంటావా?

6. నీవు నీ ప్రధాన వృత్తితోపాటు నీ కిష్టమైన చిన్న తరహా పనులను గూడ (హాబీలు) ఒకటి రెండు చేపట్టవచ్చు గదా?
7. ఆటంకా లెదురైనపుడు పట్టుదలతో నీవు చేపట్టిన పనిని కొనసాగిస్తూంటావా లేక దాన్ని సులభంగా వదలివేస్తుంటావా? నీవు చేపట్టిన కార్యం విజయవంతం కానపుడు నిరుత్సాహభావాలకు లొంగిపోవుకదా?
8. చక్కగా పనిచేసినపుడు అంతరాత్మ ఓ విధమైన సంతృప్తిని కలిగిస్తుంది. ఈ యనుభవం నీకేమైనా వుందా?
9. ఒకవేళ నీవు కష్టపడి పనిచేసేవాడివైతే, అందరూ నిన్ను మెచ్చుకోవాలని కోరుకొంటావా? అలా మెచ్చుకోకపోతే నిరుత్సాహపడుతూంటావా?
10. నీ దప్పు నీవు వాయించుకొంటూంటావా? నీ బూర నీవు ఊదుకొంటూంటావా?

# 7. దురాశ

## 1. దురాశ అంటే యేమిటి?

ఈ లోకవస్తువులను మితంమీరి కూడబెట్టుకోవాలని కోరుకోవడమే దురాశ.

దురాశని అర్థం చేసికోవాలంటే ఒక మూలసూత్రాన్ని బాగా గ్రహించాలి. భగవంతుడు ఈ లోకవస్తువులను మన లాభానికీ, ఇతరుల లాభానికీగూడ దయచేసాడు. కాని మనం వాటిని కేవలం మన లాభానికి మాత్రమే వాడుకోజూస్తాం. వాటిని కేవలం మనమే దక్కించుకోజూస్తాం. దురాశ ఇక్కడే వుంది.

భగవంతుడు లోకవస్తువులను నరులందరి లాభానికీ ఉద్దేశించాడు. వాటిని వాడుకొని మనం వృద్ధిలోకి రావాలి. వాటిద్వారా మన శక్తిసామర్థ్యాలను పెంపొందించుకోవాలి. ఉదాహరణకు, భూమి ఆహారపదార్థాలు జలం విద్యుత్తు డబ్బు మొదలైన వాటిని మనం నిరంతరంర వాడుకొంటూంటాం. ఈ వస్తువులు లేందే మన మనుగడ సాగదు. కాని ఈ వస్తువులను మనం పూర్తిగా మన సొంతం చేసికోగూడదు. వాటిని మనకు కావలసినంతగా వాడుకొని మిగిలిన భాగాన్ని తోడి ప్రజలకు వదలివేస్తుండాలి. అసలు మనకు లోక వస్తువులను వాడుకొనే హక్కు వుందేగాని వాటిమీద యాజమాన్యం నెరపే హక్కు లేదు. వాటిమీద యాజమాన్యం కలవాడు దేవుడొక్కడే. ఐనా మనం దుర్బుద్ధివల్ల లోకవస్తువులమీద సులభంగా యాజమాన్యం నెరపబోతాం. వాటిని మితంమీరి కూడబెట్టుకోబోతాం. వాటిని పూర్తిగా మనం వశం చేసికోబోతాం. వాటిని ఇతరులకు, విశేషంగా పేదసాదలకు, దక్కనీయం. ఉదాహరణకు, నరుడు తనకు కావలసినంత భూమిని మాత్రమే వాడుకొని మిగిలిన నేలను ఇతరులకు వదలివేయాలి. కాని కొందరు తెలివైనవాళ్ళూ బలవంతులూ నేలలో అధిక భాగాన్ని ఆక్రమించుకొన్నారు.

ఇతరులకు నేల ఏమాత్రం దక్కకుండ జేసారు. కనుకనే భూస్వాములు కూలీలు అనే రెండు వర్గాలు ఏర్పడ్డాయి. వీళ్ళలో ఒక వర్గానికి మితం మీరిన భూమివుంటే మరో వర్గానికి ఇల్లు వేసికోవడానికి సెంటు నేలకూడ లేకుండా పోయింది. ఇదే దురాశ.

దురాశ చాల చెడ్డది. ఈ లోక వస్తువులను మితంమీరి కూడబెట్టుకోవడంవల్ల మనం మూడు పాపాలు చేస్తాం.

మొదటిది, సంపదను సంపద కొరకే ఆశిస్తాం. సంపదవలన అధికారమూ గౌరవమూ శక్తీ ఆనందమూ కలుగుతాయి. కనుకనే నరులు సొత్తును అంత మక్కువతో ఆశిస్తారు. కొందరైతే దానిమీదనే పంచప్రాణాలు పెట్టుకొంటారు. దాన్ని దైవంగా భావించి ఆరాధిస్తారు. పూర్వం యిస్రాయేలు ప్రజలు బంగారు దూడను కొల్చారని వింటున్నాం. డబ్బుని ఓ విగ్రహంగా పూజించే వాళ్ళుకూడ తక్కువేమీకాదు. ఈ సృష్టిలో దేవుడొక్కడే తన కొరకు తాను ఆశింపదగినవాడు. కనుక ధనాన్ని దానికొరకు దాన్ని ఆశించకూడదు.

రెండవది, సంపదలను ఆర్జించేవాళ్ళు తరచుగా అపమార్గంలో ఆర్జిస్తారు. లోకానికి అర్థంకాని సూక్ష్మరీతిలో ఇతరులకు ముట్టవలసిన ఆదాయాన్ని తాము కొట్టేస్తారు. పక్కవాడి హక్కులకు భంగం కలిగించి వాడికి చెందవలసింది తమ యింటికి తెచ్చుకొంటారు. లేకపోతే చుట్టూరా వున్నవాళ్ళు పేదవాళ్లుగా వుండిపోవడమేమిటి, తాము మాత్రమే ధనవంతులు కావడమేమిటి? చుట్టుపట్ల వాళ్ళకి ముట్టవలసింది తాము దక్కించుకోవడంవల్లనే కదా? లోకంలో చట్టసమ్మతమైన అన్యాయం బోలెడంత వుంది. దీన్ని మనం అట్టే గమనించం.

మూడవది, సంపదలను సరిగా వినియోగించుకోం. ఉన్నవాళ్ళు చాలమంది తమ డబ్బును సరిగా ఖర్చుచేయనే చేయరు. అత్యాశతో ఆ ధనాన్ని ఇంకా వృద్ధిచేసికో గోరుతారు. డబ్బువల్ల అధికారమూ గౌరవమూ లభిస్తాయని చెప్పాంగదా? కనుక ధనవంతులు తమ సొమ్మని వదలుకోవడానికి ఎంతమాత్రం ఇష్టపడరు. దాన్ని పేదసాదలకు ఖర్చుపెట్టరు. విద్య ఆరోగ్యం మొదలైన సత్కార్యాలమీద వెచ్చించరు. ఈ దుర్గుణం పిసినిగొట్టుల్లో చాల యెక్కువగా వుంటుంది. కాని ధనవంతులందరూ కొంతవరకు పిసినిగొట్టులే. దేవుడు లోకవస్తువులను నరులందరి కొరకూ సృజించాడనీ, మనకక్కరలేని వస్తువులను ఇతరులతో పంచుకోవాలనీ ముందే చెప్పాం. కలిమికలవాళ్ళు ఈ సూత్రాన్ని నిరంతరమూ మీరుతూనే వుంటారు.

## 2. దురాశలోని దుష్టత్వం

దురాశలో చాల దుష్టగుణాలున్నాయి. కొన్నిటిని పరిశీలిద్దాం.

దురాశ అంటే దేవుణ్ణిగాక లోకవస్తువులను నమ్మడం. పరలోకపు తండ్రి ఆకాశపక్షులను పోషించేవాడు. గడ్డిమొక్కలకు పూబుట్టలు దయచేసేవాడు. ఐనా ఆశాపరుడు

అతన్ని నమ్మడు. సంపదలనే నమ్ముతాడు. అతడు దేవునిమీద గాక తన సొత్తుమీదనే ఆధారపడతాడు - కీర్త 52,7.

మన హృదయంలో దేవుడు రాజ్యం చేయాలి. కాని ఆశాపరుల హృదయంలో లోకవస్తువులు రాజ్యాం చేస్తాయి. వాళ్ళ హృదయం భగవంతునికిగాక అతడు చేసిన వస్తువులకు అర్పితమౌతుంది. వాళ్లు విగ్రహారాధకు లౌతారు. ఏ నరుడూ దేవుణ్ణీ ద్రవ్యాన్నీ సేవించలేడు. దేవుణ్ణి కొల్చేవాడు ద్రవ్యాన్ని కొలవడు. ద్రవ్యాన్ని కొల్చేవాడు దేవుణ్ణి కొలవడు. కనుకనే ప్రభువు ఇద్దరు యజమానులను సేవించవద్దన్నాడు - మత్త 6,24.

సంపదలను ఆర్జించేవాళ్ళు తరచుగా ఇతరులను మోసగిస్తారు. ఇతరులకు ముట్టవలసింది తాము కొట్టేస్తారు. ఈ యన్యాయాన్ని చట్టం అంగీకరిస్తుంది. ఐనా ఇది అన్యాయమే. తోడినరుడు తిండిలేక బాధపడుతుంటే నేనొక్కణ్ణి సుఖించడం ఏమి న్యాయం? వాడికి తెలివీ శక్తి లేదుకదా అని వాడికి దక్కవలసింది నేను గుంజుకొని పోవడం ఏమి ధర్మం?

సంపదలకు మన హృదయాన్ని వశంచేసికొనే విచిత్రమైన శక్తి వుంది. ఆ శక్తికి లొంగిపోయినవాడు ఇక భగవంతుణ్ణి పట్టించుకోడు. ఇది గొప్ప అనర్థం. అవివేకియైన ధనికుడు ఈలాంటివాడే. అతడు "నాకు అనేక సంవత్సరాలకు సరిపడే సంపదలున్నాయి. నేను సుఖంగా తిని త్రాగుతాను. ఇక దేవుణ్ణి పట్టించుకోను" అనుకొన్నాడు - లూకా 12,16-21.

దురాశలో ఇంకో దుర్గుణం కూడ వుంది. ఆశాపరులు తమ హృదయాన్ని కఠినం చేసికొంటారు. తోడిప్రజల కష్టాలను పట్టించుకోరు. వాళ్ళకు సాయం చేయరు. ధనవంతుడు రోజూ విందులారగిస్తూ తన వాకిట పడియున్న నిరుపేదయైన లాజరుని పట్టించుకోలేదని వింటున్నాం - లూకా 16,19-21. సంపదలవల్ల మన గుండె మొద్దువారుతుంది. ఇక మనకు పేదసాదలమీద కరుణ వుండదు.

## 3. బైబులు దృష్టాంతాలు

1. యోషువా సైనికుల్లో ఆకాను వొకడు. ఆ రోజుల్లో యిస్రాయేలీయులు శత్రుపట్టణాలనూ వాటిల్లో దొరకిన సొత్తునుగూడ కాల్చి నాశం చేసేవాళ్లు. కాని అకాను హాయి అనే పట్టణంలో దొరకిన సొమ్ములో కొంతభాగం, అనగా పట్టుబట్టలూ నాణాలూ రహస్యంగా దాచిపెట్టుకొన్నాడు. దానివల్ల యోషువాకు యుద్ధంలో అపజయం కలిగింది. తరువాత అకాను నేరం బయటపడగా అతనికి మరణశిక్ష విధించారు - యోషు 7.

2. ఎలీషా ప్రవక్త సిరియా సైన్యాధిపతియైన నామానుకి కుష్ఠనయంచేసి అతనినుండి ఏమీ ప్రతిఫలం పుచ్చుకోలేదు. ఎలీషా శిష్యుడైన గేహసీ మాత్రం నామాను వెంటబోయి మా గురువుగారు అడుగుతున్నారని బొంకి అతనినుండి నాణాలు ఇప్పించుకొని

వచ్చాడు. ఎలీషా నామానుని వదలిన కుష్ఠ నిన్ను పట్టిపీడిస్తుందని శిష్యుణ్ణి శపించాడు. ఆ శాపం అక్షరాలా నెరవేరింది - 2రాజు 5,20-27.

3. అహాబు రాజు తన మేడ ప్రక్కన వున్న నాబోతు అనే పేదవాని పొలాన్ని ఆశించాడు. కాని నాబోతు అతనికాపొలాన్ని అమ్మలేదు. కనుక రాజు దుర్మార్గులచే నాబోతు మీద కూటసాక్ష్యం చెప్పించి అతన్ని చంపించి అతనిపొలాన్ని స్వాధీనం చేసికొన్నాడు. అప్పుడు ఏలీయాప్రవక్త రాజుని కఠినంగా మందలించి ఆ పేదవాడి పొలంలోనే నీ నెత్తురు కుక్కలు నాకుతాయి పో అన్నాడు. తర్వాత అతడు చెప్పినట్లే జరిగింది -1రాజు 21,1-16.

4. సీరా గ్రంథం ఈలా చెప్తుంది :

"పేదలకిచ్చిందే నీవు భద్రపరచిన నిధియనుకో
అది నిన్ను సకలాపదలనుండి కాపాడుతుంది
బలమైన డాలుకంటె బరువైన యీటెకంటె గూడ అధికంగా
అది నీ శత్రువుతో పోరాడి నిన్ను రక్షిస్తుంది.

- 29,12-13.

5. ధనిక యువకుడు ప్రభువు శిష్యుడు కావాలని ఉబలాటపడ్డాడు. కాని ప్రభువు నీ యాస్తిని పేదలకు దానంజేసి నా వెంటరా అన్నాడు. కాని ఆ యువకుడు అధిక సంపదలు కలవాడు కనుక తన సొత్తుని వదలుకోడానికి మనసురాక క్రీస్తువెంట వెళ్ళలేదు - మత్త 19,21-22.

6. ఓ ధనికునికి పంటలు బాగా పండాయి. అతడు నేను సుఖంగా తిని త్రాగుతాను, దేవుణ్ణీ తోడినరుణ్ణీ పట్టించుకోను అనుకొన్నాడు. కాని ఆ రాత్రే ప్రభువు అతని ప్రాణాలు తీసాడు. ఇరుగుపొరుగువాళ్ళు వచ్చి అతని సొత్తంతా పంచుకొని పోయారు - లూకా 12,16-20.

7. యూదాలో దయ్యం ప్రవేశించింది. అతడు ఆసబోతుతనంతో గురువుని ముప్పయి వెండికాసులకు అమ్ముకొన్నాడు - లూకా 26,3-6.

8. యెరూషలేములోని తొలినాటి క్రైస్తవులు పేతురు ఆధిపత్యం క్రింద ఉమ్మడిజీవితం జీవిస్తుండేవాళ్లు. ఈ సమాజానికి చెందిన అననీయా సఫీరా అనే భార్యాభర్తలు పొలం అమ్ముకొన్నారు. వచ్చిన సొమ్ములో కొంతమాత్రమే పేత్రుకి ముట్టజెప్పి అతన్ని మోసగించారు. పేత్రు ఆ దంపతులను శపింపగా వాళ్ళు ధిడీలున నేలమీదపడి ప్రాణాలు విడచారు - అచ 5,1-11.

9. సకల అనర్థాలకు మూలం ధనాపేక్షే -1తిమో 6,10.

## 4. దురాశను వారించే మార్గాలు

దురాశను జయించాలంటే మనం కొన్ని సత్యాలను జాగ్రత్తగా గుర్తించాలి. మన జీవితాశయం సంపదలుకాదు, భగవంతుడు. కనుక సంపదలను ప్రోగుజేసికొనే రందిలో భగవంతుణ్ణి కోల్పోగూడదు. నరుడు లోకాన్నంతటినీ సంపాదించినా తన ప్రాణాన్ని కోల్పోతే ఏమి లాభం? - మార్కు 8,36.

లోకవస్తువులు మన అవసరాలు తీర్చడానికీ ఇతరులు అవసరాలను తీర్చడానికీగూడ ఉద్దేశింపబడ్డాయి. కనుక మనం వాటిని అమితంగా ప్రోగుజేసికోగూడదు. మన అక్కరలు తీరిన పిదప మిగిలిన వస్తువులను పేదసాదలతో పంచుకోవాలి. కనుక డబ్బున్నవాడు పేదలకు సాయంచేయాలి. ఈ సత్కార్యంద్వారా మనం వస్తుప్రీతినీ వస్తు వ్యామోహాన్నీ అణచుకొంటాం.

మనకు ఈలోక వస్తువులను ఉపయోగించుకొనే హక్కువుందే కాని వాటిమీద యాజమాన్యం నెరపే హక్కులేదు. కనుక దేవుడు మన చేతిలో పెట్టిన వస్తువులకు మనం ఖచ్చితమైన లెక్క ఒప్పచెప్పాలి. అతడు ఖండితుడైన న్యాయాధిపతి. కావున మనం డబ్బుని దూబరాగా ఖర్చుచేసినా, అక్కరలోవున్న పేదలతో దాన్ని పంచుకోక పోయినా, శిక్ష ననుభవిస్తాం.

మనం పుడుతూ ఈ లోకంలోకి సంపదలను తీసికొని రాము. ఇక్కడి నుండి వెళ్ళిపోతూ సంపదల తీసికొనిపోము - 1తిమో 6,7. అవి నశ్వరమైన వస్తువులు. ఈ లోకానికి మాత్రమే చెందినవి. అందుచేత బుద్ధిమంతుడు పరలోకంలో సంపదలు కూడబెట్టుకోవాలి - మత్త 6,19-20. ఏలా? మన సొమ్ములో కొంతభాగం పేదలకు దానంచేయడం ద్వారా. మనం పేదసాదల అక్కరలు తీర్చాలి. పేదల కిచ్చినవాడు దేవునికే అరువిస్తున్నాడు. ఆ బాకీని దేవుడు వడ్డీతో సహ తీరుస్తాడు. నా శిష్యుల్లో అత్యల్పునికి మేలు చేసినవాడు నాకు మేలు చేసినట్లే నన్న ప్రభువు వాక్యం వుండనేవుంది - మత్త 25,40. ఇంకా, మన సొమ్ములో కొంతభాగాన్ని విద్య సాంఘికసేవ మొదలైన సత్కార్యాలకుగూడ వినియోగించాలి. వీటన్నిటిద్వారా మనం పరలోకంలో సంపదలు కూడబెట్టుకొంటాం. మన ధానధర్మాలు మోక్షంలో నిధులుగా నిలుస్తాయి - మత్త 6,19-20. కొంతమంది యెప్పుడూ తీసుకోవాలని చూస్తుంటారుగాని ఈయడానికి యెంతమాత్రం వొప్పుకోరు. కాని పుచ్చుకోవడం కంటె ఈయడం ధన్యమని గ్రహించాలి - అకా 20,35.

## 5. ఆత్మ శోధనం

1. నీవు వస్తువ్యామోహం కలవాడివా లేక ఆశను కొంతవరకైనా జయించినవాడివా?
2. లోకవస్తువులు మన ప్రయోజనానికి మాత్రమే కాక ఇతరుల ప్రయోజనానికికూడ సృష్టింపబడ్డాయి అన్న సూత్రాన్ననుసరించి, నీవు నీ యవసరాలను మించి విపరీతంగా వస్తువులు ప్రోగుజేసికోవుగదా?

3. సంపదలనే విగ్రహాన్ని ఆరాధించే మనస్తత్వం నీకు లేదా?
4. "సంపదలకు మన హృదయాన్ని వశం చేసికొనే విచిత్రమైన శక్తి వుంది" -- ఈ రంగంలో నీ యనుభవం ఏమిటి?
5. సుఖభోగాలు, ధనం ఆస్తి, పదవి, కీర్తిప్రతిష్ఠలు - మొదలైన లోకవస్తువుల్లో నీ వెక్కువగా ఆశించేది వేటిని?
6. నీవు పిసినిగొట్టువా లేక నీ కున్నదానిలో కొద్దో గొప్పో పేదలకు దానం చేసేవాడివా?
7. దురాశతో ఇతరులకు ముట్టవలసింది నీవు కొట్టేస్తుంటావా?
8. "బుద్ధిమంతుడు పరలోకంలో సంపదలు కూడబెట్టుకోవాలి" అంటే యేమిటి?
9. "పుచ్చుకోవడంకంటె ఈయడం ధన్యం" - ఎందుకు?
10. పేదవాళ్ళు మార్గాంతరం లేక పేదవాళ్ళుగా వుంటున్నారు గాని వాళ్ళల్లోగూడ ఆశలు బ్రహ్మాండంగానే వుంటాయి - ఈ రంగంలో నీ యనుభవం ఏమిటి?

# 2. నాల్గు నైతిక పుణ్యాలు

ప్రాచీనకాలంనుండి క్రైస్తవ రచయితలు నాలుగు నైతిక పుణ్యాలను పేర్కొంటూ వచ్చారు. అవి వివేకం, న్యాయం, ధైర్యం, మితత్వం. ఇవికాక యితర నైతిక పుణ్యాలుకూడ వున్నాయి. కాని నైతికపుణ్యాలన్నిటికీ ఈ నాల్గే ఆధార మౌతాయి. ఇక ఈ నాల్గింటినీ క్రమంగా పరిశీలిద్దాం.

## 1. వివేకం

### 1. వివేకం అంటే ఏమిటి?

లక్ష్యాన్ని సాధించడానికి అనువైన మార్గాన్ని ఎన్నుకోవడమే వివేకం. ఉదాహరణకు దానధర్మాలు చేయాలన్నది క్రైస్తవ లక్ష్యం. కాని మనం ఎవరికి, ఎప్పుడు, ఏలా, ఎంత దానంచేయాలో నిర్ణయించుకోవాలి. ఆ నిర్ణయాన్ని సరిగా చేసికొని దానం చేస్తే అది వివేకమౌతుంది. శాశ్వత గృహమైన మోక్షాన్ని చేరుకొని దేవుణ్ణి దర్శించడం మన లక్ష్యం. మోక్షాన్ని చేరుకోవడానికి తగినట్లుగా ఈ లోకంలోనే భక్తితో జీవించడానికి పూనుకొంటే అది వివేక మౌతుంది.

లౌకిక రంగంలో కూడ బోలెడంత వివేకముంటుంది. పరిశ్రమలు, వ్యాపారం, రాజకీయాలు మొదలైన వాటిల్లో వివేకంతో మెలిగి ప్రజలు డబ్బు కీర్తి మొదలైనవాటిని గడిస్తారు. ఇది లౌకిక వివేకం. దీనికి దేవునితో సంబంధం లేదు. ఉదాహరణకు సుమతీ శతకంలోని ఈ క్రింది పద్యం చూడండి.

"ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటికా మాటలాడి యన్యుల మనముల్
నొప్పింపక తానొవ్వక
తప్పించుక తిరుగువాడు ధన్యుడు సుమతీ"

ఈ పద్యం కేవలం లౌకిక వివేకాన్ని బోధిస్తుంది. కాని ఇక్కడ మనం చెప్పబోయేది ఆధ్యాత్మిక వివేకం. ఇది నిరంతరం దేవునితో సంబంధం కలిగి వుంటుంది. ఈ వివేకానికి ఆదర్శం క్రీస్తూ, నూత్న వేద బోధలూను. పునీతులు క్రీస్తు బోధల ప్రకారం జీవించారు. తిరుసభ ఈనాడు మనకు క్రీస్తు బోధలనే తిరిగి చెప్తాంది. కనుక పునీతుల జీవితాలూ తిరుసభ బోధలూ కూడ మన వివేకానికి ప్రేరణం కలిగిస్తాయి.

వివేకం ప్రధానంగా బుద్ధిశక్తికి సంబంధించింది. లక్ష్యసాధనకు ఏ మార్గాన్ని ఎన్నుకోవాలో బుద్ధిశక్తికే తెలుస్తుంది. కాని అలా యెన్నుకొన్న మార్గాన్ని బుద్ధిశక్తి ఒకోసారి అనుసరించలేదు. అప్పుడు చిత్తశక్తి రంగంలోకి దిగి బుద్ధిశక్తి తానెన్నుకొన్న మార్గాన్ని అనుసరించేలా చేస్తుంది.

వివేకంతో మెలగాలంటే ప్రధానంగా మూడు విషయాలవసరం. అవి చక్కగా ఆలోచించడం, సరైన నిర్ణయం చేసికోవడం, కార్యాచరణకు పూనుకోవడం. ఇక్కడ ఈ మూడంశాలను ఒకింత విపులంగా పరిశీలిద్దాం. మొదటిది, మనం చక్కగా ఆలోచించాలి. మొట్టమొదట మనం బాగా ఆలోచించాలి. ఆ మీదట ఇతరుల అనుభవం కూడ పరిశీలించాలి. ఏదైనా సమస్య ఎదురైనపుడు నరులు ప్రాచీన కాలంనుండి ఆ సమస్యను ఏలా పరిష్కరిస్తూ వచ్చారా అని విచారించి చూడాలి. ప్రధాన సత్యాల విషయంలో నరులు . అన్ని కాలాల్లోను ఒకేరీతిగా ప్రవర్తిస్తూ వచ్చారు. కనుక పూర్వుల అనుభవం మనకు పాఠం నేర్పుతుంది. ఇక ఆ సమస్యను ఈనాడు మన జీవితంలో ఏలా పరిష్కరించుకోవాలా అనిగూడ ఆలోచించాలి. ఉదాహరణకు మోక్షసాధనం అనే సమస్యనే తీసికొందాం. ఈ విషయంలో పూర్వకాలంనుండి భక్తులు చేసిన కృషి ఈనాడు మనకు మార్గదర్శకంగా వుంటుంది.

మనం స్వయంగా ఆలోచించి చూచినా, పూర్వం అనుభవాలు పరిశీలించినా, అన్ని సంగతులూ మనకు బోధపడవు. కనుక నిపుణులైనవారిని సలహా అడగాలి. ఒక తలకంటె రెండు తలలు మేలు. ఇతరులతో చర్చించినపుడు సమస్య మరింత స్పష్టమౌతుంది. ఆధ్యాత్మిక విషయాల్లో అనుభవజ్ఞులైన ఆత్మగురువులను సంప్రతించడం మంచిది. యెరూషలేములో యూదమత నాయకులు గమలియేలు సలహాను పాటించి తాము చంపదలచుకొన్ని అపోస్తలులను చంపకుండా వదలివేసారని వింటున్నాం - అచ 5,38-39.

రెండవది, నిర్ణయం. సలహా మొదలైనవి ముగిసిన తర్వాత ఒక నిర్ణయానికి రావలసింది మనమే. కాని ఈ నిర్ణయం చేసికొనేపుదు మనం రాగద్వేషాలకూ ఇష్టానిష్టాలకూ

లొంగిపోగూడదు. అపోహలకు తావీయకూడదు. సత్యప్రీతి అవసరం. ఏ పక్షాన బలమైన కారణాలు కన్పిస్తే ఆ పక్షాన్నే ఎన్నుకోవాలి. సమస్యను మనకు చేతనైనంతవరకు నిశితంగా అర్థంచేసికొని సత్యప్రీతితో చేసికొన్న నిర్ణయాన్ని దేవుడుకూడ ఆశీర్వదిస్తాడు.

మూడవది, మనం చేసికొన్న నిర్ణయాన్ని కార్యరూపేణ సాధించడానికి పూనుకోవాలి. కార్యాచరణంలో ఎదురయ్యే అవరోధాలను ముందుగానే పసికట్టాలి. ఆ యాటంకాలను దాటే మార్గాలనుగూడ తెలిసికోవాలి. అవసరమైన వాళ్ళనుండి సహాయాన్ని పొందాలి. లక్ష్యాన్ని సాధించేదాకా విసుగూ విరామమూ లేకుండా కృషి చేయాలి. కొందరు మంచి నిర్ణయాలే చేసికొంటారుగాని కార్యానికి మాత్రం వుపక్రమించరు. ఈలాగైతే విజయం సిద్ధించదు. పూవులు కాయలుగా మారినట్లే హృదయంలోని కోరికలు కార్యాలుగా రూపొందాలి.

వివేకం చాల విస్తృతమైన పుణ్యం. అది మనంచేసే అన్ని సత్కార్యాల్లోకి ప్రవేశిస్తుంది. మనం ఆచరించే అన్ని పుణ్యాలను నడిపిస్తుంది. వివేకంతో చేయందే ఏ సత్కార్యమూ ఫలించదు. అందుచేత అది ఓ ప్రత్యేక పుణ్యం అనడంకంటె అన్ని పుణ్యాలనూ ఫలభరింతం చేసే విశాల పుణ్యం అనడం మేలు.

## 2. వివేకం ఆవశ్యకత

నిత్యజీవితంలో వివేకం అత్యవసరం. మనం నిరంతరం పాపపు లోకంలో జీవిస్తూంటాం. ఇతరుల దుష్టచేష్టలు మనలనుగూడ పాపానికి పురికొల్పుతాయి. వివేకంగలవాడు ఈ పాపకార్యాలనుండి కొంతవరకైనా తప్పుకొంటాడు. ఈ గుణం లేనివాడు పాపప్రవాహంలోబడి కొట్టుకొనిపోతాడు.

ఒక్క పాపవిసర్జనకేగాదు, పుణ్యార్జనకుగూడ వివేకం అవసరం. పుణ్యాలనే రథమెక్కి మనం మోక్షానికి పయనిస్తాం. కాని ఈ రథసారథి వివేకమే. వివేకమే లేకపోతే మనం ఎప్పుడు ఏ పుణ్యాన్ని ఎంతవరకు ఆచరించాలో తెలియక పొరపాట్లు చేస్తాం. ఉదాహరణకు తోడి నరుల సేవలో అతిగా శ్రమించి ఆరోగ్యాన్ని చెడగొట్టుకొనేవాళ్ళున్నారు. ఆరోగ్యం దెబ్బతింటుందేమోనన్న భయంతో తాము చేయవలసిన సేవలు కూడ చేయక సోమరులై పోయేవాళ్ళుకూడ వున్నారు. ఇవి రెండూ అవివేక ప్రవర్తనలే. వివేకం ఈ రెండు వర్గాలవాళ్ళను సవరించి వాళ్ళు తోడివారికి చేయవలసినంత సేవ చేసేలా చేస్తుంది.

ప్రేషిత సేవ చేసే గురువులు మఠకన్యలు మొదలైనవాళ్ళకు ఈ పుణ్యం అత్యవసరం. గురువు ప్రసంగంలో చెప్పగూడని విషయాలు చెప్పకూడదు. జ్ఞానోపదేశం బోధించే వాళ్ళు అనవసరవిషయాలు చెప్పకూడదు. గురువు ప్రజల పాపోచ్చారణం వినేప్పుడు ఈ గుణం అత్యవసరం. అలాగే సాంఘిక సేవా కార్యక్రమాలు నడిపించేపుడు గూడాను.

ఉపాధ్యాయులు పిల్లలతో మెలిగేపుడూ, సంఘ పెద్దలు జనంతో మెలిగేపుడూ వివేకంతో ప్రవర్తించాలి. లేకపోతే అల్లరిపాలవుతారు.

కొందరు మాట్లాడేపుడు ఆచితూచి మాట్లాడతారు. వాళ్లు చెప్పినదానిలో సులభంగా తప్పుపట్టలేం. మరికొందరు మూడు మాటలు మాట్లాడితే ఆరు తప్పులు దొర్లుతాయి. మన మాటలు తీరులో జాగ్రత్త అవసరం.

ఈలాగే కొందరు ఏపని చేసినా నిదానంగా ఆలోచించి జాగ్రత్తగా చేస్తారు. గ్రుడ్డివాడు కర్రతో తడివి చూచుకొని గాని ముందుకి అడుగుపెట్టడు. నేర్పరియైనవాడి పనితీరు ఈలా వుంటుంది. కాని మరికొందరు ఏపని జేసినా పిచ్చిపిచ్చిగాను మూర్ఖంగాను చేస్తారు. మళ్లా మరొకరు వచ్చి ఆ పనిని సవరించివలసి వుంటుంది. అసలా పనిని ప్రారంభించకుండా వుంటేనే బాగుండేది అనిపిస్తుంది. ఈలా వివేకవంతులూ మూర్ఖులూ భిన్నభిన్నంగా ప్రవర్తిస్తారు.

## 3. బైబులు దృష్టాంతాలు

పూర్వవేదంలోని సీరా గ్రంథం, సామెతల గ్రంథం మొదలైన విజ్ఞాన గ్రంథాలు వివేకాన్ని మాటిమాటికీ పేర్కొంటాయి. ఈ వుదాహరణలు చూడండి :

"హితోపదేశంలేని ప్రజలు నశిస్తారు
చాలమంది హితోపదేశకులుంటే భద్రత కలుగుతుంది"

– సామె 11,14

"ఓర్పుగలవాడు వీరునికంటె ఘనుడు
నగరాన్ని జయించడంకంటె తన్ను తాను గెల్వడం మేలు

– సామె 16,32

"జ్ఞాని తగిన సమయం లభించేదాకా మౌనంగా వుంటాడు
కాని గొప్పలు చెప్పుకొనే మూర్ఖునికి ఉచిత సమయం తెలీదు"

- సీరా 20,7.

"పుణ్యం కోరుకోతగిందైతే
పుణ్యాలన్నీ జ్ఞానంయొక్క కృషినుండే పుడుతున్నాయి
మితత్వం, వివేకం, న్యాయం, ధైర్యం
మొదలైనవాటినన్నిటినీ జ్ఞానమే మనకు బోధిస్తుంది
ఈ జీవితంలో వీటికంటె విలువగలవేమీ లేవు"

– సొలోమోను జ్ఞాన 8,7.

కాని ఆ జ్ఞానగ్రంథాలు పేర్కొనేది తరచుగా లౌకిక వివేకం. మన దేశంలో పంచతంత్రం మొదలైన నీతిగ్రంథాలు కూడ ఈ లౌకిక వివేకాన్ని విరివిగా ప్రచారం

చేసాయి. ఆధ్యాత్మిక వివేకం నూత్నవేదంలోకాని స్పష్టంగా కన్పించదు. క్రీస్తుబోధలన్నీ వివేకానికి నిదర్శనాలే. ఉదాహరణకు ప్రభువు పండ్లనుబట్టి చెట్టు ఏలాంటిదో నిర్ణయించమన్నాడు - మత్త 7,17. శిష్యులు సర్పాలవలె జాగరూకులుగాను, పావురాలవలె నిష్కపటులుగాను మెలగాలన్నాడు - 10,16. నరులు చక్రవర్తివి చక్రవర్తికీ, దేవునివి దేవునికీ చెల్లించాలన్నాడు - 22,21. గోపురాన్ని కట్టగోరేవాడు ముందుగా తన చేతిలో డబ్బున్నదా లేదా అని ఆలోచించాలి, యుద్ధానికి బోయేరాజు ముందుగా శత్రురాజు తనకంటె బలవంతుడా కాదా అని పరిశీలించాలి అన్నాడు - లూకా 14,28-32.

పౌలు పేర్కొన్న సేవావరాల్లో వివేకంకూడ ఒకటి. ఈ వరంద్వారా మనలను దుష్టాత్మే నడిపిస్తుందో లేక సదాత్మే నడిపిస్తుందో తెలిసికొంటాం - 1కొ 12,10. యోహాను మొదటిజాబు "మీరు ప్రతిఆత్మను నమ్మకండి. ఆయా ఆత్మలు దేవుని సంబంధమైనవో కావో పరీక్షించండి. యేసుక్రీస్తు మనుష్యుడుగా వచ్చాడని వొప్పుకొనే ఆత్మ దేవుని సంబంధమైంది. అలా వొప్పుకోని ఆత్మ దేవుని సంబంధమైంది కాదు" అని చెప్తుంది - 1యోహా 4,1-3.

ఈ బైబులు దృష్టాంతాల సారాంశమేమిటంటే, క్రైస్తవుల్లో వివేకమనే పుణ్యం ఒకటుంది. మనం దాన్ని చక్కగా పాటించాలి. మనకు ఏ సమస్యను గూర్చయినా అనుమానం కలిగితే క్రీస్తు బోధలూ, తిరుసభ బోధలూ మన అంతరాత్మ కూడ వెలుగును ప్రసాదిస్తాయి.

## 4. వివేకాన్ని సాధించటం ఏలా?

వివేకం ఓవైపు ఆత్మ అనుగ్రహం. మరోవైపు మనం స్వయంకృషితోగూడ ఈ పుణ్యాన్ని సాధించవచ్చు. దీన్ని సాధించే మార్గాలు చాలా వున్నాయి. ఇక్కడ కొన్నిటిని పేర్కొంటున్నాం.

1. మనం ఎప్పుడుకూడ స్వార్థబుద్ధితో కాక ఆధ్యాత్మిక దృష్టితో ఆయా నిర్ణయాలు చేసికోవాలి. "మానవుడు లోకాన్నంతటినీ సంపాదించినా తన ప్రాణాన్ని కోల్పోతే అతనికేమి లాభం?" అన్న ప్రభువువాక్యం మన జీవితానికంతటికీ, మన నిర్ణయాలన్నిటికీ ప్రేరణం పుట్టించాలి - మత్త 16,26. ఈ ప్రేరణం కల నరుడు వివేకంతో ప్రవర్తిస్తాడు.

2. చాలమంది యోహాను పేర్కొన్న శారీరక వాంఛలు, దురాశ, అధికారవాంఛ అనే త్రిలోభాలకు లొంగిపోతారు -1యోహా 2,16. జ్ఞానియైనవాడు ఈ ప్రలోభాలకు తట్టుకోవాలి. లైంగికవాంఛలకు లొంగినవాడి మనసుకి మసకలు కమ్ముతాయి. అతడు సత్యాన్ని చూడలేడు. అలాగే దురాశలకు చిక్కినవాడుకూడ సత్యాన్ని లెక్కచేయడు.

ఈ రెండు దుర్గుణాలు వివేకాన్ని నాశం చేస్తాయి. ఇంకా, మనకు తాత్కాలిక లాభం కలిగినాకూడ మోసం, అబద్ధం, కపటం మొదలైనవాటికి పాల్పడకూడదు. "సత్యమేవ జయతే" అన్న సూక్తిని నమ్మి అన్ని వేళలా నిజాయితీని పాటించాలి. చిత్తశుద్ధిలేనివాడికి నిజమైన వివేకం వుండదు.

3. కొందరు తమ ఇష్టానిష్టాలకూ రాగద్వేషాలకూ పక్షపాతవైఖరికీ సులభంగా లొంగిపోతూంటారు. సత్యాన్నీ న్యాయాన్నీ లెక్కచేయరు. ఈలాంటివాళ్లు ఏ నిర్ణయం చేసికొన్నా తమకు అనుకూలంగానే చేసికొంటారు. సహజంగానే వీళ్లు అవివేకమనే బురదలో దిగబడిపోతారు. ఈలాంటివాళ్లు దైవసాన్నిధ్యంలో నిలచి, అందరి హృదయాలు తెలిసినవాడూ న్యాయాధిపతిఐన దేవునికి భయపడి మంచి నిర్ణయాలు చేసికోవడం నేర్చుకోవాలి. ఇంకా తొందరపాటు, ఒకసారి చేసికొన్న నిర్ణయాలను చీటికిమాటికి మార్చుకోవడం మొదలైన దుర్గుణాలను చక్కదిద్దుకోవాలి.

4. కొందరు సమస్య ఎదురైనపుడు ఏ నిర్ణయానికీ రాలేరు. అటూఇటూ తేల్చుకోకుండా అలాగే జాప్యంచేస్తూ వుండిపోతారు. వీళ్ళు పదిమందిమీద అధికారులుగావుండి బృందం కార్యాలను నడిపింపవలసిన వాళ్లయితే మరీ చిక్కులు వస్తాయి. ఈలాంటివాళ్ళు నిపుణులు సలహాలను పొందాలి. ఓ సమస్యనుగూర్చి సకాలంలో తగిన నిర్ణయానికి రావడం జీవితంలో అందరికి అవసరమే.

5. మనం వివేకం అలవర్చుకొనేది ప్రధానంగా క్రీస్తు బోధలనుండీ, అతని చర్యలనుండీని. అతని బోధలన్నీ, కార్యాలన్నీ వివేకంతో కూడివుంటాయి. కనుక ఆ ప్రభువు జీవితాన్ని ప్రార్థనాపూర్వకంగా మననం జేసికొంటూ మనం కూడ ఈ పుణ్యాన్ని పెంపొందించుకోవాలి. సువిశేషాలను భక్తితో చదువుకొని క్రీస్తు అద్భుతాలూ, బోధలూ, సామెతలూ అతడు ఆనాటి జనంతో మెలిగిన తీరూ మొదలైనవాటిని జాగ్రత్తగా గమనించాలి.

ఈ పుణ్యాన్ని పెంపొందించుకోవాలంటే ఆత్మ సహాయంకూడ అత్యవసరం. ఒకవైపు పిశాచంబిడ్డల్ని పిశాచం నడిపిస్తూంటే, మరోవైపు దేవుని బిడ్డల్ని దేవుని ఆత్మ నడిపిస్తూంటుంది - రోమా 8,14. కనుక మనలను నిరంతరం వివేకమార్గాల్లో నడిపించమని ఆ యాత్మను అడుగుకోవాలి. ఆ యాత్మ మన మనసులో పుట్టించే మంచి కోరికలద్వారా మనలను సన్మార్గాల్లో నడిపిస్తూంటుంది. పైగా, ఆత్మ మనకు దయచేసే సప్తవరాల్లో "సదుపదేశం" ఒకటి. ఆ వరం మనలోని నైతికపుణ్యమైన వివేకాన్ని బలపరుస్తుంది.

దేవమాతను "మంచి ఆలోచనయొక్క మాతా" అని సంబోధిస్తాం. ఆ తల్లిని అడుగుకొంటే ఆమె మనకు తప్పకుండా మంచి ఆలోచనలను పుట్టిస్తుంది. ఈలాగే

కావలి సన్మనస్కులు, అర్చ్యశిష్టులు మొదలైనవాళ్ళుకూడ ఈ పుణ్యార్జనంలో మనకు తోడ్పడతారు.

వివేకమనే పుణ్యం అందరిలోను ఒకేస్థాయిలో వుండదు. కాని వరప్రసాదస్థితిలో జీవించే వాళ్ళందరిలోను ఈ పుణ్యం చాలినంతగా వుంటుంది. మనం సమాజంలో వివేకవంతుడైన నరుణ్ణి గుర్తుపట్టవచ్చు, అతన్ని సలహా అడుగుకోవచ్చుగూడ.

## 5. ఆత్మ శోధనం

1. నీ మాటల తీరు ఏలా వుంటుంది? ఇతరులు నీ మాటల్లో సులభంగా తప్పు పడుతూంటారా? లేక నీ వాగ్ధోరణిని మెచ్చుకొంటూంటారా?
2. నీవు తొందరపాటు మనిషివా లేక నిదానంగా ఆలోచించి పనిచేసేవాడివా? నీవు చేసిన పనిని మరొకరు చక్కదిద్దవలసి వుంటుందా?
3. నీవు ఒకసారి చేసిన పొరపాటు మళ్ళా చేయకుండా వుంటూంటావా? అతిగా బాధపడవలసిన పెద్ద పొరపాట్లు చేయకుండా వుంటూంటావా?
4. నీకు ముందుచూపు, రాబోయే సమస్యలను ముందుగానే పసికట్టడం, పొదుపరితనం మొదలైన గుణాలున్నాయా?
5. నీవు ఆయా నిర్ణయాలు చేసికొనేపుడు నీ యిష్టానిష్టాలకూ రాగద్వేషాలకూ లొంగిపోతూంటావా లేక న్యాయబుద్ధితో ప్రవర్తిస్తూంటావా?
6. నీవు ఆయా జనంతో మెలిగేప్పుడు ముందుగానే వాళ్ళ స్వభావాన్ని గుర్తించి వాళ్ళతో జాగ్రత్తగా మెలుగుతూంటావా? ఇతరులతో తరచుగా తగాదాలు తెచ్చుకోవుగదా?
7. నీవు వ్రాసే జాబులు పదిమంది కంటబడితే నీవు సిగ్గుపడవలసిన అవసరం వుంటుందా?
8. నీవు అవసరం వచ్చినపుడు ఇతరులను సలహా అడుగుతూంటావా లేక అలా అడగటం నామూషి అనుకొంటావా? నీ దగ్గరకి వచ్చేవాళ్ళకు మంచి సలహా యిస్తుంటావా?
9. జనం నిన్ను వివేకవంతుణ్ణిగాను నమ్మదగినవాణ్ణిగాను ఎంచుతారా?
10. దేవుని ఆత్మ నిన్ను నడిపిస్తున్నట్లుగా నీకేమైనా అనుభవం వుందా? నీ మనసులో మంచి కోరికలు పుడుతూంటాయా?

# 2. న్యాయం

## 1. న్యాయం అంటే ఏమిటి?

ఇతరుని హక్కును గుర్తించి అతనికి ముట్టవలసింది అతనికి ముట్టేలా చేయడమే న్యాయం. ఉదాహరణకు కూలివాడికీయవలసిన కూలి అతనికి ముట్టజెప్పాలి. అధికారికి చెందవలసిన గౌరవం అతనికి అందజేయాలి. తోడివాడు గోప్యంగా వుంచదలచుకొన్న రహస్యాన్ని గోప్యంగా వుంచాలి.

వివేకం ప్రధానంగా బుద్ధిశక్తికి సంబంధించినదయితే, న్యాయం ప్రధానంగా చిత్తశక్తికి సంబంధించింది.

న్యాయం వేరు, సోదరప్రేమ వేరు. న్యాయంలో ఇతరుని హక్కుని గుర్తిస్తాం. అతని కీయవలసింది అతనికిస్తాం. సోదరప్రేమలో ఇతరుని దేవుని బిడ్డనుగాను క్రీస్తుకి సోదరుని గాను మనకు సోదరునిగాను గుర్తించి అతన్ని ఆదుకొంటాం. న్యాయంకంటె సోదరప్రేమ విస్తృతమైంది. కాని న్యాయంలో గూడ ప్రేమ వుండాలి. సోదరప్రేమను ఆచరణలో పెట్టినపుడు న్యాయాన్ని పాటిస్తాం. ఉదాహరణకు అక్కరలో వున్న పేదవాణ్ణి పట్టించుకొంటే అతనిపట్ల ప్రేమ చూపినట్లు. ఆ ప్రేమే న్యాయంకూడ ఔతుంది.

న్యాయం చాలా రకాలుగా వుంటుంది. ఇక్కడ కనీసం నాల్గు రకాల న్యాయన్నయినా గుర్తించాలి. మొదటిది, పౌరులు దేశంపట్ల భక్తిచూపి ప్రభుత్వం అమలుపరచే చట్టాలను పాటించాలి. ఉదాహరణకు పన్నులు చెల్లించాలి. రైళ్ళలో టిక్కెట్లతోనే ప్రయాణం చేయాలి.

రెండవది, దేశం ప్రజలు శ్రేయస్సుకోరి వాళ్ళకు మేలు కలిగేలా పరిపాలించాలి. అనగా ప్రభుత్వం ఎవరి ఆదాయానికి తగినట్లుగా మాత్రమే వారికి పన్ను విధించాలి. వ్యక్తుల సామర్థ్యానికి తగినట్లుగా వారిని ఉద్యోగాల్లో నియమించాలి.

మూడవది, నరుడు తోడి నరుని హక్కులను మన్నించాలి. కనుక మనం తోడినరుని సొత్తును అపహరించకూడదు. అపదూరులు మోపి అతని కీర్తిని చెడగొట్టకూడదు.

నాల్గవది, కలిమికలవారు అక్కరలోవున్న పేదసాదలను ఆదుకోవాలి. వారికి జీవించడానికి అవసరమైన కూడుగుడ్డ యిల్లువాకిలి మొదలైన కనీసపు సదుపాయాలను కలిగించాలి. ఈ నాల్గవరకపు న్యాయాన్నే నేడు "సాంఘిక న్యాయం" అని పిలుస్తున్నారు. నేడు ప్రపంచంలో దీన్ని అతిముఖ్యమైన దాన్నిగా ఎంచుతున్నారు. పేదప్రజల ఆర్థిక సాంఘిక పరిస్థితులను మెరుగుపరచడానికి కృషిచేస్తున్న విమోచనోద్యమాలన్నీ ఈ సాంఘికన్యాయం కోసమే శ్రమిస్తున్నాయి. ప్రపంచ జనాభాలో నాల్గింట మూడువంతులు

పేదలు. కాని ప్రపంచం ఉత్పత్తిచేసే సంపదనంతటినీ కేవలం నాల్గవవంతు జనం మాత్రమే కొట్టేసి మిగతా మూడువంతుల జనానికీ ఏమీ దక్కనీయడంలేదు. కనుక ఈ ధనవంతులు తమ సొత్తును పేదలతో పంచుకోవాలి.

మామూలుగా మనం అన్యాయాన్ని అట్టే లెక్కచేయం. కాని ఇది ఘోరమైన పాపం. మడుగులో పెద్దచేప చిన్నచేపను తింటూంది. అడవిలో పెద్దమృగం చిన్నమృగాన్ని వేటాడుతుంది. అలాగే సమాజంలో బలవంతుడు దుర్బలుణ్ణి, ధనవంతుడు పేదవాణ్ణి, పైకులంవాడు చిన్నకులంవాణ్ణి నిరంతరం వేటాడుతూంటారు. నరుడు తోడినరునిపట్ల తోడేలులాగ ప్రవర్తిస్తూంటాడు. భగవంతునికి పోలికగావున్న నరుణ్ణి హింసిస్తే ఆ భగవంతుణ్ణి హింసించినట్లే. క్రైస్తవులమైన మనం ఈ పాపకార్యానికి పాల్పడకూడదు. కాని ఈ విషయంలో మనం ఇతరమతాలవారికంటె మెరుగేమీ కాదు.

న్యాయం యొక్క ప్రాశస్త్యం అంతాయింతా కాదు. న్యాయాన్ని పాటిస్తేనేగాని వ్యక్తుల మధ్యనూ సమాజంలోనూ శాంతి నెలకొనదు. ఈ పుణ్యంద్వారా ఇతరుల హక్కులను మన్నిస్తాం గనుక ధర్మం నీతినిజాయితీలు నిలుస్తాయి. వంచన మోసం అంతరిస్తాయి. బలవంతులు దుర్బలులను పీడించకుండా వుంటారు. న్యాయమే లేకపోతే లోకంలో నీతి నిజాయితీలుండవు. యుద్ధాలు పెచ్చు పెరిగిపోతాయి. బలవంతుడు దుర్బలుణ్ణి అణగద్రొక్కుతాడు. అధర్మం రాజ్యం చేస్తుంది. ఇది లౌకికమైన న్యాయంయొక్క చిత్రం.

కాని క్రైస్తవ న్యాయం ఈ లౌకిక న్యాయంకంటె గొప్పది. పవిత్రాత్మ మన హృదయాల్లోనికి ప్రవేశించి వాటిని ధర్మబుద్ధితో నింపుతుంది. మనలను అన్యాయానికి దూరంగా వుంచుతుంది. మనం ఇతరుల హక్కులను మన్నించేలా, చిన్న అన్యాయాన్ని గూడ ఎంతో అసహ్యించుకొనేలా చేస్తుంది. తోడి నరులను అన్నదమ్ముల్లా, అక్కచెల్లెళ్ళలా ఆదరించి వాళ్ళ శ్రేయస్సు కొరకు కృషిచేసేలా చేస్తుంది. ఇదే క్రైస్తవన్యాయం.

## 2. బైబులు దృష్టాంతాలు

పూర్వవేదంలో మోషే ధర్మశాస్త్రమూ, విశేషించి పదిఆజ్ఞలూ, న్యాయస్థాపనం కొరకు ఏర్పడినవే. ధర్మశాస్త్రంలో మోషే పలువిధాలైన న్యాయాలను పేర్కొన్నాడు. ఉదాహరణకు అతడు "మీరు ఒకటి పెద్దది వొకటి చిన్నదిగా రెండు తూకపు రాళ్ళు వాడవద్దు. అలాగే వొకటి పెద్దది మరొకటి చిన్నదిగా రెండు కొలమానాలు ఉపయోగించవద్దు" అని ఆజ్ఞాపించాడు - ద్వితీ 25,13-15. న్యాయాధిపతుల నుద్దేశించి "మీరు యూదులకుగాని మీతో వసించే విజాతీయులకుగాని జగడాలను న్యాయసమ్మతంగా పరిష్కరించాలి. ఎవరియెడల పక్షపాతం చూపవద్దు" అని శాసించాడు - 1,16.

ప్రవక్తలు పేదలను పీడించే ధనవంతులను మొగం వాచేలా చీవాట్లు పెట్టారు. ఉదాహరణకు యెషయా

"మీ పాపపు పనులనుండి వైదొలగి
సత్కార్యాలకు పూనుకొనండి
న్యాయాన్ని పాటిచండి
పీడితులకు మేలు చేయండి
అనాథుల హక్కులను నిలబెట్టండి
వితంతువులను ఆదుకొనండి"

అని బోధించాడు - 1,16-17. మీకా ప్రవక్త

"భక్తిమంతులు భూమిమీద కరువైపోయారు
సత్యవంతులు కలికానికైనా లేరు
ప్రతివాడూ హత్యకు పాల్పడేవాడే"

అని వాపోయాడు - 7,2. ఆమోసు

"నీతి ఓ నదిలాగ పొంగిపారాలి
న్యాయం ఓ జీవనదిలాగ ప్రవహించాలి"

అని శాసించాడు - 5,24.

నూత్నవేదంలో క్రీస్తు "ఇతరులు మీకేమి చేయాలని కోరుతారో మీ రితరులకు దాన్ని చేయండి" అన్నాడు - మత్త 7,12. న్యాయమంతా, మోషే ధర్మశాస్త్రమంతా, ప్రవక్తల బోధలన్నీ ఈ యేక వాక్యంలో ఇమిడి వున్నాయి. ఇంకా ఆ ప్రభువు తోడినరుల్లో తన్ను చూచి వాళ్ళకు సాయం చేయమని చెప్పాడు. "ఈ సోదరుల్లో అత్యల్పుడైన ఏ వొక్కనికి మీరు ఇవి చేసినపుడు అవి నాకే చేసారు" అని పల్కాడు - మత్త 25,40.

క్రీస్తు తర్వాత అతని శిష్యులుకూడ ఆ గురువు న్యాయబోధలను కొనసాగించారు. యోహాను ఈలా వ్రాసాడు. "ఏ వ్యక్తియైన ధనికుడై యుండిగూడ అవసరంలో వున్న తన సోదరుణ్ణిచూచి హృదయ ద్వారాన్ని మూసికొంటే ఇక అతని హృదయంలో దైవప్రేమ వుందని యేలా చెప్పుకోగలడు? బిడ్డలారా! మన ప్రేమ కేవలం మాటలు మాత్రమే కాకూడదు, అది చేతలతో నిరూపింపబడే యథార్థ ప్రేమకావాలి" -1యోహా 3,17-18.

ఈ బైబులు బోధలను మనసులో పెట్టుకొనే నాల్గవ శతాబ్దంలో మిలాను పట్టణానికి బిషప్పుగా వున్న అంబ్రోసు భక్తుడు ఈలా చెప్పాడు. "భగవంతుడు ఈ భూమిని నరులందరికోసం సృజించాడు. దాని ఫలితాన్నికూడ అందరూ అనుభవించాలనే ఉద్దేశించాడు. కాని అత్యాశవల్ల కొందరు మాత్రమే దాన్ని దక్కించుకొంటున్నారు. ఆకలితో చచ్చేవాడికి అన్నం పెట్టండి. లేకపోతే మీరే వాణ్ణి చంపినట్లు. మీ సిరిసంపదలను పేదలకు పంచిపెట్టినపుడు మీరేమి దానధర్మాలు చేయడం లేదు. పేదలకు చెందిన వస్తువులును తిరిగి వాళ్ళకు ముట్టచెప్పుతున్నారు, అంతే."

## 3. న్యాయాన్ని పాటించడం ఏలా?

ఇంతవరకు న్యాయమంటే యేమిటో దాని అవసరమేమిటో చూచాం. ఇక దాన్ని ఏలా పాటించాలో పరిశీలిద్దాం. పైస్థానంలో వున్నవాళ్ళు న్యాయాన్ని నిశితంగా పాటించి క్రింది స్థానంలోనివాళ్ళకు మార్గదర్శకంగా వుండాలి. న్యాయవర్తనులు కానివాళ్ళు న్యాయమూర్తియైన దేవునికి ప్రియపడరు - ఎంత వున్నతమైన స్థానంలో వున్నవాళ్ళయినా సరే. న్యాయాన్ని గూర్చిన సూత్రాలు చాలా వున్నాయి. వాటినన్నిటినీ ఇక్కడ వివరించలేం. ముఖ్యమైన వాటిని కొన్నిటిని మాత్రం పరిశీలిద్దాం.

ఇతరుల హక్కులను మన్నించి వాళ్ళ సొత్తును అపహరించకుండా వుండాలి. మళ్ళా ఇక్కడ చాలా అంశాలున్నాయి.

1) పెద్దదిగాని చిన్నదిగాని దొంగతనం చేయకూడదు. తల్లిదండ్రులు పిల్లలకు చిన్నప్పటినుండే ఇతరుల సొత్తు నయాపైసకూడ ముట్టుకోగూడదని నిశితంగా బోధించాలి. వ్యాపారాలు చేసేవాళ్ళు చాల మోసాలు చేస్తుంటారు. విశేషంగా కొనుక్కొనే వాళ్ళల్లో అట్టే తెలివితేటలు లేకపోతే వాళ్ళను సులువుగా బోల్తాకొట్టిస్తారు, ఇది పెద్దదోషం. దొంగిలించిన సొమ్ముకీ మోసగించిన సొమ్ముకీ నష్టపరిహారం చేయాలి.

2) మనం అనవసరంగా బాకీలు చేయకూడదు. చేసిన బాకీలు చిత్తశుద్ధితో తీర్చాలి. దేహశుద్ధికంటె ఆత్మశుద్ధి ముఖ్యం.

3) ఇతరులనుండి ఏదైనా పనిముట్టు అరువుతెచ్చుకొంటే దాన్ని అజాగ్రత్తగా వాడి చెడగొట్టకూడదు. దానిని సరైనస్థితిలో, సకాలంలో యజమానునికి ముట్టజెప్పాలి. చాలమంది తాము బదులుతీసికొన్న వస్తువును మళ్ళామళ్ళా అడిగించుకొనిగాని తిరిగి ఈయరు. ఇది నిక్కంగా దురభ్యాసం.

4) ఇతరుల వస్తువును మనం బుద్ధిపూర్వకంగా చెడగొడితే తప్పక నష్టపరిహారం చేయాలి. మనకు దొరికిన వస్తువును మనం దక్కించుకోగూడదు. దానిని సొంతదారునికి ముట్టజెప్పాలి.

వస్తువులేకాదు మంచిపేరుకూడ నరులకు సొత్తులాంటిది. కనుక మనం ఆ మంచిపేరును చెడగొట్టకూడదు. ఇక్కడకూడ చాల విషయాలున్నాయి. 1) మనం చాలసారులు వెలుపలి పనులను మాత్రమే చూచి ఇతరులను చెడ్డవాళ్ళనుగా ఎంచుతాం. కాని వాళ్ళ హృదయంలోని ఉద్దేశాలు మనకు తెలియవు. వాళ్ళ హృదయంలో మంచి వుద్దేశం వుంటే వాళ్ళు చేసేపని చెడ్డది కాదు. అది మన దృష్టిలో చెడ్డదైనా దేవుని దృష్టిలో మంచిదే ఔతుంది. కనుక మనం ఇతరులను గూర్చి సులభంగా దురభిప్రాయాలు కలిగించుకోగూడదు. తోడివారి మాటలకూ చేతలకూ సాధ్యమైనంతవరకు మంచి అర్థాన్ని కల్పించాలేగాని చెడుఅర్థాన్ని కల్పించగూడదు. నరుల మంచిచెడ్డలు ఎంచడానికి న్యాయాధిపతియైన దేవుడున్నాడు. మనం ఆ పనికి పూనుకోవడం సాహసమే ఔతుంది.

ఇక్కడ వొక్క విషయం ఆలోచిద్దాం. ఇతరులకు మన హృదయంలోకి తొంగిచూసే శక్తీ, మనం వాళ్ళను గూర్చి చెడ్డగా ఆలోచిస్తున్నామని తెలిసికొనే శక్తీ వుందనుకోండి. అప్పుడు మనం ఎంత జాగ్రత్తగా మన దురాలోచనలను అదుపులో బెట్టుకొంటాం! కాని తోడివారు కాకపోయినా దేవుడు నిరంతరం మన హృదయంలోకి చూస్తుంటాడుకదా! మరి మన హృదయంలోని దురభిప్రాయాలను అతడు అంగీకరిస్తాడా?

2) మనం అన్యుని రహస్యలోపాలను వెల్లడి చేయకూడదు. అలాచేస్తే అన్యుడు తన కీర్తిని కోల్పోతాడు. అతనికి తన కీర్తిని నిలబెట్టుకొనేహక్కు వుంది. మనమా హక్కుని భంగపరచకూడదు. కొందరు నోటి దురదకొద్ది అన్యుల లోపాలను తాము పొయినకాడల్లా ప్రచారం చేస్తూంటారు. అలా చేయడం తెలివనుకొంటారు. కాని దానివల్ల తోడివారికి ఎంత అపకీర్తి కలుగుతుందో గుర్తించరు. పునీతుల చరిత్రలు పరిశీలిస్తే వాళ్ళు తోడిజనంపట్ల ఎంతో దయతో మెలిగారని తెలుస్తుంది. అన్యుల మంచిపేరును కాపాడ్డానికి ఎంతో ప్రయత్నంచేసినట్లు విశదమౌతుంది.

3) ఇక, తోడివారిమీద నిందలూ అపదూరులూ మోపడం ఘోరమైన పాపం. కొందరు అసూయకొద్దీ తోడివారిమీద పుకార్లు పుట్టిస్తారు. దీనివల్ల మంచివాళ్ళుగూడ చెడ్డవాళ్ళుగా చలామణి అయ్యే దుస్థితి పడుతుంది. ఇది క్షమింపరాని నేరం.

4) ఇంకా మనం ఇతరులను అక్రమంగా అవమనాపరచగూడదు. ఇతరులను బహిరంగంగా దూషించడం, వాళ్ళమీద చేయి చేసుకోవడం, ఉమ్మివేయడం, చెప్పులు విసరడం మొదలైన కార్యాలకు పాల్పడినప్పుడు వాళ్ళను అవమానిస్తాం. ఈలాంటి పనులన్నీ న్యాయాన్ని చెరుస్తాయి.

ఇక, ఇతరుల వస్తువులను అపహరించినపుడులాగే వారి మంచిపేరును చెడగొట్టినపుడుకూడ నష్టపరిహారం చేయాలి. కనుక ఇతరులనుగూర్చిన మన దురభిప్రాయాలూ అబద్ధాలూ అపదూరులూ అవమానాలూ మొదలైన వాటికన్నిటికీ మనం క్షమాపణం అడుక్కోవాలి. ఈ కార్యం మనకు సిగ్గును పుట్టిస్తుంది. అయినా తప్పదు. నోటిదురుసువల్ల మనం ఇతరులకు ఎంత అపకీర్తి కలిగించామో గ్రహిస్తే ఈలాంటి సిగ్గును తేలికగానే సహించవచ్చు. భవిష్యత్తులో ఈలాంటి పాపాలనుండి వైదొలగవచ్చుకూడ. అసలు పవిత్రతమీద మక్కువ కలవాళ్ళు న్యాయంతోబాటు సోదరప్రేమనుగూడ పాటిస్తారు. అప్పుడు ఇతరులపట్ల దయతో సానుభూతితోను మెలగవచ్చు.

## 4. సాంఘిక న్యాయం

సాంఘిక న్యాయాన్ని గూర్చి ఒకటిరెండు భావాలైనా చెప్పకుండా ఈ యధ్యాయాన్ని ముగించకూడదు. నేడు అన్నిటికన్నా ఈ న్యాయాన్ని ముఖ్యమైనదాన్నిగా గణిస్తున్నారు. ముందే చెప్పినట్లు, పేదప్రజలు గౌరవప్రదంగా జీవించడానికి అనువైన

సదుపాయాలను కల్పించడమే సాంఘిక న్యాయం. అనగా వాళ్లు ఆర్థికంగా, సాంఘికంగా, రాజకీయంగా పైకి వచ్చేలా చూడాలి. వాళ్ళకు విద్య, ఆరోగ్యం మొదలైన సదుపాయాలన్నీ కల్పించాలి.

అన్ని దేశాల్లోలాగే మనదేశంలో గూడ మీది యిరవైశాతం ప్రజలు భూములు ధనం అపరిమితంగా స్వాధీనం చేసికొని పేదలకు ఏమీ దక్కనీయడంలేదు. దేవుడిచ్చిన సంపదలను కొద్దిమంది కొట్టేసి అధిక సంఖ్యాకుల నోళ్ళల్లో దుమ్ముకొడుతున్నారు. సాంఘిక అన్యాయం ఇక్కడే వుంది.

కూలివానికి అతని వ్యక్తిగతమైన కూలికి మాత్రమే వేతనమిస్తే చాలదు. మనమిచ్చే వేతనం అతని కుటుంబ పోషణకుకూడా సరిపోవాలి.

ఈ దేశంతో క్రైస్తవులమైన మనంకూడ సాంఘిక అన్యాయాల్లో మస్తుగానే పాలుపంచుకొంటాం. క్రైస్తవుల్లోకూడ నిరుపేదలు కాని ఒకపాటి సంపన్నులు చాలమంది వున్నారు. కాని వాళ్లు తమ సొత్తును ఇరుగుపొరుగు నిరుపేదలతో ఏ మాత్రం పంచుకోరు. క్రీస్తు నేర్పిన ప్రేమసూత్రాలను ఏమాత్రం పాటించరు. ఒక్క విషయం చూద్దాం. ఈ దేశంలోని క్రైస్తవులమైన మనకు విదేశాలనుండి విరాళాలు అందుతున్నాయి. కాని మనకా విరాళాలు పంపే విదేశీయులు పేదవాళ్ళు. వాళ్ళు మనకంటె ధనవంతు లేమీ కాదు. ఐనా వాళ్ళు తోడి పేదలను ఆదుకొంటున్నారు. మనం అలా ఆదుకోవడంలేదు. వాళ్ళు క్రీస్తు ప్రేమసూత్రాలను పాటిస్తున్నారు. మనం పాటించడం లేదు.

భగవంతుడు నరుణ్ణి తనకు పోలికగా జేసాడు. నరునికి చేసిన సేవను ఆ ప్రభువు తనకు చేసినట్లే భావిస్తాడు. కడ తీర్పు సామెత భావం యిదే. ఈ సామెత క్రీస్తుబోధల్లో అతిముఖ్యమైంది. కనుక మనం మన శక్తికొలది తోడిపేదలను ఆదుకోవడం నేర్చుకోవాలి. మన క్రైస్తవుల్లోనే ఒక్కో సంపన్న కుటుంబం ఒక్కో పేదకుటుంబాన్ని ఆదుకొంటే ఎంత ఆదర్శవంతంగా వుంటుంది.

## 5. ఆత్మశోధనం

1. నీవు ఇతరుల వస్తువులను అపహరిస్తుంటావా?
2. నీవు చేసిన బాకీలను సకాలంలో ఖండితంగా తీరుస్తావా? నీకు దొరికిన వస్తువులను సొంతదారులకు ముట్టజెప్పే ప్రయత్నం చేస్తుంటావా?
3. ఇతరులనుండి బదులు తీసికొన్న వస్తువులను జాగ్రత్తగా వాడుకొని సకాలంలో తిరిగి యిచ్చి వేస్తుంటావా?
4. తోడిప్రజలు నిన్ను నమ్మి నీకు డబ్బునుగూర్చిన బాధ్యతలను ఒప్పజెప్తారా?
5. నీవు ఇతరులను గూర్చి చెడ్డగా ఆలోచిస్తుంటావా? వాళ్ళ పనులకు మాటలకు దురుద్దేశాలు అంటగడుతుంటావా?

6. రహస్యంగావున్న ఇతరుల లోపాలనూ దోషాలనూ అనవసరంగా పదిమందికి వెల్లడి చేస్తుంటావా?
7. నీకు అసూయ వున్న వారిమీద పుకార్లు పుట్టిస్తుంటావా?
8. నీ వుద్యోగానికి లేక నీవు చేసే పనికి నీకు జీతం లభిస్తుంది. కాని నీవా పనులకు న్యాయం చేకూర్చుతున్నావని చెప్పగలవా?
9. ఇతరుల వస్తువులు దొంగిలించినపుడుగాని, ఇతరుల మంచిపేరు చెడగొట్టినపుడుగాని నష్టపరిహారం చేయాలి అన్న సూత్రాన్ని గమనిస్తుంటావా?
10. నీవు వున్న వాడివైతే, క్రీస్తు ప్రేమసూత్రాలను మనసులో పెట్టుకొని, నీ చుట్టుపక్కలవున్న పేదసాదలను పట్టించుకొంటావా?

# 3. ధైర్యం

## 1. ధైర్యం అంటే ఏమిటి?

భయానికి వెనుదీయకుండా కష్టమైన ఆధ్యాత్మిక కార్యాలను సాధించడానికి పూనుకోవడమే ధైర్యం. పూర్వకాలంలో వేదబోధ చేయడానికి ఇండియాకు వచ్చిన ఫ్రాన్సిస్ శౌరివారు మొదలైన ప్రేషితులకు ఎంతటి ధైర్యం వుండివుండాలి! ప్రాకృతికమైన ధైర్యం కూడ వుంది. కాని ఇక్కడ మనం చూడబోయేది ఆధ్యాత్మికమైన ధైర్యం. ఈ నైతిక పుణ్యం ఓవైపు భయాన్నీ మరోవైపు దుస్సాహసాన్నీ కూడ అరికడుతుంది.

ఈ పుణ్యంలో రెండు గుణాలున్నాయి. మొదటిది, మనం ఆధ్యాత్మిక రంగంలో కష్టమైన కార్యాలను సాధించడానికి పూనుకొంటాం. వాటినిగూర్చి త్వరగా ఓ నిర్ణయానికి వస్తాం. ఉత్సాహంతో వాటిని సాధించడానికి ఉపక్రమిస్తాం. రెండవది, ఈ కార్యాచరణంలో ఎదురయ్యే ఇబ్బందులనూ బాధలనూ సహిస్తాం. పనికి పూనుకొన్నపుడు గొప్ప ఉత్సాహమే వుండవచ్చు. కాని అవరోధాలు ఎదురయ్యేకొద్దీ ఆ ఉత్సాహం కాస్త నశిస్తుంది. కష్టాలు ఎదురయ్యేకొద్దీ నిరుత్సాహం పెరుగుతుంది. అప్పుడు ఈ పుణ్యం మనకు బలాన్నిచ్చి మనం నిబ్బరంగా ముందుకి సాగిపోయేలా చేస్తుంది. ఈ పుణ్యమే లేకపోతే మనం కష్టమైన కార్యాలను అసలు చేపట్టనే పట్టం. ఒకవేళ చేపట్టినా, వాటిని మధ్యలోనే ఆపివేస్తాం.

ధైర్యాన్ని పాటించడంలో చాల మెట్లున్నాయి. మొదటిమెట్టు, భయాన్ని జయించడం. కష్టమైన కార్యమనగానే సహజంగానే నరులందరూ భయపడతారు. ఎందుకంటే ఆకార్యంలో అపాయాలూ బాధలూ అపజయాలూ ఎదుర్కోవలసి వుంటుంది. ఐనా ధైర్యగుణం గలవాడు వీటికి జంకడు. ఈ లోక భాగ్యాలకంటె విలువగల ఆధ్యాత్మిక భాగ్యాలున్నాయని అతనికి తెలుసు. ఎంత శ్రమపడైనాసరే ఆ శాశ్వతసౌభాగ్యాలను సంపాదించాలని అతడు కోరుకొంటాడు.

రెండవమెట్టు, ఇతరుల అవహేళననూ విమర్శలనూ సహించడం. ఆధ్యాత్మిక భాగ్యాల కొరకు కృషిచేసేవాణ్ణి లోకం పిచ్చివాణ్ణిగా ఎంచుతుంది. అతన్ని విమర్శిస్తుంది. పరిహాసం చేస్తుంది. ఐనా పరలోక భాగ్యాల నాశించేవాడు ఈ విమర్శలను లెక్కచేయడు.

మూడవమెట్టు, స్నేహితులు తన్ను చేయివిడచినా కలత జెందకుండా వుండడం. పారలౌకిక దృష్టికలవాణ్ణి ఈ లోకపు విలువల నభిమానించే మిత్రులు మెచ్చరు. అతన్ని పరిత్యజిస్తారు. కాని ఆధ్యాత్మిక మానవునికి ఇహలోక స్నేహితులను సంతోషపెట్టడం కంటె దేవుని సంతోషపెట్టడం మెరుగని తెలుసు. కనుక అతడు ఈ లౌకిక మిత్రులను వదలుకొని దేవుణ్ణి మిత్రుణ్ణిగా పొందడానికి సంసిద్ధుడౌతాడు. ఈలా ధైర్యమనే పుణ్యం మనలను మెట్టుమీద మెట్టు ఎక్కించుకొంటూ పైకి తీసికొనిపోతుంది. మనం భయాన్ని పూర్తిగా జయించేలా చేస్తుంది.

ధైర్యానికి చివరిమెట్టు వేదసాక్షి మరణం. వేదసాక్షిగా మరణించడమంటే క్రైస్తవమత విశ్వాసం కొరకు ప్రాణాలు అర్పించడం. ఈ వేదసాక్షి మరణంద్వారా మనం క్రీస్తుని పూర్తిగా అనుకరిస్తాం. అతనిలాగే మనంకూడ ప్రేమతో ప్రాణాలు ధారపోస్తాం. ఐనా వేదసాక్షిగా మరణించే భాగ్యం కొద్దిమందికే అబ్బుతుంది. మనబోటివాళ్ళందరికీ సిద్ధించే భాగ్యం రోజురోజు మన క్రైస్తవ జీవితాన్ని ధైర్యంతో జీవించడం.

సంగ్రహంగా చెప్పాలంటే, క్రైస్తవ మతాచరణంలో ఎదురయ్యే అవరోధాలనూ భయాలనూ ఎదుర్కోడానికి పవిత్రాత్మ మనకు ధైర్యమనే పుణ్యాన్నిస్తుంది. ఈ పుణ్యబలంతో మనం ఓవైపు పిరికితనాన్ని మరోవైపు దుడుకుతనాన్నీ జయిస్తాం.

## 2. ఔదార్యం, ఓర్పు

ధైర్యానికి సంబంధించిన ఇతర పుణ్యాలు రెండున్నాయి. అవి ఔదార్యం, ఓర్పు.

ఔదార్యమంటే దేవునికొరకుగాని తోడి నరులకొరకు కాని గొప్పకార్యాలు చేయడానికి పూడుకోవడం. లోకంలో స్వీయకీర్తి కొరకు గొప్పకార్యాలు చేపట్టేవాళ్ళున్నారు. కాని భగవంతుని మహిమ కొరకు గొప్పకార్యాలు చేసినపుడు మాత్రమే ఔదార్యమనే పుణ్యాన్ని సాధిస్తాం. మతసభలను స్థాపించిన దోమినికు, ఫ్రాన్సిసు, ఇగ్నేష్యసు మొదలైన భక్తులు ఈ పుణ్యానికి ఉదాహరణం. సమాజానికి గొప్ప సేవలుచేసిన మదర్‌తెరేసా మహాత్మాగాంధి మొదలైనవాళ్లు కూడ దీనికి తార్కాణమే.

దైవసేవ కొరకు ప్రజాసంక్షేమం కొరకు విరాళాలీయడంకూడ ఔదార్యమే ఔతుంది. కనుక దేవాలయాలు ఆస్పత్రులు విద్యాసంస్థలు మొదలైనవాటిని స్థాపించడానికి నిధులను సమకూర్చడం గూడ ఔదార్యమే. మనం గొప్పదానాలే చేయనక్కరలేదు. మన ఆర్థిక స్థితినిబట్టి చిన్నదానాలుకూడ జేయవచ్చు. విన్సెంట్ దపాల్ భక్తుడు చిన్నచిన్న విరాళాలతోనే

ఎన్నో సేవాకార్యక్రమాలు నెలకొల్పాడు. పిరికితనం, పిసినిగొట్టుతనం, దూబరాఖర్చులు చేయడం మొదలైనవి ఔదార్యానికి వ్యతిరేకమైన దుర్గుణాలు.

ఇక, ఓర్పు అంటే సత్కార్యాచరణలో ఎదురయ్యే కష్టాలను దేవుని కొరకు సహనంతో భరించడం. జీవితంలో అందరికీ కష్టాలు ఎదురౌతాయి. చాలమంది అనిష్టంతోను దేవునిమీద తిరుగబడుతూను కష్టాలను అనుభవిస్తారు. దీనివలన ఫలితం లేదు. మనం దేవుని చిత్తానికి లొంగి శ్రమలనుభవించాలి. ఈ పట్టున క్రీస్తు శ్రమలుకూడ మనకు ప్రేరణం కలిగిస్తాయి. దేవునిమీద గొణగుకోకుండా దైవచిత్తానికి తలొగ్గి మన పాలబడిన కష్టాలను అనుభవిస్తే అవి మన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసిపెడతాయి. మన హృదయాన్ని శుద్ధి చేస్తాయి. కష్టాల్లో చివరిదాకా ఓర్పుతో నిలచేవాడే బహుమతిని పొందేది. బాధల్లో నిరుత్సాహం మనలను క్రుంగదీస్తుంది. ఐనా సహనం వలన మనం ప్రాణాలను దక్కించుకొంటాం - లూకా 21,19.

## 3. బైబులు దృష్టాంతాలు

పూర్వవేదంలో ధైర్యానికీ ఓర్పుకీ పెట్టింది పేరు యోబు. పిశాచం అతని సిరిసంపదలనూ సంతానాన్నీ కడకు ఆరోగ్యాన్ని కూడ అపహరించింది. ఐనా యోబు దేవునిమీద తిరుగబడలేదు. "ప్రభువు తానిచ్చిన వాటిని తానే తీసికొన్నాడు, అతనికి స్తుతి కలుగునుగాక" అన్నాడు, అంతే - 1,21. అంటియోకసురాజు వేదహింసల కాలంలో ధర్మశాస్త్రాన్ని పాటించినందుకు మక్కబీయుల తల్లి తన యేడ్గురు కుమారులను కోల్పోయింది. కడన తన ప్రాణలనుకూడ బలిగా సమర్పించింది - 2మక్క 7.

నూత్నవేదంలో ధైర్యం ఓర్పు మొదలైన గుణాలన్నిటికీ క్రీస్తు మనకు ఆదర్శంగా వుంటాడు. అతడు పుట్టినప్పటినుండి దారిద్ర్యం శ్రమలు హింస మొదలైన యాతనలు అనుభవించాడు. తరువాత యూదనాయకులు అతన్ని ఎదిరించి అతని కార్యాలకు విఘ్నం కలిగించినా అతడు వెనుకాడలేదు. కడన అతడు నానాయాతనల ననుభవించి సిలువమీద మన పాపాలకొరకు ఆత్మార్పణం చేసికొన్నాడు. విధేయతతోను ప్రేమతోను తన ప్రాణాలను తండ్రికి అర్పించాడు.

క్రీస్తు మనకొరకు బాధలనుభవించి తన అడుగుజాడల్లో నడవటానికి మనకు ఒక ఆదర్శాన్ని ఏర్పరచాడు -1పేత్రు 2,21. మనం ఆ ప్రభువుతోపాటు బాధలనుభవిస్తే అతనితో పాటు మహిమను పొందుతాం. క్రీస్తుశ్రమలలో పాలుపంచుకోవడం గొప్పభాగ్యం. కనుకనే యెరూషలేములో యూదనాయకులు శిష్యులను కొరడాలతో కొట్టించినపుడు వారు క్రీస్తుకొరకు అవమానాలు పొందడానికి యోగ్యులమయ్యామనుకొని సంతోషించారు - అచ 5,41. పౌలుకూడ "క్రీస్తు తన శరీరమైన శ్రీసభ కొరకు పడిన బాధలలో కొదవగా వున్నవానిని నా శ్రమలద్వారా పూర్తి చేస్తున్నాను" అని వాకొన్నాడు - కొలో 1,24.

## 4. ధైర్యాన్ని సాధించే మార్గాలు

1. జీవితంలో కొందరు చాలా పిరికివాళ్ళు. వీళ్ళు ఏ మంచికార్యాన్ని సాధించడానికీ ముందుకిరారు. చిన్నదానికీ పెద్దదానికీగూడ భయపడిపోయి వెనక్కువెనక్కు పోతుంటారు. మరికొందరు అనాలోచితంగాను మూర్ఖంగాను పనులు ప్రారంభిస్తారు. వీళ్ళకు తొందరపాటు, దుడుకుతనం ఎక్కువ. కనుక తాము ప్రారంభించిన పనులను కొనసాగించలేక నగుబాట్లు తెచ్చుకొంటారు. ఇవిరెండూ అవివేక గుణాలే. ఈ దుర్గుణాలను సవరించడానికే పవిత్రాత్మ ధైర్యం అనే పుణ్యం ద్వారా మనలను సత్క్రమమార్గంలో నడిపిస్తుంది. ఆత్మ మనకు ధృఢత్వమనే వరాన్ని కూడ యిస్తుంది. ఆ వరం ఈ ధైర్యమనే పుణ్యాన్ని బలపరుస్తుంది. కనుక జీవితంలో ధైర్యం చాలనివాళ్ళు ఆత్మసహాయంకోసం విశేషంగా ప్రార్థించాలి.

2. ఆధ్యాత్మికరంగంలో గొప్ప ధైర్యాన్ని ప్రదర్శించి విజయాలు సాధించినవాళ్ళు తమ్ముతాము నమ్మలేదు. దేవుణ్ణి నమ్మారు. వినయంతో దేవుణ్ణి నమ్మేవాళ్ళు ఎక్కువ ఫలితాలు సాధిస్తారు. "ఎవడు నాయందు నిలిచివుంటాడో, నే నెవరియందు నిలిచివుంటానో వాడు అధికంగా ఫలిస్తాడు" అన్నాడు ప్రభువు - యోహా 15,5. పౌలుకూడ "నేను ప్రభువు బలాన్ని పొంది అన్ని కార్యాలు చేయగలను" అని వాకొన్నాడు - ఫిలి 4,13. పైగా ప్రభువు బలవంతులద్వారా గాక దుర్బలులద్వారా మహత్తరకార్యాలు సాధిస్తుంటాడు. "బలవంతులకు సిగ్గు పుట్టించడానికి లోకం దుర్బలులనుగా గణించేవాళ్ళనే ఆయన ఎన్నుకొన్నాడు" -1కొరి 1,27. కనుక మనం అల్పులమైనా సరే దేవుణ్ణినమ్మి అతనిమీద ఆధారపడితే గొప్ప విజయాలు సాధిస్తాం.

3. చాలమంది కష్టాలు వస్తాయని గూడ వూహించరు. కనుక బాధలూ సమస్యలూ రాగానే బెండుపడిపోతారు. అధైర్యంతో వాటిని ఎదుర్కోబోతారు. ఇది మంచి పద్ధతి కాదు. మనం కష్టాలనూ ఇబ్బందులనూ ముందుగానే పసికట్టాలి. ఆపదను ముందుగానే గుర్తుపట్టినవాడు దాన్ని కొంతవరకు గెల్చినవాడౌతాడు.

4. దేవుణ్ణి గాఢంగా ప్రేమించేవాడు అతని కొరకు ఎన్ని కష్టాలైనా అనుభవిస్తాడు. అతని సేవలో ఎంత ధైర్యాన్నయినా, ఎంత వోర్పునయినా ప్రదర్శిస్తాడు. ప్రేమ మృత్యువులాగ బలమైంది - పరమగీతం 8,6. ఈ ప్రేమ వలననే వేదసాక్షులు క్రీస్తుకోసం ధైర్యంతో ప్రాణాలర్పించారు. ఈ ప్రేమానుభవం కలవాడు కనుకనే పౌలు "క్రీస్తు ప్రేమ మమ్ము ప్రోత్సాహపరుస్తుంది" అని వాకొన్నాడు - 2కొ 5,14. అతడు క్రీస్తుపట్లగల గాఢమైన ప్రేమవలననే ఎన్నో కష్టాల నెదుర్కొని బోలెడన్ని ప్రేషిత కార్యాలను సాధించాడు. కనుక మనం క్రైస్తవ జీవితంలో ధైర్యాన్ని పెంపొందించుకోవాలంటే ప్రభువుపట్ల గాఢమైన ప్రేమను అలవర్చుకోవాలి.

5. లౌకిక రంగంలో ధైర్యసాహసాలు కలవాళ్ళు మంచిపేరు కోసం ఎన్నిశ్రమలైనా అనుభవించడానికి సిద్ధంగా వుంటారు. అలాగే ఆధ్యాత్మిక రంగంలోకూడ. క్రీస్తుపట్ల గాఢమైన ప్రేమగలవాళ్ళు ఆ ప్రభువు కోసం బాధలనుభవించడానికి తయారుగా వుంటారు. తామూ ఆ ప్రభువులాగే నిందావమానాలూ వేదనలూ, చివరకు మరణాన్ని గూడ అనుభవించడానికి జంకరు. గురువుకొకత్రోవా శిష్యుడికింకొకత్రోవా లేదని వాళ్ళకు బాగా తెలుసు. జీవితంలో మన పాలబడిన కష్టాలను అనుభవించడంవేరు. క్రీస్తుపట్లగల ప్రేమచే అతని కష్టాలు మనకుకూడ రావాలని కోరుకోవడం వేరు. పునీతులు చాలమంది ఈలా కోరుకొన్నారు. ఈ కోరిక అరుదైన భాగ్యం.

## 5. ఆత్మశోధనం

1. మతవిషయాల్లో నీకు మామూలుగా ధైర్యమెక్కువా లేక పిరికితనమెక్కువా? నీవు నీకంటె అధికులను జూచి భయపడుతుంటావా?
2. నీకు ఇతరులు ఏమనుకొంటారో అనే బెరుకు ఎక్కువగా వుంటుందా?
3. నీవు ఇతరుల విమర్శకూ ఎగతాళికీ భయపడి నీవు చేపట్టిన మంచి కార్యాలను వదలివేస్తుంటావా?
4. నీలో దుడుకుతనం తొందరపాటు అనే దుర్గుణాలు కన్పిస్తుంటావా?
5. నీవు ఓర్పుగలవాడివేనా? కష్టాల్లో దైవచిత్తానికి లొంగుతూంటావా లేక దేవుని మీద తిరగబడి అతన్ని నిందిస్తూంటావా?
6. నీవు ఇతరుల కేదైన సేవచేయడంలోగాని, ఓ మంచి కార్యానికి విరాళాలీయడంలో గాని ఔదార్యాన్ని ప్రదర్శిస్తుంటావా? ప్రజలు నిన్ను ఉదారహృదయుణ్ణిగా గణిస్తారా లేక పిసినిగొట్టుగానో దూబరాఖర్చులు చేసేవాణ్ణి గానో గణిస్తారా?
7. నీ పనుల్లో నీవు వినయంతో దైవబలం మీద ఆధారపడుతూంటావా?
8. ఏదైనా వో సత్కార్యసాధనలో ఆత్మ నీకు ధైర్యాన్ని కలిగించిన అనుభవం నీకేమైనా వుందా?

# 4. మితత్వం

## మితత్వం అంటే యేమిటి?

ఇంద్రియ సుఖాలను అదుపులో వుంచే పుణ్యమే మితత్వం (Temperance). ఈ పుణ్యం విశేషంగా భోజన ప్రీతినీ లైంగిక ప్రీతినీ అదుపులో వుంచుతుంది. ఈ యధ్యాయంలో భోజనప్రీతి, లైంగికప్రీతి అనే రెండంశాలను పరిశీలిద్దాం.

## 1. భోజనప్రీతి

"భోజనప్రీతి అనే అధ్యాయంలో కొన్ని అంశాలను చెప్పాం. అక్కడ చెప్పని అంశాలను ఇక్కడ వివరిస్తున్నాం.

భగవంతుడు నరుల ప్రాణాలను నిలిపేందుకు భోజనాన్ని దయచేసాడు. మనం ఆ భోజనాన్ని మక్కువతో ఆరగించేందుకు దానిలో రుచినిగూడ పెట్టాడు. కాని నరులు మితిమీరి తింటారు, తాగుతారు. దీనివల్ల చాల అనర్థకాలు కలుగుతాయి. అనారోగ్యం తెచ్చుకొంటాం. శరీరం ఆత్మకు లొంగదు. కనుక భోజనం విషయంలో మనం మితత్వాన్ని పాటించాలి. అనగా మన ఆరోగ్యానికీ పనికీ అవసరమైనంతగా మాత్రమే భుజించాలి. అతిగా తిని రోగాలు తెచ్చుకోవడంగాని, మత్తెక్కి తిరగడంగాని పనికిరాదు.

### ఉపవాసం, శుద్ధభోజనం

ప్రాచీన కాలంనుండి క్రైస్తవ సమాజం ఉపవాసాన్నీ శుద్ధభోజనాన్నీ పాటిస్తూ వస్తూంది. భోజనం విషయంలో మితత్వాన్ని పాటించే మార్గాల్లో ఇదొకటి. ఉపవాసంవల్ల కామవాంఛలు తగ్గి శరీరం అదుపులోకి వస్తుంది. జపతపాలు మొదలైన ఆధ్యాత్మిక విషయాలమీద భగవంతునిమీద కోరిక పుడుతుంది. మన పూర్వపాపాలకు పరిహారం చేసికొని వరప్రసాదాన్ని అధికాధికంగా పొందుతాం. తపస్సుకాలంలో వచ్చే ఓ పూజ ప్రార్థన ఈలా వాకొంటుంది. "ఓ ప్రభూ! మీరు ఉపవాసంద్వారా మా దుర్గుణాలను అణచివేస్తున్నారు. మా మనస్సును ఉన్నతానికి త్రిప్పుతున్నారు. పుణ్యాన్నీ దాని బహుమానాన్ని మాకు దయచేస్తున్నారు". ఉపవాసంవల్ల ఇన్ని లాభాలు కలుగుతాయి.

ఉపవాసమంటే నిండుగాగాక కొద్దిగా భుజించడం. కొంత ఆకటితో వుండిపోవడం. శుద్ధభోజనమంటే మాంసాహారాన్ని వర్జించడం. సంవత్సరం పొడుగునవచ్చే శుక్రవారాల్లోను, తపస్సు కాలంలోను ఉపవాసాన్నీ శుద్ధభోజనాన్నీ పాటించడం తిరుసభ సంప్రదాయం. ఈ దినాలు విశేషంగా క్రీస్తు శ్రమలను జ్ఞప్తికి తెచ్చేవి. ప్రస్తుత నియమాల ప్రకారం మనం విబూది బుధవారంనాడు, పెద్ద శుక్రవారంనాడు శుద్ధ భోజనాన్నీ ఉపవాసాన్నీ గూడ పాటించాలి. అన్ని శుక్రవారాల్లోను శుద్ధభోజనాన్ని పాటించాలి. 15వ యేటి నుండి జీవితాంతం వరకు శుద్ధ భోజన నియమాన్ని పాటించాలి. 18వ యేటినుండి ఉపవాస నియమాన్ని పాటించాలి. వ్యాధిగ్రస్తులు మొదలైనవాళ్ళకు ఈ నియమాలు వర్తించవు.

### బైబులు దృష్టాంతాలు

యూదులు కష్టాల్లో జిక్కి భగవంతుని అనుగ్రహాన్ని పొందగోరినపుడల్లా ఉపవాసం చేసేవాళ్ళు. మోషే, దానియేలు అన్నా, యూదితు మొదలైనవాళ్ళంతా యిలా చేసినట్లు చదువుతున్నాం. యోవేలు గ్రంథం ఈలా చెప్తుంది -

ప్రభువు ఇట్లంటున్నాడు
ఇప్పుడైన మీరు పూర్ణహృదయంతో నాచెంతకు మరలిరండి
ఉపవాసంతో సంతాపంతో ఏడ్పులతో
నా వద్దకు తిరిగిరండి" - 2,12-13.

క్రీస్తు స్వయంగా ఉపవాసాన్ని పాటించాడు. "నలువది రేయింబవళ్ళు ఉపవాసాలతో గడిపిన పిదప అతనికి ఆకలి వేసింది" - మత్త 4,2. అతడు ఉపవాసాన్ని గూర్చి చాలసార్లు బోధించాడుకూడ. ఓసారి శిష్యులు ఓ బాలుని నుండి మూగదయ్యాన్ని పారదోలలేకపోయారు. కాని క్రీస్తు ఆ భూతాన్ని వెళ్ళగొట్టాడు. అది మాకెందుకు లొంగలేదో చెప్పమని వాళ్లు క్రీస్తు నడిగారు. ప్రార్థన ఉపవాసాలవల్ల మాత్రమే ఈలాంటి దయ్యాలను వెళ్ళగొట్టవచ్చు అని క్రీస్తు జవాబు చెప్పాడు - మార్కు 9,29. కనుక క్రీస్తు బోధల ప్రకారం మనం ఉపవాసాన్ని పాటించాలి.

భోజన విషయంలో మితత్వాన్ని గూర్చి ఖండితమైన నియమాలేవీ లేవు. ఎవరికి తోచిన పద్ధతిలో వాళ్లు మితత్వాన్ని పాటించాలి. మనం ఎన్నిసార్లు తింటున్నాం, ఎంత తింటున్నాం, ఏలాంటి తిండి తింటున్నాం అనే విషయాలన్నిటిలోను సంయమనాన్ని పాటించాలి.

మనదేశంలో మద్యపానం దుర్గుణం క్రిందికే వస్తుంది. దేహారోగ్యానికి గాని పుష్టికిగాని సారాయం అవసరంకాదు. కనుక మద్యాన్ని పూర్తిగా మానుకోవడమే మెరుగు. ఈ సందర్భంలో చుట్ట, సిగరెట్లు మొదలైన వాటినిగూడ ప్రస్తావించాలి. భోజనంలాగ పొగత్రాగడం అవసరంకాదు. ఐనా చాలమంది చుట్టా సిగరెట్లమీద ఎంతో డబ్బు తగలేస్తారు. వీటిని పూర్తిగా విసర్జించడం ఉచితం. అలాగే అతినిద్రకూడ పనికిరాదు. మితిమీరిన నిద్ర సోమరితనాన్నీ బద్దకాన్నీ తెచ్చిపెడుతుంది. ప్రార్థనకు ఆటంకం కలిగిస్తుందికూడ. కనుక అనవసరమైన నిద్రను త్యజించాలి.

ఉపవాస శుద్ధభోజనాలద్వారాను, మద్యం చుట్టా బీడీలు మొదలైనవాటిని పరిత్యజించడం ద్వారాను కొంత సొమ్ము ఆదాచేస్తాం. ఆ సొమ్మును పేదల భోజనావసరాలకు వెచ్చించడం ఉచితం. మనది పేదదేశం. ఎప్పుడూ కొందరు పస్తులుండనే వుంటూంటారు. కనుక మన ఖర్చులను కొంచెం తగ్గించుకొని మిగిలిన సొమ్మును పేదల తిండి కొరకు వెచ్చిస్తే సోదరప్రేమను పాటించినవాళ్ల మౌతాం. వట్టి ఉపవాసం కంటె సోదరప్రేమతో గూడిన ఉపవాసం అధిక పవిత్రమైంది.

## 2. లైంగిక ప్రీతి

భగవంతుడు వ్యక్తి ప్రాణాలను నిలబెట్టడానికి భోజనప్రీతిని దయచేసాడు. మనం భోజనాన్ని తగినంతగా భుజించి వ్యక్తిగతంగా శరీరాన్ని నిలబెట్టుకోవాలి. అలాగే అతడు

నరజాతి ప్రాణాలను నిలబెట్టడానికి లైంగికప్రీతిని దయచేసాడు. స్త్రీ పురుషులు ఉచితరీతిలో కలసికొని సంతానాన్ని కని ఈ నేలమీద నరజాతిని కొనసాగించుకొనిపోవాలి.

భగవంతుడు భోజనంలో రుచిని పెట్టినట్లే కలయికలో ఆనందాన్ని పెట్టాడు. రుచికి మరిగి అన్నం తింటాం, ఫలితంగా దేహపోషణం జరుగుతుంది. సుఖానికి మరిగి స్త్రీ పురుషులు కలసికొంటారు. ఫలితంగా సంతానోత్పత్తి కలిగి నరజాతి కొనసాగుతుంది.

కాని నరులు భోజనం విషయంలో చాల పాపాలు చేసినట్లే, లింగం విషయంలో గూడ చాల పాపాలు చేస్తారు. కనుక భోజనం విషయంలోలాగే లింగం విషయంలో గూడ మితత్వం అవసరం.

మనం హృదయంలోనుండి లైంగిక వాంఛలను పూర్తిగా నిర్మూలించకూడదు. వాటంతటఅవి మంచివే. అవిలేందే నరజాతి కొనసాగే మార్గంలేదు. కాని మనం ఈ వాంఛలను స్వార్థలాభానికి వాడుకొని పాపం కట్టుకొంటాం. కనుక వీటిని అదుపులో పెట్టుకోవడం అవసరం. ఇందుకుగాను పవిత్రత (Chastity) అనే పుణ్యాన్ని పాటించాలి. "మోహం" అనే అధ్యాయంలో పవిత్రతను గూర్చి కొన్ని అంశాలు చెప్పాం. అక్కడ చెప్పినవాటిని ఇక్కడ వివరిస్తున్నాం.

లైంగిక సుఖాలను అదుపులో వుంచే పుణ్యమే పవిత్రత. అవివాహితులు వివాహితులు కూడ వారివారి అంతస్తునకు తగినట్లుగా పవిత్రతను పాటించాలి. దంపతులు వివాహ జీవితంలో క్రమబద్ధమైన లైంగిక సుఖాలను అనుభవించవచ్చు. అవివాహితులకు ఈ సుఖాలు అసలు పనికిరానేరావు.

సంసార జీవితంలో స్త్రీపురుషులు తమ లైంగికావయవాలను పరస్పరం వినియోగించుకొని పరిపూర్ణ సుఖాన్ని పొందుతారు. కాని అవివాహితులకు ఈ లైంగిక క్రియ పూర్తిగా నిషిద్ధం. వాళ్ళు సంతానాన్ని కనే ప్రసక్తిలేదు. కనుక లైంగిక క్రియకూడ వాళ్ళకు తగదు. శారీరకంగాను మానసికంగాను గూడ వాళ్ళకు ఈ క్రియ నిషిద్ధం. స్వయంగా లైంగికావయవాలను స్పృశించుకొని ఉద్రేకాన్నీ ఆనందాన్నీ పొందడం గూడ పాపమే.

## వివాహితులు

కాని వివాహితుల విషయం వేరు. వాళ్ళు సంతానాన్ని కని జగత్ స్థితిని కొనసాగించాలని భగవంతుని నిర్ణయం. కనుక దంపతులు కలుసుకోవాలి, సుఖాన్ని అనుభవించాలి, బిడ్డలను కనాలి. భార్యభర్తల లైంగిక క్రియలు లైంగిక సుఖాలు నానారూపాల్లో వుండవచ్చు. వాళ్ళు దంపతులు కనుక అవి యే రూపాంలోవున్నా పవిత్రమైనవే ఔతాయి. కనుక వాటికి నిషేధం ఏమీలేదు.

కాని ఆలుమగలు లైంగిక సుఖాన్ని అనుభవించి ఆ మీదట తత్ఫలితమైన సంతానాన్ని బుద్ధిపూర్వకంగానే నిషేధించకూడదు. పరస్పరప్రేమ సంతానప్రాప్తి రెండూ

వివాహ ధర్మాలు. కనుక కృత్రిమంగా సంతానాన్ని అరికట్టడం వివాహ ధర్మాన్ని మీరడమే ఔతుంది. ఈ పట్టున తోబియా వాక్యాలు మనకు ఆదర్శం కావాలి. అతడు సారాను కూడబోయేపుడు ఈలా ప్రార్థన చేసాడు -

"ప్రభూ! నీవు ఆదాముని సృజించావు
అతినికి భార్యగాను ఆదురువుగాను
తోడునీడగాను ఉండడానికి ఏవను చేసావు
వారినుండియే మానవజాతి ఉద్భవించింది
నేను కామతృప్తి కొరకుగాక
దైవాజ్ఞకు లొంగి ఈ సారాను స్వీకరించాను
నీవు మమ్ము కరుణతో జూడు" - తోబీ 8,6-7.

క్రైస్తవ దంపతుల లైంగిక జీవితంలో సంయమనం కూడ వుండాలి. మనం ఇహలోకం కొరకుగాక పరలోకం కొరకు ఉద్దేశింపబడినవాళ్ళం. అక్కడ వివాహంగాని బిడ్డలను కనడం గాని వుండదు. అక్కడి జీవితం దేవదూతల జీవితంలా వుంటుంది - మార్కు 12,25. మనం ఇక్కడ వున్నపుడే ఆ పరలోక జీవితానికి సిద్ధం కావాలి. కావున దంపతుల లైంగిక ప్రవృత్తిలో నిగ్రహం వుండాలి. ఈ నిగ్రహం లైంగిక క్రియ చెడ్డదని నిరూపించదు. క్రైస్తవుడు లైంగిక జీవితాన్ని దాటిపోయి ఉత్థాన జీవితంలో అడుగిడాలని నిరూపిస్తుంది. ఈ భూలోక జీవితంకంటె పరలోక జీవితం గొప్పదని నిరూపిస్తుంది. పౌలు కూడ తన లేఖల్లో ఈ సంయమనాన్ని పేర్కొన్నాడు. కాలం చివరకు వచ్చింది కనుక భార్యను కలిగినవాళ్లు కూడ భార్య లేనట్లుగా జీవించాలి అని చెప్పాడు -1కొ 7,29.

ఆ ప్రభువు రెండవ రాకడను మనసులో పెట్టుకొని అతడు ఈలా వ్రాసాడు. ఈలోక విషయాలూ, వాటితోపాటు వివాహం కూడ ప్రభువు రాకడకు తావీయాలి. ఇంకా, ప్రార్థనం చేసికొని భగవంతుని సాక్షాత్కారం కలిగించుకోవడం కోసం భార్యాభర్తలు కొంత కాలంపాటు ఒకరి నొకరు సమీపించకుండా వుండడం మంచిదని కూడా సూచించాడు. - 1కొ 7,5. కనుక లైంగిక సుఖమే పరమావధి అనుకోగూడదు.

## పవిత్రతను సాధించే మార్గాలు

లైంగిక వాంఛలు అతి బలీయంగా వుంటాయి. వాటిని అణచుకొని పవిత్రతను సాధించడం కష్టమైన కార్యం. ఐనా వరప్రసాద బలంతో క్రైస్తవుడు ఈ పుణ్యాన్ని సాధించవచ్చు.

పవిత్ర జీవితం జీవింపగోరేవాళ్ళు తమ్ముతాము నిగ్రహించుకోగలిగి వుండాలి. సుఖాలను త్యజించ గలిగివుండాలి. దివ్యసత్ప్రసాదం, పాపసంకీర్తనం మొదలైన

సంస్కారాలను భక్తితో స్వీకరించాలి. శ్రద్ధతో ప్రార్థన చేసికోవాలి. దైవబలం వలన మన శరీరం క్రమేణ ఆత్మకు లొంగుతుంది.

సుఖజీవనానికి అలవాటుపడినవాళ్ళు పవిత్రతను సాధించలేరు. తమ యిష్టం వచ్చినట్లుగా తిని త్రాగేవాళ్ళు, ఎప్పుడూ ఇంద్రియాలను సంతోషపెట్టుకొనేవాళ్లు, వళ్ళువంచి పనిచేయకుండ సోమరితనంగా తిరిగేవాళ్లు శారీరక వాంఛలను జయించలేరు. భోగప్రియులు జితేంద్రియులు కాలేరు కదా? శరీరంలోని జంతు వాంఛలను లొంగదీసుకోవాలంటే నరుడు కఠోర జీవితం జీవించాలి. తపస్సును అలవాటు చేసికోవాలి.

ఈ విషయంలో జాగ్రత్తకూడ అవసరం. మనకు భావనాశక్తి వుంది. ఈ శక్తితో మన మనసు పెక్కు లైంగిక భావాలను కల్పించుకొంటుంది. మనం చదివే పుస్తకాలు, చూచే సినిమాలు, టీవీలు మొదలైనవి కూడ కొంతవరక మన మనసుకి ఉసిపోస్తాయి. మన చూపులు కూడ చాల ముఖ్యం. కంటితో చూచిన దృశ్యం ఒకటి ఇవ్వాళ మనకు పాపకారణం గాకపోవచ్చు. కాని రేపు అదే శోధనలు తెచ్చిపెడుతుంది. కనుక నేత్రవినీతి అవసరం. ఈ సందర్భంలో సీరా గ్రంథం ఈలా వాకొంటుంది.

“అందగత్తె యెదురుపడినపుడు
నీ చూపులను ప్రక్కకు త్రిప్పుకో
స్త్రీసౌందర్యం వలన చాలమంది తప్పుత్రోవ పట్టారు
అది అగ్నిలాగ ఉద్రేకజ్వాలలను రగుల్కొల్పుతుంది” - 9,8-9.

ఇక్కడే స్పర్శను గురించి కూడ ఓ మాట చెప్పాలి. లైంగిక సుఖం విశేషంగా స్పర్శలోనే వుంటుంది. ఒకమారు ఈ స్పర్శను మేలుకొల్పితే దాన్ని అదుపులో పెట్టుకోవడం కష్టం. కనుక విశుద్ధ హృదయులు కామ సంబంధమైన స్పర్శకు అన్నివిధాల దూరంగా వుండాలి.

కొన్నిసార్లు లైంగిక పాపాల్లో పడిపోతాం. కొన్ని పర్యాయాలు ప్రయత్నం చేసినా ఈ పాపాలనుండి తప్పించుకోలేం అనిపిస్తుంది. దీనివలన నిరుత్సాహ భావాలు కలుగుతాయి. విశేషంగా కొందరికైతే ఈ రంగంలో బలహీనత మెండు. వీళ్ళు అవివాహితులూ కావచ్చు. వివాహితులూ కూడ కావచ్చు. వీళ్ళకు ఏదో కామభూతం తమ్ము ఆవేశించినట్లుగాను, అది నిర్బంధంగా తమ్ము పాపానికి పురికొల్పుతూన్నట్లుగాను తోస్తుంది. ఐనా మనం నిరుత్సాహపడకనక్కర లేదు. మన హృదయం దేవునిపై నిల్చివుంటే చాలు ఆ ప్రభువే మనలను సకల శోధనల నుండి కాపాడతాడు. ప్రభువుకి నీతిశాస్త్రం బాగా తెలుసు. మన మనసు ఎంతవరకు పాపానికి లొంగిందో, ఎంతవరకు తనపట్లగల భక్తిభావంతో స్థిరంగా నిల్చివుందో అతనికే తెలుసు. కనుక మన మంచి చెడ్డలను ఆ దయామయునికే వదలివేయాలి. మనం మాత్రం నిరాశకు తావీయక, వరప్రసాద బలంతో ధైర్యంగా ముందుకి వెళ్తూండాలి.

# అనుబంధం- 1. వినయం

ఇక్కడ నాల్గంశాలు పరిశీలిద్దాం. ప్రాచీన గ్రీకు, రోమను ప్రజలు వినయాన్ని అంగీకరించలేదు. వినయమంటే అణకువ, లొంగివుండడం. కనుక ఆత్మోత్కర్షగల అన్యజాతి ప్రజలకు ఈ పుణ్యం గిట్టలేదు. కాని పూర్వవేదపు యూదులు మాత్రం దైవానుగ్రహంవల్ల ప్రబోధితులై వినయాన్ని అంగీకరించారు. పశ్చాత్తాప పూరితులూ వినయాన్వితులూ ఐన వారిని ప్రభువు ఆనాదరం చేయదని స్పష్టంగా చెప్తుంది పూర్వవేదం. నూత్నవేదంలో క్రీస్తు వినయాన్ని బోధించాడు, స్వయంగా పాటించాడు కూడ. నేడు ఆ ప్రభువు మనకు ఆదర్శం.

## 1. వినయం అంటే యేమిటి?

నరుడు ఆత్మజ్ఞానం ద్వారా తన తక్కువతనాన్ని తాను గుర్తించి తన్ను తాను తగ్గించుకోవడం వినయమౌతుంది. ఈ నిర్వచనంలో రెండు అంశాలున్నాయి. మొదటిది, మన అల్పత్వాన్ని మనం అర్థం చేసికోవాలి. మన శక్తిసామర్థ్యాలు దేవునినుండి వచ్చినవిగాని మనం స్వయంగా ఆర్జించినవి కావు. కనుక మనలను మనం తక్కువగా అంచనా వేసికోవాలి. రెండవది, రోజువారి జీవితంలో మనలను మనం తగ్గించుకోవాలి. ఈ తగ్గించుకోవడమనేది నిందావమానాలు భరించే వరకు పోవాలి.

అణకువలో సత్యం, న్యాయం, అనే రెండు లక్షణాలున్నాయి. మనలోని మంచిఅంతా దేవుని వద్దనుండి వచ్చిందే. మనలోని దుష్టత్వమంతా మననుండి వచ్చిందే. కనుక మన అల్పత్వాన్ని మనం అంగీకరించాలి. ఇది సత్యం.

మన అల్పత్వాన్ని మనం అంగీకరించాక, మనలోని మంచికి దేవునికి వందనాలర్పించాలి. ఈ మంచి మన సొత్తుగాదు, భగవంతునిసొత్తు. కనుక మనలోని గొప్పగుణాలను మనమే ఆర్జించినట్లుగా పొంగిపోకూడదు. వాటికి కర్తయైన దేవునికి వందనాలర్పించాలి. ఇది న్యాయం. మనలో మంచి అనేది లేకపోలేదు. మనం కృషి చేయకపోలేదు. కాని ఈ కృషికీ ఈ మంచికీగూడ కర్త దేవుడే. అతని వరప్రసాదం వల్లనే మనం మంచిని చేయగల్గుతున్నాం. లేకపోతే పూర్తిగా భ్రష్టులమై పోయివుండేవాళ్ళమే. చిత్రకారుడు నారబట్టపై బొమ్మను చిత్రిస్తే నారబట్టను మెచ్చుకోం. చిత్రకారుణ్ణి మెచ్చుకొంటాం. అలాగే మనలోని మంచికి మనలను మనం మెచ్చుకోగూడదు. ఆ మంచికి కారకుడైన దేవుణ్ణి మెచ్చుకోవాలి.

వినయంగా వుండడమంటే మనలో మంచిలేదని చెప్పుకోవడంగాదు. మనలో శక్తిసామర్థ్యాలు లేవని తలంచడం గాదు. కాని ఆ మంచీ ఆ శక్తిసామర్థ్యాలు దేవుని వద్దనుండే వచ్చాయని అంగీకరించడం. దేవుని వరాలనూ దానాలనూ పొందిన పిమ్మటకూడ మన విలువ అత్యల్పమని గ్రహించడం. ఈ సందర్భంలో పౌలు "నీకున్నది

సమస్తం దేవుడేకదా నీ కిచ్చింది? ఐతే నీకున్నది దేవుడిచ్చిన దానం కాదన్నట్లు నీవు గర్వించడం దేనికి" అని ప్రశ్నించాడు - 1కొ 4,7.

కొందరికి వినయం అంత సలువుగా అలవడదు. వీళ్ళు తమ్ముగూర్చి తాము ఘనంగా యెంచుకొంటారు. తమ్ము గూర్చి తాము గొప్పలు చెప్పుకొంటారు. ఈలాంటివాళ్ళు విశేషంగా తమ పాపాలు తలంచుకొని తమ్ముతాము తగ్గించుకోవడం నేర్చుకోవాలి. మనమందరమూ జన్మపాపంతో పుడతాం. కనుక పాపంలోనే పుట్టిన నరునికి అహంభావం తగదు. ఇంకా మనం బుద్ధి వివరం తెలిసిననాటి నుండి ఎన్నో సొంతపాపాలుకూడ చేస్తుంటాం. వీటికి నరకశిక్షకు పాత్రులమౌతాం. ఈలాంటి వాళ్ళం మిడిసిపాటుతో విర్రవీగడం తగుతుందా? పైపెచ్చు, దేవుని వరప్రసాద బలమే లేకపోతే మనమింకా యెన్నో పాపాలు మూటకట్టుకొని వుండేవాళ్ళమే. వరప్రసాద బలమే మనలను ఆయా ప్రత్యేక పాపాలనుండి కాపాడింది. ఈ సందర్భంలో అగస్టీను భక్తుడు ఈలా వాకొన్నాడు: "ఓ ప్రభూ! నేను ఏయే పాపకార్యాలు చేయలేదో వాటన్నిటినుండి నన్ను కాపాడింది నీ వరప్రసాదమే. నేను పాపం కొరకే పాపం చేసే దుష్టుణ్ణి. కనుక నేను ఏలాంటి దుష్కార్యమైన చేసివుండేవాణ్ణే కదా? ప్రభూ! నీవు నా పాపాలన్నీ మన్నించినందులకు నేను నిన్ను స్తుతిస్తున్నాను. నేను యథార్థంగా చేసిన పాపాలనూ, నీ కృపవల్ల చేయక వదలివేసిన పాపాలను గూడ నీవు మన్నించావు". ఈ పునీతుని వాక్యాలు మనకుకూడ అక్షరాల వర్తిస్తాయి. వరప్రసాద బలం మనలను ఎన్నో పాపాల నుండి తప్పిస్తుంది. ఈలా నిరంతరం పాపంవైపే మొగ్గేవాళ్ళం, దేవుని వరప్రసాదంవల్ల మాత్రమే ఆ పాపం నుండి తప్పించుకొన్నవాళ్ళం మనం గొప్పలు చెప్పుకొంటే చెల్లుతుందా? ఫలితార్థమేమిటంటే, పాపపు నరులమైన మనం మన పాపాలను జ్ఞప్తికి తెచ్చుకొని మనలను మనం తగ్గించుకోవడం నేర్చుకోవాలి.

## 2. వినయం యొక్క ప్రాశస్త్యం

వినయం గొప్పతనాన్ని రెండు విధాల అర్థం చేసికోవచ్చు. మొదటిది, అది మనకు వరప్రసాదాలను సంపాదించి పెట్టే సాధనం. "దేవుడు అహంకారులను ఎదిరించి వినమ్రులకు తన కృపను అనుగ్రహిస్తాడు" - యాకోబు 4,6. దేవుడు వినయాత్ములకు కృపను ఎందుకు అనుగ్రహిస్తాడు అంటే వాళ్లు తమకు తాము ఘనతను ఆపాదించుకోరు. గర్వంతో పొంగిపోరు. దేవుడు తమకు దయచేసిన వరప్రసాదాలకు అతన్ని స్తుతించి కీర్తిస్తారు. అందుచేత ప్రభువు సంతోషంతో వాళ్ళకు తన కృపను దయ చేస్తాడు. వాళ్ళ ద్వారా అతని కీర్తి పెరుగుతుందేగాని తరగదు. కాని ప్రభువు గర్వాత్ములకు తన కృపను దయచేయడు. ఎందుకంటే, వాళ్లు దేవుణ్ణి కీర్తించడానికి బదులుగా తమ్ముతామే కీర్తించు కొంటారు. ఇది దేవునికి నచ్చదు. అతడు తన కీర్తిని ఇతరులతో పంచుకొనేవాడు కాదు- యెష 12,8. కనుక అతడు గర్విష్ఠులకు సాయంచేయడు. ఈలా అణకువ మనకు

దేవుని నుండి వరప్రసాదాలను సంపాదించి పెడుతుంది. అందుచేత క్రైస్తవ భక్తుడు వినయం గొప్పతనాన్ని అర్థం చేసికొని ఆ పుణ్యాన్ని సాధించే ప్రయత్నం చేయాలి.

రెండవది, వినమ్రత అన్ని పుణ్యాలకు పునాదిలాంటిది. అది లేందే ఏ పుణ్యమూ వృద్ధి చెందదు. వినయంలేని హృదయంలో విశ్వాసం నమ్మకం దేవప్రేమ పెంపొందవు. ఆలాగే వినమ్రత లేనికాడ వివేకం, న్యాయం, మితత్వం మొదలైన పుణ్యాలుకూడ అభివృద్ధి చెందవు. కావుననే పునీత పెద్ద గ్రెగొరీగారు "వినయం అన్ని పుణ్యాలకు తల్లిలాంటిది. అన్ని పుణ్యాలకు దుంపలాంటిది. కనుక వినయం అనే దుంపనుండి చిగురించిన పుణ్యం ఏదైనా వృద్ధి చెందుతుంది. ఆ దుపంనుండి చిగురింపని పుణ్యం ఏదీ వికసింపదు. దానికి ఆధారం లేదు" అని వ్రాసారు. ఆగస్టీను భక్తుడు కూడ "మనం పైకి ఎక్కాలంటే మొదట క్రిందకు దిగడం నేర్చుకోవాలి. ఆకాశాన్నితాకే గోపురాన్ని కట్టాలంటే మొదట దాని పునాదిని పటిష్ఠంగా నిర్మించాలి. ఆ పునాదే వినయం" అని వ్రాసాడు. కనుక క్రైస్తవుల్లో వినయం అనేది బలంగా వుండాలి. అది లేకపోతే అసలు క్రైస్తవ జీవితమే లేదు.

## 3. వినయానికి వ్యతిరేకమైన పాపాలు

వినయానికి వ్యతిరేకమైన పాపాలు చాల రూపాల్లో కన్పిస్తాయి. కొందరు తామే అధికులమని యెంచుతుంటారు. తమ తక్కువతనాన్నీ తప్పిదాలనూ తాము గుర్తించరు. వీళ్లు అందరినీ అన్ని సంఘటనలనూ విమర్శిస్తూంటారు. ఇతరుల్లో తప్పులెన్నేవాళ్ళు తమ తప్పులను తాము గుర్తించలేరు కదా!

ఇంకా కొందరు తమలోని మేలిగుణాలన్నిటికీ తామే కర్తలైనట్లుగా భావించి విర్రవీగుతుంటారు. డాబూ, దర్పమూ ప్రదర్శిస్తుంటారు. ఆ మేలి గుణాలకు దేవునికి వందనాలర్పించరు. వీలైనప్పుడల్లా తమ్ముతామే పొగడుకొంటుంటారు.

మరికొందరు వాళ్ళల్లోని శక్తిసామర్థ్యాలను బాగా ప్రకటనం చేసికొంటారు. తమలోని లోపాలను మాత్రం జాగ్రత్తగా కప్పిపెట్టుకొంటారు. లోకం యెదుట మంచి వాళ్ళుగా సమర్థులుగా చలామణి ఔతారు. తమకు తామే మంచిపేరు ఆపాదించుకొంటారు. ఇది నిక్కంగా వంచన.

అవినయాత్ములు నానారూపాల్లో కన్పిస్తారు. కొందరు పొగరుబోతులు. వీళ్ళు నిరంతరం తమ్ముతాము కీర్తించుకొంటుంటారు. కొందరు ఆడంబర ప్రియులు. వీళ్ళు తమ చేతల్లోను వేషభాషల్లోను ఆడంబరాన్ని ప్రదర్శిస్తుంటారు. కొందరు ఆశాపరులు. వీళ్ళు తమ శక్తిని మించి పదవులను ఆశిస్తారు. కొందరికి దుస్సాహసం మెండు. వీళ్ళు తమ శక్తికి మించిన కార్యాలను చేపడతారు. వాటిని సాధించలేక నగుబాట్లు తెచ్చుకొంటారు గూడ. కొందరు ఆత్మస్తుతిపరులు. వీళ్ళు నిరంతరం తాము సాధించిన విజయాలను ఏకరువు పెడుతుంటారు. ఈలాంటి క్రియలన్నీ వినయానికి వ్యతిరేకమైనవే.

## 4. వినయాన్ని ఏలా సాధించాలి?

పాపపు నరులమైన మనం సహజంగానే గర్వాత్ములం. మనకు వినయం సులువుగా అలవడదు. కనుక మనం క్రీస్తుని చూచి వినయాన్ని నేర్చుకోవాలి. అతడు దేవుడైకూడ నరుడుగా జన్మించాడు. జీవితాంతం వినయంతో జీవించాడు. మరణం వరకు, సిలువ మరణం వరకు గూడ, విధేయుడయ్యాడు. కనుక తండ్రి అతన్ని అధికంగా హెచ్చించాడు. అన్ని నామాల కంటె శ్రేష్ఠమైన నామాన్ని అతనికి అనుగ్రహించాడు. ఈలా వినయాత్ముడైన క్రీస్తు మనకు ఆదర్శం. ఆ ప్రభువు "మీరు నా కాడిని ఎత్తుకొనండి. నేను సాధుశీలుణ్ణి వినమ్రహృదయుణ్ణి అని నా నుండి నేర్చుకొనండి" అని పల్కాడు - మత్త 11, 29.

మనం దేవునిపట్లా, తోడి నరులపట్లా, వ్యక్తిగత జీవితంలోనుగూడ వినయాన్ని చూపించాలి. ఈ మూడంశాలను క్రమంగా పరిశీలిద్దాం.

1) దేవునిపట్ల వినయం. ఆరాధన, కృతజ్ఞత, ఆధారభావాలద్వారా దేవునిపట్ల వినయాన్ని ప్రదర్శిస్తాం.

సర్వసంపూర్ణుడైన దేవుణ్ణి ఆరాధించి అతని ముందట మన తక్కువతనాన్నీ పాపాన్నీ వొప్పుకోవాలి. అతన్ని స్తుతించి కీర్తించాలి. ఆ ప్రభువు నెదుట మన విశ్వాసాన్నీ భయభక్తులనూ వెల్లడి చేయాలి. నీ వొక్కడివే పరిశుద్ధుడవు, నీ వొక్కడివే ప్రభువువి, నీ వొక్కడివే మహోన్నతుడవు అని ప్రకటించాలి.

మనకున్న ఆధ్యాత్మిక వరాలూ భౌతిక వరాలూ అన్నీ దేవుడిచ్చినవే. ఈ వరాలన్నిటికి ఆ ప్రభువు స్తుతించాలి. అతనికి కృతజ్ఞత తెలియజేయాలి. మరియమాతలాగ "నా హృదయం ప్రభువుని స్తుతిస్తూంది. సర్వశక్తిమంతుడు నా యెడల గొప్ప కార్యాలు చేసాడు" అని చెప్పాలి.

మనకు స్వయంశక్తిలేదు. కనుక మనం నిరంతరం దేవునిమీద ఆధారపడి జీవించాలి. ఆయా పనులు ప్రారంభించక ముందు దేవుని సహాయం అడుగుకోవాలి. వాటిని ముగించాక దేవునికి వందనాలు చెప్పుకోవాలి. అనవరతం దైవబలంమీద ఆధారపడి జీవించాలి.

2) తోడి నరులపట్ల వినయం. భగవంతునిపట్ల వినయాన్ని ప్రదర్శించడం సులభమే. కాని తోడి నరులపట్ల వినయాన్ని చూపించడం ఎంతమాత్రం సులభంకాదు. ఐనా ఇది అవసరం. మనం తోడి నరుల్లోని ఆధ్యాత్మిక వరాలనూ భౌతిక వరాలనూ గుర్తించి వారిని ప్రశంసించాలి. నరుల మంచితనం దేవునికే కీర్తి తెచ్చిపెడుతుంది. వారిలోని లోపాలను చూచీచూడనట్లు వదలివేయాలి. విశేషంగా ఇతరులను చక్కదిద్దే పూచీ మనకు లేనపుడు, వారి లోపాలను పట్టించుకోగూడదు. ఇతరులు పొరపాటు చేసినపుడు, పాపంలో

పడినపుడూ వారికి పశ్చాత్తాపం కలగాలని ప్రార్థన చేయాలి. వరప్రసాదమే గనుక మనలను ఆదుకోకపోయినట్లయితే, మనం అంతకంటె పెద్దపాపమే చేసివుండేవాళ్ళమని అనుకోవాలి.

తరచుగా అహంకారంకొద్దీ ఇతరులకంటె మనమే యోగ్యులమని తలుస్తూంటాం. మనలను మనం గొప్ప జేసికొని ఇతరులను చిన్న చూపు చూస్తుంటాం. కాని ఇది పద్ధతి కాదు. "వినయంతో ఇతరులను మీకంటె అధికులనుగా భావించండి" అని చెప్పాడు పౌలు - ఫిలి 2,3. ఇతరుల్లో మనం గుర్తించని మంచీ వరప్రసాదమూ బోలెడంత వుండవచ్చుగదా! కనుక పరులు మనకంటె యోగ్యులని భావించడం కష్టం కాకూడదు. మొత్తం మీద చిత్తశుద్ధితో ప్రయత్నం చేస్తేనేతప్ప తోడి నరులపట్ల వినయాన్ని ప్రదర్శించలేం.

3) వ్యక్తిగత జీవితంలో వినయం. మన హృదయంలోను బాహ్యక్రియల్లోను వినయం వుండాలి.

మన హృదయంలో వినయముండాలి. కనుక మనలను మనం అతిగా నమ్మకూడదు. మనలనుగూర్చి మనం గొప్పగా అంచనా వేసికోగూడదు. "నీ శక్తికి మించిన కార్యాలను అర్థంచేసికోవాలని యత్నం చేయకు. నీ కందని విషయాలను పరిశీలించాలని ప్రయాసపడకు" - సీరా 3,21.

ఇంకా దేవుడు మన కిచ్చిన వరాలతో తోడి నరులకు సేవలు చేయాలి. అంతేగాని వాటిద్వారా మనకు మనం గొప్పను ఆపాదించుకోగూడదు. వాటిద్వారా మనకు కీర్తిని తెచ్చుకోవాలని తాపత్రయ పడకూడదు. ఈలా చేసేవాళ్లు క్రీస్తునిగాక తమ్ముతామే ప్రకటించుకొన్నట్లవుతుంది. దేవుడు మనకిచ్చిన వరాలతో దేవునికే కీర్తి రప్పించాలిగాని మనకు మనం కీర్తి తెచ్చుకోగూడదు.

ఇంకా మనం గొప్ప పదవులనూ గౌరవాలనూ ఆశించగూడదు. పేరు తెచ్చుకోవాలనే దురదను అణచుకోవాలి. పునీతులు గుప్తజీవితం జీవించారు. వారినాటి ప్రజలకు వారి గొప్పతనం తెలియనే తెలియదు. ఎవరు ఊరూపేరూ లేనివాళ్లుగానూ విలువ లేనివాళ్ళుగానూ చలామణి కాగోరుతారో వాళ్లే నిజంగా మహాత్ములు. వినయాత్ములు ఎప్పుడుకూడ అందరి కంటె క్రింది స్థానంలో కూర్చుంటారు - లూకా 14,10. ఈ సూత్రాలు మనకుకూడ ఆదర్శం కావాలి.

ఇక, మన బాహ్యక్రియల్లోగూడ వినయం కన్పించాలి. కొందరు షోకైన దుస్తులను ధరిస్తారు. తమ యిండ్లను షోకుషోకుగా అలంకరించుకొంటారు. కాని వినయంగా వుండేవాళ్లు అతి సాదాగా కన్పిస్తారు. సాదాదుస్తులతోను అలంకరణలతోను సరిపెట్టుకొంటారు. మనం నిల్చుండే తీరులోను కూర్చుండే తీరులోను కూడ వినయం కన్పించాలి. ఇతరులను మర్యాదతో ఆహ్వానించి వారి అవసరాలను తీర్చే పద్ధతిలోను, వారికి పరిచర్య చేసే రీతిలోనుగూడ వినయం కన్పించాలి.

మన సంభాషణావైఖరిలోకూడ అణకువ కన్పించాలి. వినమ్రత కలవాళ్ళు ఇతరులను మాట్లాడనిస్తారు. తమ్ముగూర్చి తాము చాల తక్కువగా చెప్పుకొంటారు. ఇతరుల మాటలనూ చేతలనూ అంత తేలికగా విమర్శింపరు.

వినయం కష్టమైన పుణ్యం. యథార్థంగా వినయాత్ములైనవాళ్ళు కొద్దిమందే. వినమ్రులు నిందావమానాలనుగూడ సహిస్తారు. లోకం దృష్టిలో వినయానికీ నిందావమానాలకూ విలువలేదు. కాని దేవుని దృష్టిలో వాటికెంతో విలువవుంటుంది. అది చాలు. కనుక మనం తప్పక అణకువకు అలవర్చుకోవాలి. మన అంతస్తు పెరిగేకొద్దీ అణకువకూడ పెరగాలి. కనుకనే సీరా గ్రంథం "నీవు ఎంత అధికుడవో అంత యెక్కువగా వినయాన్ని అలవర్చుకో. అప్పుడు ప్రభువు మన్ననను పొందుతావు" అని చెప్తుంది - 3,18.

# అనుబంధం - 2. బలహీనతలోనే బలం

రెండవ కొరింతీయుల జాబు 12, 1-10 లో పౌలు ఓ గొప్ప సత్యాన్ని పేర్కొన్నాడు. నేనెప్పుడు బలహీనుణ్ణో అప్పుడే బలవంతుణ్ణి అని చెప్పుకొన్నాడు. ఏ నరుడైనా సరే నేను బలవంతుణ్ణి అనుకొన్నాడో ఇక దేవుని శక్తి అతని మీద పనిచేయదు. నేను బలహీనుణ్ణి అనుకొంటే దైవబలం పని చేస్తుంది. ప్రేషితోద్యమంలో ఈ సూత్రం చాల ముఖ్యమైంది. కనుక దీన్ని గూర్చి విపులంగా తెలిసికొందాం.

## 1. ముల్లు వుదంతం

1కొ 12, 1-10 వచనాలు పరికిస్తే ఈ క్రింది విషయాలు స్పష్టమౌతాయి. పౌలుకి దైవదర్శనాలు లభించాయి. అతడు దేవలోకానికి ఎక్కిపోయాడు. అక్కడ మనుష్యభాషలో చెప్పడానికి శక్యంగాని సంగతులు విన్నాడు. అది వో గొప్ప అధ్యాత్మికానుభూతి. కాని ఈ దర్శనంవల్ల పౌలుకి ఎక్కడ తల తిరుగుతుందోనని ప్రభువు అతనికి వోముల్లు గుచ్చుకొనేలా చేసాడు. అది పిశాచం దూతగా పనిచేసింది. అతన్ని అణచి వుంచడానికి వుపయోగపడింది.

ఏమిటి ఈ ముల్లు? ఈ పదానికి వ్యాఖ్యాతలు చాల అనర్థాలు చెప్పారు. బహుశ వాటిల్లో సబబైన అర్థం యిది. పౌలుకి ఎదురైన బాధలే ఈముల్లు. అతడు వ్యాధి బాధలు, ఆకలి దప్పులు, వేదహింసలు, మిత్రద్రోహం, నానాపదలూ, ఆందోళనలూ, భయాలూ, మొదలైనవన్నీ అనుభవించాడు. ఈ శ్రమలను గూర్చి 2కొ 11,23-29లో సవిస్తరంగా చెప్పుకొన్నాడు.

ఈ శ్రమలతోపాటు అతనికి ప్రతిపక్షుల పీడకూడ ఎదురైంది. యూద క్రైస్తవుల్లో కొందరు మోషే ధర్మశాస్త్రం కూడ క్రైస్తవులను రక్షిస్తుందని వాదించేవాళ్ళు. వీళ్ళే యూదమతాభిమానులు. కాని పౌలు ఈ వాదాన్ని ఖండించాడు. ధర్మశాస్త్రంకాదు, క్రీస్తుపట్ల విశ్వాసం మాత్రమే మనలను రక్షిస్తుందని బోధించాడు. కనుక పై యూదమతాభిమానులు

పౌలుకి శత్రువులయ్యారు. వాళ్లు అతని బోధకు అంతరాయం కలిగించేవాళ్లు. అతన్ని హింసించేవాళ్లు. వాళ్లు తన్ను పెట్టే బాధలను గూడ పౌలు పై "ముల్లు" శబ్దంతో సూచించాడు.

ఇక, పౌలు ఈ ముల్లుని తొలిగించమని ప్రభువుని మూడు సార్లు మనవి చేసాడు. అనగా అతడు దాన్ని ఘోరశ్రమగా భావించాడనుకోవాలి. కాని ప్రభువు మాత్రం ఆ ముల్లుని తొలగించలేదు. నా కృప నీకు చాలుపో అన్నాడు. నీవు బలహీనుడవై వున్నప్పుడు నా శక్తి నీ మీద బలంగా పని చేస్తుంది అని చెప్పాడు. పౌలుకి విషయం అర్థమయింది. తాను బలహీనుడుగా వున్నప్పుడు, తన సొంత బలం తనకు చాలనపుడు, వినయంతో ప్రభువుని ఆశ్రయిస్తాడు. అప్పుడు దైవబలం అతనిమీద పనిచేసి విజయాన్ని సాధించిపెడుతుంది. కాని అతడు నేను బలవంతుణ్ణి అనుకొన్నపుడు, తన బలం మీద తాను ఆధారపడినప్పుడు, గర్వంతో పొంగిపోతాడు. అప్పుడు దైవబలం అతనికి సహాయపడదు. కనుక ఓడిపోతాడు. కావున అతడు బలహీనుడుగానే వుండగోరాడు. నేను ఎప్పుడు బలహీనుణ్ణో అప్పుడే దైవబలం పొంది బలవంతుణ్ణి ఔతాను అనుకొన్నాడు. అందుచేత ఆ ముల్లుని తొలగించమని అతడు మళ్లా ప్రభువుని అడగనేలేదు. ఏ బలహీనతను తలంచుకొని పౌలు భయపడిపోయాడో ఆ బలహీనతలోనే శక్తి యిమిడి వుండడం ఆశ్చర్యంకదా!

## 2. పౌలు బలహీనతలు

పై ముల్లు ఉదంతాన్ని పేర్కొనక ముందు పౌలు చాలా బలహీనతలను చవిజూచాడు. వాటిల్లో కొన్నిటిని పరిశీలిద్దాం. అది అతని రెండవ ప్రేషిత ప్రయాణం. ఫిలిప్పి నగరంలో దయ్యం పట్టిన బానిసపిల్ల వుండేది. ఆమె సోదె చెప్పి యజమానులకు డబ్బు గణించి పెట్టేది. పౌలు ఆ దయ్యాన్ని వెళ్ళగొట్టాడు. తమ ఆదాయం పోయినందుకు ఆ యజమానులు మండిపడి, పౌలుని అతని శిష్యుడు సీలని కొరడాలతో కొట్టించారు, చెరలో త్రోయించారు. అప్పుడు పౌలుకి తన బలహీనత అనుభవానికి వచ్చింది - అకా 16, 16-24.

తరువాత అతడు తెస్సలోనిక నగరానికి వచ్చి అక్కడ క్రీస్తే మెస్సియా అని బోధించడం మొదలెట్టాడు. కాని ఆ నగరంలోని యూదులు పౌలు బోధకు అసూయ చెందారు. గూండాలను తీసికొనివచ్చి అతన్ని ముప్పుతిప్పలు పెట్టారు. పౌలుకి ఆశ్రయమిచ్చిన యాసోనుని చెరలో త్రోయించారు. పౌలుకి తన అశక్తకత అనుభవానికి వచ్చింది - అచ 17, 1-9.

అక్కడినుండి అతడు బెరియాకు వెళ్ళాడు. అక్కడ బోధ చేయగా చాలమంది క్రీస్తుని విశ్వసించారు. ఉన్నత కుటుంబాలవాళ్ళు కూడ శిష్యులయ్యారు. ఈ సంగతి తెలిసికొని తెస్సలోనికా యూదులు మళ్ళా అక్కడికి వచ్చిపడ్డారు. పౌరులను రెచ్చగొట్టి కలకలం సృష్టించారు. పౌలుకి తన చేతగానితనం అనుభవానికి వచ్చింది - అచ 17, 10-13.

అతడు అక్కడినుండి ఆతెన్సు నగరానికి వచ్చాడు. ఆ పట్టణం గ్రీకు విద్వాంసులకు కేంద్రస్థానం. పౌలు ఆ పండితుల సభలో ఉపన్యసించాడు. కాని వాళ్ళు పౌలుని ఎగతాళి చేసారు. నీ బోధలు మరోసారి వింటాంలే అన్నారు. పౌలుకి తలవంపులు వచ్చాయి. అతనికి తన అసామర్థ్యం తెలియవచ్చింది - అకా 17, 16-30.

అక్కడి నుండి అతడు కొరింతుకు వచ్చాడు. అక్కడ క్రీస్తుని బోధిస్తూంటే యూదులు అతన్ని ఎదిరించారు. అతని మీద నిందలు మోపారు. పౌలుకి మళ్ళీ తన బలహీనత అనుభవానికి వచ్చింది- అకా 18, 6. ఈ చివరి అనుభవాన్ని గూర్చి అతడు నేను కొరింతులో వున్నపుడు బలహీనతవల్ల భయకంపితుణ్ణయ్యాను అని చెప్పుకొన్నాడు - 1కొ 2,3.

పౌలు ఇన్ని పరాజయాలను చవిజూచినవాడు. ఇన్ని సారులు బలహీనతలను అనుభవించినవాడు. తన అశక్తతను తాను చక్కగా అర్థంచేసికొన్నవాడు. కాని ఆ యశక్తతను తలంచుకొని నిరుత్సాహపడలేదు. అతని విజయమంతా ఆ యశక్తతలోనే వుంది. ఎందుకంటే తాను అశక్తుణ్ణని నమ్మి ప్రభువుని ఆశ్రయించినప్పుడే అతనికి దైవశక్తి లభిస్తుంది. అతడెప్పుడు బలహీనుడో అప్పుడే బలవంతుడు - 2 కొ 12, 10. ప్రేషితోద్యమంలో అతని విజయమంతా ఈ సూత్రంమీదనే ఆధారపడి ఉంది.

## 3. మానుష బలం చాలనికాడనే దైవబలం

నరుని బలహీనతలో దేవుని శక్తి పరిపూర్ణ మౌతుందని గుర్తించాడు పౌలు. బైబుల్లోని చాల సంఘటనలకు ఈ సూత్రం వర్తిస్తుంది. కొన్ని ఉదాహరణలు చూద్దాం.

గిద్యోను యిస్రాయేలీయులకు న్యాయాధిపతిగా పనిచేస్తున్నాడు. ఆ రోజుల్లో మిద్యానీయులనే శత్రువులు వాళ్ళను పీడిస్తుండేవాళ్ళు. ప్రభువు గిద్యోనుద్వారా యిస్రాయేలీయులను రక్షించడానికి పూనుకొన్నాడు. గిద్యోను 32 వేలమంది సైన్యంతో బయలుదేరాడు. కాని ఆ సైన్యాన్నిజూచి యిస్రాయేలీయులు మా బలంతో మమ్మే మేమే రక్షించుకొన్నామని విర్రవీగవచ్చు. కనుక ప్రభువు ఆ సైన్యాన్ని తగ్గించివేయమన్నాడు. గిద్యోను పౌజును పదివేలకు తగ్గించాడు. ప్రభువు ఇంకా తగ్గించమన్నాడు. అతడు కేవలం 300కు తగ్గించాడు. ఆ మూడు వందలమంది భటులతోనే ప్రభువు అతనికి శత్రువుల మీద విజయం చేకూర్చి పెట్టాడు - న్యాయా 7, 2-7. మానుష బలమున్న కాడ గర్వముంటుంది కనుక దైవబలం పనిచేయదు. మానవ బలం లేనికాడ వినయం వుంటుంది. కనుక దైవశక్తి పనిచేస్తుంది.

యిస్రాయేలీయులకు ఫిలిస్తీయులు ప్రబల శత్రువులు. వాళ్ళ వీరుడు గొల్యాతు. అతడు యుద్ధంలో కాకలు తీరిన జోదు. యిస్రాయేలీయుల వీరుడు దావీదు. అతడు బాలుడు. గొల్యాతు కత్తి, యాటె, బాకు తీసికొని మానుషబలంతో వచ్చాడు. దావీదుకి మానుషబలంలేదు. అతడు కేవలం పడిసెలతో వచ్చాడు. కాని దైవబలం అతనికి అండగా

వుంది. కనుకనే గొల్యాతుని గెల్చాడు. ఆ రాక్షసుడు వడిసెల రాయి తగిలి మొదలు నరికిన చెట్టులా కూలాడు - 1సమూ 17, 45-47.

మోషే ప్రజలను ఫరో బానిసంనుండి విడిపించిన మహా నాయకుడు. ఫరో తరపున మానుషబలము మోషే తరపున దైవబలమూ పని చేసాయి. ఈ మోషే నైలునది తుంగల్లో, ఓ పెట్టెలో, వాయెత్తి యేడ్చే పసికందుగా ఫరో కూతురికి దొరికాడు. అతని అశక్తత అలాంటిది - నిర్గ 2, 5-6. అతడు బానిస జాతికి చెందినవాడు, నత్తివాడు- 4,10. కాని ప్రభువు అలాంటివాని ద్వారానే సామ్రాజ్యాధీశ్వరుడైన ఫరోను ఓడించాడు.

నూత్న వేదంనుండి ఒక్క వుదాహరణం చూద్దాం. పేత్రు చేపలను పట్టడానికి రాత్రంతా కృషి చేసాడు. కాని ఒక్క పక్కెపిల్ల గూడ దొరకలేదు. అతని కృషి ఎందుకూ అక్కరకు రాలేదు. అతడు తన ఆశక్తతను తలంచుకొని "రాత్రంతా శ్రమించినా ఫలితం దక్కలేదు" అని వాపోయాడు. నరుడు తన అశక్తతను గుర్తించినపుడే గాని దేవుడు సహాయం చేయడు. ప్రభువు అతన్ని లోతులో వలవేయమన్నాడు. ఆలా వేయగానే వల పిగిలిపోయేలా చేపలు పడ్డాయి. పేత్రు ఆ సంఘటనకు ఆశ్చర్యపడి ప్రభో నేను పాపిని నన్ను విడచి పొమ్మని క్రీస్తుని అభ్యర్థించాడు - లూకా 5,8.

ఈ సంఘటనలను బట్టి యేమి అర్థం చేసికోవాలి? దేవుడు నరునికి శక్తి చాలదని నిరూపించిగాని అతనికి సహాయం చేయడు. ఏనరుడైనా నా బలం నాకు చాలు అనుకొంటే ప్రభువు అతన్ని అణగద్రొక్కుతాడు. అతడు గర్వాత్ముల కొమ్ములు విరగ గొట్టేవాడూ, వినయాత్ములను పైకి లేవనెత్తే వాడూను - యాకో 4,6

## ఉపసంహారం

పౌలు తన బలహీనతనూ దైవబలాన్నీ బాగా అర్థం చేసికొన్నవాడని చెప్పాం. అతడు కొరింతీయుల మొదటి జాబు 1, 26-31 వచనాల్లో ఈ యంశాన్నే ప్రస్తావించాడు. కొరింతులోని అతని క్రైస్తవులు బానిసలు. ఓడలో పనిచేసే కళాసీలు, పామరులు, సమాజంలో అట్టడుగున వున్నవాళ్లు.మామూలు దృష్టితో జూస్తే వీళ్లు తాడూ బొంగరమూ లేని అనామకులు. కాని ఆలాంటి వాళ్ళనే ప్రభువు తన శిష్యులనుగా ఎన్నుకొన్నాడు. ఆ నగరంలోని పండితుల నెవ్వరినీ ఎన్ను కోలేదు. లోకం అవివేకులుగాను, బలహీనులుగాను, అల్పులుగాను, విలువలేనివాళ్లుగాను భావించేవాళ్ళనే దేవుడు ఎన్నుకొంటాడు. ఎందుకు? గొప్పవాణ్ణి ఎన్నుకొంటే వాడు నా గొప్పవల్లనే నేను మొనగాణ్ణయ్యానని డప్పాలు కొడతాడు. ఈ డాబుని దేవుడు సహించడు. అతని యెదుట ఏ నరుడూ గొప్పలు చెప్పుకోగూడదు.

ప్రేషితరంగంలో కృషిచేసే గురువులు, మఠ కన్యలు, గృహస్థులు ఓ పెద్ద పొరపాటు చేస్తుంటారు. తమకున్న అధికారం, సామర్థ్యం, పలుకుబడి, కులగౌరవం, డబ్బు మొదలైన

వాటిని ఆసరాగా తీసికొని పొంగిపోతారు. కాని యీ పొంగు వాళ్ళ వినాశానికే దారి తీస్తుంది. స్వీయ బలంమీద ఆధారపడే నరుణ్ణి ప్రభువు నట్టేట ముంచుతాడు.

మరోతావులో పౌలు "దేవుని అనుగ్రహం వల్లనే నేనిప్పుడున్న స్థితిలో వున్నాను" అని చెప్పుకొన్నాడు - 1కొ 15,10. అతడు మహాప్రేషితుడు. తీతు తిమోతి లాంటి శిష్యవర్గాన్ని తీర్చిదిద్దినవాడు. కొరింతులాంటి గ్రీకు పట్టణాల్లో క్రైస్తవ సమాజాలు నెలకొల్పినవాడు. ఆ సమాజాలకు వేదాంత సూత్రాలతో నిండిన 14 పెద్ద జాబులు వ్రాసినవాడు. కాని దైవానుగ్రహం వల్లనే అతడీ కార్యాలన్నీ సాధించాడు. కనుక అతడు తన ఉచ్ఛ స్థితిని దేవునికే ఆరోపించుకొన్నాడు. నరుడు తన అశక్తతను గుర్తించడమంటే యిది. దేవునిమీద ఆధారపడ్డం అంటే యిది. ఏ నరుడు ఈ మనస్తత్వాన్ని అలవర్చుకొంటాడో అతడు దేవునికి ప్రియపడతాడు. దేవుని శక్తితో మహత్తర కార్యాలు సాధిస్తాడు. తాను బలహీనుడుగా వున్నపుడే బలవంతుడ నయ్యానని చెప్పుకోగల్గుతాడుగూడ - 2కొ 12, 10.

# ప్రశ్నలు

## ఏడు మూలపాపాలు

1. గర్వస్వభావాన్నీ దానిలోని దుష్టత్వాన్నీ వివరించి, దాన్ని జయించే మార్గాలను పేర్కొనండి.
2. అసూయాగుణాన్నీ దాని వలని అనర్థాలనూ వివరించండి.
3. కోపస్వభావాన్నీ దాన్ని నివారించే మార్గాలనూ పేర్కొనండి.
4. భోజన ప్రియత్వాన్ని వివరించి దానిని జయించే మార్గాలను తెలియజేయండి.
5. మోహ స్వభావాన్నీ దానిలోని దుష్టత్వాన్నీ వివరించి, దాన్ని జయించే మార్గాలను పేర్కొనండి.
6. సోమరితనం స్వభావాన్నీ దాన్ని అరికట్టే మార్గాలనూ వివరించండి.
7. దురాశ స్వభావాన్నీ దానిలోని దుష్టత్వాన్నీ తెలియజేయండి.

## నాల్గు నైతిక పుణ్యాలు

1. వివేక స్వభావాన్ని వివరించి దాన్ని సాధించే మార్గాలను తెలియజేయండి.
2. న్యాయం స్వభావాన్నీ దాన్ని పాటించే మార్గాలనూ తెలుపండి.
3. ధైర్యం స్వభావాన్ని తెలియజేసి దాన్ని సాధించే మార్గాలను పేర్కొనండి.
4. ఉపవాసం, శుద్ధభోజనం స్వభావాలను వివరించండి.



**ఫాదర్ పూదోట జోజయ్య, S.J.** గారు, పూదోట మరయ్య, చిన్నమ్మ దంపతులకు 1931వ సం॥ ఫిబ్రవరి 15న, గుంటూరు జిల్లాలోని కనపర్రు గ్రామంలో జన్మించారు. ఈయన ప్రాథమిక విద్యను కనపర్రులో, ఉన్నతవిద్యను ఫిరంగిపురంలో అభ్యసించారు. మద్రాసు లొయోలాలో కళాశాల విద్యను పూర్తిచేసి, ఆంధ్రవిశ్వవిద్యాలయంలో **M.A.** (సాహిత్యం) లో పట్టా పుచ్చుకున్నారు.

1955లో తమిళనాడులోని దిండిగల్ నందు యేసుసభలో చేరిన జోజయ్యగారు, అటుపిమ్మట కొడైకెనాల్‌లో తత్వశాస్త్రాన్ని, కర్సియాంగ్‌లో వేదాంతశాస్త్రాన్ని నిశిత పరిశీలనా దృష్టితో క్షుణ్ణంగా అధ్యయనం గావించారు. 1965, మార్చి 27న బిషప్ ముమ్మడి ఇగ్నేష్యస్ గారి చేతుల మీదుగా ఫిరంగిపురంలో గురుపట్టం పొందారు.

రోమునగరంలోని బిబ్లికల్ ఇన్‌స్టిట్యూట్‌లో బైబులు విద్యనభ్యసించిన జోజయ్యగారు ఆ తర్వాత తనదైన విశిష్టశైలిలో బైబులు సాహిత్యానికి ఎనలేని సేవ చేసారు. లొయోలా కళాశాలలో 2 సంవత్సరములు ఉపన్యాసకునిగా విద్యార్థులకు చక్కని శిక్షణను అందించారు. పుస్తకరచన, బైబులుబోధ, విద్యార్థులకు నాయకత్వ శిక్షణ వీరి ముఖ్య కార్యక్రమాలు.

**సాహిత్యరంగంలో వీరు నిర్వహించిన కొన్ని బృహత్తర కార్యక్రమాల వివరాలు :**

1. అనువాదకునిగా : అకుంఠిత దీక్షతో 17 సం॥లు అవిరళకృషిసల్పి క్యాథలిక్ బైబులులోని పూర్వవేదాన్ని జనరంజకంగా తెలుగులోనికి అనువదించారు.
2. ఆధ్యాత్మికవేత్తగా : ఆధ్యాత్మిక చింతనకు పెద్దపీట వేస్తూ ఆయన నడిపే బైబులు భాష్యం పత్రిక, బైబులు గ్రంథమాల ఆయన ఆధ్యాత్మికరంగంలో నిత్యకృషీవలుడని చెప్పకనే చెబుతాయి.
3. విద్యార్థి బాంధవునిగా : విద్యార్థిలోకాన్ని ఉత్తేజపరచడానికి, వారిలో నవచైతన్యం నింపడానికి ఆయన నడిపే చైతన్యవాణి పత్రిక, విద్యార్థిహిత గ్రంథమాల, విద్యార్థిలోకానికే నిర్దేశకాలు.
4. వక్తగా : ఆంధ్రరాష్ట్రమంతటా తిరిగి విద్యార్థులకు,ఉపాధ్యాయులకు, ఉపదేశకులకు సామాన్యప్రజానీకానికి వందలకొలది సదస్సులు నిర్వహించి, వారిలో నవ్యోత్సాహాలను నింపారు.